NAVYA MAANAVATHAA VAADHAM - O
PARICHAYAM (Telugu)

An Introduction to Neo-humanism

By

**VAACHASPATHY**



**Published :** 2016

**PRICE :** Rs.200/-

**ANDHRA HUMANIST PUBLICATIONS,** GUNTUR.

# విషయసూచిక

| | పుట |
|---|---|
| వినివేద్య | 1 |
| మొదటి అధ్యాయం | 9 |
| రెండో అధ్యాయం | 28 |
| మూడో అధ్యాయం | 154 |





వాచస్పతి



|| ఓం నమో భగవతే మానవాయ ||

# వినివేద్య

ప్రియ పలిత్ర బాంధవులారా!

మానవతావాదాన్ని ఆంధ్రదేశానికి, విశేషించి అది తొలుదొల్త అడుగుపెట్టిన గుంటూరుగడ్డకి క్రొత్తగా పరిచయం చేయనక్కర్లేదేమో! అయితే అది కేవలం నాస్తికులకే ప్రీతిపాత్రమైన M.N. రాయ్ గారి Radical Humanism. దానికి ఆ కాలంలో ప్రాచుర్యాన్ని కల్పించిన కీ.శే. ఆవుల గోపాలకృష్ణమూర్తి, త్రిపురనేని గోపీచంద్, రావిపూడి వెంకటాద్రి ప్రభృతులైన మహామహులకి ముందస్తుగా హార్దిక నమస్సుమాంజలులు.

మానవతావాద ఉద్యమం అనేక దశాబ్దాలుగా ఆంధ్రదేశం మీద ప్రసరించిన ప్రభావం బహు సూక్ష్మమూ, అమార్జనీయమూ (indelible), శాశ్వతమూను. అది మనవారిని హింసకి సుదూ రంగా ప్రశాంతులుగా, నాగరికులుగా తీర్చిదిద్దింది. మర్యాదస్థుల్ని చేసింది. వారి మానసిక ఎల్ల ల్ని చెఱిపేసి వారిని అంతర్జాతీయ మానవులుగా రూపొందించింది. వారి మెదళ్ళకున్న సంకెళ్ళని తెంచి స్వేచ్ఛా-ఆలోచనాపరులుగా మలచింది. ఈ తత్త్వశాస్త్ర ప్రభావం మన ప్రాత సినిమాల మీదా, సాహిత్యం మీదా చాలా లోతుగా కనిపిస్తుంది. అది బలంగా ఉన్నంతకాలమూ మనవారు కులమతాల గుఱించీ, ప్రాంతాల గుఱించీ బహిరంగంగా మాట్లాడడానికి సంకోచించేవారు. నేడు కూడా ప్రజాస్వామిక లక్షణాలైన భావప్రకటనాస్వేచ్ఛ, చర్చాధోరణీ, విమర్శసహిష్ణుతా దేశంలోని మిగతా ప్రాంతాల కన్నా ఆంధ్రలోనే ఎక్కువగా ఉండడానికి కారణం తరతరాల మానవతావాద ఉద్యమ ప్రభావమే ననడంలో విప్రతిపత్తి లేదు.

అటువంటి ర్యాడికల్ హ్యూమనిజమైనా మా ముందటి తరం వఱకే ప్రాచుర్యంలో ఉంది. ఐతే ఆ తరం వారంతా దాదాపుగా గతించిపోవడానా, వారి మేధావారసత్వం ఎవఱికీ సంక్రమించనం దునా అది గుంటూరులో కూడా ప్రస్తుతం అంతరించిపోయే దశలోనే ఉంది. బహుశా ఆ వారస త్వం క్రమంగా విస్మృతిలోకి జాఱుకోవడానే కాబోలు, కులతత్త్వం గత 35 ఏళ్ళుగా ఆంధ్రదేశం లో మళ్లీ విజృంభించింది.

అయితే ఇప్పటిదాకా ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉన్న మానవతావాదంలోని నాస్తిక భాగాలు నాకు రుచించనందువల్లా, అది సమకాలీన అవసరాల్ని తీర్చలేనందువల్లా క్రొత్తబాట పఱవాల్సిన అగత్యం కలిగింది. ఇది మొదట *"ది ఆంధ్రా హ్యూమనిస్ట్"* అనే తెలుగుబ్లాగుగా అంతర్జాలం (internet) లో వెలువడింది. అందులోని టపా (post) లనే ఇంకొంత సుబోధంగా విపులీకరించి ఇప్పుడిలా పుస్తకరూపాన్నివ్వడం జఱిగింది. ఐతే చదివి నేర్చుకునేవారెవరూ లేరు. జనం చూసే నేర్చుకోగలరు. ముఖ్యంగా మానవతావాదం విషయంలో మానవతావాదుల వ్యక్తిగత శీల–ప్రవర్తన–వైఖరుల ఆలంబనతో ఈ చింతనాధారని అర్థం చేసుకోవడం ఎక్కువ సులభం. ఐనా ఈ ప్రస్తావన మీది సందేహాల నివృత్తికి ఆచూకీగ్రంథం (reference book) లా ఉపయోగపడుతుందనే ఉద్దేశంతో ఇలా అక్షరబద్ధం చేయడమైనది.

నవ్యమానవతావాదం ప్రతివారికీ అవసరమే. ప్రపంచం రోజురోజుకీ దగ్గఱవుతోంది. రకరకాల ప్రజలు ప్రక్కప్రక్కనే కలిసి బ్రతక్క తప్పని పరిస్థితి వస్తోంది. అయినా సమాజాలు వందలేళ్ళనాటి మనోవాలకం (mood) లోనే కొనసాగుతున్నాయి. అందువల్ల అవి బాహ్యంగా ఘర్షణల్నీ, అంతర్గతంగా సంఘర్షణల్నీ అనుభవిస్తున్నాయి. ఇలా కొనసాగలేమని అవి తెలుసుకునే రోజు తప్పకుండా వస్తుంది. అప్పుడు వాటికి నవ్యమానవతావాదమే అనుసరణీయమవుతుంది.

పేరుకి "నవ్య" అంటున్నప్పటికీ వాస్తవానికి ఇది పూర్తిగా సరిక్రొత్త పరిభావన (concept) కాదు. దీని సారాంశం మన దేశంలో కొన్ని పురాణ కథల రూపంలో ఇంతకు ముందే ప్రచారంలో ఉంది. ఆ కథల్ని చెప్పిన పూర్వీకులు వాటి చివర్లో *"కనుక ధర్మం అత్యంత సూక్ష్మమైనది"* అన్న దళాన్ని జతచేఱుస్తూ వచ్చారు. నిజానికి వాటిల్లో మానవమేధకి అంతగా అందుబాటులో లేని, దుర్బోధమైన సూక్ష్మమేమీ లేదు– "ఏ రకంగానైనా సరే, ఇతరుల్ని బాధించడమూ, నష్టపఱచడమూ, అవమానించడమూ తప్పు" అనే ఒక్క సర్వసామాన్య సూత్రాన్ని గనక అర్థం చేసుకోగలిగితే! దీన్నే కృష్ణద్వైపాయనుల వారు *"పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్"* అని ఒక్క ముక్కలో వాక్రుచ్చారు.

కాబట్టి ఈ దేశపు మతానికి తొల్తటి రూపం కూడా మానవతావాదమేనని నాకు ఏ మూలనో గట్టి నమ్మకం, ఇది ఆ రోజుల్లో ఈ పేరుతో వ్యవహృతం కాకపోయినా! వేదసాహిత్యం ద్వారా తెలియవచ్చే ఆనాటి–

- స్వేచ్ఛాచింతన



- స్వేచ్ఛాచరణం
- ప్రకృత్యారాధన
- అతిథిపూజ
- ప్రశ్నోపనిషత్తు
- ఒకే గురువూ, ఒకే దేవుడూ, ఒకే పవిత్రగ్రంథం లేకపోవడం (ఆత్మాన్వేషణలో ఎవటి ఎంపికకి వారిని స్వేచ్ఛగా వదలడం)
- మనిషిలో దేవుణ్ణీ, దేవుళ్లలో మనిషితనాన్నీ చూడగలగడం
- జీవుడు (మానవుడు) స్వతహాగా పరిశుద్ధుడనీ, అనాదియైన అవిద్య (అజ్ఞానం) వల్లనే పాపాలు చేసి సంసారంలో ఇరుక్కుంటున్నాడనే వేదాంత అభిప్రాయం
- పూర్ణపుణ్యులూ, పూర్ణపాపులూ లేరనీ, ప్రతిపాపికీ తనని తాను సంస్కరించుకునే అవకాశం ఉందనీ, అలాగే శాశ్వత స్వర్గాలూ, శాశ్వత నరకాలూ కూడా లేవనే అభిప్రాయం. (పునర్జన్మ సిద్ధాంతం)
- ధర్మం (మానవతావాదం) సనాతనమనీ, దాన్ని ఎవఱూ నాశనం చేయలేరనీ చెప్పి ఉండడం *[ఇంత ధీమాగా అధివచించడం*[1] *మానవతావాదానికి తప్ప ఏ వ్యవస్థీకృత మతానికీ (organized religion కీ) సాధ్యం కాదు]*
- *ఆ నో భద్రాః క్రతవో యన్తు విశ్వతః మఱియూ సర్వే సన్తు నిరామయాః అలాగే సమ్ గచ్ఛధ్వం సమ్ వదధ్వమ్ మొదలైన మంత్రాలూ.*
- *రామాయణ మహాభారతాల్లో మానవుల మధ్య వ్యక్తిగత సత్సంబంధాలకి వేసిన పెద్దపీట.*
- *సామూహిక ప్రార్థనల కన్నా వ్యక్తిగత సాధనకే ప్రాధాన్యాన్ని ఒసంగిన వైనం*
- *ఎవటిని వారే బాగుచేసుకోవాలి తప్ప బైటివారెవఱూ వచ్చి బాగుచేయరనే బోధ (ఉద్ధరేదాత్మనాఽఽత్మానమ్)*
- *జ్ఞానం కన్నా దాన్ని ప్రసాదించే గురువునే ఎక్కువగా ప్రేమించాలని చెప్పడం*

ఇవన్నీ బహుశా ఆ వాస్తవానికే సాక్ష్యం పలుకుతాయి. ఏ చింతనాధారనీ గ్రుడ్డిగా త్రోసిపుచ్చక అందఱినీ వారివారి గుణోత్తరత ననుసరించి అక్కున చేర్చుకునే విశాలహృదయం గల మానవతావాదాన్ని ఎవఱికి తోచిన విధంగా వారు వ్యాఖ్యానించుకోవడంలో ఆశ్చర్యం లేదు. ఆ క్రమంలో 'హిందూ' అనే పేరిట అర్వాచీన కాలంలో మతహోదా ఆపాదించబడ్డ ఒకానొక ప్రాచీన

[1] Claim చేయడం.

మానవతావాద పాఠాంతరానికి అనంతరకాలంలో పలుభాష్యాలూ, వాటి ననుసరించి వందలా దిగా శాఖోపశాఖలూ బయల్దేరాయి. వాటిల్లో కొద్ది శాఖలు కాలగతిలో స్వతంత్ర మతాలుగా కూడా రూపొందాయి.

ఆ వేదకాలీన మానవతావాదాన్ని మర్చిపోవడం/ప్రక్కన పెట్టడం చేత నేడు మన దేశీయులు "ధర్మం ధర్మం" అని ఘోషించేది నిజంగా తమకే తికమకైన పరిస్థితి. "*ధ్రియతే అనేన ఇతి ధర్మః*" అని ధర్మానికి వ్యుత్పత్త్యర్థం. దీన్తో మనిషి ధరిస్తాడు (మనగల్గుతాడు) కాబట్టి ధర్మం అని పేరు. మనుషులు దేన్తో మనగలరు? తాను తనకెంతో ఇతరులకీ వారూ అంతేననే గ్రహింపుతోనే కదా. ధర్మమంటే అదే. సుప్రసిద్ధమైన మహాభారత పద్యం :

కం॥ ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియము తన మ | నంబునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ | పథములకెల్లన్.

మానవతావాదం కూడా చెప్పేది కూడా ఇదే. కానీ తరవాతి కాలంలో 'ధర్మ'శబ్దానికి అర్థమే మారిపోయింది గుర్తుపట్టరాని విధంగా! ముఖ్యంగా ధర్మశాస్త్రాల రచనాకాలం నుంచి ధర్మ మంటే ఆ శాస్త్రాల్లో వర్ణించబడిన అనేకానేక విధి-నిషేధాలూ, ఆచార వ్యవహారాలే తప్ప ఇంకేమీ కాదనే అభిప్రాయం వ్యాపించింది. అంటే ధర్మానికి 'కర్తవ్యం (mandate)' అనే అర్థం వాడుక లోకి వచ్చిందన్నమాట. ఏదైతే కర్తవ్యం అవుతుందో అదే సహజన్యాయం (natural justice) గా భావించబడుతుంది. ఎప్పుడైతే ధర్మానికి ఈ విధంగా నిర్బంధార్థ (compulsion) ద్యోతక మైన భాష్యం చెప్పడం మొదలుపెట్టారో అప్పుడది స్వతహాగా స్వేచ్ఛాశీలకమైన మానవాత్మకి రుచించకుండా పోతుంది. ఎందుకంటే దాని (ధర్మానికి సంబంధించిన) కార్యకలాపాలలోని ప్రేమనీ, స్వచ్ఛందత (voluntariness) నీ ఆ రకమైన భాష్యం హరించివేస్తుంది. తత్ఫలితంగా అంతా ఆ ప్రమాణాలకి అనుగుణంగా ఉన్నట్లు నలుగుఱిలోనూ నటించడమే మిగుల్తుంది. మన కాలానికొచ్చేసరికల్లా అది మఱి కొంత దిగజాఱి ధర్మం అంటే 'మతం (religion)' అనే అర్థం ప్రబలింది. దక్షిణాదిన 'ధర్మ'శబ్దం ఇప్పటికీ కాస్త కూస్తో ప్రాచీనార్థంలో కూడా వాడబడుతోంది గానీ ఉత్తరాదిన దానికి మతమనే అర్థం మినహా ఇంకేదీ లేదు.

కనుక మానవతావాదాన్ని మించిన ధర్మమేదీ లేదు. ధర్మానికి మఱో స్వరూపం లేదు. సంస్కృ



తిని ఓ బ్రతుకోజేగానో దానికి మూలప్రేరణైన తలపోజేగానో నిర్వచించినప్పుడు దాని గుఱించి సాధికారికంగా గర్వపడాలంటే మనమింకా బహుదూరం ప్రయాణించాల్సి ఉంది. అందుకు నవ్యమానవతావాదమొక్కటే సాధనం.

మతమీమాంసా నిరపేక్షంగా మానవతావాదం గుఱించి ఐకాంతికంగా చర్చించడం అన్నివేళలా సాధ్యం కాదు. కానీ మన దేశవాసులకి పారలౌకికత విషయమై అదనంగా చెప్పాల్సినదేమీ లేదు. అందుగుఱించిన భాండాగారం ఈ గడ్డమీద వేలాది సంవత్సరాలుగా తయారవుతూ పుష్కలంగా సర్వేసర్వత్రా లభ్యమవుతోంది. మనవారు సజీవులైన, స్పందకులైన మనుషుల కన్నా దేవుళ్ళనీ, దేవతల్నీ, కల్పితపాత్రల్నీ, తమ పెంపుడుజీవాల్నీ బాగా అర్థం చేసుకోగలరు. ఐతే మనవారికి తెలియనిదీ, అర్థం కానిదీ, అలవాటు లేనిదీ– ఈ లోకంలో ఈ లోకజీవితానికి అవసరమైన ఆచరణాత్మక దృక్పథాల్ని అలవఱచుకొని జీవించడం. అందులో భాగంగా తోటిమనుషుల్ని వారి దృక్పథంలోంచి అర్థం చేసుకోవడం. అధునాతనులకి ఆధ్యాత్మిక ఆదర్శాల్ని పాపపుణ్యాలూ, కర్మ ఫలంలాంటి ప్రాత పదజాలంతో, ప్రాత పౌరాణికోదాహరణలతో నూఱిపోసే ప్రయత్నం ఎక్కువ ఫలవంతం కాదు. వాటిని మానవతావాదపు క్రొవ్వెలుగులో లౌకికంగా, వైజ్ఞానికంగా, ఆధునికం గా పునర్నిర్వచించుకునే అవసరం ఉంది.

ఇక్కడ మనం "మానవుడి గుఱించి" మాట్లాడ్డం వాక్యార్థ సౌలభ్యం కోసమే. అతని గుఱించి చెప్పినవన్నీ మానవురాలిక్కూడా సమానంగా వర్తిస్తాయి. తాము ఆశించినంత మానవత్వాన్ని వ్యవస్థీకృత మతాల అనుష్ఠానరూపం అందించలేకపోవడంతో నాస్తికులుగానూ, అజ్ఞేయవాదులు గానూ పరిణమిస్తున్నారు పలువుఱు విద్యావంతులు. మఱి కొందఱేమో ఇక్కడలేని మానవత్వం మఱెక్కడో దండిగా ఉందనుకుని మతం మారుతూ, అక్కడ కూడా దాని వాసన తగుమాత్రం ఘాటుగా తగలకపోవడంతో నిస్పృహకి లోనవుతున్నారు. మానవతావాదానికి సంబంధించి సువిశాల సమాజ అవగాహన ఇంకా ఓనమాల స్థాయిలోనే ఉంది. దురదృష్టవశాత్తూ ఈ విష యంలో మన ఆధ్యాత్మికత మనల్ని ఆదుకోవడం లేదు. పైపెచ్చు మనలో ఎంతగా ఆధ్యాత్మిక/ మతచ్ఛాందసాలు విజృంభిస్తే అంతగా మనం తోటిమానవుల పట్ల అమానుషంగా ప్రవర్తించడం జఱుగుతోంది. మతచ్ఛాందసాలే కాదు, ఏ రకం ఛాందసాలైనా మనుషుల్లో మానవత్వాన్ని ఆచ్ఛాదించి వేస్తాయి. నిజానికి మానవుల పట్ల దయచూపడం ద్వారా తమ ఆధ్యాత్మిక లక్షణా లకి మఱింత పుష్టి చేకూర్చుకోవడానికి ధారాళమైన అవకాశం ఉంది. కానీ ఎందుకో జనం అలా చేయడం లేదు.

ఇప్పటిదాకా ఉన్న మానవతావాదులంతా ప్రాయికంగా నాస్తికులో, అజ్ఞేయవాదులో (agno-

stics) ఐనప్పటికీ వారిలో ఇంకా పలు గోత్రాలవారున్నారు. పైకి 'మానవతావాదం' అని చెప్పుకుంటున్నా, వారందఱికీ దాని కంటే దైవభావనని వ్యతిరేకించడమే అత్యంత ముఖ్యమైన పూర్తికాలిక కార్యకలాపం (full-time activity) గా పరిణమించడం వల్లా, వారి ఆలోచనా సరళిలో ప్రేమాంశ (element of love) లోపించడం వల్లా వారు లోకంలో మానవుల దుఃఖాలకి సంబంధించి ఏ ఇతర సమస్యకీ స్పందించలేని, వాటిని పరిష్కరించడానికి క్రియాశీలకంగా కృషి చేయలేని పరిస్థితిలో ఉన్నారు. అందుచేత వారెవ్వఱిలోనూ నేను చేఱను. ఈ నవ్యమానవతావాదం నా పాఠాంతరం.

మఱో ప్రక్క జనసామాన్యం 'మానవతావాదం' అనే బ్రహ్మాండమంత పదాన్ని చాలా సంకుచితార్థంలో బోధపఱచుకుంటోంది. ఎవఱైనా ఏదన్నా సహాయం చేస్తే వారిని మానవతావాదులంటున్నారు. ఇది అపార్థమేనని చెప్పక తీఱదు. దీనిక్కారణం– ప్రధానంగా మన పత్రికలు. సహాయం చెయ్యనివారంతా రాక్షసులు కారు గదా!

కొన్ని పర్యాయాలు భాషాజ్ఞానలోపం కూడా ఇలాంటి అపార్థాలకి దారితీయవచ్చు. మానవీయతకీ, మానవతావాదానికీ సంబంధముంది. కానీ అంతమాత్రాన సహానుభూతిని సూచిస్తూ 'మానవీయం' అని వాడాల్సిన చోటల్లా అగాధ ఆలోచనామృతమైన 'మానవతావాదం' అని వాడితే అది పొఱపాటవుతుంది. మానవతావాదమంటే జాలిపడడం, సహాయం చేయడం మాత్రమే కాదు. అది అనేక ఆలోచనా విధాన సంస్కరణల యొక్కా, దృక్పథ సూత్రాల యొక్కా సంపుటం. అది కష్టాల్లో ఉన్న వ్యక్తులకు సంబంధించినది కాదు. ఎవఱికి వారు తమని తాము మార్చుకోవడానికి సంబంధించినది. ఈ రచన ఇలాంటి అర్థవ్యత్యయాల్ని క్రమ్మఱిస్తుందని ఆశిస్తాను. మానవజాతి ఇంత ప్రగతి సాధించిందంటే దానిక్కారణం "ఈ ప్రపంచం బాగుపడదు. ఇదింతే"నని రాజీపడిపోయినవారు కాదు. "నేనొక్కణ్ణీ ఏం చేయగలను?" అనుకోనివారి వల్లనే సాధించింది. గాంధీగారు ఒక్కఱే. న్యూటన్ ఒక్కడే. ఐన్ స్టీన్ ఒక్కడే.

నేనూ పుట్టుకతో సమగ్ర మానవతావాదిని కాను. కానీ గుంటూరి మట్టివాసనో, మఱేంటో గానీ మానవతావాద భావాలు కొన్ని అంకురప్రాయంగా బాల్యమాదీ నాలో ఉన్న మాటైతే వాస్తవం. ఐనా పూర్తిగా ప్రాగని నా ఇతః పూర్వపు జీవన దశల్లో ఇక్కడ ప్రవచించిన మానవతావాదానికి విపర్యస్తంగా మెలగిన ఘట్టాలున్నాయి. అయితే ఆ జ్ఞాపకాలతో నేనెప్పుడూ సౌకర్యంగా లేను. చిన్నప్పటి నుంచీ నన్ను నేనో మతవాదిగానే భావించుకున్నాను. అలాగే స్థిరపడాలనుకున్నాను. మతవాదంలో భాగంగా కులవాదం కూడా కొంతకాలం నా సావధానాన్ని వ్యాపృతం చేసింది.



కానీ కొద్ది సంవత్సరాల పాటు తీవ్రంగా ఆలోచించాక మనలాంటివారికి కుల–మతాల కన్నా మానవతావాదమే ముఖ్యమని తోచింది. ఏనాటికైనా పరిపూర్ణ మానవతావాదిని కావాలనేది నా కల. వ్యక్తిగతంగా నాకీరోజు మానవతావాదం ఇస్తున్న మనోనిర్వృతిని ఇదివఱకటి మతవాదం ప్రసాదించలేకపోతోంది. అంటే దీనర్థం– మతంతో బొత్తిగా పనిలేదని కాదు. మతం ప్రతి సామాజికుడికీ అవసరం లేదు, మన వాతావరణం విచక్షణా రహితంగా ప్రతివారికీ ఆ సూది మందు ఎక్కిస్తున్నప్పటికీ!

నేను మేధావినీ కాను. పండితుణ్ణీ కాను. జ్ఞానిని అసలే కాను. నాగరికుణ్ణి అంతకంటే కాను. కానీ ఈ ప్రస్తావన మీద నాకు ఏమేం తెలుసో, దాని మీద నేను ఏమైతే ఆలోచించానో అవే ఈ పుస్తకంలో వ్రాశాను. ఏమైనా పొఱపాట్లుంటే అన్యథా భావించవద్దని మనవి. ముఖ్యంగా బహుశ్రుతులైన చదువరులకి విదితపూర్వమే అయ్యుంటాయనే ఉద్దేశంతోనూ ఎక్కువభాగం స్వయంసుబోధమనే భావనతోనూ పలు వ్యక్తీకరణలకి నేపథ్యాలూ, నిర్వచనాలూ, వివరణలూ ఇవ్వలేదు. ఐనా ఇదివఱకటి రచనల్లాగే దీన్ని కూడా అభిమానంతో ఆదరించి అక్కున చేర్చుకుంటారని ఆశంసిస్తున్నాను. సహృదయ పాఠకులు ఇందులోని లోటుపాట్లని ఎత్తిచూపితే మలిముద్రణలో సవరించుకుంటాను. భావి మానవతావాదులు ఇందులోని భావాల్ని మఱింత మెఱుగ్గా తీర్చిదిద్దుతారనీ, ఇంకొంత ఆచరణీయంగా రూపొందించి ప్రజల్లోకి తీసుకెళతారనీ ఆశిస్తున్నాను.

*గుంటూరు* — **ఇట్లు**

*ఏప్రిల్, 2016.* — **భవదీయుడు, బుధజన విధేయుడు**

**వాచస్పతి**

|| *మానవో మమ దేవతా* ||



# మొదటి అధ్యాయం

## నవ్యమానవతావాదం: ఓ క్లుప్త పరామర్శ

### (ఉపోద్ఘాతం)

(అ) **నవ్యమానవతావాదం అంటే ఏంటి ?** మానవజాతి యొక్క తొల్తటి మూలజనులు ఒక్క సమూహపు వారేనని భావించబడుతోంది. ఆ భావన నిజమే కావచ్చు. ఎందుకంటే మన మధ్య ఏ సంబంధమూ లేకపోతే ఒక జాతివారు మఱో జాతివారినీ, ఒక దేశస్థులు మఱో దేశస్థుల్నీ పెళ్ళాడి సంతానవంతులు కావడం అసంభవమై ఉండేది. కనుక మానవుల మైన మనం ఒకటికొకఱు నేరుగా సంబంధీకులం కాకపోయినా చుట్టుతిరుగుడుగా సంబం ధీకులమే అయి ఉన్నాం. సంబంధం లేదని భావించడానికి కారణం–మన తత్క్షణ పరిసరా ల్లోని సన్నిహితుల విషయం మినహా ఇంకేదీ పట్టించుకోవడానికి మన శక్తిసామర్థ్యాలు చాలకపోవడమే. కనుక మానవజాతిలో కాలానుగతంగా ఏర్పడ్డ అన్ని భేదాల్నీ, విభేదాల్నీ సహించి వాటి ప్రాతిపదికన దానిలో ఏ ఒక్క భాగాన్నీ ద్వేషించని విధంగా జాగ్రత్త వహిం చాలి. ఎందుకంటే ముందు మనమంతా మనుషులం. ఆ తర్వాతే ఇంకేదైనా !

నవ్యమానవతావాదం వ్యక్తుల వైయక్తిక జీవితాల్లో వారి పరస్పర మన్నింపుల విషయంలో ప్రేమ, అవగాహన, సహనం, సానుభూతి, సహాయం, సహకారం ఉండాలని చెబుతున్నదే తప్ప ఏ విధమైన క్రొత్త మతవ్యవస్థని గానీ, సాంఘిక వ్యవస్థని గానీ, రాజకీయ వ్యవస్థని గానీ, ఓ కొంగ్రొత్త సంక్లిష్ట తత్త్వశాస్త్రాన్ని గానీ ప్రతిపాదించడం లేదు. ఎందుకంటే ఇది విడివ్యక్తుల్నే తప్ప గుంపుల్నీ, వ్యవస్థల్నీ విశ్వసించదు. నవ్యమానవతావాదం మార్పుని ఆశించేది వ్యక్తిస్థాయిలో మాత్రమే. వ్యవస్థలో రావాల్సిన మార్పులంటూ ఇది ప్రతిపాదించేవి కూడా విడివ్యక్తి యొక్క శ్రేయస్సు కోసమే! వాటి అవసరాన్ని అందఱూ అర్థం చేసుకునే రోజు రావాలి. విడివ్యక్తి యొక్క మనసే ఏ సంస్కరణకైనా పదభూమిక (launching pad

). వ్యక్తినిర్మాణమే సంఘనిర్మాణం. వ్యక్తుల స్థాయిలో అర్థం చేసుకోబడని సంస్కరణల్ని సంఘస్థాయిలో తెచ్చినా విఫలమౌతాయి. మనసా–వాచా–కర్మణా ఏ ప్రాతిపదికనైనా సరే, ఇతరుల్ని బాధించకుండా ద్వేషించకుండా, వారిని వ్యక్తులుగా మనుషులుగా ప్రేమిస్తూ నడుచుకోవాలనే అంశమే దీని బోధలన్నింటికీ కేంద్రబిందువు.

లోకంలో మగవారు ఆడవారినీ, ఆడవారు మగవారినీ ప్రేమిస్తారు. లేదా ఎవటికి వారు తమ విజనుష్మ (gender) నే అభిమానిస్తారు. తమ కుటుంబసభ్యుల్ని అందఱూ ప్రేమిస్తారు. నవ్యమానవతావాదం అంటే అదొక్కటే కాదు. కుటుంబం బయటా, అలాగే మనదని భావించబడే మానవ సమూహం బైట కూడా అందఱూ మనలాంటి శరీరాలూ, మనోభావాలూ, శక్తియుక్తులూ, లోపాలూ గలవారేనని గ్రహించడం, వారి నర్థం చేసుకోవడం, సహించడం, స్నేహభావంతో చూడ్డం, ప్రేమించడం, క్షమించడం, దయచూపడం, ఏ కారణం చేతనైనా సరే, ఈ విధమైన వైఖరినుంచి ప్రక్కకి ఓసరిల్లకుండా కొనసాగడం మొదలవ్వాల్సి ఉంది. మనకి ప్రకృతి ప్రసాదించిన మేధాశక్తిని గరిష్ఠస్థాయిలో ఈ లక్ష్యానికేసి ఉపయోగించాల్సి ఉంది. ఇదే యావత్తు నవ్యమానవతావాదం యొక్క సారాంశం.

**(అ) మానవప్రేమకి ప్రాతిపదికలు** (The basis for love of humanity) : *"ఏం చేస్తే మానవులు పరస్పరం సౌహార్దపూరితంగా మెలగుతారు?"* అనే చర్చ ఈనాటిది కాదు. వేలాది సంవత్సరాలుగా సాగుతూనే ఉంది. తమలో తమకి కొన్ని పోలికలు గల ప్రజలే సౌహార్దంగా కలిసి సుఖశాంతులతో జీవిస్తారని ప్రాచీనులు భావించారు. ఆధునికులు కూడా చాలామంది ఈ భావనలోనే ఉన్నారు. దీనికి సంబంధించి చాలా ప్రతిపాదనలు ముందుకొచ్చాయి. అందటికీ ఒకే దేవుడుంటే ఆ విధమైన ఏకేశ్వర భక్తి ప్రజల్ని ఏకం చేస్తుందని ఎక్కువమంది ప్రాచీనులు నమ్మారు. ఒకే రాజుంటే ప్రజలు సుఖపడతారని ఇంకొందఱు నమ్మారు. ఒకే భాష ప్రజల్ని కలుపుతుందని గత కొన్ని వందల సంవత్సరాలుగా భావిస్తున్నారు. ఒకే ఆర్థిక వర్గానికి చెందినవారంతా ఒక్కత్రాటి మీద ఉంటారని చెప్పే సిద్ధాంతవాదులున్నారు.

సోదాహరణ వివరాల్లోకి వెళ్ళను. కానీ వాస్తవ జీవితాచరణా, మన ఉమ్మడి అనుభవమూ ఈ పై అభిప్రాయాల్ని ధ్రువీకరించడం లేదు. ఏకం చేస్తాయని మనం భావిస్తున్నవి కొన్ని



సానుకూల పరిస్థితులు మాత్రమే. ఒకే పరిస్థితిలో ఉండేవారు ఒకేలా ప్రవర్తించక తప్పదు. గనక ఆ పరిస్థితి కొనసాగినంత కాలం వారంతా తమలో తాము సఖ్యంగా ఉన్నట్లు కనిపిస్తారు. అది నిజమైన ఏకీకరణ కాదు. సామాజిక జీవనంలోనూ, పరిపాలనపరంగానూ సానుకూల పరిస్థితుల వల్ల తప్పనిసరిగా ఉపయోగముంది. కానీ కేవలం వాటి వల్లనే జనం ఏకం కారు. అదీ గాక భూమండలం మీద ఎక్కడో ఒక చిన్న ప్రాంతంలోనో పెద్ద ప్రాంతంలోనో జనం ఏకత్రాటి మీద లేరని బాధపడడం బహుశా బాల్యచేష్ట. ఎక్కడి జనమైనా విశాల మానవాళిలో భాగమే. అలా భావించుకోనంత కాలం ఏ ప్రాతిపదికన జనాన్ని ఏకం చేసినా ఆ సుఖశాంతులూ, సమైక్యమూ తాత్కాలికమే అవుతాయి. మానవప్రేమకి ఏ విధమైన ప్రాతిపదికలూ నిజంగా అవసరం లేదు. మన ప్రేమకి పాత్రులు కావడానికి మనకి సంబంధించిన ప్రతి గుర్తింపునీ అవతలివారు పులుముకోనక్కర్లేదు. ఎవటిని వారుగా (మానవుల్ని మానవులుగా) చూసి ప్రేమిస్తే చాలు.

**(ఇ) "నవ్యమానవతావాదం లేకపోతే నష్టమేంటి ? ఇప్పుడు బానే ఉన్నాం గదా!"** వాస్తవం ఏంటంటే, *మనం బాగా లేం. సామూహికంగా బాగా లేం.* ఇలా బాగా లేకపోవడానికి సుదీర్ఘకాలంగా అలవాటు పడీ, పడీ ఇదే చాలా బావుందన్న భ్రాంతిలో మనం జీవిస్తున్నామంతే! పోల్చి చూసుకోవడానికి, దీన్ని తల దన్నే మెఱుగైన పరిస్థితేదీ మన ఎఱుకలో లేకపోవడాన మనం ఈ అమానవీయ సమాజంతో, దీని పామరత్వపు టవగాహనతో, అది సృష్టించిన అమానుష పరిస్థితులతోనూ పూర్తిగా రాజీపడిపోయాం.

నవ్యమానవతాసూత్రాల Education లేక, మనలో తోటిమనుషుల పట్ల సున్నితత్వమూ, సహానుభూతీ దయనీయంగా లోపించిపోయిన ఈ దుఃస్థితిని ఒక్కొక్కఱూ ఒక్కోలా వాడేసుకుంటున్నారని గమనించాలి. మనుషుల్లో పరస్పరం ఏర్పడుతున్న కృత్రిమద్వేషం సైద్ధాంతిక గుంపులకు వరప్రసాదం. ఎందుకంటే మనుషులు మళ్ళీ కలవడానికి వీల్లేని విధంగా విడిపోవడమే, ఆ రకంగా విశిష్ట వర్గీయగుర్తింపులూ, అస్తిత్వాలూ, వాటితో పాటు సంక్రమించే సత్తా–స్వామ్యాలూ నిలబడ్డమే వాటిక్కావాల్సింది. ముఖ్యంగా వారి పాపాల్లో మనల్ని భాగస్వాములుగా మార్చగల్గుతున్నారని గమనించాలి. మనవారి మీదికి మనల్నే ఉసిగొల్పుతున్నారు. మన కళ్ళని మన వ్రేళ్ళతోనే పొడిపించగల్గుతున్నారు. వారిలా చేస్తున్నది కూడా మనలాగే మానవతాసూత్రాలు తెలీక! తెలిసి, అర్థం చేసుకుంటే, వారూ బహుశా

అలా చెయ్యరేమో!

**(ఈ) నవ్యమానవతావాదం మఱో ఇజేమా?** నవ్యమానవతావాదం నిజానికి ఓ 'వాదం' కాదని గమనించాలి. మనమంతా పుట్టుకతో ఏదైతే అయి ఉన్నామో అదే మానవత్వం. దాన్ని గుఱించిన పరిజ్ఞానమే మానవతావాదం. క్రొత్తగా అలవాటు చేసుకోవాల్సిందేమీ లేదు. 'సాత్త్వికత' అనే మాట అందఱూ వినే ఉంటారు. శాంతంగా సౌమ్యంగా మంచిగా ఉండేవారి స్వభావం గుఱించి ఆ మాట వాడతారు. ఈ పదానికి నిరుక్తి (etymology) ఏంటి? సంస్కృతంలో 'సత్' అంటే 'ఉన్నటువంటిది' అని అర్థం. మనిషిలో సహజంగా ఉన్న స్వభావాన్నే సత్+త్వం (ఉన్నదాని తత్త్వం) అంటారు. దానికి సంబంధించినదే సాత్త్వికత. అంటే మనిషి సహజంగా మంచివాడనే అభిప్రాయం ప్రాచీన భారతీయులక్కూడా ఉన్నట్లు ఈ శబ్ద సంఘటనం తెలుపుతోంది.

అవతలివారు తమను మానవీయంగా మన్నించడం లేదనే అసంతృప్తితో పుట్టుకొచ్చినవే అన్ని వాదాలూ. ఆ ఒక్క చిఱువిత్తనంలోనుంచి మఱ్ఱిచెట్లంత మహా సిద్ధాంతాల్ని మొలిపించి ఊడలు దింపుతారు. కానీ మానవస్వభావం ఏ ఒక్క సిద్ధాంతానికీ, సూత్రానికీ లోబడేది గానీ కట్టుబడేది గానీ కాదు. మారాలనే వివేకోదయం తానుగా మనిషిలో కలిగితేనే మీ రతన్ని మార్చగలరు. లేకపోతే అది హరిహరబ్రహ్మాదుల వల్ల కూడా అవ్వదు. అందుచేత ఆ వాదాలన్నింటికీ యథార్థ మాతృక మానవతావాదమే. అంతకు ముందు అమల్లో ఉన్న నీతి నియమాల వ్యవస్థే అన్ని బాధలకీ కారణమని భ్రమపడి, అందుకు విరుద్ధమైన నియమాల్ని (కేవలం తమకే అనువుగా ఉండేవాటిని) ఓ క్రొత్త వ్యవస్థగా రూపొందించి ప్రపంచాన్ని చక్క దిద్దుదామనే ఆలోచనకి ఫలితమే వివిధ వాదాలు.

ఈ వాదాల ఫలితంగా యావత్తు 20 వ శతాబ్దమూ ప్రపంచ ప్రజలకి ప్రతీదాని మీదా హింసాయుతంగా, లేదా ఆవేశపూరితంగా తిరగబడడాన్నే నేర్పింది. ప్రశాంతంగా తోటి మనుషుల్ని అర్థం చేసుకోవడాన్ని మాత్రం నేర్పలేదు. మానవాళి మీద ఆ ప్రభావం ఇప్పటికీ దృగ్గోచరమవుతోంది. తిరుగుబాట్లనేవి ఆయా చారిత్రిక పరీక్షాసమయాలకి తప్పనిసరైనప్ప టికీ వాటిల్లో పాల్గొనే ప్రజల మనస్తత్త్వాన్ని అవి శాశ్వత ప్రాతిపదికన వక్రింపజేస్తాయి. అవి వారికి చర్య (action) జఱపడాన్ని కాకుండా ప్రతిచర్య (reaction) జఱపడాన్నే గఱపు



తాయి. అవి ప్రజల్లో తమ స్వదేశ సంస్థల యందలి ప్రమాణబుద్ధినే పోగొడతాయి. తిరుగు బాట్లు విడిచివెళ్ళే మానసికమైన మదశేషం (hang-over) సమాజంలోనూ, కుటుంబం లోనూ అశాంతిమయ హింసాత్మక ధోరణుల్ని ప్రవేశపెడుతుంది.

*వాస్తవానికి మానవ సంబంధాల్లోని అన్ని సంక్షోభాలకీ మూలకారణం మానవతా విలువల అనుష్ఠానలోపమే.* క్రొత్త వ్యవస్థల్ని కూడా మనుషులే నిర్మిస్తారు. అంతకు ముందటి వ్యవ స్థల నిర్మాతల కన్నా వీరేమీ గొప్పవారు కారు. అసలు ఏది తప్పుడు వ్యవస్థో, ఏది కాదో చెప్పడం కష్టం. వ్యవస్థల్లో ఏమీ లేదు. అంతా వాటికి చోదకులైన మనుషుల్లోనే ఉంది. వ్యవస్థలు నిర్జీవాలూ, హృదయహీనాలూ, యంత్రసమానాలూను. ఓ మంచివ్యవస్థ చెడ్డవారి చేతుల్లోకి వెళితే వారి చెడ్డతనపు సంస్పర్శను పురస్కరించుకొని దరిమిలా అదీ ఓ చెడ్డ వ్యవస్థగానే పేరుపడుతుంది. ఓ మంచి క్రొత్తవ్యవస్థని నిర్మించినా దాన్ని విజయవంతంగా నడిపే నిమిత్తం మళ్ళీ మానవతావాదాన్నే ఆశ్రయించక తప్పదు.

మనం ఏదో ఒక్క మానవ సమూహం తరఫునే వకాల్తా పుచ్చుకున్నాక నవ్యమానవతా వాదులమని చెప్పుకునే అర్హత కోల్పోతాం. ఆ మానవసమూహం ఎంత పెద్దదైనా కావచ్చు. నిజంగానే దయ జూపదగినది కూడా కావచ్చు. మనవీ నిజంగా సదుద్దేశాలే కావచ్చు. ఐనా మనం నవ్యమానవతావాదులమని అనిపించుకోను తగం. నిజమైన నవ్యమానవతావాదికి యావన్మానవజాతి పట్లా ప్రేమ ఉండాలి. ప్రేమించలేకపోతే మానె, కనీసం ద్వేషమైనా ఉండ కూడదు.

నవ్యమానవతావాదం ఎవఱికి వారు అర్థం చేసుకుని ఆచరించడం కోసమే తప్ప దాని సూత్రాల ఆధారంగా ఇతరుల్ని బేరీజువేసి తప్పు పట్టడం కోసం కాదు. నిజమైన నవ్యమాన వతావాది మఱీ ఎక్కువ మానవతావాద లక్షణాలు లేనివారిని కూడా సహిస్తాడు, క్షమి స్తాడు.

**(ఉ) నవ్యమానవతావాదం ఎవఱికెక్కువ ఉపయోగం?** నవ్యమానవతావాదం మానవులం దఱి కోసమూ. ఇది కేవలం బలవంతుల కోసమో బలహీనుల కోసమో కాదు. స్త్రీల కోసమో పురుషుల కోసమో కాదు. అదే విధంగా ఇది కేవలం బాధితుల కోసమో బాధకుల కోసమో కాదు. పాలకుల కోసమో పాలితుల కోసమో కాదు. కేవలం పెద్దల కోసమో పిన్నల కోసమో

కాదు. ధనికుల కోసమో, దరిద్రుల కోసమో కాదు. ఎందుకంటే బలవంతులని భావించబడే వారంతా ప్రతిసందర్భంలోనూ బలవంతులు కారు. అదే విధంగా బలహీనులని భావించ బడేవారంతా ప్రతి సందర్భంలోనూ బలహీనులు కారు. అదే విధంగా, బలవంతులంతా ఒకే వర్గానికీ, అలాగే బలహీనులంతా ఒకే వర్గానికీ చెందరు.

దీనికి గల మఱో కోణం ఏంటంటే– ఓ "బలవద్ వర్గానికి" చెందినంత మాత్రాన ఏ వ్యక్తీ వైయక్తికంగా బలశాలి కాకపోవచ్చు. అదే విధంగా, ఓ "బలహీన వర్గానికి" చెందినంత మాత్రాన ఏ వ్యక్తీ వైయక్తికంగా బలహీనం కాకపోవచ్చు. ఓ ధనిక దేశానికి చెందిన ప్రతి ఒక్కఱూ ఎలాగైతే ధనికులు కారో ఇదీ అంతే! ప్రతివ్యక్తినీ అతని గుంపుని బట్టి కాక అతన్ని బట్టే అర్థం చేసుకోవాలి. అంటే మనలో ప్రస్తుతం నాటుకుపోయిన ఏకమొత్తపు చుట్టుచూపు (overall outlook) స్థానంలో సందర్భానుసార విచారణ (case-to-case approach) పెంపొందాలన్న మాట.

బలాన్ని నవ్యమానవతావాదులు బహుముఖీనంగా అభిదర్శిస్తారు. కేవలం దేహదార్ఢ్యమో, ఓ మానవ సమూహానికి చెంది ఉండడమో, లేదా డబ్బుండడమో ఓ వ్యక్తిని బలశాలిని చెయ్యజాలదు. అందులో వయసు, జ్ఞానం, నేర్పు, పదవి, పలుకుబడి, కీర్తి, కుటుంబ నేపథ్యం, ప్రాంతనేపథ్యం, సాంఘిక మద్దతు లేదా సానుభూతి, చట్టాల ఆనుకూల్యం, స్వభావసిద్ధమైన దుందుడుకుతనం, సందర్భాలూ, పరిస్థితులూ– ఇలా అనేకానేక అంశాలు పాత్ర పోషిస్తాయి.

మనుషుల్లో మానవత్వం తగ్గడానికి సమాజంలో ఏర్పడ్డ రకరకాల హెచ్చుతగ్గులే కారణ మనీ, వాటిని నిర్మూలించి చదును చేస్తే మానవత్వం దానంతట అదే వెల్లివిఱుస్తుందనీ కొందఱంటారు. వారు అసలువిషయాన్ని ఏమాఱుతున్నారు. భేదభావనల్ని సహించలేకపో వడమే అమానవీయతకి గల ప్రధానలక్షణం. ఎన్ని భేదాలున్నా సహృదయంతో సహించా లనడమే నవ్యమానవతావాదం. భేదాల్ని బలవంతంగా నిర్మూలించడమంటే అమానవీయత కి పరోక్షంగా వెన్నుదన్ను ఇవ్వడమే అవుతుంది. ఒకే రంగుగా భావించబడే దాంట్లో సైతం అనేక ఛ్చాయలుంటాయి. అలాగే పైకి ఏ భేదాలూ లేనట్లు గోచరించే సజాతీయ, సవర్గ, ససిద్ధాంత సమాజాల్లో కూడా అంతర్లీనంగా పలు విభేదాలుంటాయి. అక్కడ ఇతర వర్గాలవారి మీద కాకుండా తమవారి మీదే అమానుషత్వాన్ని ప్రదర్శించేవారుంటారు.



కనుక నవ్యమానవతావాదం ఎక్కడైనా ఎప్పుడైనా అవసరమే.

**(ఊ) నవ్యమానవతావాద పరిమితులు :** లోకంలో ఏం చెప్పినా విననివారున్నారు. ఎంత చెప్పినా అర్థం కానివారున్నారు. ఏం చేసినా మారనివారున్నారు. అన్ని సిద్ధాంతాల్నీ స్వార్థ ప్రయోజనాల కోసం అందమైన ముసుగుల్లా వాడుకోగలవారున్నారు. నవ్యమానవతావాదం అటువంటివారి కోసం కాదు. ప్రతివారితోనూ ఒకేలా యాంత్రికంగా వ్యవహరించాలని నవ్యమానవతావాదం చెప్పదు. వారు చైతన్యమూర్తులైన మనుషులు గనుక వారి పరిజ్ఞానా నికీ, అవగాహనకీ, శక్తియుక్తులకీ, తత్త్వానికీ అనుగుణంగానే వారితో వ్యవహరించాలని చెబుతుంది. తమకివ్వబడే మానవీయ మన్నింపు (humanitarian treatment) ని ఉద్దేశపూర్వకంగానూ, వ్యూహాత్మకంగానూ నిరుపయోగమో, దురుపయోగమో చేసేవారి విషయంలో మానవతావాదం అప్రభావం (ineffective). అంతమాత్రాన వారిపట్ల కర్కశ వైఖరి నవలంబించే పని లేదు. వారి నుంచి ఇతరులకి రక్షణ కల్పించే చర్యలు తీసుకుంటే సరిపోతుంది.

సమాజంలో ప్రతి ఒక్కఱినీ ఒకేసారి మానవతావాదులుగా మార్చడం నవ్యమానవతావాద లక్ష్యం కాదు. ఎందుకంటే నవ్యమానవతావాదం ప్రాథమికంగా వ్యక్తిగతమైన గ్రహింపు (realization) కి సంబంధించినది. గ్రహింపు అంటే ఇక్కడ జ్ఞానోదయం అనుకోవచ్చు. ఓ సమాచార శకలాన్నో, పరిజ్ఞాన విశేషాన్నో (a piece of information or know-how) ఇతరులకి ప్రసారించగలం. కానీ గ్రహింపుల్ని శాబ్దికంగా ప్రసారించడం (verbal transmission) సాధ్యం కాదు. అవి ఎవఱికి వారు, ఎవఱి సమయమొచ్చినప్పుడు వారు, యాదృచ్ఛికం (spontaneous) గా పొందాల్సినవి.

అలాగే మానవులందఱినీ ఏకం చేయడం కూడా నవ్యమానవతావాద ధ్యేయం కాదు. కారణం– ఏ జనత అయినా ఎవఱో ఒకఱికి వ్యతిరేకంగా, వారిని ద్వేషించడం ద్వారా, ఆ ద్వేషానికి విస్తృత ప్రచారాన్ని కల్పించడం ద్వారా మాత్రమే ఏకమవుతుంది. ఎవఱో ఒక ఉమ్మడి శత్రువునో, బూచాణ్ణో చూపించకపోతే జనం ఏకం కారు. కానీ నవ్యమానవతావాదుల దృష్టిలో ద్వేషించదగ్గ శత్రువులెవఱూ లేరు. ఆఖరికి అమానవీయంగా ప్రవర్తించేవారినీ, నవ్యమానవతావాద సిద్ధాంతాలతో విభేదించేవారిని కూడా వారు శత్రువులుగా చూడరు.

వారి తత్త్వాన్ని ఓ మనఃపరిణామ దశగానే చూస్తారు. ఆ దశ దాటుకుంటే అందఱూ నవ్య మానవతావాదంలోకే వస్తారని వారు నమ్ముతారు.

సిద్ధాంతాలే కాదు, అసలు ఏ కారణం చేతనైనా ఇతరుల్ని ద్వేషించడమూ, ఆ ద్వేషాన్ని ప్రచారం చేయడమూ నవ్యమానవతావాద స్ఫూర్తికే విరుద్ధం. ఏ రకమైన సమైక్యమైనా విడివ్యక్తి యొక్క ప్రయోజనాల్నీ, మనోభావాల్నీ ఎంతో కొంత బలిచేస్తేనే తప్ప సంభవించదు. కానీ నవ్యమానవతావాదం గుంపుల కన్నా విడివ్యక్తి పైనే హెచ్చుశ్రద్ధ వహిస్తుంది. మఱో విషయమేంటంటే- భౌతికమైన సమూల మార్పులు తేవడం నవ్యమానవతావాద లక్ష్యం కాదు. అది సాధ్యం కాదు కూడా. మానవతాసూత్రాల్ని ఆచరించడానికి అనువుగా, ప్రస్తుతమున్న వ్యవస్థల్లోనే కొద్దిపాటి సంస్కరణలూ, కఱుడుగట్టిన మనుషుల దృక్పథాల్లో కాస్త సడలుబాటూ (flexibility) అవసరమని నవ్యమానవతావాదులు ప్రతిపాదిస్తారు.

ఐతే దీనిసూత్రాల్ని సైతం వివేకంతోనే అనువర్తించుకోవాల్సి ఉంటుంది. ఎందుకంటే- మనుషుల మంచితనాన్ని వాడుకుని లాభం పొందాలని చూసేవారు లోకంలో చాలామంది ఉన్నారు. ఉదాహరణకి- మన దేశంలో ప్రజల జాలిగుణాన్నీ, ఆధ్యాత్మిక తత్త్వాన్నీ ఆసరాగా చేసుకుని ఓ బృహత్తరమైన భిక్షాటన పరిశ్రమే వర్ధిల్లుతోంది. అలాగే అంతకంటే పెద్దస్థాయిలో అధికార సంపాదన కోసం సానుభూతిని వాడుకునే రాజకీయ పక్షాలున్నాయి. తమకి పూర్తి అనుకూలంగానూ, ఇతరులకి పూర్తి ప్రతికూలంగానూ ఉండే నిరంకుశ చట్టాల్ని తేవడం కోసం సానుభూతిని వాడుకునే ప్రయోజన గుంపులూ, వర్గీయ గుంపులూ (interest groups and sectarian groups) ఉన్నాయి.

**(ఋ) నవ్యమానవతావాదం ఆచరణసాధ్యమేనా?** నవ్యమానవతావాదం శుష్కపుస్తక జ్ఞానం మీదా, ఊహాపోహల మీదా, అవాస్తవిక ఆశింపుల మీదా ఆధారపడ్డది కాదు. ఇది వెఱ్ఱి ఆదర్శవాదం కాదు. దీన్ని ఎవఱూ గ్రుడ్డిగా నమ్మాల్సిన పనిలేదు. ఎవఱికి వారు పరిశీలించి పరీక్షించి నిగ్గుదేల్చుకోవచ్చు. ఇది చాలావఱకూ భౌతికకోణంలోంచి అర్థం చేసుకోవడానికి అనువైనదే. ఖచ్చితమైన ప్రకృతి సూత్రాల్నీ, మనస్తత్త్వశాస్త్రాన్నీ, ఇంగితాన్నీ (commonsense) ప్రాపుగా చేసుకున్నట్టిది. ఇది జ్ఞాన-విజ్ఞాన-వివేకాల మీదా మానవాళి యొక్క చారిత్రిక అనుభవాల మీదా ఆధారపడినట్టిది. లౌకిక ప్రయోజనా లనేకం కలిగినది



కూడా.

**(ౠ) నవ్యమానవతావాదానికీ మంచితనానికీ మధ్య గల సూక్ష్మ వ్యత్యాసం :** నవ్యమానవతావాదాన్ని మంచితనంగా కూడా అర్థం చేసుకోవడానికి అవకాశముంది. మంచితనమూ, నవ్యమానవతావాదమూ ఉపరితలంలో ఒకేలా ఉంటాయి. అదే విధంగా మంచి మనుషులూ, నవ్యమానవతావాదులూ ఇద్దఱూ పైకి ఒకేలా కనిపిస్తారు. కానీ సూక్ష్మమైన తేడాలు కొన్ని లేకపోలేదు. లోకంలో మంచి మనుషులుగా కనిపించేవారు ప్రధానంగా ఆఱు రకాల తత్త్వాలు.

**ఒకటి–** ఏమీ తెలీకపోవడం వల్ల మంచిగా మిగిలిపోయినవారు. వీరి పరిజ్ఞానం గనక హెచ్చితే ఆ తరువాత అదే మంచితనపు సౌరభాన్ని వారినుంచి ఆశించలేం.

**రెండోది-** ఏమీ చేతకాకపోవడం (అసమర్థత) వల్ల మంచిగా మిగిలిపోయినవారు. వీరికి గనక ఏదైనా చేతనైతే విశ్వరూపం ప్రదర్శిస్తారు.

**మూడోది–** చేతనైనప్పటికీ పిఱికితనం మూలాన మంచిగా మిగిలిపోయినవారు. ఎవఱూ చూడరనే ధీమా, లేదా ఎవఱైనా తమకు అండగా నిలబడతారనే ధైర్యం గనక వస్తే వీరు ఏమైనా చేయగలరు.

**నాలుగోది–** సమాజాన్ని నూటికి నూఱుశాతం అనుకరిస్తూ అనుసరిస్తూ తమ స్వంతమంటూ ఏమీ లేకుండా అచ్చం సమాజ ప్రతినిధులుగా దాని ఛాయామాత్ర ప్రతిబింబాలుగా జీవించేవారు.

**ఇంకొంతమంది (ఐదో రకం)** వ్యక్తిగతంగా చాలా మంచివారు. కానీ సైద్ధాంతిక విషయాల్లో మాత్రం ఏ విధమైన పట్టూ-విడుపూ, రాజీ లేని కఠినాత్ములు. అంటే తాము స్వయంగా శాంతమూర్తులైనా తమ అభిమాన గుంపులు దిగే దౌర్జన్యాల్ని వెనకేసుకొస్తూంటారు.

**ఇహపోతే ఆఱో శ్రేణి** ఇవేవీ కాని నిజమైన మంచివారు. ఈ కడపటి శ్రేణి మిక్కిలి అరుదు. ఒకఱు "మంచివాడా? చెడ్డవాడా?" అనే చర్చతో సమాజానికి నిమిత్తం లేదు. అతను "బలవంతుడా? బలహీనుడా?" అనేదొక్కటే దానికి ప్రసక్తం. మంచివాడన్న కారణం చేత ఎవఱి

కోసమూ అది తన నమ్మకాల్నీ, నియమాల్నీ సడలించదు. కానీ ఓ వ్యక్తి బలవంతుడన్న కారణం చేత అది అతని కోసం అన్ని నమ్మకాల్నీ తాత్కాలికంగానైనా వదిలేసుకుంటుంది. అన్ని నియమాలకీ గండి కొడుతుంది. దీనికి రెండు కారణాలు.

- సమాజానికి మానవతాసూత్రాలు తెలీవు.
- మంచివారు ఎంతసేపూ తమకు చేతనైన పద్ధతిలో తమవఱకూ మంచిగా ఉండాలని చూస్తారే తప్ప ఆ ప్రవర్తనకి నవ్యమానవతావాదంలాంటి లోతయిన చింతనాత్మక ప్రాతిపదికా, అందులో శిక్షణా, దాన్తో పాటు తమలాంటివారితో సంపర్క జాలమూ (networking) అవసరమని గుర్తించరు.

మానవతావాదమంటే వట్టి మంచితనం కాదు. ఇది వివేక–విజ్ఞానాలతోనూ, తర్కపటిమ తోనూ, సమాచార సంపత్తితోనూ, శక్తిసామర్థ్యాలతోనూ, సౌజన్యశాలుల సంయుక్తబలంతో నూ మిశ్రితమై సత్తాసమన్వితమైన మంచితనం. వట్టి మంచితనాలన్నీ ఏ దురదృష్ట సంఘ టన మూలాన్నయినా చెడ్డతనాలుగా మారిపోవచ్చు. నవ్యమానవతావాద సూత్రాల అవగా హన లేని సాదాసీదా మంచివాళ్ళకి కలిగే అనూహ్య జీవితానుభవాలు వారికి తప్పుడు సందే శాలిచ్చి వారి మంచితనాన్ని ఏ బలహీనక్షణంలో నైనా పట్టాలు తప్పించేయగలవు. నవ్య మానవతావాదమంటే మంచితనంలో ఇమిడున్న నియమాల్ని, వాటి మూలాల్నీ, ప్రయోజ నాన్నీ కూలంకషంగా అర్థం చేసుకోవడం. ఒకసారి అలా అర్థం చేసుకున్నాక ఎంతటి దుర్ఘ టనైనా నవ్యమానవతావాదిని అన్యథా మార్చజాలదు.

**(ఇ) మనమెందుకు నవ్యమానవతావాదులం అవ్వాలి?** కారణాలేవైనప్పటికీ మానవుడు సృష్టిలోకెల్లా అద్భుతమైన ఉత్కృష్ట జీవి. అలాంటి మానవజన్మెత్తడం మన అదృష్టం. ఈ అదృష్టం మనకే కాక కోట్లాదిమంది ఇతరులక్కూడా పట్టిందంటే దానర్థం– వారు కూడా మనలాంటి ఉత్కృష్టజీవులే అయ్యుండాలి. కాబట్టి వారిలో మనల్నీ, మనలో వారినీ చూసుకో వాలి. ఆ విధమైన దృక్పథం మనల్ని మానసికంగా ఉన్నతంగానూ ఉదాత్తంగానూ మలచ గలదు. మన సామూహిక, వైయక్తిక జీవితాల్ని సుఖసంతోషాల మయంగా రూపుదిద్ద గలదు. ఆ విధమైన దృక్పథాన్ని పెంపొందించే దిశగా అనేక ఇతరేతర అవగాహనల్నీ, ప్రవ ర్తనా నియమావళినీ నవ్యమానవతావాదం సమకూరుస్తుంది.

**(ఈ) నవ్యమానవతావాదంలో తప్పొప్పుల నిర్వచనం:** ఇది చాలా పెద్ద ప్రస్తావన. ఐనా



క్లుప్తంగా వ్రాస్తాను. ప్రపంచంలో తప్పొప్పులనే పదాలకి స్థూలంగా 3 దృక్కోణాల్లోంచి వ్యావహారికార్థం చెప్పుకోవచ్చు.

- తత్క్షణం మేలు చేకూర్చేవి ఒప్పులు. తద్విరుద్ధమైనవి తప్పులు.
- యథార్థమైనవి (లేదా జఱిగి తీఱాల్సినవి) ఒప్పులు. కానివి తప్పులు.
- మనం పుట్టి పెఱిగిన సంస్కృతిని బట్టి మనకి నచ్చేవి ఒప్పులు. నచ్చనివి తప్పులు.

అయితే ఇక్కడ సర్వసాధారణంగా తలెత్తే గందరగోళం (confusion) ఏంటంటే–

- మేలంటే ఎవఱికి మేలు? వ్యక్తికా? సమాజానికా?
- యథార్థాన్ని నిరూపించేది ఎలా? ఎవఱికి నిరూపించి చూపాలి? దాని వల్ల ఉప యోగమేంటి?
- మనకి నచ్చనిది ఇతరులకి నచ్చితే ఏం చెయ్యాలి?
- ఈ లక్షణాల్లో ఒకదానికొకటి సరిపడనప్పుడు ఏం చెయ్యాలి? అంటే ఉదాహ రణకి– యథార్థమైనది మనకి నచ్చనప్పుడు గానీ, లేదా మేలు చేకూర్చనప్పుడు గానీ, లేదా సమాజానికి మేలైనది మనకి మేలు కానప్పుడు గానీ!

కాబట్టి ఈ దృక్కోణాలు సమగ్రం కావని తెలిసిపోతోంది. తప్పొప్పుల ప్రాతిపదికలు అన్నివేళ లా మనం అనుకుంటున్నవే కాకపోవచ్చు. ఉదాహరణకి– ఓ ముఠా (mafia) సభ్యుడు మఱో ముఠా సభ్యుణ్ణి చంపితే అది శిక్షార్హమైన హత్య అవుతోంది. కానీ ఓ లక్షమంది వెళ్ళి మఱో లక్షమందిని చంపితే దాన్ని సమ్మానార్హమైన దేశభక్తి అంటున్నారు.

ఒకటి జఱగక తప్పదని తెలిసినప్పుడు, లేదా ఒకటి ఒకలా జఱుగుతోంది కాబట్టి దానికి మన ప్రతిస్పందన ఇలాగే ఉండాలని అర్థమైనప్పుడు మనకందులో తప్పు కనిపించడం మానేస్తుంది. కాబట్టి చాలా తప్పొప్పులు సత్యస్థితి మీద ఆధారపడి ఉంటాయి. సత్యానికీ, ప్రకృత్యనుసరణకీ అభేదం. అలాగే సత్యానికీ, జ్ఞానానికీ కూడా అభేదం. ప్రకృతినియమాల ననుసరించి పోయేవాడు సరాళమైన దారిలో ఉన్నట్లే లెక్క. అతను జ్ఞానుల కోవలోకే వస్తాడు. అందుచేత నవ్యమానవతావాదంలో తప్పొప్పుల నిర్ధారణ కంటే సత్యాసత్యాల నిర్ధారణకే అగ్రతాంబూలం. ఎందుకంటే తప్పొప్పులనేవి దేశకాలాల్ని బట్టి, సందర్భాన్ని బట్టి, వ్యక్తుల్ని బట్టి సదా మారిపోతూంటాయి.

తద్విపర్యాసంగా, సత్యస్థితితో, లేదా ప్రకృతితో నిమిత్తం లేని తప్పొప్పులన్నీ మానవకల్పితాలే. ఉదాహరణకి, *'ఏకాదశినాడు ఏ కాకీ ఎంగిలిపడదు'* అనే సామెత ఉంది. కాబట్టి మానవులు కూడా ఆ రోజున ఉపవాసం ఉండాలని తాత్పర్యం. ఇది నిజమో కాదో తెలుసుకోవాలంటే ఏకాదశి రోజున కాకుల్ని పరిశీలించాలి. లేదా ఆ రోజు ప్రాయోగికంగా భోంచేసి చూస్తే ఆ నియమం మానవకల్పితమా? ప్రకృతిసృష్టా? తేలిపోతుంది. ప్రకృతితో సంబంధం లేని మానవకల్పిత విలువలన్నీ ఊహాజనితమనే భావించాల్సి ఉంటుంది.

అందుచేత ప్రకృతిసహజమైన ప్రేమ-కామ-క్రోధాది సహజాతాల్ని (instincts) కలిగి ఉండడాన్ని కూడా నవ్యమానవతావాదులు ఓ లోపంగానో దోషంగానో అభిదర్శించరు. ఈ అంశాన్ని ఇక్కడ విపులంగా విస్తరించి చెప్పే అవకాశం లేదు. నేను వ్రాసిన **చింతన సమీరం** అనే పుస్తకం చూడవలసినది. కానీ మతమూ, నవ్యమానవతావాదమూ ఇక్కడ చాలా వఱకూ విభేదిస్తాయని చెప్పుకోవచ్చు. మానవజీవితంలో దేనికుండే ప్రాధాన్యం దానికుంది. వాటిని మానవులకి ప్రసాదించడం వెనక ప్రకృతికి ఖచ్చితమైన లక్ష్యమూ, ప్రయోజనమూ ఉన్నాయి. అవి వాస్తవానికి మనిషి అదుపులో ఉన్న విషయాలు కావు. కనుక అవి ఉన్నందుకూ, వాటిని బైటికి వ్యక్తం చేసినందుకూ, తృప్తిపఱచుకున్నందుకూ ఎవఱినీ నిందించాల్సిన పనీ లేదు. అసహ్యించుకోనక్కఱ్లేదు. వెలివేసే అవసరమూ లేదు. శిక్షించే అగత్యం అంతకన్నా లేదు. ఇతరులకి వస్తు-ద్రవ్య-ప్రతిష్ఠారూపాల్లో నష్టాన్ని చేకూర్చనంతవఱకూ, అలాగే శారీరిక బాధనీ, మానసిక క్రుంగుబాటు (mental depression) నీ కలిగించనంత వఱకూ ఎవరైనా తమ స్వాభావిక సహజాతాల్ని అనుసరించి నడుచుకోవచ్చు.

తప్పొప్పులకీ, మంచి-చెడులకీ యథార్థమైన నిర్ణాయకాంశం (decisive factor) సత్యమే. ఒకానొక సామాజిక అమఱిక (social setting) లో హానికరమని భావించబడే సత్యం మఱో అమఱికలో అలా కాకపోవచ్చు. ఉదాహరణకి, పరిపాలన రహస్యాల్ని కాపాడడం ఒకనాటి ఆదర్శం. ఏదీ దాచుకోకుండా పారదర్శకం (transparent) గా పరిపాలించడం నేటి ఆదర్శం. అంటే, ఇక్కడ మారినది సత్యం కాదు, మన అభిదర్శనకోణమే (perspective). కాబట్టి సత్యాల వెల్లడి ద్వారా జఱిగే హానికి సత్యవచనుల్ని నిందించడం సరి కాదు. విశేషాధ్యయనం నిమిత్తం, నేను వ్రాసిన **'చింతన సమీరం'** అనే గ్రంథంలో *'తప్పొప్పుల నిర్ణయం తరువాత'* అనే వ్యాసాన్ని పఠించవలసినది.



వేటికైతే దండనభయం ఉంటుందో అవే తప్పులనీ, ఆ భయం లేనివే ఒప్పులనీ జనసామాన్యంలో ప్రచురమైన అభిప్రాయంతో నవ్యమానవతావాదులు ఏకీభవించరు. దండనభయానికీ తప్పొప్పులకీ సంబంధమే లేదు. దండనభయం అనేది సమాజం తన సౌకర్యం కోసం కృత్రిమంగా కల్పించినట్టిది కాగా నీతి మానవుడి సహజస్థితి. అదే గనక అతనికి సహజస్థితి కాకపోతే ఈ ప్రపంచంలో నీతులు చెప్పేవారూ, చట్టాలు చేసేవారూ, వాటిని అమలుజఱిపేవారు కూడా ఉండేవారు కాదు. కొంతమందికి కొన్ని విషయాల్లో మాత్రమే నీతి లేదు గనక మనం బ్రతికిపోతున్నాం. ఎవఱికీ ఏ విషయంలోనూ నీతి లేకపోతే ఎక్కడుండేవారిమో ఆలోచించండి. కాబట్టి కొన్ని లోపాలున్నా కూడా ప్రతి మనిషికీ నీతే సహజస్థితి అని స్పష్టంగా తేల్తోంది. కీ.శే. కొడవటిగంటి కుటుంబరావుగారన్నట్లు- మనిషి పశువులా ప్రవర్తించగలడేమో గానీ నిజంగా పశువెన్నటికీ కాలేడు.

**(ఎ) మానవతావాదం మన గడ్డమీద ఎందుకు పుట్టలేదు ?** పుట్టడం సంగతలా ఉంచి, ఓ సమాజానికి మానవతావాదం కనీసం అర్థమవ్వాలన్నా ఆ సామాజికుల్లో పరిసర చింతన సంప్రదాయం (మన చుట్టూ ఉన్నవారి గుఱించి ఆలోచించే సంప్రదాయం) ఎంతో కొంత ఉండాలి. మనవారికి తమ చుట్టూ ఉన్న మనుషుల మీదా, ప్రకృతి మీదా ఆసక్తి లేదు. ప్రశ్నలూ లేవు. ప్రతిదానికీ "అదంతేలే" అని సరిపుచ్చుకుంటూ తలొంచుకు పోవడమే మనకి తెలుసు. అందుచేత ఇక్కడ ఏ నూత్నాలోచనా పుట్టలేదు. పుట్టనివ్వరు. మనలోనూ చింతన లేకపోలేదు. కానీ అది పరలోకం గుఱించే.

అలాగే మన పాఠ్యపుస్తకాల్లో సంఘసంస్కరణగా, జాతీయ పునరుజ్జీవనంగా పేర్కొనబడే విషయాలు కూడా వాస్తవంగా మన కుటుంబాలకీ, కులాలకీ, అందులోనూ ఒక ప్రత్యేక విజనుష్షు (gender) కు సంబంధించినవి. అప్పట్లో కొద్దిమందిలోనూ, వారి కులాల్లోనూ కలిగిన జాగృతిని యావత్తు దేశానికీ టోకున (wholesale) అన్వయిస్తున్నారు. నిజంగా అదంత విస్తృతస్థాయి సంస్కరణో, పునరుజ్జీవనమో అయితే అంతకంటే సంతోషకరమైన విషయం లేదు. కానీ దురదృష్టవశాత్తూ మన దేశపు భావాత్మక వాతావరణం (thought climate) ఇప్పటికీ బహు సంకుచితంగా, అస్తిగోపనం (conservative) గా యూరప్ కంటే వందేళ్లు వెనకబడే ఉంది.

దీనిక్కారణం– వర్గీయ ధోరణి (sectarian attitude) మాలిన శుద్ధ చింతనని మన దేశంలో తప్పుగా చూస్తారు. మనవారు ప్రతి చిన్న మార్పునీ ద్వేషిస్తారు. ముఖ్యంగా, దాని ఆకరం (source) స్వదేశీయులే ఐన సందర్భాల్లో! మౌలికమైన మార్పులు రావాలని కోరే వారిని ఇక్కడ దాదాపు వెలివేసినంత పని చేస్తారు. బైటినుంచి దిగుమతయ్యే మార్పులనైతే ఏమీ అనరు. కానీ ఆ దిగుమతైన మార్పుకు ప్రచోదకమైన స్థానికస్ఫూర్తినీ, దాని వెనక పనిచేస్తున్న మూలసూత్రాన్నీ మాత్రం ఎప్పటికీ అర్థం చేసుకోరు. ఈ దేశంలో పరిసర చింత నులకి సర్వసాధారణంగా ఇవ్వబడే సలహా: *"నీ పని నువ్వు చూసుకో. నీ డబ్బు నువ్వు సంపాదించుకుని సుఖంగా ఉండు. నీకెందుకు ఆ గొడవంతా ?"* అని!

అదే సమయంలో వట్టిమేధావుల్నీ, వారి తాత్త్విక ఊహాపోహల (philosophical speculations) నీ మనం సుతరామూ మెచ్చుకోలేం. మన దృష్టిలో– వాటితో వారు అత్యవస రంగా ఏదైనా చెయ్యాలి."వాటితోనే" అని కాకపోయినా, వారు కనీసం తద్వ్యాహ్యంగానైనా మనకేదో ఒకటి ఆర్థికంగా, భౌతికంగా ఒరగబెట్టాలి. లేకపోతే వారు ఎంతగొప్ప మేధావు లైనా, వారి ఆలోచనలు ఎంత వినూత్నాలైనా మనకవసరం లేదు. ఏతావతా, సారాంశ రూపంగా మనలో ఎక్కువ మందిమి, ఎంత చదువుకున్నా, ఎంత ఉన్నతవర్గానికి చెందినా, పక్కా ఆర్థికజీవులమే తప్ప బుద్ధిజీవులం మాత్రం కాదు. ఆర్థికతతో సంబంధం లేనిదేదీ మన కర్థం కాదు. కనుక ఆధునిక కాలంలో అన్ని శాస్త్రాలూ పాశ్చాత్యదేశాల్లోనే వికాసాన్ని గాంచాయి తప్ప మన దగ్గఱ ఏ వినూత్నాలోచనకీ ప్రోత్సాహం లేదు.

మనకి తెలిసిందల్లా కుటుంబమే. మళ్ళీ అందులో కూడా ఓ ప్రత్యేక విజనుష్ప తప్ప ఇంకె వఱూ మనకి ముఖ్యం కాదు. ఉదాహరణకి— మన చలనచిత్రాలూ, దూరదర్శన ధారావాహి కలూ, సాహిత్యమూ అన్నీ విధిగా ప్రేమ–పెళ్ళి అనే జెమిలి ఇతివృత్తాల చుట్టూ పరిభ్రమి స్తూంటాయి. మన దగ్గఱ పబ్లిక్ లిమిటెడ్ సార్థవాహాలుగా నమోదై ప్రజానీకం నుంచి ఇల్లడాల (deposits) నీ, వాటాల (shares) నీ సేకరించే సంస్థలు సైతం ఆచరణలో కుటుంబవ్యాపారాలుగానే నడపబడతాయి. మనకు వేఱే ఊహలు స్ఫురించవు. ఒకవేళ స్ఫురించినా అవి జనాదరణకీ, ప్రోత్సాహానికీ నోచుకోవు. మనలో విభిన్నాలోచనల్నీ, స్ఫూర్తి నీ అపేక్షించేవారు అవశ్యం విదేశీయుల్ని ఆశ్రయించాల్సిందే. మన దృష్టిలో పరిసరాల గుఱించి ఆలోచించడమంటే స్త్రీల గుఱించి ఆలోచించడమే. ఐతే మన బలహీనత ఏంటంటే, టప్పుడు తల్లీ, చెల్లీ లాంటి వరసల్ని అన్వయిస్తే తప్ప అర్థం కానంత సంకుచితత్వం. ఎప్పు డైనా ఈ పరిధిని కాస్త అధిగమించాల్సి వస్తే మనకి మేధాపరంగా చాలా ఇబ్బందవుతుంది.



ఈ కారణాల చేత మన దేశంలో పరిసర చింతన అనేది ఒక ఎదగని గిటకచెట్టు (bonsai plant) గా మిగిలిపోయింది. గడిచిన శతాబ్ది కాలంలో ఈ శూన్యాన్ని భర్తీ చేయడానికి రక రకాల 'ఇజాలు' ప్రయత్నించాయి. కానీ విఫలమయ్యాయి. ఎందుకంటే, కులాలే తప్ప అందఱికీ వర్తించే, అందఱూ మమించే (identify అయ్యే) సమాజం లేని చోటా, పార లౌకిక చింతనా, కుటుంబ చింతనా తప్ప ఇంకేమీ ఎఱగని చోటా 'ఇజాల్ని' రప్పించి ప్రవేశ పెడితే అవి సహజంగా ఇమడవు. అది, బధిరుల దేశంలోకి సంగీతవాద్యాల్ని దిగుమతి చేసి నట్లుంటుంది.

పరిసర చింతనలో కేవలం కుటుంబాలూ, కులాలే కాదు. ఇంకా పెక్కంశాలు అంతర్భ విస్తాయి. సంఘసంస్కరణ అంటే స్త్రీల జీవితాల్ని బాగుచెయ్యడమొక్కటే కాదు. అన్ని విష యాలతో పాటు అదీ ఒకటి. కాదనలేం. కానీ మన సమాజం పురోగత స్థాయికి చేఱుకోవా లంటే రావాల్సిన మార్పులు చాలానే ఉన్నాయి. చాలా రంగాలకి సంబంధించి ఉన్నాయి. అవి ఎక్కువ భాగం మన ఆలోచనాధోరణులతో ముడిపడ్డవి. మనలో కుటుంబాలంటే పారంపరికంగా నాటుకుపోయిన బలమైన మమకారం, సెంటిమెంటు దృష్ట్యా మనం స్త్రీల అంశాలకి మాత్రమే మిక్కిలి భావోద్వేగ భరితంగా తత్క్షణం స్పందిస్తూంటాం. మిగతావన్నీ వినీ విననట్లూ, చూసీ చూడనట్లూ వదిలేస్తూంటాం. ఈ పరిస్థితిని మార్చే శక్తి విశాల దృక్పథం గల నవ్యమానవతావాదానికి మాత్రమే ఉంది.

**(ఏ) నవ్యమానవతావాదం ఒకదానికొకటి పొంతన లేని వైరుధ్య ప్రతిపాదనల సమా హారమా ? :** అసలు సాంప్రదాయిక మానవతావాదం మీదే ఈ విధమైన నెపముంది మొద ట్నుంచీని! తమ లక్ష్యాల్ని నాస్తిక–అజ్ఞేయ వాదాలతో ముడిపెట్టుకోవడమనే పొఱపాటు చేయడాన ఈ ఆరోపణకి సాంప్రదాయిక మానవతావాదులు తలొంచుకోవడమే మినహా సంతృప్తికరమైన సమాధానం ఇవ్వలేకపోయారు. నవ్యమానవతావాదంలో మటుకూ అటు వంటి అయోమయమేదీ లేదు. దీని తదుపరి అధ్యాయంలో 36 మానవతావాద సూత్రాలివ్వ బడ్డాయి. అవన్నీ కూడా ఇతరుల్ని ఏ విధంగానూ బాధించకుండా ప్రేమించాలనే మూల

సూత్రం చుట్టూ పరిభ్రమించేవే. వాటిల్లో ఏ ఒక్కదాన్ని ఉల్లంఘించినా, లేక కాదని తిరస్క రించినా మనం ఇతరులకి పీడాకరంగా పరిణమించేది ఖాయం.

**(ఐ) నవ్యమానవతావాదులకు వర్గీయ భావజాలాలు** (sectarian ideologies) **ఏల ఆమోదయోగ్యం కావు?** నవ్యమానవతావాదం అన్ని వర్గాల ఉనికినీ ఆమోదిస్తుంది. అవి తమ ఉనికికి చెప్పుకునే సమర్థనల (justifications) ని ఇది ప్రశ్నించదు. ఆయా వర్గాల్ని ఒకదాన్నుంచి మఱోదాన్ని విచక్షించి చూపే వాటి విలక్షణ లక్షణాల (unique featu-res) ని ఇది విమర్శించదు. వాటి ఆచరణల్నీ, ఆచారాల్నీ ఇది ఖండించదు. అవి తమ ఉమ్మడి గొప్పతనాలుగా చెప్పుకుని గర్వపడే విశిష్ట సంసాధింతల (achieve-ments) విషయంలో ఇది విభేదించదు. ఆయా వర్గాల సభ్యులు తమ తమ వర్గాలకి చేసుకునే ఉప కారాల్నీ, సేవల్నీ, అలా చేయడంలో వారి ఉద్దేశాల (motives) నీ ఇది నిరసించదు. వారు స్వీయవర్గ ప్రాతిపదికన సంఘటితమైతే ఇది కాదనదు. మఱి ఇది వాటిని ఆమోదించనిది ఎక్కడ?

ఎక్కడంటే– వర్గీయ ప్రాతిపదికన చేసే గుంపు–గూండాయిజాన్నీ, రాజకీయాల్నీ, పరపీడన నీ, ఆ స్వభావం కలిగిన చట్టాల్నీ, నియమ–నిబంధనల్నీ నవ్యమానవతావాదం ఆమోదిం చదు. ఆ ప్రాతిపదికన అన్ని రంగాల్లోనూ, అన్ని సందర్భాల్లోనూ సమాజాన్ని పనసపొట్టులా కొట్టడాన్ని (social fragmentation) ఇది హర్షించదు. ఆ ప్రాతిపదికన ఓ వర్గపు ఆధి పత్యాన్ని మిగతా అందఱి మీదా ఆధికారికంగానో చట్టపరంగానో ఉద్దేశపూర్వకంగా రుద్ద డానికి మానవతావాదం అంగీకరించదు. వర్గీయ భావజాలాలన్నీ పిండదశలో ఉన్న తీవ్ర వాదాలే. ప్రభుత్వాలూ, వాటిని నడిపే రాజకీయ పక్షాలూ ప్రత్యేక చట్టాల ద్వారానూ, విభా గాల ద్వారానూ ఇలాంటి భావజాలాల్ని బాహాటంగా పెంచి పోషించడం మిక్కిలి శోచ నీయం.

వర్గీయ భావజాలాలకీ, నవ్యమానవతావాదానికీ వాస్తవంగా పొత్తు కుదరదు. ఎందుకంటే మానవాళిలో ప్రతి ఒక్కఱి గుఱించీ ఆలోచించేది నవ్యమానవతావాదం. వర్గంతోనూ, అటు వంటి వంద ఉపరితల గుర్తింపులతోనూ నిమిత్తం లేకుండా అందఱిలోనూ మానవుణ్ణే చూసేది నవ్యమానవతావాదం. విభేదించేవారిని శత్రువులుగా కాక ప్రతివాదులుగా మాత్ర



మే చూసి గౌరవించేది నవ్యమానవతావాదం. వాదనలు ముగిసిన తరవాత కూడా ప్రతి వాదుల మీద మనసులో కసి పెంచుకుని వేటాడడం లాంటి పనులు నవ్యమానవతావాదులు చేయరు. ఏవో ఒకటి–రెండు, లేదా రెండు–మూడు ప్రస్తావనల (topics) మీద ఏర్పడే చిన్నచిన్న అభిప్రాయ భేదాల్ని శాశ్వత శత్రుత్వాలుగా మార్చుకోవడం లాంటి పనులకి ఈ దృక్పథంలో స్థానం లేదు. అంత వ్యక్తిగత అహంకారాన్ని నవ్యమానవతావాదులు పెంచు కోరు. వారి స్పందనా, ప్రతిస్పందనా ఎల్లప్పుడూ సవితర్కమైన వాగ్రూపంలోనే ఉంటాయి.

కానీ వర్గీయ భావజాలాలు అందుకు పూర్తి విరుద్ధం. వాటి రూపకర్తలకీ, అవలంబులకీ తమ వర్గీయులే మనుషులు. వారే మహనీయులు. వారు మాత్రమే బ్రతకడానికీ, ఆధిక్యం సంపాదించడానికీ అర్హులు. మిగతావారంతా హీనమానవులు (sub–humans). వారు ఏమైపోయినా ఫర్వాలేదు. తమ అభిమానవర్గమే బావుండాలి. పైకి రావాలి. తత్ఫలితంగా వారు అవతలివారి వాదనలోని సబబుల్ని చూడలేని కబోదులుగా తమని తాము తీర్చిదిద్దు కుంటారు. వారు ప్రతివారినీ "వీరు మా శత్రువులా? మిత్రులా?" అనే దృష్టితో మాత్రమే చూడగలరు. చిన్నపాటి అభిప్రాయ భేదమేదో ఉన్న ప్రతివారూ వారికి శత్రువులే. అలా శత్రు వుల్లా కనిపించేవారిని నిశ్శేషంగా నలిపి నాశనం చేసేదాకా వారు నిద్రపోలేరు. కనుక సహజంగానే నవ్యమానవతావాదమూ, వర్గీయ భావజాలాలూ ఎన్నటికీ కలవడానికి వీల్లేని ఉత్తర–దక్షిణ ధ్రువాల్లాంటివి. అయినా నవ్యమానవతావాదులు వర్గీయ భావజాలాల అను యాయుల్ని శత్రువులుగా పరిగణించరు.

**(ఒ) చట్టవాదమూ, నవ్యమానవతావాదమూ :** చట్టవాదం (Legalism) నిజానికి ఓ సిద్ధాంతం కాదు. అదో భావాత్మక వాతావరణం. దాదాపుగా అందఱమూ ఆ వాతావరణం లోనే జీవిస్తున్నాం. మానవత్వం వెల్లివిఱియడానికి అది పెద్ద ఆటంకం. ఎందుకంటే అంతా పుట్టుకతోనే సహజంగా తప్పుడు మనుషులని ఈ భావనావళి నమ్ముతుంది. ఆ తప్పుడు తనం ఎక్కడ ఏ రూపంలో ఉన్నా వెతికి వేటాడాలనీ, ఏరిపారేయాలనీ భావిస్తుంది. ఇటు వంటి పురోఽభిప్రాయాలు (biases and prejudices) సమాజంలో వ్యాపిస్తే మానవా ళికి వ్యతిరేకంగా క్రూరమైన కట్టళ్ళు తయారవుతాయి. అవన్నీ మనుషుల నైసర్గిక స్వేచ్ఛకి విరుద్ధంగా పనిచేస్తాయి. మనుషుల్ని ఉన్నవారిని ఉన్నట్లు అంగీకరించడానికి మఱీ ఎక్కువ కొలమానాలు ఓ ప్రతిబంధకం.

ఈ భావనావళి ననుసరించి– *"చట్టబద్ధమైన ప్రవర్తనే శ్రేయస్కరం. చట్టాల్ని చేసినది ప్రజలెన్నుకున్న ప్రతినిధులు. ప్రజావాక్కంటే సాక్షాత్తూ దైవ వాక్కే (Vox populi vox dei). కాబట్టి చట్టాలు భగవదాజ్ఞతో సమానం. మీరెంత మేధావులైనా కావచ్చు. కానీ చట్టం ముందు మీ వ్యక్తిగత అభిప్రాయాలు చెల్లవు. చట్టాలు లేకపోతే ప్రజలు సరైన దారిలో ఉండరు."*

ఈ పై భావాల్లో "చట్టబద్ధమైన ప్రవర్తనే శ్రేయస్కరం" అన్న ఒక్క ముక్కతో మాత్రమే నవ్యమానవతావాదం ఏకీభవిస్తుంది. మిగతావాటిని ఆమోదించదు.

ఎందుకంటే చట్టాల్ని చేసినది భగవంతుడు కాదు, మానవులే. ప్రజలు దేవుళ్ళు కారు, మానవులే. అందుచేత వారెన్నుకున్న ప్రతినిధులు కూడా దేవుళ్ళు కారు, మానవులే. కనుక ఆ మానవులకున్న అన్ని పరిమితుల్నీ చట్టాలు ప్రతిబింబిస్తాయి. ఆ మానవుల్లో మంచివారూ, చెడ్డవారూ ఉన్నట్లే వారు చేసుకున్న చట్టాల్లోనూ ఉన్నాయి. చట్టాలేవీ శాశ్వతం కాదు. అవన్నీ కాలానుగుణంగా– అంతకంటే ముఖ్యంగా మన అవగాహన కనుగుణంగా మారాల్సినవే. మారి తీఱాల్సినవే. వాటిని మార్చగల శక్తి మేధావులకి మాత్రమే ఉంది. కాబట్టి నిర్జీవ చట్టాల కన్నా సజీవ మేధావులు గొప్పవారు. మనుషుల్ని బట్టి చట్టాలు తప్ప చట్టాల్ని బట్టి మనుషులు కాదు. వారికి ఇబ్బందనిపిస్తే చట్టాల్ని మార్చక తప్పదు.

ప్రతీదానికీ ఓ చట్టం అవసరమని భావించడం, వాటితో మనుషుల్ని అదుపు చేయగలమని నమ్మడం చట్టవాదం క్రిందికే వస్తాయి. ఇలాంటి నమ్మకాల వల్ల ఆధునిక ప్రజాస్వామ్యాల నాణ్యత ప్రాచీన రాజఱికాల కన్నా కీతగా ఉంది. ఇప్పుడు కూర్చుంటే ఒక రూలు. నిలబడితే ఒక రూలు. "ఇదంతా ప్రజల భద్రత కోసమే" నని చెప్పడం జఱుగుతోంది. కానీ ఆచరణాత్మకంగా చూసినప్పుడు ఎన్ని చేసినా, ఆఖరికి వ్యక్తి తన పర్సు తానే కాపాడుకోవాలి కదా. తన ఇంటికి తానే ప్రహరీ కట్టుకుని గేటు పెట్టుకోవాలి కదా.

నిజానికి మనిషి స్వంతంగా–ప్రత్యేకంగా–కృత్రిమంగా–చట్టాలు చేయాల్సిన అవసరం ఉందా? ఇది ఆలోచనీయం. మనక్కావాల్సిన అన్ని చట్టాల్నీ ప్రకృతిమాత ఇంతకు ముందే చేసిపెట్టేసింది. వాటిని ఉల్లంఘించినవారికి ఆవిడే అనారోగ్యరూపంలో శిక్షలు కూడా విధిస్తోంది. జ్ఞాన–విజ్ఞాన రూపాల్లో మనిషి ఆ చట్టాల్ని తెలుసుకుంటే చాలు. ఆవిడ చేసిన చట్టాల్ని అనుసరించినప్పుడల్లా మానవాళి సుఖపడింది. ఉదాహరణకి– గర్భిణీ స్త్రీలకి ప్రత్యేక సెలవులూ, బాలింత ఉద్యోగినులకి పని మధ్య విరామం– ఇవన్నీ ప్రకృతి ననుసరించడం కోసమే కదా.[1] మనుషులు చేసే చట్టాలెక్కువభాగం ప్రకృతిచట్టాల ఉల్లంఘనని అడ్డుకోవడం కోసమే గానీ ఇవి వాటికి ప్రత్యామ్నాయం కాదు. అంటే ఇవి ప్రతిచర్యాత్మకం (reactionary) మాత్రమే నన్నమాట.



చట్టాల్ని అనుసరించాల్సిన ప్రజానీకానికీ మంచీ చెడూ ఏమీ తెలియవనుకుంటే, మఱి వారి లోంచే వచ్చి వాటిని చేసిన ప్రజాప్రతినిధులకి ఎలా తెలిసింది? ఇందులో మతలబేంటంటే ప్రజలకైనా, వారి ప్రతినిధులకైనా– ప్రకృతినీ, మానవ మనస్తత్త్వాన్నీ అనుసరిస్తే మంచీ చెడూ వాటంతట అవే అర్థమవుతాయి. లేకపోతే దెబ్బతినక తప్పదు. అలా అనుసరించగలిగినప్పుడు ఎవఱూ చెప్పకుండానే అందఱూ సరైన దారిలో ఉంటారు.

**(ఓ) 'నవ్యమానవతావాదులు' అని అనిపించుకునేందుకు అర్హత :** ఇందులోని 36 సూత్రాల్లో కనీసం రెండు–మూడింటిని అంగీకరించగలిగినా అలాంటివారంతా నవ్యమానవతావాదులే అవుతారు. ఎందుకంటే సద్గుణాలని మనం భావించేవాటన్నిటి ఆచరణాత్మక స్వరూపమూ వాస్తవంగా లోలోపల ఒకటే. మానవ నైతిక మంజూషకి[2] పెక్కు తాళం చెవులున్నాయి. వాటన్నింటికీ ఏదో అదృశ్యలంకె ఉంది. అందుచేత ఒక్క సద్గుణాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకు అనుష్ఠించినా చాలు, కాలక్రమంలో మిగతావన్నీ వాటంతట అవే అలవడతాయి.



[1] ప్రకృతిబద్ధ జీవనం గుఱించి విశేష పరిజ్ఞానం నిమిత్తం శ్రీ మంతెన సత్యనారాయణరాజు (అమరావతి, ఆంధ్రప్రదేశ్) గారు వ్రాసిన గ్రంథాలు చదవండి.

[2] నీతుల బోషాణానికి.

# రెండో అధ్యాయం

## నవ్యమానవతావాద సూత్రాలు


వగాహన రీత్యా నవ్యమానవతావాదంలో ఇంకా పెక్కంశాలు స్వయం తంత్రం (automatic) గా అంతర్భవిస్తాయి. ఎందుకంటే వాటిని ఆకళిం చుకోకుండా నవ్యమానవతావాదాన్ని నిజజీవితంలో అమలు జఱపలేం. వాటిని వరుసగా ఈ క్రింద పేర్కొనడమైనది.

1. అందఱూ ప్రాథమికంగా మానవులే

2. వ్యక్తివాదం

3. మనుషుల్ని ఎలా ఉన్నవారిని అలాగే స్వీకరించడం

4. అతిసాధ్వవాదానికి దూరంగా ఉండడం

5. ఇతరుల్ని వారి దృష్టిలోంచే అర్థం చేసుకోవడం

6. ప్రేమ-గౌరవాలతో జమిలి సంభావన

7. నిర్జీవ వస్తువుల్నీ, విషయాల్నీ, అసమక్ష వ్యక్తుల్నీ కాక సజీవులైన, సమక్షంలో ఉన్న మనుషుల్ని ప్రేమించడం

8. మానవవ్యక్తుల పట్ల అహింస

9. ప్రతిహింసా వ్యతిరేకత

10. క్షమాగుణం



11. మానవ సంబంధాలు అధికారం చెలాయించడం కోసం కాదు

12. వ్యక్తుల మీద ఎవఱికీ హక్కులు లేవు

13. సర్వతోముఖమైన స్వేచ్ఛ

14. స్వతంత్రంగా స్వేచ్ఛగా ఆలోచించడం

15. మూకుమ్మడి నీతిసూత్రావళి స్థానే వైయక్తిక నీతిసూత్రావళి

16. వైవిధ్యాన్ని గౌరవించడం

17. నిరీక్షణ తత్త్వం

18. పోరాట దూరత్వం

19. తన ధనాన్నీ, జ్ఞానాన్నీ ప్రతిఫలాపేక్ష లేకుండా ఇతరులతో పంచుకోవడం

20. చట్టాల్నీ, వ్యవస్థల్నీ మానవతావాద స్ఫూర్తితో రూపొందించుకోవడం

21. విదేశీయుల పట్ల కూడా దయనీ, ఆదరాన్నీ ప్రదర్శించడం

22. కృతజ్ఞత చూపడం

23. వర్తమానంలో జీవించడం

24. మార్పుని అంగీకరించడం

25. జనామోదితమైన, క్రమానుగత మార్పులు

26. దేనికీ అంకితం కాకపోవడం

27. వ్యవస్థల కతీతంగా మానవత్వాన్నే అవలంబించడం

28. శ్రమకి తగ్గ ప్రతిఫలం

29. మంచిచెడుల సాపేక్షత్వం

30. మంచి ఎవరు చెప్పినా స్వీకరించడం

31. భావోద్వేగాల స్థానే పర్యాలోచనకి పెద్దపీట

32. ఆత్యంతిక వాదాల నుంచి దూరం పాటించడం

33. ప్రతిచర్యకి బదులు, చర్య

34. ఏది చేసినా ముందు దానికో కారణాన్నీ, ప్రయోజనాన్నీ చెప్పి చేయడం.

35. విషయాల యొక్క అన్ని కోణాలూ సమగ్రంగా వెల్లడయ్యే దాకా ఓర్పుతో ఎదురు చూడడం

36. చెడుని కప్పిపుచ్చి మంచిని మాత్రమే పంచడం

## 1. అందఱూ ప్రాథమికంగా మానవులే

మనుషులు ఇతరుల పట్ల దయాదాక్షిణ్య రహితంగా ప్రవర్తించడానికి గల కారణాల్లో ఒకటి– వారిని అభివర్ణిస్తూ మనం వాడే పదజాలం. ప్రతివారికీ ఏదో ఒక పేరు పెట్టకపోతే మనకు వారి గుఱించి ఏమీ అర్థం కాని, దిక్కుతోచని పరిస్థితి. ఈ పేర్లు రకరకాలుగా ఉంటాయి. రకరకాల ప్రాతిపదికల మీద పెట్టబడతాయి. మనం మనుషుల్ని ఓ కులస్థులుగా అర్థం చేసుకుంటాం. ఓ మతస్థులుగా అర్థం చేసుకుంటాం. ఓ శాఖీయులుగా అర్థం చేసుకుంటాం. ఓ ప్రత్యేక కుటుంబస్థులుగా, వంశీయులుగా అర్థం చేసుకుంటాం. ఓ వావిగా, వరసగా అర్థం చేసుకుంటాం. ఓ వృత్తి/కళ చేసేవారుగా అర్థం చేసుకుంటాం. ఓ విద్యాపర యోగ్యత (educational qualification) గా, ఓ అంకశాతం (marks' percentage) గా అర్థం చేసుకుంటాం. పేదఱికం, రోగం, నేఱం లాంటి ఓ స్థితిగా కూడా అర్థం చేసుకుంటాం. అంటే వ్యక్తుల్ని వ్యక్తులుగా (మనుషులుగా) తప్ప ఇంకెలా అర్థం చేసుకోవడానికైనా మనం సిద్ధమే.

పర్యాలోచించగా, ఇవన్నీ మనం పెట్టిన పేర్లే. అవి వారు కాదు. లేదా, వారు అవి మాత్రమే కాదు. ఎందుకంటే వారు ఆ పేర్లతోనూ, స్థితులతోనూ పుట్టలేదు. వారు ప్రాథమికంగా మనుషులు. వారు తమ తల్లిదండ్రులకే కాక మానవజాతి పూర్వీకులందఱికీ వారసులు. ఆ



తరువాతే ఇంకేదైనా! ఆయా పేర్లతోనే మనుషుల్ని వ్యవహరించడం వల్లా, వారికీ, వాటికీ అభేదాన్ని పాటించడం ('అవే వారు' అనుకోవడం) వల్లా మానవత్వానికి జఱిగే నష్టం చాలా రకాలుగా ఉంటుంది. ముఖ్యంగా ఆ పేర్లకి సంబంధించి కొన్ని విధినిషేధాల్ని వ్యక్తుల మీద విధించడం, వాటిల్లో వారు ఇమడలేకపోతే వారిని దోషులుగా చేసి దూషించడం జఱుగుతుంది. "అంతకు ముందు ఎవఱో ఆ పేర్లకి న్యాయం చేశారనీ, వీరిక్కూడా మనం ఆ పేర్లే పెట్టినా వారిలా వీరు లే" రనీ సణగడం కనిపిస్తుంది.

మానవజాతి చరిత్రలో ప్రతితరమూ ఓ క్రొత్త ఉత్పత్తే. క్రొత్తతరాలవారు ప్రాతవారి పేర్లే పెట్టుకు తిరుగుతున్నప్పటికీ, వారి భౌతిక పోలికలు వీరిలో కూడా ఉన్నప్పటికీ వీరు నిండా క్రొత్తమనుషులని గమనించాలి. పూర్తిగా వారిలాగే వీరు ఉండాల్సిన అవసరం లేదు. అలా ఉండడం ఓ గొప్పవిషయమూ కాదు. మానవజాతి ఎప్పటికప్పుడు మారిపోతూనే ఉంది. ఓ పేరు ఏమీ సూచించజాలదు. ఏ నిబంధనలూ విధించజాలదు. ఉదాహరణకి, వెయ్యేళ్ళనాటి వైద్యుడు బ్రతికొస్తే మన కళ్ళకతను అసలు 'వైద్యుడు' అనే పదానికే తగిన వ్యక్తిలా కనిపించడు. రెండువేల సంవత్సరాలనాటి ఇంగ్లీషువాడు బ్రతికొస్తే అతనూ అంతే ! ఆ తప్పు వారిలో కాదు. మనలో ఉంది. మన దృక్పథంలో ఉంది. మనమే ఓ పదాన్ని ఓ అర్థంలో వాడడమూ, ఆ పదాన్నీ, అర్థాన్నీ ఇతరులకి ఆపాదించి పిలవడమూ, ఆ తరువాత మనం అనుకున్నట్లుగా వారు లేరేంటని ఏడ్చుకోవడం, నవ్వుకోవడం, లేదా ద్వేషించడం– ఇదంతా హాస్యాస్పదం.

జీవజాతులూ, వాటిల్లో లింగజాతులూ – ఇవే ప్రకృతి సృష్టించినవి. మిగతావేవీ కావు. కనుక ఓ మానవుడు తనకివ్వబడ్డ నానారకాల మానవకల్పిత కృత్రిమగుర్తింపుల (Man-made artificial identities) తో నిమిత్తం లేకుండా, సహజంగా ఓ మనిషిలా ప్రవర్తించి, తద్వారా తన నైసర్గిక బలాలనో, బలహీనతలనో వెల్లడిచేస్తే అందుకు అతన్ని తప్పు పట్టడం సరికాదు. అలాగే ఓ స్త్రీ స్త్రీలా ప్రవర్తించినందుకూ, లేదా ఓ పురుషుడు పురుషుడిలా ప్రవర్తించినందుకూ సైతం తప్పు పట్టడం సరికాదు. అయితే ప్రకృతి వారికి ఆ లక్షణాలతో పాటు ఇతరేతర లక్షణాలు (మేధాశక్తి, సవ్యతాభిమానం లాంటివి) కూడా ప్రసాదించి ఉండగా కేవలం ఆ ఒక్క లక్షణాన్నే ఉపయోగించుకోవడం సరికాదని సలహా ఇవ్వాల్సి ఉంది.

**మనుషుల్ని 'ఫలానా' అంటూ తప్పుగా సారాంశీకరించడం** (False Essentialization): పదాల్ని వ్యక్తులుగా భావించడంలో కలిగే నష్టాల్లో మఱొకటి, మానవుల్లోంచి వారి మానవత్వాన్ని విడదీసి చూడడం. ఒకఱిని మనం 'పూజారి' అంటే, ఇహ ఆ తరువాత మన దృష్టిలో అతను మనిషి కాకుండా వట్టి పూజారే అవుతాడు. అప్పట్నుంచి అతను అందఱు మనుషుల్లా భార్యతో సంసారం చేయడమూ ఆశ్చర్యకరమే. సినిమాకెళ్ళడమూ ఆశ్చర్యకరమే. జబ్బుపడి ఆస్పత్రిలో చేఱడమూ ఆశ్చర్యకరమే. అలాగే ఒకఱికి మనం 'స్మగ్లర్' అని పేరు పెట్టేశాక, అతను దైవభక్తుడు కావడమూ ఆశ్చర్యకరమే. అప్పుడప్పుడు కవితలు వ్రాయడమూ ఆశ్చర్యకరమే. ఈ పూజారితనాలూ, నేఱాలూ, పదవులూ, పాపాలూ, పుణ్యాలూ అన్నీ మానవతా మహావృక్షానికే కాచిన కాయలు. అవన్నీ అందులోనే ప్రకరణానుగత భాగాలు. దాన్నుంచి వాటిని విడదీసి చూడడం శుద్ధమూర్ఖత్వం. ఒక్కో మనిషి మూర్తిమత్త్వం లోనూ వంద కోణాలుంటాయి. వాటిల్లో ఏదో ఒక్క కోణాన్ని ఉద్యోతించి (highlight చేసి), సంఘటనలు అనే చలువపెట్టెల (refrigirators) లో చేష్టల్ని గడ్డకట్టించి, "పక్కాగా అదే అతను" అని తేల్చేయడం సరికాదు. తద్వారా మనకి మనుషులు అర్థం కాకుండా మనమే చేసుకుంటున్నాం. "మనుషుల్ని ఎలా అపార్థం చేసుకోవాలి?" అనే విషయంలో మానవాళి జఱిపిన విస్తృత పరిశోధన "వారిని ఎలా అర్థం చేసుకోవాలి?" అనే విషయంలో జఱపలేదు.

మంచివాడికైనా, చెడ్డవాడికైనా రోగం ఒక్కలాగే వస్తుంది. దాని చికిత్స కూడా ఇద్దఱికీ ఒక్కలాగే చెయ్యాల్సివస్తుంది. అలాగే, ఎవఱిని కోసి చూసినా అవే అవయవాలు కనిపిస్తాయి. ఇందులో హిందూ –ముస్లిమ్, ఆఫ్రికన్, ఏషియన్, ఉపాధ్యాయుడు, దేశాధ్యక్షుడు అనే తేడా లేదు. కనుక అందఱినీ మానవులుగానే చూడడం నేర్చుకోవాలి. వారి తత్త్వాన్నీ, చేష్టల్నీ కూడా మానవత్వానికే ఉన్న మఱో పార్శ్వం (aspect) గా అర్థం చేసుకోవాలి. పేర్లు పెట్టడం మానేయాలి.



## ౨. వ్యక్తివాదం

ఇది నవ్యమానవతావాద సూత్రాల్లో అత్యంత ముఖ్యమైనదీ, ప్రథమగణ్యమైనదీను. నవ్యమానవతావాదమంతటికీ ఇదే గుండెకాయ, వెన్నెముక, పునాదిఱాయి, ఆయువు పట్టు అని చెప్పుకోవచ్చు. ఎందుకంటే వ్యక్తులు సంతోషంగా ఉంటేనే సమాజం సంతోషంగా ఉన్నట్లు లెక్క. సమాజం భవనమైతే వ్యక్తులు దాన్ని కట్టిన ఇటుకల వంటివారు. వ్యక్తుల్ని అడుగడుగునా బాధపెడుతూ "సమాజం మటుకూ సంతోషంగా ఉండా"లని ఆశిస్తే అది కలలో కూడా జఱగదు. **తోటిమనుషుల్ని ఏ దృష్టితో చూడాలో వ్యక్తికి సూచించేది మానవతావాదం కాగా, ఆ వ్యక్తిని ఏ దృష్టితో చూడాలో సమాజానికి నేర్పేది వ్యక్తివాదం. అంటే వ్యక్తివాదం వ్యక్తికోసం కాదు. సమాజ సావధానం కోసమే.** అందుచేత వ్యక్తివాదాన్ని వ్యక్తిస్వార్థంగానూ, దాని సమర్థనగానూ అర్థం చేసుకోవడం అసమీచీనం.

**వ్యక్తివాదంలో మళ్ళీ ఇంకొన్ని ఉపసూత్రాలున్నాయి. అవి –**

౧. విడివ్యక్తి యొక్క పరమత్వం

౨. వ్యక్తిగత జీవితాలే ముఖ్యతరం

౩. వ్యక్తిగోప్యత మఱియు ఇష్టానిష్టాలు

౪. వ్యక్తిని పట్టించుకోని సమాజం విసర్జనీయం

౫. వైయక్తిక సంబంధాల ఐకాంతికత్వం

౬. వ్యష్ట్యాలోచనలు చేయడంలో తప్పులేదు

౭. వ్యక్తి స్వార్జితైక జీవనం

౮. భావోద్వేగాలకి వ్యక్తిబాధ్యత

౯. వ్యక్తిగత సమస్యలకి వ్యక్తిగత పరిష్కారాలు

౧౦. వ్యక్తిగత పరిమితుల్ని బట్టి నియమ నిబంధనల్ని అనువర్తించడం

౧౧. ప్రేమ-కామంలాంటి వ్యక్తిగతవిషయాల్లో అజోక్యదారీ వైఖరి

౧౨. బలమైన వ్యవస్థల స్థానే బలమైన వ్యక్తిత్వాలు రూపొందడానికి దోహదం చేయడం.

**౧. విడివ్యక్తి యొక్క పరమత్వం** (The individual is the ultimate) : వ్యక్తికి గుంపు[1] కంటే వేఱుగా తనదంటూ ఓ అస్తిత్వం ఉంది. కానీ వ్యక్తిని విడిచి గుంపులకు అస్తిత్వమే లేదు. కనుక వ్యవస్థల కంటే విడివ్యక్తే గొప్పవాడు. అతనే ముఖ్యం. దీనికి విపర్యస్తంగా నేనింతకు ముందు ఏవైనా వ్రాసి ఉంటే వాటిని ఉపసంహరించుకుంటున్నాను.

విడివ్యక్తి వల్లే వ్యవస్థలు[2] నడుస్తున్నాయి. అవి అతనికంటే శక్తిమంతాలే. కానీ అతనే వాటి కంటే తెలివైనవాడు. ఎందుకంటే అతను వాటికన్నా ఎల్లప్పుడూ ముందుంటాడు. అతనీనాడు వ్యక్తిగత స్థాయిలో గుర్తించిన ఓ సత్యాన్ని సమాజం గుర్తించాలంటే దానికి దశాబ్దాలో శతాబ్దాలో పట్టుతుంది.  వ్యవస్థలు పుట్టక ముందు నుంచీ వ్యక్తి ఉన్నాడు. అవన్నీ అంతరించిపోయాక కూడా అతనుంటాడు. వ్యవస్థలన్నీ అతని కోసమే. కానీ అతను వ్యవస్థల కోసం

[1] విడివ్యక్తి నుంచి వేఱై, ఓ వివాహిత జంట కంటే ఎక్కువమందిని సభ్యులుగా కలిగుంటూ సజాతీయం (homogenous) గా భావించబడే ఏ కూటమి అయినా గుంపే. ఉదాహరణకి- కుటుంబాలూ, గ్రామాలూ, పార్టీలూ, దేశాలూ, రాష్ట్రాలూ, జిల్లాలూ, తాలూకాలూ, వాటి ప్రభుత్వాలూ, సాయుధ బలగాలూ, సంఘాలూ, సార్థవాహాలూ (companies), సభలూ, సమితులూ, సంస్థలూ, అలాంటి వివిధ వ్యవస్థలూ, విద్యాలయాలూ, మత కమ్యూనిటీలూ,  కులాలూ, జాతులూ, తెగలూ- ఏదో ఒక రకంగా అన్నీ గుంపులే.

[2] ఏదో ఒక సమంగీకృత (mutually agreed-upon) రూపంలో కాలకాలీన వేతనాలు (periodical payments) పుచ్చుకుంటూ కొన్ని లక్ష్యాల కోసం కొన్ని నిబంధనల ప్రకారం ఓ నాయకత్వం క్రింద అనునిత్యమూ (regularly) పనిచేసే సిబ్బంది గల ప్రతి ప్రభుత్వ/వివిక్త సంస్థా (public or private institution) వ్యవస్థ క్రిందికే వస్తుంది.



కాదు. వ్యవస్థలంటే జీతాల కోసం పడే అవస్థలే. వాటి వల్ల బైటివారికంటే వాటిల్లో పనిచేసే వారికే ఎక్కువ లాభం. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే– వ్యవస్థలన్నీ ప్రజల కోసం పనిచేస్తున్నామంటూ మొదలవుతాయి. కాలక్రమంలో వాటి ఉనికిని నిలబెట్టడం కోసం ఆ ప్రజలనే నిర్లక్ష్యం చేయడం జఱుగుతుంది. వ్యవస్థల్ని సృష్టించినది మనిషే. కానీ ఆ మనిషే ఈనాడు వాటి ముందు బక్కపల్చనైపోయాడు. విలువలేనివాడయ్యాడు. అవి అతన్ని సపోర్ట్ చేయడం లేదు. అతనే వాటిని సపోర్ట్ చేయడానికి నానా తంటాలూ పడుతున్నాడు.

విడివ్యక్తి కుపయోగపడని వ్యవస్థలన్నీ మృతప్రాయాలూ హింస్రాలూ. అలాంటివి కేవలం వృథా. అందుచేత గుంపులూ, వ్యవస్థలూ అతనికోసం మాత్రమే పనిచేయాలి. అతన్నీ, అతని కష్టసుఖాల్నీ దృష్టిలో ఉంచుకునే, చట్టాలూ, నియమ–నిబంధనలూ ఏర్పఱచాలి. గుంపుల కోసం విడివ్యక్తిని బలైపొమ్మని సలహా ఇవ్వడం తెలివితక్కువతనం. వాటి కోసం పాపాలూ, నేఱాలూ చేస్తే పుణ్యమొస్తుందని చెప్పడం ఇంకా జుగుప్సాకరం.

వ్యక్తి తనకంటూ ఓ ప్రత్యేకతనీ, మూర్తిమత్త్వాన్నీ సంతరించుకోకుండా గుంపుల్లో భాగంగా, వాటి ప్రతిరూపంగా అనామకంగా మిగిలిపోతే సమాజం ఇప్పటికీ పశువుల స్థితిలో, ఆదిమావస్థలోనే ఉండి ఉండేది. అతని ప్రత్యేక వ్యక్తిత్వాన్ని గుర్తించిన ప్రతిసారీ అదీ, దాని నాగరికతా శరవేగంతో ముందుకు సాగిపోయింది. ప్రతి వ్యక్తికీ ఓ ప్రత్యేకమైన పేరూ, ఇంటి పేరూ, అతనికంటూ ఓ గోత్రమూ, కుటుంబమూ, ఇల్లూ, అతనికంటూ ఓ తల్లీ–తండ్రి, అతనికంటూ ఓ భార్యా, పిల్లలూ ఏర్పడ్డాకనే అతనికి నాగరికతని అభివృద్ధి చేయడం మీద ఆసక్తి పెఱిగింది. ఆ విధంగా ప్రతివ్యక్తినీ సమాజపు దీర్ఘకాలిక పురోగతిలో ఓ నేరు స్వప్రయోజనం కలిగిన ఇష్టపూర్వక భాగస్వామి (a willing partner with a direct vested interest) గా మార్చడం జఱిగింది.

గమనిస్తే– ఏ కాలంలో నైనా, ఏ దేశంలో నైనా సంఘసంస్కరణ పేరుతో జఱిగినది కూడా వాస్తవంగా సంఘాన్ని సంస్కరించడం కాదు. ఆచారాల పేరుతో చెలామణి అయిన సమాజ క్రౌర్యం నుంచీ, దాని రౌడీయిజమ్ నుంచి వ్యక్తుల జీవితాల్ని తప్పించి వాటిమీద వారికి జన్మసిద్ధంగా ఉన్న వ్యక్తిగత స్వామ్యాన్ని పునరుద్ధరించడమే. ఆ విధంగా వ్యక్తుల్ని సాధికారుల్ని చేయడం (personal empowerment) ద్వారా మాత్రమే సమాజం బాగుపడుతూ

వచ్చింది. మనుషుల్ని సమాజానికి విధేయులుగా ఉంచేసి దాన్ని సంస్కరించడం అసంభవం.

అలాగే విడివ్యక్తుల ప్రతిభాపాటవాల్ని సమాజం గుర్తించి వారి నాయకత్వం క్రింద పనిచేయడానికి సిద్ధపడినప్పుడల్లా అది ప్రగతిని రుచి చూడగలిగింది. అసలు నాయకత్వమంటేనే ప్రత్యేకమైన వ్యక్తిత్వం (special personality) అని అర్థం. విడివ్యక్తుల విశిష్టతని అంగీకరించను ఇష్టపడని సమాజాలకి సహజనాయకులనేవారే ఉండరు. అవి మనగల్గుతాయేమో (survive) గానీ పురోగమించజాలవు. విడివ్యక్తుల సంఘజీవితం వారి తెలివితేటల్ని గరిష్ఠస్థాయిలో ఉపయుక్తం చేయడానికే తప్ప వారిని సంఘానికి కట్టుబానిసలుగా మార్చడానికి కాదు. తెలివితేటలనేవి స్వతహాగా నిర్మాణాత్మకమైనవి (constructive). అందువల్ల అవి (ఇలా చేద్దాం, అలా చేద్దాం అనే) సంకల్పాలతో కూడుకుని ఉంటాయి. అయితే ఆ సంకల్పాల్ని నెఱవేర్చుకోవడానికి ఓ విడివ్యక్తి కుండే శారీరిక బలం చాలదు. తన ఆలోచన (idea) గుఱించి ఇతరులకి చెప్పి వారి సహాయం కూడా తీసుకోవాల్సి ఉంటుంది. తలో చేయీ వేసి సహాయాన్ని అందిస్తున్నంత మాత్రాన ఆ తెలివితేటలూ, ఆలోచనలూ సంఘానివి కావు. సంఘం విడివ్యక్తి యొక్క మేధాశక్తికి లబ్ధిదారూ (beneficiary), అతని ఆలోచనల్ని అమలుచేసే కూలీ మాత్రమే. విజ్ఞానశాస్త్ర చరిత్ర తీసుకు చూసినా ప్రతీదీ విడివ్యక్తులే కనుగొన్నారు. గుంపులు కనుక్కున్నవంటూ ఏమీ లేవు. మానవాళి యొక్క పురోగతిక్రమంలో అవసరమైన త్యాగాలూ, సాహసాలూ అన్నీ కొంతమంది వ్యక్తులు చేసేవి మాత్రమే. సమాజం ఏ త్యాగమూ చేయదు.

మనుషులు సంఘజీవులైనంత మాత్రాన వారు గుంపులో గోవిందయ్యలుగా ఉండకూడదనీ, వారికి ప్రత్యేకమైన వ్యక్తిత్వాలు ఉండాలనేదే ప్రకృతిమాత అభీష్టం కూడా అయినట్లు కనిపిస్తుంది. ప్రపంచంలో గేదెలన్నీ ఒకేలా ఉంటాయి. గొఱ్ఱెలన్నీ ఒకేలా ఉంటాయి. కానీ ఏ ఒక్క మనిషీ పూర్తిగా ఇంకో మనిషిలా ఉండడు. కనీసం కంఠస్వరంలో నైనా తేడా ఉంటుంది. అలాగే ఏ మనిషి వ్రేలిముద్రలూ ఇంకో మనిషి వ్రేలిముద్రల్ని పోలి ఉండవు.

వ్యక్తుల తెలివితేటలతో, వారి శ్రమతో నడుస్తున్న సమాజం వారి మీద అడుగడుగునా చెలాయించే పెత్తనం ఒక్కోసారి మిక్కిలి విస్మయావహం. ఆ సమాజం రాజకీయంగా వ్యవస్థీకృతం (politically organized) ఐనప్పుడు *"నువ్వు ఫలానా చోట పుట్టావు. కాబట్టి నువ్వు అక్కడివాడివి. అక్కడ నీ కంటే ముందు పుట్టినవారు కొన్ని నియమ నిబంధనలు వ్రాసిపెట్టారు. అక్కడివాడివి గనుక నువ్వు వాటి ప్రకారమే ఉండాలి"* అని చెప్పడం జఱుగుతుంది. ఆ రాజకీయ సమాజంలో పుట్టినందుకు ఆ వ్యక్తి దాని మిత్రత్వాల్నీ, శత్రుత్వాల్నీ తనవిగానే స్వీకరించి తీఱాలి, లేకపోతే అతనికి 'దేశద్రోహి' అని పేరు పెడతారు. అతనికి వ్యక్తిగతంగా ఎవఱి పట్లా తీవ్రమైన రాగద్వేషాలు లేకపోవచ్చుననే విషయం పరిగణనలోకి తీసుకోబడదు.



ఇందులో వాస్తవం ఏంటంటే– ఆ వ్యక్తి యొక్క పుట్టుకలో సమాజం పాత్ర ఏమీ లేదు. అదే విధంగా ఆ సమాజంలో పుట్టడంలో ఆ వ్యక్తి యొక్క సంకల్పం కూడా ఏమీ లేదు. ఏమీ లేని దానికి ఉత్తుత్తి ఋణానుబంధాల్ని కల్పించడమూ, సమాజం వ్యక్తికి యజమానుడైనట్లు మాట్లాడడమూ సరికాదు. పోషించాల్సి వచ్చినప్పుడేమో అతని బాధ్యతంతా అతన్ని కన్న తల్లిదండ్రులది. ఎన్నడూ పిలిచి అన్నం ముద్ద పెట్టకపోయినా అతన్ని శాసించే హక్కు మాత్రం సమాజానిది. దానికి తలొగ్గితే అతను మంచివాడు. లేకపోతే చెడ్డవాడు. ఈ పరిభావన (concept) మానవతావాదులకి ఆమోదయోగ్యం కాదు.

వ్యక్తులకి విలక్షణమైన వ్యక్తులుగా తమ దృష్టిలో తమకున్న వ్యక్తిగత గుర్తింపే వాస్తవికమైనది. ఈ వాస్తవిక గుర్తింపుకి కుల, మత, వర్గ, ప్రాంత, లింగాదులు సందేహ నివర్తకమైన అదనపు వివరాలు (additional details) మాత్రమే. కానీ ఇప్పుడేం జఱుగుతోందంటే– వ్యక్తుల వాస్తవిక గుర్తింపుని తుడిచిపెట్టే విధంగా ఈ అదనపు వివరాల్నే వారి అసలైన గుర్తింపుగా గుర్తిస్తూ, అలా అని ప్రచారం చేస్తూ కొన్ని సైద్ధాంతిక గుంపులు తయారయ్యాయి. తాము అభిమానించే అదనపు వివరాలతో మాత్రమే మమించమంటూ అవి వ్యక్తుల్ని పత్రికల ద్వారా, పుస్తకాల ద్వారా ఒత్తిడి చేస్తున్నాయి. వాటి రౌడీయిజానికి దడుచుకుని ప్రభుత్వమూ, ప్రభుత్వ సంస్థలూ తమ దేశపౌరులుగా వ్యక్తులకున్న హక్కుల్ని మర్చిపోయాయి. గుంపుల హక్కులనే గుర్తింవడం మొదలుపెట్టాయి. ప్రజల దృష్టిలోనూ, ప్రభుత్వదృష్టిలోనూ వాస్తవ గుర్తింపు యొక్క స్థానాన్ని ఈ అదనపు వివరాలు ఆక్రమించుకోవడంతో హక్కులన్నీ అదనపు వివరాలకే బదిలీ అయి అసలైన గుర్తింపు (వ్యక్తిగత గుర్తింపు) కి ఏ హక్కులూ లేని పరిస్థితి తయారైంది. హక్కులు కావాలంటే ఏదో ఒక గుంపులో దూఱక తప్పని పరిస్థితి. చివరికి ఓ అదనపు గుర్తింపుకి వ్యతిరేకంగా మఱో అదనపు గుర్తింపు తన

కంటూ ప్రత్యేకంగా ఓ హక్కుల సంఘాన్ని ఏర్పఱచుకోవాల్సిన పరిస్థితి కూడా తెచ్చారు. ఉదాహరణకి, మహిళా సంఘాలకి వ్యతిరేకంగా పురుష హక్కుల సంఘాలు.

ఏ గుంపు గూండాయిజాన్నీ నవ్యమానవతావాదం ఆమోదించదు. గుంపుల రౌడీయిజానికీ వ్యక్తుల హక్కులకీ పొత్తు కుదరదు, అవి వ్యక్తుల కోసమే తామున్నట్లు భంగిమలిస్తున్నప్పటికీ! ఉదాహరణకి- న్యాయస్థానంలో హాజరు పఱచాల్సి ఉన్న ఇద్దఱు కళాశాల విద్యార్థుల్ని గుంపులు డిమాండు చేశాయనే కారణం చేత ఆనాటి ప్రభుత్వం కాల్చిచంపింది. ధర్మబద్ధమైన న్యాయవిచారణని పొందే మానవ హక్కుని గుంపుల మెప్పు కోసమూ, మీడియా మెప్పు కోసమూ అలా హరించింది. వ్యక్తులకి హక్కులున్నాయనీ, అవి ఉండాలనే విషయాన్ని గనక మనం గుర్తిస్తే గుంపుల రౌడీయిజాన్ని తప్పనిసరిగా ఖండించాల్సిన/అడ్డుకోవాల్సిన అవసరముంది.

గుంపులకి తమవంటూ ఓ అనుభవమూ, అనుభూతీ ఏమీ ఉండవు. వాటి సైద్ధాంతిక భావజాలమంతా వ్యక్తులు విషయదానం (contribution) చేసిన అనుభవాల నుంచీ, ఆలోచనల నుంచీ అరువు దెచ్చుకున్నదే, కాపీకొట్టినదే. కాకపోతే కాస్త ఎక్కువ సంఖ్యలో ఉన్న వ్యక్తులవి, అంతే! గుంపులకు స్వీయ క్రమశిక్షణ అంటూ ఏమీ ఉండదు. అది మళ్ళీ కొంత మంది వ్యక్తులే పై నుంచి అమలుచేస్తూంటారు. వ్యక్తులు స్వతంత్రులు కనుక ఎప్పటికప్పుడు (update) తాజాభవిస్తారు. గుంపులకు విడివ్యక్తిని విడిచి స్వతంత్ర వ్యక్తిత్వమేమీ ఉండదు గనుకా, వాటిని సంయుక్తంగా కలిపి ఉంచేది కేవలం ఏనాటిదో భావజాలం గనుకా అవి సర్వకాల సర్వావస్థల్లోనూ గతంలోనే బ్రతుకుతూంటాయి. గుంపుసంస్కృతి పేరుతో తమకో విశిష్ట అస్తిత్వమూ, వ్యక్తిత్వమూ ఉన్నట్లు అవి భంగిమలిస్తూంటాయి. సడలుబాటు (flexibility) కి తావులేని ఏకచ్ఛత్ర నియమ-నిబంధనలు (blanket rules) తప్ప ఆ సంస్కృతికి వేఱే అంతరార్థమేదైనా ఉన్నట్లు గోచరించదు. ఐతే, అవి ఎంతగా గుంపాలోచనల్ని ప్రచారం చేస్తున్నప్పటికీ ఆచరణకొచ్చేసరికి ఆ గుంపులు కూడా వ్యక్తులనే లక్ష్యంగా చేసుకుంటాయి. గుంపుగా మనుషుల్ని మార్చలేమని వాటికీ తెలుసు.

కాబట్టి ప్రతివ్యక్తినీ ఓ గుంపులో భాగంగా కాకుండా ఓ విశ్వపౌరుడిగా/పౌరురాలిగా, ఓ మనిషిగా చూడాలి. ఓ స్వతంత్ర, విభిన్న సృష్టిగా గుర్తించాలి. అతన్నీ, అతని వర్తమానాన్ని అతని సంబంధీకుల గతంతో ముడిపెట్టకూడదు. కొన్ని సార్లు అతని స్వంత గతంతో కూడా ముడి పెట్టకూడదు. లేదా అతను ఓ గుంపుకి చెందుతాడన్న కారణం చేత సదరు గుంపు మీది కక్షని అతని మీద సాధించడం అనుచితం. అదే విధంగా ఓ వ్యక్తి గుఱించి అతని గుంపు మొత్తాన్నీ ద్వేషించడం సైతం అనుచితమే. ఎందుకంటే ఎవఱూ "నేను ఫలానా" అని తమకి తామొక ముద్రవేసుకుని పుట్టరు. పుట్టాక ఇతరులే వారి కటువంటి ముద్రలు వేస్తున్నారు.



విడిమానవుడికి తనమీదా, తన అవసరాలమీదా తనకున్న ప్రాకృతిక హక్కుల్ని సమాజమనే బృహద్ గుంపూ, ఇతరేతర పిల్లగుంపులూ గౌరవించడం నేర్చుకోవాల్సి ఉంది. ఏ విషయంలోనైనా అతని స్వేచ్ఛకి ఆటంకాలు కల్పించకూడదు. **పరుల్ని బాధించకుండా ఏమైనా చేసుకునే హక్కు ప్రతివారికీ ఉంది.** వ్యక్తులు ఏ గుంపుకి చెందుతారో దాన్ని గుఱించిన పూర్వాభిప్రాయాలతో నిమిత్తం లేకుండా ప్రతివారినీ వారివారి వైయక్తిక శక్తిసామర్థ్యాల్ని బట్టే ఎదగనివ్వాలి.

నవ్యమానవతావాదం మానవుల్ని ముక్కూ-మొహం లేని అమూర్త గుంపులు (faceless abstract groups) గా కాక ఓ ప్రత్యేక వ్యక్తిత్వమూ, ప్రత్యేక పరిస్థితులూ, ప్రత్యేక అవసరాలూ, భావోద్వేగాలూ, రక్తమాంసాలూ గలిగిన విడివ్యక్తులుగానే చూస్తుంది, తాము ఫలానా గుంపువారిమంటూ వారు తీవ్రమైన సాంప్రదాయిక గుంపభిమానాలతో బహిరంగంగా ప్రకటించుకున్నా! ఆ గుంపులకున్న ప్రాతిపదిక కులం, మతం, జాతి, విజనుష్షు ఇత్యాదుల్లో ఏదైనా కావచ్చు. మనుషుల్ని గుంపులుగా జమకడితే వారిని గుఱించిన సూక్ష్మ వివరాలు మన మనసులకి పట్టకుండా పోతాయి. వారి గుఱించి మన అవగాహన శూన్యంగానైనా ఉంటుంది. లోపభూయిష్ఠంగానైనా ఉంటుంది. అందువల్ల మనం వారిపట్ల తప్పుడు నిర్ణయాలకీ, చేష్టలకీ ఒడిగడతాం.

విడివ్యక్తిని అణచివేయడానికి ప్రజాభిప్రాయం పేరుతోనో, వ్యవస్థల పేరుతోనో సామూహిక బలాన్ని ప్రయోగించడం అమానవీయం. అది శక్తి-అసమతూకం (power imbalance) క్రిందికొస్తుంది. దురదృష్టవశాత్తూ మన కాలంలో కాలనీ వెల్ఫేర్ అసోసియేషన్లు తప్ప నిజమైన ప్రజాసంఘాలంటూ ఏమీ లేవు. ఆఖరికి సహకార సంఘాలు కూడా బహిరంగ రాజకీయమే. నిజమైన ప్రజాసంఘాలుంటే అవి వ్యక్తిని తప్పకుండా అర్థం చేసుకుంటాయి.

ఇంకాస్త మానవీయంగా వ్యవహరిస్తాయి. కానీ అలా జఱగట్లేదని మనకి తెలుసు. నేడు ప్రజాసంఘాలంటూ చెలామణి అవుతున్నవి ఎక్కువభాగం కొన్ని రాజకీయ సంస్థలకో, వ్యాపార ప్రయోజనాలకో లోపాయికారీగా అనుబద్ధమైన (affiliated) తోకసంస్థలూ, జేబుసంస్థలూను. సమయమొస్తే నచ్చనివారి మీదికి ఉసిగొల్పడానికీ, వారి జీవితాల్ని అల్లరి పెట్టడానికీ ఉపయోగపడే విశ్వాసపాత్రమైన మేలుజాతి జీవాలవి.

విడివ్యక్తులు కూడా, తాము వివిధ గుంపులతో మమేకించడం, వాటిని ఆరాధించడం కేవలం నిష్ప్రయోజనమని గ్రహించే రోజు రావాలి. నిజం చెప్పాలంటే, విడివ్యక్తి ఏ గుంపులోనూ పూర్తిగా ఇమడలేడు. తన స్వభావాన్నీ, ఆలోచనల్నీ, ఆకాంక్షల్నీ సంపూర్ణంగా ప్రతిబింబించే, లేదా వాటిని సమగ్రంగా తృప్తిపఱచే ఏ ఒక్క గుంపునీ అతడు ఈ భూమండలం మీద వెతికి పట్టుకోలేడు. ఎందుకంటే, వ్యక్తులు విలక్షణులు (unique). గుంపులన్నీ మూసపోత (stereotypical). అవి వైవిధ్యాన్ని ఏ రూపంలోనూ భరించలేవు. అంగీకరించలేవు. ఓ జనభాగం లేదా వ్యవస్థ ఎంత పెద్దదైతే, ఎంతగా అది ఓ బలమైన నాయకత్వం కింద సమీకృతమైతే, అంతగా అందులోని వైవిధ్యం మొత్తం విధ్వంసానికి గుఱవుతుంది. వ్యవస్థలన్నీ వ్యక్తుల్ని వాడుకుంటాయి, నానా ఆదర్శాలతో ఆకర్షించి! కానీ అవి వారినీ, వారి అవసరాల్నీ, ఆకాంక్షల్నీ సహించలేవు, తీర్చలేవు.

గుంపుల మీద మూఢభక్తినీ, వెఱ్ఱి అభిమానాన్నీ పెంచుకుని వాటి కోసం వ్యక్తి పాల్పడే నేఱాలకీ, ఘోరాలకీ ఫలితాన్ని అతనే స్వయంగా అనుభవించాల్సి ఉంటుంది. అంతే తప్ప ఆ గుంపులోని వారంతా వచ్చేసి "వద్దు నేస్తం! నువ్వు ఇవన్నీ చేసింది మా కోసమే కాబట్టి నీ బదులు మేమే అనుభవిస్తాం" అంటూ ఎన్నటికీ పోటీపడరు. మామూలుగా అందఱూ తమ తమ అభిమాన గుంపులకి మానసికంగా అతుక్కుని ఉంటారు. కానీ మనిషి అంతర్గతంగా ఏకాకి అనీ, అతను నైసర్గికంగా ఏ గుంపుకీ చెందడనేదీ, ఏ గుంపూ అతన్ని రక్షించ జాలదనేదీ ఇలాంటి కీలక సందర్భాల్లో నగ్నంగా బైటపడిపోతుంది.

మనలో ఒక్కొక్కఱం వ్యక్తిగతంగా జీరోలమైతేనే మనకు గుంపుల్ని ఏర్పఱచుకునే అవసరం, వాటిల్లో దూరే అవసరం. వాటి నాశ్రయించే అవసరం, వాటితో తాదాత్మ్యం చెందే అవసరం. కానీ తద్భిన్నంగా, మనం హీరోలమైతే మనకి తెలియకుండానే మనం అవశంగా, అసంకల్పితంగా అన్ని గుంపుల నుంచీ దూరం జఱిగిపోతాం. ఒక గుంపులో ఎవఱో ఎవఱినో ఏదో అంటే, 'అది నన్నే' అన్న భావన మనలో కలగడం మానేస్తుంది. ఒకవేళ మనం హీరోలమయ్యాక కూడా ఇంకా గుంపుతో తాదాత్మ్యం చెందుతున్నామంటే దానర్థం– ఏనాడో చచ్చిన పాముని ఇంకా చంపుతూనే ఉన్నామని!



గుంపులు బావుంటే వ్యక్తులు బావున్నట్లేనన్న మూఢవిశ్వాసం ఎలా వ్యాపించిందో, ఎవఱు వ్యాపింపజేశారో గానీ మొత్తమ్మీద విస్తారంగా వ్యాపించిపోయింది. వాటి పేరుతో బావుండేది కూడా వాస్తవానికి కొందఱు వ్యక్తులే. ఎటొచ్చీ వారా గుంపుల్లో చాలా ప్రముఖపాత్ర పోషిస్తున్న వ్యక్తులు, అంతే! నిజాం ప్రభుత్వం ఆ కాలంలో చాలా సంపన్నమైనది గానే లెక్క. కానీ ప్రజలంతా దుర్భర పేదఱికాన్ని అనుభవించారు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యపు రోజుల్లో దాని జన్మస్థానమైన ఇంగ్లండులో కూడా విపరీతంగా దరిద్రజనాభా ఉండేది. అందఱికీ సామ్యవాదపు కబుర్లు చెప్పిన సోవియట్ రష్యాలో ఆనాటి అధ్యక్షుడు బ్రెజ్నేవ్ కి వంద కార్లు ఉండేవి. అలాంటిదే మఱో దేశమైన రొమేనియాలో దాని అధ్యక్షుడు సీసెస్కూకి బంగారు కక్కసులు (latrines) ఉండేవి.

వ్యక్తి కంటే సంస్థ గొప్పదనీ, లేదా వ్యవస్థ గొప్పదనీ, లేదా సిద్ధాంతం గొప్పదనీ అవాస్తవికమైన అలౌకిక ఉద్ఘాటనల (romantic statements) కి దిగేవారు సైతం, తమదాకా వస్తే ఆ సంస్థల్నీ, వ్యవస్థల్నీ ముంచెయ్యడానికీ, ఆ సిద్ధాంతాలకి పాతర వెయ్యడానికీ ఎంతమాత్రమూ వెనుకాడరు. అంటే తమ జీవితాలకి మాత్రం వ్యక్తే (అంటే తామే) ముఖ్యం. సంస్థల పట్ల విధేయతేమో ఇతరులకి చెప్పడం కోసం. సిద్ధాంతాలేమో భావితరాల రికార్డు కోసం. వ్యవస్థల పేరిట చెలామణి అవుతున్న ఈ విదూషకత్వాన్ని చూసి నవ్యమానవతావాదులు హాయిగా నవ్వుకుంటారు. అసలీ డొంకతిరుగుడంతా దేనికి? ఎవఱి ఆత్మతృప్తి కోసం? ఈ శాఖాచంక్రమణానికి బదులు, అన్నిటి కన్నా వ్యక్తే మహాన్ అనీ, అన్నిటికీ అతడే కేంద్రమనీ, ఆ తర్వాతే మిగతావన్నీ అనీ నిజాయితీగా ఒప్పేసుకుంటే పోలా?

ఈ రోజుల్లో తెలుగుదేశంలో ఎవఱినైనా బహిరంగ సభల్లో పొగడాలంటే వక్తలు ఎంచుకునే రూపకాలంకార వాక్యం "ఆయన వ్యక్తి కాదు, వ్యవస్థ" అనేది. నవ్యమానవతావాద దృష్టితో చూస్తే అది పొగడడం అవ్వదు. తిట్టడమే అవుతుంది. ప్రాణమూ, జీవమూ, హృదయమూ, చైతన్యమూ, గ్రహణశక్తీ, విచక్షణా, స్పందనా గల వాస్తవికమైన మనిషిని అవేవీ లేని,

కేవలం ఊహామాత్ర అస్తిత్వమే (imaginary existence) గల మొండి–బండ వ్యవస్థల తో పోల్చడం సమీచీనమేనా? విడివ్యక్తి ఆలోచించగల దాంట్లో ఒక్కశాతం కూడా అవి ఆలోచించలేవు కదా! అవి ఎవతివో లిఖిత/అలిఖిత ఆజ్ఞలకి తలొగ్గడానికే తప్ప స్వతంత్ర కార్యాచరణకి సుతరామూ పనికిరావే! ఫలితార్థంగా వ్యక్తికి వ్యక్తుల వల్లనే తప్ప వ్యవస్థల వల్లా, సంస్థల వల్లా మేలు జఱిగేది కల్ల. కనుక వ్యక్తులు వ్యవస్థల్ని దేవతలుగా భ్రమించడం మాని వ్యక్తిగత స్థాయిలో ఒకటికొకఱు ప్రేమ– సానుభూతులతో సహాయం చేసుకోవడం నేర్చుకోవాలి.

**౨. వ్యక్తిగత జీవితాలే ముఖ్యతరం:-** మన ఇంటినీ, దాంట్లో ఉన్న వస్తువుల్ని ఒకసారి పరికించండి. వాటిల్లో ఒక్కొక్కటీ ఒక్కో కర్మాగారం (factory) లో తయారై వస్తుంది. ఆ కర్మాగారాల చుట్టూ నగరాలు ఏర్పడి ఉంటాయి. వాటి రక్షణ కోసం పోలీసులున్నారు. ఆ వ్యాపారాల మీద ప్రభుత్వానికి పన్నుల రూపంలో ఆదాయమొస్తుంది. ఆ ప్రభుత్వాలకి రక్షణగా సైనికులున్నారు. ఆ వ్యాపారాల గుఱించి చేసిన చట్టాలున్నాయి. అంటే ఈ setup పైకి ప్రదర్శించే మేకపోతు గాంభీర్యమంతా మనింట్లో మనకున్న వ్యక్తిగత అవసరాల మీదే ఆధారపడి ఉంది.

అలాగే మన శరీరాల వంక కూడా ఒకసారి చూసుకుందాం. వీటిల్లో ప్రతి అవయవం కోసమూ పెద్దపెద్ద స్పెషాలిటీ ఆస్పత్రులున్నాయి. వాటిల్లో చేఱడం కోసం ఆ అవయవాల గుఱించి విస్తృతంగా చదివే విద్యార్థులున్నారు. వారు చదవడం కోసం ఆ అవయవాల మీద పరిశోధనలు చేసి పత్రికావ్యాసాలూ సిద్ధాంతవ్యాసాలూ పుస్తకాలు వ్రాసే శాస్త్రవేత్తలున్నారు. వారు పనిచేయడం కోసం పెద్దపెద్ద ప్రయోగశాలలున్నాయి. అంటే ఇదంతా వ్యక్తుల్ని తలచుకోకుండానే వారి శరీరాల గుఱించి జఱుగుతున్న కార్యకలాపం.

వీటన్నింటినీ పునాదుల స్థాయిలో పోషిస్తున్నదెవఱు? ఆ వస్తువుల్ని కొంటున్నదెవఱు? ఈ పరిశోధనల్ని ఉపయోగించుకుంటున్నదెవఱు? విడివ్యక్తులే. వాటి మూలాన ప్రయోజనం లేదని గనక వారు భావిస్తే అలా భావించిన మఱుక్షణమే అవన్నీ మూతపడతాయి. కనుక వ్యక్తిగత జీవితాల మెఱుగుదల కోసం ఏర్పడి, వ్యక్తుల శ్రమతో నడుస్తూ, వారి కష్టార్జితంతో మనుగడ సాగించే బృహద్ గుంపూ దాని తోకగుంపులూ "వ్యక్తులతో తమకి పనిలేదన్నట్లూ, వ్యక్తులే తమకి ఋణపడ్డా"రన్నట్లూ భంగిమలివ్వడం సరికాదు.



**౩. వ్యక్తిగోప్యత, ఇష్టానిష్టాలు** (Personal privacy):- ఎదిగిన వయోజన (adult) మానవుడి వైయక్తిక అంశాల్లో అతని అనుమతి లేకుండా ఇతరులు– ఆఖరికి ప్రభుత్వమైనా వేలు పెట్టడం ఆమోదయోగ్యం కాదు. ఇతరుల కోసం తన స్వేచ్ఛనీ, సుఖాన్నీ, ధనాన్నీ వదులుకోవడం ఇవన్నీ మంచి విషయాలే, గొప్పవిషయాలే. కానీ ఇవి ఎవఱంతట వారు విలువ గుర్తించి స్వచ్ఛందంగా ఆచరించాల్సినవి. ఇతరులు వ్యక్తిని ఒత్తిడిచేసి అతనిచేత చేయించాల్సినవి కావు.

వ్యక్తిగత విషయాల్నీ, మానవ సంబంధాల్నీ నియంత్రిస్తూ కట్టళ్ళు చేయడం అనుచితం. సహజన్యాయాన్ననుసరించి, మనుషులు పరస్పరం ఎలా ప్రవర్తిస్తారనేది వారికీ వారి తత్క్షణ పరిసరాల్లో వారితో ప్రత్యక్షంగా మెలగేవారికీ సంబంధించిన విషయం. ఆ ప్రవర్తన ఆమోదయోగ్యమా? కాదా? అనేది నిర్ణయించాల్సినది వారితో మెలగేవారు మాత్రమే. వారందఱి కంటే వేఱైన బైటి శక్తులు కాదు. ఎందుకంటే బైటి శక్తులకి ఆ ప్రవర్తన వల్ల లాభమూ, నష్టమూ రెండూ లేవు.

దేని గుఱించైనా వ్యక్తి మీద బలప్రయోగమూ, బలవంతం చేయడమూ అయుక్తం. అతని కిష్టం లేకుండా అతని చేత ఏ పనైనా చేయించడం అసమంజసం, ఆఖరికి సమాచారం, సాక్ష్యంలాంటివి ఇవ్వడమూ, కాపరం చేయడమైనా సరే! అలాగే ఏ నేఱారోపణా లేని వ్యక్తుల మీద వారికి తెలియకుండా వారిని గుఱించిన సమాచారాన్ని సేకరించడమూ, వారి అనుమతి లేకుండా అలాంటి సమాచారాన్ని బహిర్గతం చేయడమూ కూడా గర్హణీయమే.

**౪. వ్యక్తిని పట్టించుకోని సమాజం విసర్జనీయం:** రకరకాల గుంపుల్నీ, వ్యవస్థల్నీ ఇముడ్చుకున్న సమాజం అనే స్వరూపం కూడా ఓ బృహద్ గుంపే. వ్యక్తుల జీవితాల్లో అది సర్వసాధారణంగా పోషించేది ఓ ప్రతినాయక (villain) పాత్ర. ఇప్పుడే కాదు, మొదట్నుంచీ చరిత్రలో అంతే! మనుషుల బాధలన్నిటికీ అదే మూలకారణం. జనం "పరిస్థితులు" అని వాపోయేది సమాజం గుఱించే! ఆ విషయాన్ని మర్చిపోయి సంఘం పట్ల మనకి బాధ్యత అనీ, దానికి ఋణపడ్డామనీ చెబుతూంటారు. "స్వార్థపరులం" అనిపించుకోకుండా ఉండడం కోసమూ, లేని వినయాన్ని నటించడం కోసమూ, మొహమాటం కోసమూ మినహా

ఇందులో కలికానికైనా వాస్తవం కానరాదు. ఈ కబుర్లు చెప్పేవారు తాము నిజంగా నిజాయితీగా అలాగే అనుభూతిల్లుతున్నారా? అనేది అనుమానాస్పదం.

ఈ రకమైన ప్రచారం సామ్యవాదయుగం (1900–91) లో శ్రుతి మించింది. కానీ ఈ సందర్భంగా నిజాన్ని నిక్కచ్చిగా చెప్పాల్సి వస్తున్నందుకు విచారిస్తున్నాను. నా శైలి కటువుగా ధ్వనిస్తే క్షమించవలసినది. ఒకప్పుడు– అంటే, ఆదిమకాలంలో ఎలా ఉండేదో మనకి తెలియదు. కానీ ఉన్న పరిస్థితుల్లో మాత్రం సమాజం ఓ దుర్గంధ భూయిష్ఠమైన చెత్తకుప్పే తప్ప పవిత్ర దేవాలయం కాదు. దానికి విడివ్యక్తుల్ని దోచుకునే అవకాశమొస్తే వదలదు. నాశనం చేసే అవకాశంవస్తే విడిచిపెట్టదు. తనతో ఏదో ఒక్క విషయంలో అణువంత విభేదించే వారిని సైతం అది క్రూరంగా కాల రాస్తుంది. సదా తప్పులెంచడమే తప్ప మంచిని మెచ్చుకునే ప్రతిభాసంస్కారాలు దానికి మృగ్యం.

“వ్యక్తులతోనే కదా సమాజం ఏర్పడుతుంది?” అనడిగితే ఔను, మనుషులు వ్యక్తులుగా వివేకశాలులే (sensible). కానీ గుంపుగా కూడినప్పుడు మాత్రం పశువుల కంటే క్రించుగా తమ నిర్మల నైజానికి పూర్తి విరుద్ధంగా ప్రవర్తిస్తారు. మన సమాజమనే కాదు. ఏ సమాజమైనా ఇంతే! దీనికి సరైన కారణం తెలియదు. మనం చూసే సంపన్నులూ, ప్రఖ్యాతులూ ఐన విజేతలంతా సమాజం బారిన పడకుండా తప్పించుకోగలిగిన అదృష్టవంతులు. లేదా దాని కన్ను కప్పగలిగిన లౌక్యులు. సమాజం వ్యక్తుల్ని బాగుచెయ్యకపోతే సరే, పోనివ్వండి కానీ పాడుచెయ్యకపోతే అదే పది వేలు.

ప్రజలంతా కలిసికట్టుగా దేవుళ్ళు కారు. వారిలోని విడివ్యక్తులే దేవుళ్ళు. వారే హీరోలు కూడా. ఎవఱి జీవితాన్ని తఱచి చూసినా సమాజం వారికి ఏ ఉపకారమూ చేసిన సందర్భం కనిపించదు. ఎల్లెడలా ప్రతివారూ తమ జుట్టు తామే పట్టుకుని పైకి లేవడం కనిపిస్తుంది. లేదా తమలాంటి విడివ్యక్తులే ఒకఱిద్దఱు తమకి సహాయం చేయడం కనిపిస్తుంది. వారలా ఒళ్ళు హూనం చేసుకుని పైకొచ్చాక సమాజం అనేక మాఱువేషాల్లో వచ్చేసి అనేక నెపాలతో వారి సంపదలోనూ పేరుప్రఖ్యాతుల్లోనూ వాటా కోరుతుంది. “వారు మా జాతి” అంటుంది. “మా కులస్థులు/మా పౌరులు” అంటుంది.

మనిషిలోని మంచి గుణాలన్నీ అతని స్వంతం. దుర్గుణాలన్నీ సమాజం నుంచి నేర్చుకున్నవే.



చిన్నపిల్లల్ని అందఱూ ప్రేమిస్తారు. వారు నలుగుఱిలో మేహించినా[1] ముద్దొస్తారు. ఎందుకంటే వారింకా వారుగానే ఉన్నారు. సమాజానికి ప్రతిరూపాలుగా మారలేదు. (సమాజం నుంచి ఏమీ నేర్చుకోలేదు) అందుచేత సమాజం నుంచి మనిషి కోరి నేర్చుకోవాల్సింది ఏమీ లేదు. నేర్చుకోవాల్సిందంతా ప్రకృతిలోనే ఉంది. తన ప్రకృతిని తాను అనుసరించడంలోనే ఉంది. మనం మన జీవితంలో ఏ విలువైన విషయం నేర్చుకున్నా మనకి సన్నిహితులైన/ప్రియతములైన విడివ్యక్తుల నుంచే నేర్చుకున్నాం తప్ప సమాజమొచ్చి నేర్పలేదు. చెడే తప్ప మంచి నేర్పే శక్తి సమాజానికి లేదు. మనకి రక్షణ అవసరమైతే మళ్ళీ అ విడివ్యక్తులే కొద్దిమంది వచ్చి కాపాడాల్సిందే తప్ప యావత్తు సమాజమూ వచ్చేసి కాపాడదు.

కనుక మనం వాస్తవంగా ఆలోచించాల్సినది మన చుట్టూ ఉన్న/మన సన్నిహితులైన విడివ్యక్తుల గుఱించే! మనం కోరాల్సింది వారి సంక్షేమాన్నే! మనం ఋణపడినది వారికే! మనం పట్టించుకోవాల్సినది వారి సున్నితత్వాల్నే! మనకి కావాల్సినది వారి సలహా–సంప్రదింపులూ, సమ్మతులూ మాత్రమే. ముక్కూ మొహం లేని (faceless) సువిశాల సమాజం ఎలా ఉన్నా దాని గుఱించి ఆలోచించే శక్తి ఓ మామూలు విడివ్యక్తికి లేదు. ఒకవేళ ఉన్నా అక్కడ అతని మాట వినేవారెవఱూ లేరు. ఎందుకంటే సమాజం తన సంయుక్తరూపంలో రాజకీయ నేతల పెఱడూ, వంటిల్లూ. అదీ గాక అది ఇతని గుఱించి నిద్ర మానుకుని ఆలోచించినప్పుడు కదా ఇతను కూడా అలా చేయాల్సినది!

మనుషులు తమని తాము ఒకే ఒక చిన్న సమూహానికి ఎంతగా పరిమితం చేసుకుంటారో అంతగా వారిలోని నిర్మలత్వం నిలబడుతుంది. తద్భిన్నంగా వారు ఓ పెద్ద సమూహానికి/లేదా విభిన్నమైన పలు సమూహాలకి ఎంతగా వెలారుతారో[2] అంతగా వారు చెడిపోతారు. ఎందుకంటే మనిషీ, అతని శరీర, మనశ్శక్తులూ ప్రాథమికంగా ఓ పెద్ద సమాజం కోసం సృష్టించబడలేదు. అందుచేత అతన్ని సమాజం కోసం బ్రతకమనడం పూర్తి అనుచితం. మన ఆలోచనల్లోంచీ, మాటల్లోంచీ, లక్ష్యాల్లోంచీ వ్యక్తుల సంక్షేమం కంటే వేఱైన ప్రస్తావనల్ని బహిష్కరిస్తేనే మినహా మనం పరిపూర్ణ మానవతావాదులమయ్యే అవకాశం లేదు.

[1] ఉచ్చ పోసినా...

[2] Expose అవుతారో...

ఏ పని చేసినా "దీని మూలాన ఎవఱు బాగుపడ్డట్లు? ఎవఱు తిన్నట్లు?" అనే ప్రశ్న వేసుకో వడాన్ని ముందు మనం నేర్చుకోవాల్సి ఉంది.

**౫. వైయక్తిక సంబంధాల ఏకాంతికత్వం :** రక్త/కుటుంబ సంబంధాలతో పాటు ఇద్దఱు లేదా అంతకంటే ఎక్కువమంది మనుషులు ఇష్టపూర్వకంగా ఏర్పఱచుకున్న సంబంధాలు కూడా వ్యక్తిగత వ్యవహారాల కిందికే వస్తాయి. గుంపులకి వాటితో సంబంధం లేదు. వారిని అడిగి, వారి అభిప్రాయం కనుక్కుని, వారి దగ్గఱ అనుమతి సంపాదించి ఎవఱూ మానవ సంబంధాల్ని ఏర్పఱచుకోరు. వ్యక్తిగత సంబంధాల మంచిచెడ్డలు గుంపుల్ని ఏ విధంగానూ ప్రభావితం చేయవు. ఎవఱి బ్రతుకు వారిది. కనుక వాటికి సంబంధించిన సమస్యల్లో ఏ పేరుతో నైనా ఇతరులు తలదూర్చడం అసందర్భం, అమానవీయం.

అంతే కాదు, మానవ సంబంధాల్ని గుంపు–పరంగా గుర్తిస్తున్నామనే వంక బెట్టి వాటిని బైట పడను వీల్లేని కత్తుల బోన్లుగా మార్చడం, తద్వారా ఇష్టం లేని లావాదేవీల్లో మనుషుల్ని జీవితకాలం పాటు బంధించాలని చూడడం అవగాహనాలేమి. అదే విధంగా వ్యక్తుల మధ్య చోటు చేసుకునే ఆంతరంగిక వ్యవహారాలకి వ్యవస్థాగతమైన దూరాన్వయాలు తీయడం, భాష్యాలు చెప్పడం, వాటి ఆధారంగా బాధితహీన నేఱాల్ని (victimless crimes) సృష్టించడం అతార్కికం. ఏది అతార్కికమో అది మానవతావిరుద్ధమూ అవుతుంది.

మానవసంబంధాలు మానవసంబంధాలే. అవి లాభార్జనకి హామీ ఇవ్వని స్వచ్ఛంద కార్యకలాపాలు. అవి ప్రేమ, వాత్సల్యం, దయ అనే ఇంధనాలతో నడవాల్సినవి. అవి వెల కట్టదగ్గ ఉద్యోగాలో వ్యాపారాలో, పదవులో కానే కావు. అవి మనిషి తన వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దుకోవడానికీ, దాన్ని పరిపూర్ణం చేసుకోవడానికీ, ఆంతరంగికమైన ఆనందాల్ని మనసారా పంచుకోవడానికీ దాచుకున్న ఆనందమయ కోశాలు. వాటికి వ్యవస్థలతో పనిలేదు. వ్యవస్థలు లేని కాలం నుంచే అవి ఉనికిలో ఉంటూ వచ్చాయి. అవి ఏ వ్యవస్థకీ లోబడనటువంటి స్వీయమైన గతినియమాల (dynamics)తో పనిచేసేటువంటివి. వాటికవే ఓ ప్రయోజనం తప్ప ఏ ఇతర ప్రయోజనానికీ అవి ఉపాయాలు గానీ, ఉపకరణాలు గానీ కావు.

మనుషులు వ్యక్తిగతంగా ఏర్పఱచుకొని స్వేచ్ఛగా పెంచుకోవాల్సిన, లేదా స్వచ్ఛందంగా తెంచుకోవాల్సిన మానవసంబంధాల్ని అధికారపూర్వకంగా నిబంధించడం ఓ ప్రాతకాలపు



ధోరణి. ఇద్దఱు వయోజనులు తమ మధ్య ఓ సంబంధాన్ని నెలకొల్పుకునేటప్పుడు వారందులో ఎవఱి బలవంతమూ లేకుండా దానిలో ఇమిడి ఉన్న సాధక బాధకాలన్నీ సమీచీనంగా అర్థం చేసుకున్నాకే స్వచ్ఛందంగా కోరుకుని మఱీ దాన్ని నెలకొల్పుకున్నారని భావించాల్సి ఉంటుంది. అంతే కాక సమానస్థాయిలో ఆలోచించి, తమ తమ స్వంత బాధ్యతల మీద, అన్నిటికీ సిద్ధపడే నెలకొల్పుకున్నారని కూడా భావించాల్సి ఉంటుంది. ఏదో ఒక ప్రయోజన ప్రలోభం లేకుండా ఏ ఇద్దఱూ ఓ మానవ సంబంధంలో ప్రవేశించరు. ఆ ఆశించిన ప్రయోజనం నెఱవేఱుతున్నంత కాలం వారి సంబంధం సాఫీగానే సాగిపోతుంది. కానీ ఏదో ఒక దశలో వారిలో ఒకఱికి లేదా ఇద్దఱికీ "ఆ సంబంధం ఇహ నిష్ప్రయోజనం" అని తోచి దానిలోంచి విరమించుకుంటే అందులో ప్రాథమికంగా తప్పు పట్టాల్సిందేమీ లేదు.

**౬. వైయక్తికాలోచనలు చేయడంలో తప్పులేదు :** వ్యక్తులు సమాజాని కంటే భిన్నమైన స్వకీయ ఆలోచనల్ని కలిగుండడంలోనూ, వాటిని యథాతథంగా వ్యక్తీకరించడంలోనూ, తమ వ్యక్తిగత జీవితస్థాయిలో వాటిని అమలు జఱుపుకోవడంలోనూ నవ్యమానవతావాద దృష్ట్యా తప్పు లేదు. నిజానికి వ్యక్తుల స్వతంత్ర వ్యష్ట్యాలోచనల వల్లనే సమష్టినాగరికత పురోగమించింది. అసలు సంఘదృష్టి, చట్టదృష్టి, శాస్త్రదృష్టి అనేవి కూడా మొదట్లో అందఱికీ చెందినవి కావు. అవి, ఒకనాటి సమాజంలో శక్తిమంతులైన కొద్దిమందికి చెందిన వ్యక్తిగత దృష్టులేనని మఱువరాదు. అవి వారికి సమకాలీనంగా ఉన్న పరపతిప్రాబల్యంతో అందఱికీ అన్వయించబడి అందఱికీ చెందినవిగా భావించబడ్డాయి. అయితే శక్తిమంతులకే కాదు, శక్తిహీనులక్కూడా ప్రతి అంశాన్ని గుఱించి తమ తమ వ్యక్తిగత దృష్టికోణాలు ఉండడంలోనూ, వాటిని వ్యక్తీకరించడంలోనూ తప్పులేదని నవ్యమానవతావాదం భావిస్తుంది. వారికలాంటి వైవిధ్యాలోచనలు ఉన్నప్పుడు, అవి ఉన్నందుకు వారిని శిక్షించకుండా, పరిహాసాలకి దిగకుండా వాటిని గుఱించి కూలంకషంగా చర్చించడానికి సిద్ధపడాలి. మెచ్చుకుని ప్రోత్సహించాలి.

ప్రజాస్వామ్యంలో ఆలోచనాస్వేచ్ఛ అనేది నేతి బీఱకాయలో నేతిలాంటిదే. ఏ రకమైన వ్యవస్థలో నైనా ప్రతి జీవనరంగాన్నీ రాజకీయ రంగమే శాసిస్తుంది. కానీ అంత ప్రముఖ పాత్ర పోషిస్తున్న రాజకీయాల గుఱించి పైకి మాట్లాడితే– అవి ఎవఱి కోసం నడుస్తున్నాయో ఆ సామాన్య పౌరులకి ప్రాథమిక భద్రతే కఱువవుతుంది. వారి కోసం రహస్య బ్యాలట్

ఉందని చెబుతారు. నిజంగా మనిషికి తన రాజకీయ అభిప్రాయాల్ని వ్యక్తీకరించే స్వేచ్ఛే గనక ఉంటే ఆ రహస్యం దేనికి? ఇప్పటికీ మన సమాజంలో మనుషులు రాజకీయాల గుఱించి మాట్లాడాలంటే భయం భయంగా చుట్టూ కలయజూసే పరిస్థితి ఉందనే వాస్తవాన్ని ఎవఱూ కాదనలేరు. స్వేచ్ఛకి మారుపేరంటూ ప్రగల్భాలు పలికే ప్రజాస్వామ్యాల్లో విడి పౌరులకే కాదు, నాయకులక్కూడా స్వంత అభిప్రాయాలుండడం చాలా తప్పుగా పరిగణింపబడుతుంది. ప్రజలంతా ఏమనుకుంటున్నారో గమనించి నాయకుడు కూడా ఆ ప్రకారంగానే మాట్లాడాలి. తద్భిన్నంగా మనసులో మాట పైకి వెల్లడించే సాహసం చేసిన నాయకులు, తదుపరి బహిరంగ క్షమాపణ చెప్పుకోవాల్సిన అనివార్యతలోకి త్రోయబడుతూండడాన్ని మనం తఱచూ గమనిస్తున్నాం. లక్షలాది మైళ్ళూ, కోట్లాది జనాభాలతో వ్యాపించిన రాజ్యాల్లో ఈ ప్రజాభిప్రాయం అనేది ఏంటో, ఎక్కణ్ణుంచి తయారవుతోందో తెలీదు. కానీ ఖచ్చితంగా ఎవఱో ఒకఱుండి తయారు చేయకుండా అది తయారవ్వదు.

**౭. వ్యక్తి స్వార్జితైక జీవనం :-** చట్టాలకు లోబడి గానీ, వాటికి బాహ్యంగా గానీ ఇతరుల జేబుల్లో చేతులుపెట్టే తత్త్వాల్ని నవ్యమానవతావాదం ప్రోత్సహించదు. స్వార్జితం కాని, ఇతరులు తమంత తాము ఇష్టపూర్వకంగా ఇవ్వని ప్రతిపైసా అపవిత్రమే. మానవ సంబంధాల్ని ఉద్దేశపూర్వకంగా సొమ్ముచేసుకోవడం అమానుషమని అందఱూ గ్రహించే రోజు రావాలి. ఎవఱికైనా సహాయాన్ని అర్థించే అవకాశం మాత్రమే ఉంది. డిమాండు చేసే హక్కు లేదు. శక్తి గలిగిన ప్రతి వయోజన వ్యక్తీ (adult individual) తన కష్టార్జితం మీదే ఆధారపడి బ్రతకడానికి ప్రయత్నించాలి. ఎవఱి ఆస్తి కోసమూ, ఆదాయం కోసమూ ఆశించకూడదు– వారు తనకెంత సన్నిహితులైనా! వారు తనను పోషిస్తూంటే వారికి హృదయపూర్వకంగా నెనర్లు చెప్పాలే తప్ప, "అలా పోషించడం వారి బాధ్యత. పోషించబడడం నా హక్కు" అని వితండగా వాదించకూడదు. అదే విధంగా వ్యక్తుల ఆస్తుల మీద వారి అనుమతి లేకుండా గుంపులు కూడా ఏ అవసరం కోసమూ చేయి వేయకూడదు.

**౮. భావోద్వేగాలకు వ్యక్తిబాధ్యత :** ఎవఱి భావాలూ, భావోద్వేగాలూ (feelings and emotions) వారిలోనే పుడతాయి. అవి పుట్టడానికి ఆయా వ్యక్తులు తమ మనసుల్ని అనుమతించడం చేత అవి పుడతాయి. ఆ భావాల కనుగుణంగా చర్య తీసుకోవడానికీ, ప్రతిస్పందించడానికీ వారు తమ మనసులకీ, శరీరాలకీ స్వేచ్ఛనివ్వడం చేతనే వారు వాటి కనుగు



ణంగా ప్రవర్తించడం జఱుగుతుంది. అంటే ప్రతి ఒక్కఱూ తమ భావాలకి తామే బాధ్యత తీసుకోవాలి తప్ప, "నాకు ఫలానా భావం కలగడానికి వేఱెవఱో కారణ"మంటూ నెపాన్ని ఇతరుల మీద మోప నుంకించడం అసమంజసం.

తమక్కూడా 'త్రాగాలి' అనిపించడం చేత జనం త్రాగుతున్నారు. తమకే 'చనిపోవాలి' అనిపించడం చేత కొందఱు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. 'చదవాలి' అనిపించకపోవడం చేత మానుకోలరులు (drop–outs) చదువు మానుకుంటున్నారు. *"ఎవఱినో చూసి జనం త్రాగుతున్నారు. ఎవఱో వారిని ప్రోత్సహిస్తున్నారు."* అనడం, లేదా *"ఒకఱి ఆత్మహత్యకి ఇంకెవఱో ప్రోద్బలమయ్యారు"* అనడం — ఇలాంటివి పూర్తితార్కికం కాదు. పరిస్థితులకి మనుషులు ఎలా ప్రతిస్పందిస్తారనేది ఆ మనుషుల చేతుల్లోనే తప్ప ఇంకెవఱి చేతుల్లోనూ ఉండదు. ఒకే పరిస్థితికి ఒక్కొక్కఱూ ఒక్కోలా ప్రతిస్పందిస్తారు. ఆ ప్రతిస్పందనలన్నీ వారివే. ఇతరులవి కావు. "ప్రతిస్పందించడానికి ఇంకా మంచిపద్ధతులు అందుబాట్లో ఉన్నప్పుడు అపసవ్య పద్ధతుల్లోనే ప్రతిస్పందించాలని ఎందుకు నిర్ణయించుకున్నారు?" అని ప్రశ్నించడాన్ని జనానికి నేర్పకుండా, ఒకఱి స్వయంకృత నష్టానికి వేఱొకఱిని నిష్కారణంగా నిందించే అలవాటుని మన వాతావరణం ప్రోత్సహిస్తోంది.

ఒకవేళ ఒకఱి దురదృష్టంలో ఇతరులకి పైకి స్పష్టంగా కనిపించని పరోక్ష బాధ్యత ఏదైనా ఉన్నా, అది నిర్ణయించాల్సింది అలౌకికమైన ఆధ్యాత్మిక తలం (spiritual plane) లోనే తప్ప లౌకిక జీవనరంగంలో మాత్రం కాదు. ఎందుకంటే ఇంద్రియాలకి అగోచరమైన ఆధ్యాత్మిక తలం లౌకికవ్యవస్థ యొక్క అధికార పరిధి (jurisdiction) కి అనభిగమ్యం. ప్రత్యక్ష బాధ్యతల్ని మాత్రమే లౌకికవ్యవస్థ విచారించగలదు. ఎలాగైతే ఒకఱి అదృష్టానికి వారికే ఘనత ఆపాదించి మనం ప్రశంసిస్తున్నామో, ఎలాగైతే అందుకు ఇతరుల్ని బాధ్యుల్ని చేసి భాగమివ్వడంలేదో, అలాగే వారి దురదృష్టానికి కూడా వారినే నిందించాల్సి ఉంటుంది. అంతే తప్ప ఇప్పుడు చేస్తున్నట్లుగా ఇతరుల్ని అందుకు బాధ్యులుగా చేసి దుష్ప్రచారాలు చేయడం, వారిమీద చట్టపరమైన చర్యలు తీసుకోవడం నవ్యమానవతావాద దృష్ట్యా ఆమోద యోగ్యం కావు.

**౯. వ్యక్తిగత సమస్యలకు వ్యక్తిగత పరిష్కారాలు :** మానవజాతి వేలాది సంవత్సరాలుగా ప్రోగేసుకున్న అనుభవ భాండాగారం మూలాన అనండి. లేదా ఓ మనిషిని చూసి ఇంకో

మనిషి అనుకరించాలనే ఆశంస (expectation) వల్ల అనండి. మొత్తమ్మీద సమాజంలో ప్రతి ఒక్క జీవిత సమస్యకీ ఓ పూర్వాయత్త పరిష్కారం (readymade solution) లభిస్తూంటుంది. చాలా సందర్భాల్లో అవి వ్యక్తులక్కూడా పనికొస్తాయనడంలో సందేహం లేదు. ఎందుకంటే వ్యక్తుల బదులు సంఘమే వాటిని వారికోసం వారికన్నా ముందే ఆలోచించి పెట్టేసింది. కానీ ఆ సర్వసామాన్య పరిష్కారాలు ఎవఱో ఒక్కశాతం మంది విషయంలో నప్పకపోవచ్చు. "ఎందుకు నప్పవు?" అనేది పదిమందిని సమావేశపఱిచి వివరించేది కాకపోవచ్చు. ఎందుకంటే అది ఎవఱిది వారికే తెలుస్తుంది. ఇతరులకి చెప్పినా పెక్కుసందర్భాల్లో వారు అర్థం చేసుకోలేరు. వ్యక్తిగత సమస్యలకి సమాజం చూపే పరిష్కారాలు ఓ లారీలో యాభైమందితో కలిసి చేసే ప్రయాణంలాంటివి. అవి నాణ్యత లోపించిన సంతర్పణ భోజనాల్లాంటివి. ఎవఱికి వారు చూసుకునే ఉపాయాలు సొంత ఏ.సి. కారులాంటివి. అవి అమ్మ చేతి వంట లాంటివి. "మేమంతా లారీలో ఎక్కుతూంటే నువ్వేంటి, కారులో వస్తానంటావ్?" అని గద్దిస్తే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో వ్యక్తిగత మార్గాంతరాలు వెతుక్కున్న వారిని తప్పుపట్టడం కూడా అలాగే ఉంటుంది.

కాబట్టి వ్యవస్థ/సమాజం తనని అర్థం చేసుకోవట్లేదనీ, తన గోడు పట్టించుకోవట్లేదనీ, తనకి న్యాయం చెయ్యట్లేదనీ వ్యక్తి లోతుగా అనుభూతిల్లినప్పుడు తనకి నచ్చిన పరిష్కారం తాను చూసుకోవడంలో తప్పులేదు.

**౧౦. వ్యక్తిగత పరిమితుల్ని బట్టి నియమ నిబంధనల్ని సడలుబాటుతో అనువర్తించడం**

(Flexible application of rules and regulations in keeping with personal limitations) **:** చట్టాలూ, నియమ నిబంధనలూ మన సౌలభ్యం నిమిత్తం మనమే ఏర్పఱచుకున్నవి. లేదా మన సుఖానికి అంతరాయం కలిగించే కారకాల (factors) ని ఎదుర్కునే నిమిత్తం రూపొందించుకున్నవి. అయితే మనకి సుఖమైనది అందఱికీ సుఖం కాకపోవచ్చు. అలాగే మనం అంతరాయమనుకున్నది అందఱికీ అంతరాయం కాకపోవచ్చు. వారా ముక్క వాచ్యం (vocal) గా వెల్లడి చేస్తున్నప్పుడు కనీసం వారి వఱకైనా ఆ నియమ నిబంధనల్ని సడలించడం అభిలషణీయం. నియమ–నిబంధనల వెనక వాటి రూపకర్తల స్ఫూర్తి (spirit) ని సమీచీనంగా అర్థం చేసుకుని అమలు జఱపాలి తప్ప కేవలం శుష్క పదప్రయోగాలతోనూ వాటి బాహ్యార్థాలతోనూ కుస్తీ పట్టకూడదు.



ఈ సందర్భంగా కొందఱు సమానత్వ ప్రస్తావన లేవనెత్తవచ్చు. గ్రుడ్డి సమానత్వం గ్రుడ్డి అసమానత్వంలాగే బహుపీడాకరం. ఎందుకంటే సంపూర్ణ సమానత్వం (absolute equality) అనేది సంపూర్ణ సదృశత్వం (absolute similarity లేదా అన్ని విషయాల్లోనూ అచ్చుమచ్చుగా పోలి ఉండడం) మీద ఆధారపడి ఉంటుంది. కానీ అంత సంపూర్ణ సదృశత్వం ఏ ఇద్దఱి మధ్యా కనిపించదు. కనుక 'అందఱికీ ఒకే విధమైన చట్టాలూ, నియమ–నిబంధనలూ' అనే ఏర్పాటు ఆమోదయోగ్యం కాదు.

కోట్లాది జనాభా, బహుసాంస్కృతిక జీవనశైలులూ (cosmopolitan life-styles) గల ఆధునిక సమాజాల్లో కేవలం కొద్దిమంది అభిమతాని కనుగుణంగా అందఱికీ వర్తించే ఏకచ్ఛత్ర చట్టాలు (blanket rules) చేయడం తీవ్ర అసంతృప్తికీ, అశాంతికీ దారి తీస్తోంది. ఒకనాటి చిన్న ఏకసాంస్కృతిక సమాజాల బాటలోనే ఇప్పుడు కూడా ఏకచ్ఛత్ర చట్టాలతోనే వ్యవహారాలు నిర్వహించడం సౌలభ్యం కాదు. కనుక ఒక్కో రంగానికీ సంబంధించి, వివిధ వర్గాల అవసరాల కనుగుణంగా మూణ్ణాలుగు రకాల సమాంతర/ప్రత్యామ్నాయ చట్ట–ఎంపి లుండడంలో తప్పులేదు. ఎవఱికిష్టమైన చట్టం క్రింద వారు నమోదవుతారు. ఇతరులకి నష్టమేముంది? వాస్తవానికి ఇది క్రొత్త ప్రతిపాదనేమీ కాదని అర్థం చేసుకోవాలి. ఎందుకంటే, అలాంటి చట్టవైవిధ్యం ఇప్పటికే కొంత లేకపోలేదు. మచ్చుకి మన దేశంలో హిందూ–ముస్లిమ్–క్రైస్తవ జనాభాలకి వేఱువేఱు పౌరచట్టాలు ఉన్నాయి. అలాగే ప్రాంతాల వారీగా వేఱువేఱు భూచట్టాలు కూడా ఉన్నాయి. అదే విధంగా కొన్ని సెలవులు కొన్నివర్గాలకి తప్పనిసరి కాగా, మఱికొన్ని వర్గాలకి అవి ఐచ్ఛికాలు (optional) మాత్రమే.

ఒకప్పుడు మతం పోషించిన పాత్రనే సమకాలీనంగా సైన్సూ, చట్టాలూ పోషిస్తున్నాయి. సడలుబాటుకి తావులేని గ్రుడ్డి నిర్వచనాలే (rigid and blind definitions) మతానికీ, చట్టాలకీ గల ఉమ్మడి లక్షణం. ఉదాహరణకి బాల్యవివాహాల నిషేధ చట్టాన్ని తీసుకోండి. ఈ చట్టాన్ని తేవడంలో నాటి ప్రభుత్వపు టుద్దేశం– బాలవైధవ్యాల్ని నివారించడం, వ్యక్తులు వయసొచ్చాక తమ జీవిత భాగస్వామిని తామే నిర్ణయించుకునేందుకు అనువైన పరిస్థితుల్ని కల్పించడం. అప్పట్లో వధూవరులకుండాల్సిన వయసుని 12–16 సంవత్సరాలుగా నిర్ణయించారు. ఈ చట్టపు టమలు వాస్తవంగా వివాహోచిత వయఃపరిమితి మీదే ఆధారపడి ఉంది. అంటే ప్రభుత్వం నిర్ణయించిన వయసు కంటే తక్కువ ఉన్న వధూవరులకి పెళ్లి చేస్తే

నేఱంగా భావిస్తారు. కానీ ఆ వయఃపరిమితిని పెంచుకుంటూ వెళ్ళారు, వెళుతున్నారు. ఆ క్రమంలో యౌవనులకి యౌవనులతో వివాహం చేసినా అది చట్టపరంగా నేఱమవుతోంది.

ఈ చట్టాన్ని తేవడం వెనక నున్న అసలు ఉద్దేశం కాస్తా మఱుగున పడిపోయింది. ముప్ప య్యేళ్ళవారు కూడా తల్లిదండ్రులు చెప్పినట్లే వినే దేశంలో తమ జీవిత భాగస్వామిని తామే నిర్ణయించుకోవడానికి ఈ చట్టం చేయగల సహాయమేదీ లేదు. పురుషుల సగటు ఆయుః ప్రమాణం 65 ఏళ్ళుగా ఉన్న కాలంలో అమ్మాయిలు బాలవితంతువులు కావడానిక్కూడా ఆస్కారం లేదు. ఈ చట్టం నిజానికి వ్యక్తుల జీవితాల్ని బాగుచేయడానికి ఉద్దేశించినది. కానీ ప్రస్తుతం ప్రభుత్వమేమో దీన్ని జనాభా నియంత్రణ సాధనంగా భావిస్తోంది. అంటే దీని లక్ష్యం దారి మళ్ళించబడింది. వ్యక్తులకి సంబంధించిన ప్రతి విషయాన్నీ సమాజం ఇలాగే స్వంతం చేసుకోవడం దృశ్యమానమవుతోంది.

నియమ నిబంధనల్ని సడలుబాటుతో అనువర్తించడం ఎందుకవసరమో అర్థం కావాలంటే, ముందు మనుషుల్ని మూకుమ్మడి వర్గాలుగానూ, గుంపులుగానూ కాక, వ్యక్తులుగానే చూసే సంస్కృతి పెంపొందాలి. ఉదాహరణకి, నేఱస్థుల్ని సైతం వారివారి వైయక్తిక కుటుంబ నేపథ్యానికీ, సంస్కృతికీ అనుగుణంగా బంధించడం మానవీయమవుతుంది. అంతే తప్ప, ఇప్పుడు చేస్తున్నట్లు, ఓ పాత్రికేయుణ్ణి తీసుకెళ్ళి దొంగల మధ్య కూర్చోబెట్టడం, లేదా ఓ ప్రజోద్యమ నాయకుణ్ణి తీసుకెళ్ళి ఉగ్రవాదులతో సహపంక్తి చేయించడం– ఇదంతా ప్రాత చింతకాయపచ్చడి. కాబట్టి ఉన్నతవిద్యావంతులూ, సుప్రసిద్ధులూ, సంఘసేవకులూ, ప్రజో ద్యమ నాయకులూ, ఇతరులెందఱికో ఉపజీవ్యులూ ఆశ్రయభూతులూ అయిన వ్యక్తులూ, ఇప్పుడో ఇదివఱకో ఉన్నత పదస్థులూ అయిన వారికోసం ప్రత్యేక సౌకర్యాలతో కూడిన చెఱ సాలల్ని విడిగా ఏర్పఱచడం వాంఛనీయం. చట్టాలూ మానవకల్పితాలే. చెఱసాలలూ మానవకల్పితాలే. ప్రకృతిలో అవి లేవు. మన మధ్య ఉన్న అలాంటి సవాలక్ష మానవకల్పితా ల్లో ఈ ప్రత్యేక సౌకర్యాలూ ఒకటనుకుందాం. తప్పేముంది ? అలాగే ఖైదీలు చెఱసాల బైట పాటించే స్వీయ సంరక్షణ విధానం, ఆరోగ్యసూత్రాలూ మొదలైనవాటిని కారాగృహ జీవితం లో సైతం అనుమతించడం మానవత్వం అనిపించుకుంటుంది.

**౧౧.ప్రేమ-కామంలాంటి వ్యక్తిగత విషయాల్లో అజోక్యదారీ** (non-interference)



**వైఖరి:** స్త్రీపురుషుల మధ్య పరస్పర ప్రేమే కుటుంబవ్యవస్థకి ప్రాణం. అది లేనప్పుడు వివాహ మైనా కానట్లే. కుటుంబం ఉన్నా లేనట్లే. ప్రేమ మొదట్లో ఎంతో కొంత మోహం లేకుండా ఏర్పడదు. పెళ్ళి కాకపోయినా ఆ ప్రేమాతిశయం వల్లనే స్త్రీలు పతివ్రతలవుతారనే విషయా న్ని మన పురాణాలు సైతం పలుచోట్ల సూచిస్తున్నాయి. ఇంద్రాది దేవతలు స్వయంవర సభ లో తన ప్రియుడైన నలుడి రూపాన్ని ధరించి అతని పక్కనే ఆసీనులైతే "వారిలో అసలైన నలుడెవ"అనేది దమయంతి తన పాతివ్రత్య ప్రభావం వల్లనే కనుక్కొని వరించిందట. వివా హం కావడమే పవిత్రతకి ముఖ్యమనుకుంటే, మఱి పెళ్ళికాని దమయంతికి ఆ పాతివ్రత్య మహిమ ఉండకూడదు కదా?

కనుక ఒకఱినొకఱు ఇష్టపడ్డ ఆడా-మగా ఎవరైనా కావచ్చు. ఏ (age-group) వయో వర్గానికైనా చెంది ఉండొచ్చు. ఎవఱు నాలుగ్గోడల మధ్య ఏం చేసుకుంటారనేది వారి ఆంత రంగిక (private) విషయం. దాని గుఱించి మిగతావారు గగ్గోలు పెట్టడం, వివాదపడడం అనావశ్యకమూ, నిష్ప్రయోజనమూ. తమ జీవితంలో ముఖ్యమైన మూడో పక్షం (third party) ఎవరైనా ఉంటే, వారికి ఉద్దేశపూర్వకంగా అపకారం/ద్రోహం చేయనంతవఱకూ జంటలు ఏమైనా చేసుకోవచ్చు. అది వ్యక్తిస్వేచ్ఛలో ఓ భాగం. స్త్రీకి పురుష సాంగత్యమూ, అలాగే పురుషుడికి స్త్రీ సాంగత్యమూ తప్పనిసరి అవసరాలు. ప్రాకృతికావసరాలన్నీ అవశ్యం హక్కుల క్రిందికే వస్తాయి. అందుచేత ఎవఱో ఒక ఇద్దఱు పెళ్ళిచేసుకున్నా చేసుకోక పో యినా, కలిసున్నా, కలిసి తిరిగినా, ఆఖరికి గర్భధారణే చేసినా అది మిగతా సమాజానికి సంబంధించిన విషయం కాదు. స్త్రీపురుషులు ఏదో ఒక రకంగా కలిసుంటే కాదు మిగతా సమాజానికి ముప్పు ముంచుకొచ్చేది. అలా ఉండకపోతేనే!

మిథోవాసం (live-in relationship) విషయానికొస్తే కొంతమంది దాన్ని మెచ్చుకోవ డం, మఱి కొందఱు తెగనాడడం కనిపిస్తుంది. చాలామంది అనుకుంటున్నట్లు పెళ్ళి అనేది ప్రాథమికంగా ఓ సాంఘిక వ్యవస్థ కాదు. మతవ్యవస్థ మాత్రమే. ఓ వ్యక్తికి, లేదా జంటకి పెళ్ళయితే సంఘానికి ఒరిగేదీ లేదు. అవ్వకపోతే తరిగిపోయేది కూడా ఏమీ లేదు. ఇతరుల మీద ఆధారపడకుండా ఎవఱి పొట్ట వారు పోసుకుంటున్నంత కాలమూ ఇక్కడ తలక్రిందు లయ్యేదేమీ లేదు. లైంగిక సంబంధానికి పెళ్ళిని తప్పనిసరి చేసినది మతమే. మతాలన్నీ నాగరికతా పరిణామక్రమంలో ఎదగబాఱుతూ (evolving) వచ్చినవే. కనుక పెళ్ళి కూడా

అలాంటిదే. పరిమితి, నిగ్రహాల కోసమే పెళ్ళి. అవి ఆధ్యాత్మిక జీవితానికి మిక్కిలి ఉప యుక్తం. లౌకిక జీవితంలో కూడా వాటికి ప్రయోజనం లేకపోలేదు. కానీ పరిమితం. కనుక ఎవరైనా మతోద్దిష్ట జీవనశైలి తమకవసరం లేదని భావించినప్పుడు మతం విధించిన చట్రం లో వారి ఇష్టానికి భంగకరంగా వారిని నిర్బంధించడం సరికాదు. పెళ్ళి ఓ గొప్ప సౌలభ్య మే. కాదనకూడదు. కానీ ఆ సౌలభ్యం తమకవసరం లేదనేవారికి బలవంతంగా మెడలు వంచి మరీ దాన్ని సమకూర్చాల్సిన అగత్యమేముంది ?

పెళ్ళికి గుర్తింపు నిస్తుందని చెప్పబడుతున్న రాజ్యం (State) కూడా నిజానికి కుటుంబాల ద్వారా ఏర్పడినదే. అంటే కుటుంబాలన్నీ కలిసి రాజ్యాన్ని సృష్టించాయే తప్ప రాజ్యం కుటుం బాల్ని సృష్టించలేదు. కుటుంబవ్యవస్థ లేనప్పుడు కులాలూ లేవు, గోత్రాలూ లేవు. మతాలూ లేవు, రాజ్యాలూ లేవు. దేశాలూ లేవు, జాతీయతలూ లేవు. కుటుంబాల ద్వారానే ఇవన్నీ ఏర్పడుతున్నాయి. కుటుంబాల ద్వారానే తెలుసుకోబడుతున్నాయి. వాటిద్వారానే నిలబెట్ట బడుతున్నాయి కూడా. ఆ కుటుంబాలు అన్యోఽన్యాకృష్టులైన స్త్రీపురుష యుగ్మాల ద్వారా ఏర్పడుతున్నాయి. కనుక పెళ్ళి జరిగినా, జరక్కపోయినా కుటుంబాలేర్పడతాయి. కాబట్టి మనం అన్నిటికంటే ముందు కాపాడాల్సినది ఆ స్త్రీపురుష మిథునాల ప్రయోజనాల్నే. మనం వాస్తవంగా సమర్థించాల్సింది వారి మధ్య మోహాన్నీ, ఆకర్షణనే.

“మోహం ప్రేమ కాదు గదా!” అని ఆక్షేపణ లేవదీస్తే, ఇక్కడ అసలు విషయం చెప్పాల్సి వస్తుంది. యత్కించిత్ స్వార్థస్పర్శనీ ఎరుగని పరాప్రేమ లౌకిక, మానుషతలంలో అలభ్యం. ఈ రోజుల్లో అన్నిరకాల ప్రేమలూ ఏదో ఒక స్వార్థమూ, అహంకారమే ఆలంబనగా కలిగి నవి. ఆస్తీ–ఆదాయాల పై వ్యామోహం కన్నా శుద్ధ శృంగారపర మోహమే బహుశా ఎక్కువ అమలినం.

స్త్రీపురుషులలో పరస్పరవాంఛలు సహజం. అది మానవలక్షణం. ఈ వాస్తవాన్ని నిర్ణిబం ధంగా అంగీకరించే విషయంలో మన సమాజానికి ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది. దాన్ని చాలా ఘోరమైన తప్పుగా, కళంకంగా, అపవిత్రతగా భావించడాన, కామం గల పురుషులంతా కీచకులుగానూ, అటువంటి స్త్రీలంతా విలాసవతులుగానూ సద్యఃస్ఫురణ చేసుకోబడుతున్నారు. అయితే సాధారణ పురుషుల్లో లేని విచిత్రవస్తువేదీ కీచకుడిలో కూడా లేదు. అలాగే సంసారస్త్రీలలో లేని అపూర్వ లక్షణమేదీ విలాసవతిలోనూ లేదు. ఒకటినేమో



సంసారిగానూ, మరొకటిని విలాసవతిగానూ రూపుకట్టిస్తున్నవి వారివారి పరిస్థితులే. కానీ పైన చెప్పిన భావనల మూలాన, తమలో కామం లేనట్లు బహిరంగ భంగిమలివ్వడానికే అందరూ ఉత్సుకత చూపుతారు. ఆ భంగిమలు గొప్ప మర్యాదస్థుల లక్షణంగా, సభ్యతగా ప్రచారంలోకొస్తాయి.

అందుచేత కామం అనేది ఎక్కడో అరుదుగా నేరాలకి పాల్పడేవారిలోనే ఉన్నట్లూ, మిగతా సామాజికులంతా జితేంద్రియులైన ఋషులూ, ఋషికలూ ఐనట్లూ భంగిమలిస్తున్నారు. కొండొకచో సదరు భంగిమలు (poses) శ్రుతిమించి వివాహబంధ బాహ్యంగా కలిగిన బిడ్డల్ని సిబ్బితితో, సంఘభీతితో కడతేరుస్తున్నారు. లేదా అనాథలుగా వదిలేస్తున్నారు. అంటే తాము ఏదైతే తప్పనుకుంటున్నారో ఏకంగా దాని తాతల్లాంటి తప్పులే చేస్తున్నారన్నమాట. అలా అన్యాపదేశంగా ప్రోత్సహిస్తున్నది సమాజమే. పునాదుల్లాంటి మానవతాసూత్రాలు మరుగున పడి ఇంకేవేవో భావనలు మనుషుల నెత్తి మీద తాండవించసాగితే ఉప్పతిల్లే పరి ణామాలు ఇలాగే ఉంటాయని అర్థం చేసుకోవాలి.

ఆ భంగిమలు సరికావు. స్త్రీపురుషులంతా స్వభావసిద్ధంగా కామవంతులే. నిర్భరమైన ప్రేమ కొన్నిసార్లు దుర్భరమైన కామంలో పర్యవసించేందుకు ఆస్కారం లేకపోలేదు. అంత మాత్రాన అది ప్రేమ కాకుండా పోదు. అదే విధంగా దుర్భరమైన కామం కూడా నిర్భరమైన ప్రేమలో పర్యవసించవచ్చు. ఈ పౌర్వాపర్యం ఇలాగే జరుగుతుందని మునువల్కడం (fore saying) ఎవటికీ సాధ్యం కాదు. ఈ సత్యాన్ని గ్రహించి తదనుగుణంగా మన వ్యక్తిగత కౌటుంబిక, సామాజిక దృక్పథాల్ని సమూలంగా మార్చుకోవాల్సి ఉంది. కామమనే వాస్త వాన్ని బేషరతుగా అంగీకరించి, ఆమోదించాల్సి ఉంది. అది ఇతరుల్లో ఉన్నప్పుడు, దాన్ని వారు వారికిష్టమైన పద్ధతిలో తృప్తిపరచుకుంటున్నప్పుడు అది మనకి సంబంధించిన విష యం కాదనే వాస్తవాన్ని గ్రహించి అర్థం చేసుకోవాల్సి ఉంది. నిషేధాలనేవి వాస్తవంగా చేసే పని, ఓ పని జరక్కుండా చేయడం కాదు. జరిగేవాటిని బైటికి రాకుండా చేయడమే.

ఇష్టానిష్టాలనేవి వ్యక్తులకే ఉంటాయి. గుంపులకి కాదు. ఆమోదాలూ, తిరస్కరణలూ కూడా వ్యక్తులే చేయగలరు. కనుక కామానికి గుంపుల ఆమోదం అనేది ఒక అర్థం లేని విషయం. ఎందుకంటే గుంపుమధ్య ఉన్నప్పుడు ఎవరూ కామాన్ని ప్రదర్శించరు. పెద్దలు పెళ్ళిసంబం ధాల్ని కుదిర్చే సంప్రదాయం లేని సమాజాల్లోనూ, అలా కుదుర్చుకోవడం ఇష్టం లేని వ్యక్తుల

విషయంలోనూ స్త్రీపురుషులు ఒకటి కోసం ఒకఱు వివాహార్థం ప్రయత్నించడం (court-ship) తప్పనిసరి కూడా అవుతోంది. అది ప్రకృతివిరుద్ధం కాదు. కానీ దాన్ని విలాసినీత్వంగానో, ప్రేమోన్మాదంగానో, మానభంగప్రయత్నంగానో చిత్రించే ధోరణి ఇటీవల మన సమాజంలో పెచ్చు మీఱింది.

దురదృష్టవశాత్తూ, ఈ పని చేస్తున్నవారిలో హెచ్చుశాతం బాగా వయసు మళ్ళిన పెద్దలే. వారి వయసూ, లోకదర్శనమూ వారి శేముషీవైభవానికి ఏ మేలూ చేయకపోవడం విచారకరం. సమకాలీనంగా, ఒకటిని ఇష్టపడ్డందుకూ, ఆ ఇష్టాన్ని తెలియజేసినందుకూ కేసులు పెట్టి అరెస్టులు చేస్తున్నారు. అమాయక కౌమార ప్రేమికుల్లో కఱడుగట్టిన నేఱస్థుల్ని అభిదర్శిస్తున్నారు. ఇతరేతర కారణాలు చూపించి ఉభయసమ్మత శృంగార (consensual sex) కార్యకలాపాల్ని కూడా నేఱాలుగా నమోదుచేసే ధోరణి కూడా పెచ్చుఱిల్లుతోంది. మీడియా సైతం అసలువిషయాల్ని కప్పి పుచ్చి ఈ చర్యల్ని సమర్థిస్తోంది.

ఇదో రకం అనాలోచితత్వం, అనాగరికత. అసలు ఏ రకమైన స్త్రీపురుష ఆకర్షణనైనా మహాపాపంగా, ఉరితీయదగ్గ నేఱంగా భావించే స్థితికి మనవారు ఇలా దిగజాఱిపోవడమూ, శాస్త్రీయంగా ఆలోచించడం మానేసి రోజురోజుకీ మఱింత అస్తిగోపనవాదం (conserve-atism) లో కూరుకు పోవడానికే నిశ్చయించుకోవడమూ మిక్కిలి విచారకరం. మానవత్వాన్నీ, మానవతావాద సూత్రాలనూ గుఱించిన ప్రాథమిక అవగాహన మన సమాజంలో పూర్తిగా లోపించిందనడానికి ఇదంతా ఓ సూచిక.

**౧౨.బలమైన వ్యవస్థల స్థానే బలమైన వ్యక్తిత్వాలు రూపొందడానికి దోహదం చేయడం** : మానవ నాగరికతకి వ్యక్తీ, వ్యవస్థా, ఇద్దఱూ అవసరమే. కానీ వ్యవస్థ అవసరమైన దానికన్నా చాలా ఎక్కువ బలిసిపోవడమే మన కాలపు సమస్య. వ్యవస్థకీ, వ్యక్తికీ మధ్య అగాధమైన శక్తి–అసమతూకం (power imbalance) ఏర్పడింది. దీనివల్ల వ్యక్తికి అన్నివేళలా న్యాయం జఱగట్లేదు. మనం మళ్లీ పాతకాలపు రాజఱికాల్లోకి వెళ్ళి పోయిన అనుభూతి కలుగుతోంది. మూలాల్లోకి తొంగిచూసినప్పుడు వ్యవస్థలు కేవలం ఊహాజనితాలు. ఎందుకంటే అవి ఉన్నాయని అందఱూ అనుకుంటే అవి ఉన్నట్లు. లేకపోతే లేనట్లే. వాటిల్లో పనిచేసేవారిక్కూడా అవి ఉన్నాయో లేవో తెలీదు. కానీ ఉన్నాయనుకునే పనిచేస్తూంటారు–



జీతాలు అందుతున్నంత కాలం!

ఉదాహరణకి, ఓ బ్యాంకులో వేలాదికోట్ల డబ్బు మూలుగుతోందని జనం అనుకుంటారు. చిట్టా పుస్తకాల ప్రకారం అది నిజమే అయినా ఆ బ్యాంకువారు చాలామందికి ఇల్లడదార్ల (depositors) డబ్బుతో అప్పులివ్వడం వల్ల అక్కడ కొన్నివందల కోట్లకంటే ఎక్కువ ఉండదు. హఠాత్తుగా ఎవఱైనా ఆ బ్యాంకులో డబ్బులేదని ఓ తప్పుడు వదంతి పుట్టిస్తే ఇహ ఇల్లడదార్లంతా “మా డబ్బు, మా డబ్బు” అని ఆ బ్యాంకు మీదికి ఎగబడతారు. అందఱూ ఒకేసారి అలా ఎగబడితే బ్యాంకు నిజంగానే వారి ఇల్లడాల్ని (deposits) వెనువెంటనే తిరిగి చెల్లించజాలదు కనుక ఆ బ్యాంకు దివాలా తీసిన మాట వాస్తవమేనని సమాజం నమ్ముతుంది.

మనం ఏర్పఱచుకున్న వ్యవస్థలన్నీ ఇలాంటి బ్యాంకులే. ఏతద్విపర్యాసంగా, వ్యక్తి ఊహాజనితం కాదని గమనించాలి. అతని ఉనికి ఓ ఖరాఖండీ వాస్తవం. వ్యవస్థలు బలంగా ఉండాలని ఆకాంక్షించడం అంటే వాటి గుఱించిన ఊహలూ, నమ్మకాలూ బలంగా ఉండాలని కోరుకోవడమే. విడివ్యక్తి ఇంకా బలహీనుడూ, నిస్సహాయుడూ అవ్వాలని శపించడమే. వ్యవస్థని గుఱించిన ఊహలూ, నమ్మకాలూ బలోపేతం కావాలన్నా మళ్లీ వాటిని విడివ్యక్తుల్లో ఒక్కొక్కటికీ వేఱువేఱుగా నూఱిపోయాల్సిందే. ఎందుకంటే వ్యవస్థ అనేది వారి ద్వారా నిలబడాల్సినది. ఇదో ద్రావిడ ప్రాణాయామం. దీని బదులు నేరుగా వ్యక్తుల్నే బాగుచేయడం సులభతరం. ఎక్కువమంది పెట్టుకున్న ప్రత్యయానికి (conviction) భిన్నంగా ”బలమైన వ్యవస్థలుండడం అనేది సౌష్ఠవ (perfect) సమాజానికి భరోసా కా”దని చెప్పడానికి విచారిస్తున్నాను.

ఎందుకంటే, బలహీన వ్యవస్థలో ఏ నష్టాలైతే జఱుగుతాయని నాయకులూ, మేధావులూ ఉద్ఘోషిస్తున్నారో వాటిని స్వయంగా తాము బలమైన వ్యవస్థలోనే మనకు రుచిచూపిస్తున్నారు. ఉదాహరణకి, దేశం ముక్కలు కాకూడదనే అఖండవాదులే స్వహస్తాలతో దాన్ని చించి చిన్నచిన్న ముక్కలు చేస్తున్నారు. మఱి మనం దేని గుఱించి బెంగపెట్టుకోవాలి? కొన్నిసార్లు క్రూరవ్యవస్థల కంటే అసమర్థ వ్యవస్థలే సాపేక్షంగా మేల్తరం. ఎందుకంటే అవి సమాజాన్ని ఉద్ధరించలేకపోయినా విడివ్యక్తులకి ఉద్దేశపూర్వకంగా అపకారం చెయ్యవు.

అయినా మామూలుపౌరులతో సహా అంతా బలమైన వ్యవస్థలు కావాలని ఈ రోజుల్లో డిమాండు చేయడం వెనకున్నది అమాయకత్వమూ, అజ్ఞానమే తప్ప తదన్యం కాదు. దొంగలూ, కాపలాదార్లూ వేఱువేఱుగా ఉంటారనుకునే బాల్యావస్థని అధిగమించలేక చేసే డిమాండ్లివి.

## ౩. మనుషుల్ని ఎలా ఉన్నవారిని అలాగే స్వీకరించడం

నవ్యమానవతావాదం నిజానికి ఓ 'వాదం' (ism) కాదనీ, మనమంతా పుట్టుకతో ఏదైతే అయి ఉన్నామో అదే మానవత్వమనీ, దాన్ని గుఱించిన పరిజ్ఞానమే నవ్యమానవతావాదమనీ, క్రొత్తగా అలవాటు చేసుకోవాల్సిందేమీ లేదనీ ఈ కృత్యాదిలోనే వక్కాణించడం జఱిగింది. గమనిస్తే, లోకంలో చెలామణీ అవుతున్న వివిధ "ఇజాలు" మనుషుల్లో భారీ ఎత్తున మౌలిక పరివర్తనల (fundamental transformations) ని తేవడానికి ఉద్దేశించినవి. కానీ మానవతావాదం మాత్రం అలాంటిది కాదు. ఎందుకంటే మనమంతా పుట్టుకతోనే పరిశుద్ధులం. మనలో ఎక్కువమంది పునాదుల నుంచీ మారిపోవాల్సినది వాస్తవంగా ఏమీ లేదు. అందుచేత మానవతావాదం మనుషుల మనస్తత్త్వంలో గానీ, జీవనవిధానంలో గానీ ఏ విధమైన విప్లవాత్మకమైన మార్పుల్నీ డిమాండు చేయదు.

ఇతరేతర "ఇజాల"తో చిర పరిచితీ, ప్రవేశమూ గల మేధావులకి తొలివినికిలో ఈ పై ఉద్ఘాటన (statement) బహు విస్మయావహంగా భాసించవచ్చు. ఇదంతా నమ్మశక్యం కానిదిగా, భ్రాంతిగా, మసిపూసి మారేడుకాయ చేయడంలా కూడా తోచవచ్చు. *"మఱి ఇప్పటిదాకా ఇక్కడ ప్రపంచించిన మానవతాసూత్రాల సంగతేంటి? వాటి ఉద్దేశం మనుషుల్ని మౌలికంగా మార్చడం కాదా?"* అనే విచికిత్స కూడా వారిలో పొటమరించవచ్చు.

ఇక్కడ అసలు విషయం చెప్పాలి. ఇందులో అసత్యమూ, అతిశయోక్తీ ఏమీ లేవు. మన చుట్టూ అలుముకున్న అమానవీయ వాతావరణం ఓ వయసొచ్చేసరికి మనల్ని దురభిజ్ఞంగా[1] మార్చేస్తోంది. మనం సరిగా ఉండాలంటే మనకి నిజంగానే ఆకస్మిక, మౌలిక, విప్లవాత్మక, మూకుమ్మడి సంస్కరణలు అవసరమేమోనని భ్రాంతి చెందే విధంగా మార్చేసోంది. కానీ ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి. బాల్యంలో మనమెలా ఉన్నాం? ఇప్పుడెలా ఉన్నాం? అప్పటికీ ఇప్పటికీ మధ్య మన నీతిలో, నడవడికలో ఎంత మార్పొచ్చింది? ఆ మార్పుకి కారణమెవఱు? అది నిజంగా క్రమ్మఱించరాని (irreversible) అనివర్తనీయమైన మార్పేనా? అని!



బాల్యం నుంచి వయోజనత్వం (adulthood) లోకి ఎదిగే క్రమంలో కొన్ని పద్ధతులూ, మర్యాదలూ మాత్రం నేర్చుకుని బాహ్యంగా ఉపరితలంలో మనల్ని మనం సమాజానికి ఆమోదయోగ్యులుగా చేసుకుంటున్నాం. మన బాల్యకాలపు టామోదయోగ్యతతో పోలిస్తే ఇది ఓ మిథ్యా ఆమోద యోగ్యత (psuedo acceptability) మాత్రమే. ఎందుకంటే అప్పట్లో మనం ఆమోదయోగ్యంగా జీవించాం. ఇప్పుడేమో ఆమోదయోగ్యులుగా నటిస్తున్నాం. సమాజానికి మనం అర్థం కావాలనే ఉద్దేశంతో దాన్నుంచి అనేకానేకం అభ్యసించాం– వాస్తవంగా వేఱెవఱి కోసమో ఉద్దేశించబడినవీ, మనకి వ్యక్తిగతంగా పూర్తిగా అన్వయించనివీ అయిన అనవసరపు వంకర టింకరలు.

కాసేపు ఆ సామాజిక ముసుగులన్నీ తీసేసి చూసుకుందాం. మనల్ని మనం సంఘదృష్టితో ధర్మించుకునే చిరాభ్యస్త యత్నాన్నుంచి కొద్దిసేపు విరమించి చూసుకుందాం. మనం స్వచ్ఛంగానే ఉన్నాం. మంచిగానే ఉన్నాం. మనలోని మానవీయ మూర్తి ఇప్పటికీ బలంగా, ఆరోగ్యంగా, యౌవన తేజస్సుతో బాలభానుడిలా అఖండంగా ప్రకాశిస్తూనే ఉంది. అది అలా ప్రకాశించాలంటే మనం మనలా ఉంటే చాలు. రకరకాల ఇజాలూ, ఫిలాసఫీలూ, సిద్ధాంతాల్లాంటి బైటి ఊతకఱ్ఱలు (crutches) అక్కర్లేదు.

"అలాంటప్పుడు మానవతావాదం క్రొత్తగా చెప్పేదేముంది?" అని అడిగితే, మన ఆలోచనల్లోనూ, ప్రవర్తనలోనూ మధ్యలో అస్పృహంగా, అసంకల్పితంగా వచ్చేసి చొఱబడి ప్రోగుపడ్డ అన్ని హింసాత్మక, పరాక్రామక ప్రేరణల్నీ, అభివ్యక్తుల్నీ (violent and aggressive drives and expressions) ఒక్కొక్కటిగా వెతికి వేటాడి వదిలించుకోమనే! ఇందుకోసం

[1] గుర్తుపట్టడానికి వీల్లేని విధంగా...

మనం బలవంతంగా విప్లవాత్మకంగా మారిపోవాల్సిందీ, జీవితంలో వదులుకోవాల్సిందీ ఏమీ లేదు.

**మనుషుల్ని ఎలా ఉన్నవారిని అలాగే ఎందుకు స్వీకరించాలి? ఎలా స్వీకరించగలం?**

"మనుషుల్ని ఇహనైనా ప్రేమించాలి, ఇకముందు ద్వేషించకూడదు" అనే అభిప్రాయం మనలో కలిగితే ఇది అసాధ్యం కాదు. మనుషుల్లోని ప్రేరణలు — వాటి మూలాల్లోకి తొంగిచూస్తే అవన్నీ సహజమైనవే, ఆమోదయోగ్యమైనవే. వాటిల్లో ఖండించాల్సినదేమీ కనపడదు. కానీ సాధారణంగా ఏం జఋగుతుందంటే– ఒకే ప్రేరణని పదిమంది మనుషులు పదిరకాలుగా అమల్లో పెడతారు. ఉదాహరణకి– సుఖంగా జీవించాలనే కోరిక ఉంది. ఒకడు ఆ కోరికతో వ్యాపారం మొదలుపెడతాడు. ఇంకొకడు అదే కోరికతో దొంగతనానికి వెళతాడు. మఱొకడు అదే కోరికతో కర్తవ్యాన్ని నిర్లక్ష్యం చేస్తాడు. వేఱొకడు అదే కోరికతో వ్యభిచరిస్తాడు. ఈ సందర్భంగా మానవతావాదం చెప్పేది ఏంటంటే– ఓ ప్రేరణ చేత ప్రేరితులై జనం ఏం చేస్తున్నారు? వాటి పర్యవసానాలేంటి? అనే ప్రాతిపదికన ఆ ప్రేరణని నిందించడం సరికాదు. అలాగే ఆ ప్రేరణని కలిగున్నందుకు మనుషుల్ని ద్వేషించడం కూడా సరికాదు. సదరు ప్రేరణని అమలుచేసేటప్పుడు అందులో హింస (తనని గానీ ఇతరుల్ని గానీ బాధించడం) చొఱబడకుండా చూసుకోవాలి. అలా జాగ్రత్తపడమని సలహా ఇవ్వాలి.

అంటే సహజప్రేరణలకి ఓ సవ్యమైన వాహినీకరణా, ఉన్నతీకరణా (positive channelization and sublimation) కల్పించగలిగితే వాటినీ, వాటిని కలిగున్నవారినీ నిందించే పనుండదు. అప్పుడు మనుషుల్ని ఎలా ఉన్నవారిని అలాగే స్వీకరించడం సమాజానికి సులభమవుతుంది. ఇది సమాజ విషయం. కానీ ఒకవేళ ఒకటి వ్యక్తిగత ప్రేరణలు అలాంటి దానికి నోచుకోకపోయినా, వారిని ప్రేమించాలంటే నిజమైన నవ్యమానవతావాదులకి వ్యక్తిగతంగా అదో పెద్ద ఆటంకం కాదు.

మనుషుల్ని ఎలా ఉన్నవారిని అలాగే స్వీకరించడం ఎందుకంటే– పూర్వజన్మలూ, కర్మఫలాలూ గట్రా కాసేపు ప్రక్కన పెడితే– ఎవఱూ తామున్న స్థితికి తామే పూర్తిగా బాధ్యులు కారు. వారి వశంలో లేని విషయాలకి వారిని నిందించడమూ, దూరంగా పెట్టడమూ తార్కికం కావు.



## 4. అతిసౌష్ఠవవాదానికి (Over-perfectionism) దూరంగా ఉండడం

నాగరికత మునుముందుకు సాగిపోయే కొద్దీ, లేదా చరిత్రగతిలో కొంగ్రొత్త అనుభవాలకీ, ప్రమాణాలకీ తమ మనసులు వెలారే (expose అయ్యే) కొద్దీ మనుషుల్లో వివిధ విషయాల ఎడ అవగాహన హెచ్చుతుంది. వారి కొలమానాలు పదునెక్కుతాయి. "ఇది ఇలా ఉండాలి. అది అలా ఉండాలి" అనే ఆశంసలు (expectations) మిన్నంటుతాయి. అవి మనుషుల గుఱించి కూడా ఏర్పడతాయి. "ఆడదంటే ఇలా. మగవాడంటే అలా. ఉపాధ్యాయుడంటే ఇలా. పరిపాలకుడంటే అలా." ఇదీ ధోరణి. ఒకవేళ అలా లేకపోతే, లేదా ఆ ఆశంసలకి కాస్త భిన్నంగా జఱిగితే ఆయా వ్యక్తుల పట్ల తీవ్రమైన నిరసనా, చిన్నచూపూ, ద్వేషమూ కూడా దరికొంటాయి.

ఈ మనోవికారాలు మనం ఏర్పఱచుకున్న ప్రాంశిష్ఠ ప్రమాణాల (highest standards) వల్లనే తప్ప నిజంగా అవతలివారిలో ఏదో లోపం ఉండడం వల్ల కాదని గమనించే రోజు రావాలి. అంటే ప్రమాణాలు పెట్టుకోవడం తప్పని కాదు. అసలు ప్రమాణాలనేవే అత్యంత చంచలం (transient) అని గ్రహించలేకపోవడం తప్పు. నిర్జీవమైన వాటి ఆధారంతో సజీవులైన మనుషుల్ని ధర్మించ బూనుకోవడం (judge చేయ బూనుకోవడం) తప్పు. ఎందుకంటే ప్రమాణాలనేవి తరం తరం మారిపోతూనే ఉంటాయి. మనం ఏర్పఱచుకున్న ప్రమాణాలు మన మనస్తత్త్వం గుఱించే చెబుతాయి తప్ప ఇతరుల గుఱించి ఏమీ చెప్పజాలవు.

మనం అత్యున్నత ప్రమాణాలుగా భావించేవి బహుశా ఇతరులకి అలా కాకపోవచ్చు. అవి మనం అనుకుంటున్నట్లు సర్వసమగ్రం కూడా కాకపోవచ్చు. ఉదాహరణకి, పూర్వం తెలుగు దేశంలో వరుడికి మంచి ఆకలీ, భోజనపుష్టీ, జీర్ణశక్తీ ఉండడాన్ని మగతనానికి సూచనగా ఆరోగ్యలక్షణంగా, పిల్లనివ్వడానికి అద్భుతమైన యోగ్యతగా భావించేవారు. అతనెంత తినగలడో ప్రత్యక్షంగా పరీక్షించడానికి పెళ్ళికి ముందే పూనుకునే మామలు కూడా ఉండేవారు. ఆనాడు "అత్యున్నత ప్రమాణం" అనుకున్న ఆ దూబరదిండితనం ఈనాడు వికృతమైన అవ

లక్షణం క్రిందే లెక్క. కారణం– వరుడికుండాల్సిన లక్షణాల విషయంలో మన పరిజ్ఞానం ఇదివఱకటి మీద పురోగమించడమే.

అత్యున్నత ప్రమాణాలు పెట్టుకున్నవారు తఱచూ చేసే పొఱపాటు ఏంటంటే ఎక్కడో ఎవఱో ఓ సందర్భంలో ఒకలా ఉన్నారని చెప్పి, దాన్నో గొప్ప హీరోయిజమ్ గా భావిస్తూ "అందఱూ అలాగే ఉండా"లని డిమాండు చేయడం, బలవంతపెట్టడం. ఉదాహరణకి– ఒకసారి ఎక్కడో ఓ రైలుప్రమాదం జఱిగిందని ఆ శాఖామంత్రిగా ఉన్నాయన లోలోపల తీవ్రమైన ఆత్మనిందాభావానికి లోనై రాజీనామా చేస్తే, అది నీతి–నిజాయితీలకి నిఖార్సైన ప్రమాణంగా తీసుకున్న ప్రజలు అలాంటి ప్రమాదాలు జఱిగిన ప్రతిసారీ ఆ సంబంధిత శాఖవారిని పదవీ త్యాగం చేయమంటూ డిమాండు చేయడం జఱుగుతోంది. అంతే తప్ప "ప్రతిదానికీ ప్రతివారూ రాజీనామా చేసేసి వదిలిపెట్టి పోతూంటే ఆయా శాఖల్ని పరిపాలించేదెవరు? పాలన విధానాలకీ, పథకాలకీ ఏకసూత్రకమైన కొనసాగింపు ఎలా?" అన్న ఇంగితజ్ఞానం లోపించింది.

అలాగే, మన దేశంలో ఎవఱో ఒక పురాణస్త్రీని ఆదర్శంగా తీసుకుని కోట్లాదిమంది సాధారణ స్త్రీలని ఆ ప్రమాణాలకి ఒదిగి (conform అయి) ప్రవర్తించమంటూ మానసిక ఒత్తిడి పెట్టడం సర్వసాధారణం. దీని వల్ల మన భాషలో కూడా "కులట, పతివ్రత" అనే ఉత్తర–దక్షిణ ధ్రువాల వంటి రెండు ఆత్యంతిక స్థితుల (extreme conditions) ని సూచించే పదాలే తప్ప ఆ రెండూ కాని సాధారణ స్త్రీలని సూచించే పదం ఒక్కటీ లేకుండా పోయింది. కేవలం ఈ రెండుపదాల నిర్వచనాల్లోంచే యావత్తు స్త్రీజాతినీ అర్థం చేసుకోవడం అసాధ్యం. అలాంటి మధ్యస్థ స్థితి కూడా ఒకటుంటుందనే విషయమే మనవారి ఊహకి అందని విధంగా, వారు ఒప్పుకోలేని విధంగా మన అవగాహనాస్థాయిని క్షీణింపజేశాయి మన అతిసౌష్ఠవ వాదాలూ, అత్యున్నత ప్రమాణాలూ, ఆశింపులూ! కానీ సృష్టిలో చీకటి–వెలుగులు మాత్రమే కాదు, నీడలూ, సంధ్యలూ కూడా ఉన్నాయి.

అతిసౌష్ఠవ వాదానికి గల ఓ చెడ్డ పార్శ్వంగా, చెడ్డ పర్యవసానంగా ఆత్యంతిక ముద్రాంకణ (extreme branding) కూడా ఉంది. స్త్రీలొక్కఱే కాదు, మిగతా అందఱి విషయంలో కూడా ఏదో ఒక ఆత్యంతిక ముద్రాంకణ చెయ్యకపోతే మనకి మనుషులు అర్థం కాని పరిస్థితి. నిజానికది అపార్థం చేసుకోవడమే తప్ప అర్థం చేసుకోవడం అవ్వదు. ఉదాహరణకి–



మానభంగానికి పాల్పడ్డవాణ్ణి Rapist అంటున్నారు. వాస్తవానికి ist అనే గ్రీకు ప్రత్యయంతో అంతమయ్యే ఇతర ఆంగ్లపదాలు ఓ వృత్తినో అలవాటునో సూచిస్తాయి, dentist, artist, stylist లాగా! అదే విధంగా Rapist అన్నప్పుడు మానభంగాలే వృత్తిగా, అలవాటుగా గలవాడనే అర్థం ధ్వనిస్తుంది. కానీ మానభంగానికి పాల్పడ్డ ప్రతి ఒక్కఱికీ అది వృత్తిగానీ, అలవాటు గానీ కాకపోవచ్చు. కొందఱు నేఱస్థుల విషయంలో– వారి బాధితురాళ్ళలాగే వారి జీవితాలక్కూడా ఆ సంఘటన ఓ తాత్కాలిక జంగమ దశ (passing phase) మాత్రమే కావచ్చు. కాబట్టి Rapist అనే పదప్రయోగం వాస్తవంగా ఓ అతిశయ వాడుక (hyperbolic usage) అని చెప్పాల్సి వస్తుంది. కానీ ఎప్పుడూ మానభంగం చేయని నిర్దోషీ, అదే వ్యాపకంగా గల దోషీ మినహా మన నిఘంటువుల్లో మధ్యస్థులెవఱూ లేరు.

మనుషుల్ని యథాతథంగా అర్థం చేసుకోవడానికి అతిసౌష్ఠవవాదం (over–perfectionism) ఉపకరించదు సరి కదా, ఇనుప తెఱలా అడ్డుపడుతుంది కూడా! మనం రోజూ చూసే మామూలు మనుషుల్ని మనం ఎప్పుడూ చూడని మహా మనీషులతో పోల్చి కించపఱచడం అతిసౌష్ఠవ వాదానికి గల ప్రధాన లక్షణం. ఎందుకంటే "అతిసౌష్ఠవులూ, అత్యున్నతులూ, ఆదర్శప్రాయులూ" అని ప్రస్తుతించబడే అపరిచిత వ్యక్తులంతా అరుదైనవారు. వారు అలా అవ్వాలని కోరుకుని అయినవారు కారు. వారు ఏ పరిస్థితుల్లో ఎలాంటి మనుషుల మధ్య అలా అయ్యారో వాటిని ఇప్పుడు యథాతథంగా పునస్ సృజించడం అసంభవం. కానీ వారిని ఆదర్శంగా భావించేవారు మాత్రం వారిలా అవ్వాలని తమని తాము కష్టపెట్టుకుంటారు. లేదా ఇతరుల్ని కష్టపెడతారు.

అదీ గాక ఇంతకు ముందే చెప్పుకున్నట్లు మానవజాతిలో ప్రతి ఒక్క వ్యక్తీ ఓ క్రొత్త సృష్టే. ఎవఱికి వారే విలక్షణం (unique). ప్రపంచంలో ఎవఱినీ ఇతరులతో పూర్తిగా పోల్చలేము. ఆదర్శమూర్తులనేవి మార్గపటాల (road maps) వంటివే. కానీ  పటాల మీద గెంతి గమ్యం చేరలేం కదా! వాస్తవికమైన మార్గంలోనే వెళ్ళాలి. ఎవఱి వాహనంలో వారు వెళ్లాలి. ఎవఱికి శక్యమైన వేగంతో వారు వెళ్ళాలి.

అతిసౌష్ఠవవాదంలో ఇమిడున్న మఱో తభావతు– అందఱికీ ఒకే ప్రమాణాల్ని అనువర్తించే ప్రయత్నం. ప్రపంచానికంతా కలిపి ఒకే దేవుడూ, దేశానికంతా కలిపి ఒకే నాయకుడూ

అన్నట్లు మానవాళికంతా కలిపి ఒకే విధమైన అత్యున్నత ప్రమాణాలున్నాయని సౌష్ఠవవాదులు అస్పృహం (unconscious) గా విశ్వసిస్తారు. ఆ సందర్భంగా వారు విస్మరించే విషయం ఏమంటే– అవి ఉన్నంతమాత్రాన చాలదు, వాటితో అవసరమున్నట్లు అనుభూతి లేవారు కూడా కావాలనేది. "మాకవి అక్కర్లేదు మొర్రో" అనేవారందరికీ వాటి ననువర్తించి ఆ సులోచనాల్లోంచే వారిని పరికిస్తూ "పతితులూ, భ్రష్టులూ" అని యథేచ్ఛగా ధర్మించడం (judging) సరికాదు. వారివారి అవగాహననీ, శక్తియుక్తుల్నీ, అంతకంటే ముఖ్యంగా వారి పరిస్థితుల్ని బట్టే ప్రమాణాల్ని అనువర్తించాలి. ఉదాహరణకి– ఇల్లంతా ఏ.సి. ఉండడం మన దృష్టిలో అత్యున్నత జీవనప్రమాణం కావచ్చు. కానీ ఉబ్బసం (asthma) తో బాధపడే వారికి అదే ప్రత్యక్ష నరకం కదా!

అయితే వైద్య, సైనికాది రంగాల్లో ఉన్నత ప్రమాణాల అన్వేషణని విమర్శించడం ఈ గ్రంథ భాగపు టుద్దేశం కాదని గమనిక.

## 5. ఇతరుల్ని వారి దృష్టిలోంచే అర్థం చేసుకోవడం

తమని తమ పేరుతో కాకుండా ఇంకేదో పేరుతో పిలిస్తే ఎవరికైనా కోపమొస్తుంది. అలాగే తమని తమలా కాక మరోలా అర్థం చేసుకుంటే మనుషులకి కోపం వచ్చినా రాకపోయినా బాధ మాత్రం కలిగి తీరుతుంది. "నిన్ను ఇతరులు అపార్థం చేసుకున్నారంటే అందులో నీ పాత్ర కూడా ఎంతో కొంత ఉండకపోదు" అని చెప్పేవారున్నారు. ఇది కొంత వరకూ నిజమే కానీ అన్నివేళలా కాకపోవచ్చు. ఎంత సమాజ మూసలో ఒదిగి (conform అయి) బ్రతుకుదామనుకున్నా మనుషులు తమలా తాము కాక మరోలా ప్రవర్తించలేరు. ఆ క్రమంలో వారు అపార్థం చేసుకోబడే సందర్భాలు కొన్ని ఎదురుకావచ్చు.

మనుషులనే కాదు, లోకంలో దేన్నయినా దాని దృష్టితో అర్థం చేసుకుంటే తప్ప అది అర్థం కాదు. ఒకటి ఒకలా ఉండాలని ఆశించినంత కాలం మనకి జ్ఞానం కలగదు. మన ఆశింపుల్ని ప్రక్కన బెట్టి ఏది ఎలా ఉందో దాన్ని అలాగే తీసుకోవడం ద్వారా మాత్రమే మనకి దాన్ని గురించిన జ్ఞానం కలుగుతుంది. ఒకటి ఒకలా ఉండాలని ఆశించడంలో వ్యక్తిగత రాగద్వేషాలూ, భావోద్వేగాలూ, మనం కర్తలమనే భావనా చొరబడతాయి. "మనకి ఏ



సంబంధమూ లేదు. మనం పరిశీలకులం మాత్రమే" అనుకుని గమనిస్తేనే మనకి వస్తు తత్త్వమూ, వ్యక్తుల తత్త్వమూ బోధపడతాయి.

చంద్రబింబానికి మల్లే మనుషుల వ్యక్తిత్వాల్లో మనకి కేవలం ఒక పార్శ్వమే దర్శనమిస్తుంది. రెండో పార్శ్వం మాత్రం ఎల్లప్పుడూ దుర్దర్శంగానే మిగిలిపోతుంది. అత్యంత సన్నిహితుల విషయంలో కూడా ఇది నిజం. అయితే ఆ రెండో పార్శ్వాన్ని కూడా ఎంతో కొంత తెలుసుకోకుండా మనం మనుషుల్ని సమగ్రంగా అర్థం చేసుకోలేం. మనుషుల విలువల వ్యవస్థా, వారి కొలమానాలూ పూర్తిగా సంఘాన్ననుసరించే ఉంటాయనీ, ఉండాలనీ మనం అవశం (involuntary) గా ఆశిస్తూ వారిని సమీపిస్తాం. కానీ వారు ప్రతి విషయంలోనూ సంఘానుయాయులు కాకపోవచ్చు. ఆ కొద్ది విషయాల్లో వారి స్వంత (వ్యక్తిగత) ప్రమాణాలు వారికి ఉండొచ్చు. అది అర్థం కాకపోతే సంఘాని కంటే కాస్త విభిన్నంగా ఉన్నందుకు వారు మన దృష్టిలో దైవద్రోహులే అయిపోతారు.

అందుచేత వ్యక్తుల్ని సమష్టి కొలమానాలతో కాకుండా వారి వారి అవసరాలకీ, శక్తిసామర్థ్యాలకీ సరిపడే తమ కొలమానాలతోనే ధర్మించాలి. ఉదాహరణకి, ఒకడు బ్రతకడానికి సారా అమ్ముకోవడం తప్ప మార్గాంతరం లేనప్పుడు కనీసం కల్తీ సారా అమ్మకుండా నీతి పాటిస్తున్నందుకు అతన్ని అభినందించాలి. ధర్మవ్యాధుడి వృత్తాంతం[1] ద్వారా నేర్చుకోవాల్సింది బహుశా ఇలాంటిదే.

## 6. ప్రేమ-గౌరవాలతో జమిలి సంభావన

మనం లోకంలో మెలగే వ్యక్తుల్లో సాధారణంగా రెండు రకాలవారుంటారు. ఒకటి– మనం ప్రేమించేవారు. రెండోది– మనం గౌరవించేవారు. ఈ తెలుగు మన్నింపు (treatment) లోని లోపమేమంటంటే, మనం ఎవరినైతే ప్రేమిస్తామో వారిని గౌరవించం. అలాగే, ఎవరిని గౌరవిస్తామో వారిని ప్రేమించం. ఈ పద్ధతి పోవాలి. ప్రేమించబడే ప్రతివ్యక్తికీ గౌరవాన్ని కూడా ఇవ్వాలి. అలాగే, గౌరవించబడే ప్రతి వ్యక్తికీ ప్రేమని కూడా అందించాలి. రెండూ మనిషికి అవసరమే. అయినా కొన్నిసార్లు

[1] ఆంధ్ర మహాభారతం–అరణ్యపర్వం.

గౌరవం కంటే ప్రేమదే అగ్రాసనం. ఎందుకంటే గౌరవం శిరసావహించగా, ప్రేమ అర్థం చేసుకుంటుంది. గౌరవాలన్నీ సాధారణంగా ప్రశంసాభావం (admiration) లోంచి ఉద్భవిస్తాయి. కానీ దురదృష్టవశాత్తూ ప్రశంసాభావం అనేది ఓ క్షణిక భావోద్వేగమే తప్ప ఇంకేమీ కాదు. అంటే గౌరవం వద్దని కాదు. మనకి ఎవతి గుతించైతే ఎక్కువ తెలీదో వారి పట్ల అపచారాలకి ఒడిగట్టకుండా గౌరవభావన మనల్ని కాపాడుతుంది. తమకి ఎవతైతే గౌరవనీయులో వారిని ప్రేమతో అర్థం చేసుకోను యత్నించని వారు ఏ చిన్న కారణం/ సంఘటన మూలంగా నైనా ఆ ప్రశంసాభావాన్నీ, దాన్తో పాటే ఏర్పడిన గౌరవాన్ని కోల్పోవచ్చు. కానీ అటువంటి సందర్భాల్లో సైతం ప్రేమవంతులు గౌరవనీయుల పట్ల తమ గౌరవాన్ని అక్షతం (intact) గా నిలబెట్టుకుంటారు.

మనుషులు సాధారణంగా అవతలివారి అభిప్రాయాల్ని బట్టి వారిని ప్రేమించడమో ద్వేషించడమో చేస్తూంటారు. అంటే, వారి అభిప్రాయాలు తమవాటితో సంవదిస్తే ప్రేమించడం, లేకపోతే ద్వేషించడం- ఇదీ ధోరణి. ఈ ధోరణిని జనసామాన్యం చాలా సహజమన్నట్లు చాలా మామూలుగా తీసుకుంటుంది. కానీ నవ్యమానవతావాదులు అలా చూడరు. మనిషికీ, మనిషికీ మధ్య ఉన్న సంబంధం వారి అభిప్రాయాల కంటే పవిత్రమైనది. మనుషులు తమ అభిప్రాయాల కంటే గొప్పవాళ్ళు. అభిప్రాయాలనేవి- అవి లిఖితపూర్వకం కావచ్చు, కాకపోవచ్చు. అవి మనసులో పెట్టుకున్నవి కావచ్చు. ఆంతరంగికులకు వెల్లడించినవి కావచ్చు. లేదా ఓ బహిరంగసభలోనో, మాధ్యమం ద్వారానో వ్యక్తీకరించినవీ కావచ్చు. ఎలా అయినా గానీ, అవన్నీ క్షణికమే. పరిస్థితుల్ని బట్టి మారిపోయేవే. వాటిని బట్టి మనుషుల్ని ప్రేమించడమో, ద్వేషించడమో చేయడం చాలా తప్పు. ఈ తప్పుని అన్ని రాజకీయ పక్షాలూ వివిక్త ప్రసారమాధ్యమాలూ (private media) బాహాటంగా ప్రోత్సహిస్తున్నాయి సాక్షాత్తూ ప్రభుత్వాలే స్వయంగా దీనికి పాల్పడుతున్నాయి.

అభిప్రాయాల్ని అభిప్రాయాలుగా, వ్యక్తుల్ని వ్యక్తులుగా చూసే మేధానాణ్యత మనలో పెంపొందాల్సి ఉంది. వ్యక్తుల్ని మూర్తీభవించిన అభిప్రాయాలుగా చూడడం, ఆ భ్రాంతిలో అభిప్రాయాల మీద అభిప్రాయాలతో కాకుండా, వ్యక్తుల మీద వ్యక్తిగతంగా దాడిచేయడం, చేయించడం, ఆ రకంగా శాశ్వతంగా మానవసంబంధాల్ని దెబ్బదీసుకోవడం— ఇలాంటి కుసంస్కారాలు పోవాలి. ఇద్దఱు వ్యక్తులకు ఒక విషయం గుఱించి పరస్పర విరుద్ధమైన



అభిప్రాయాలు ఉండొచ్చు. అదే సమయంలో వారు మంచిమిత్రులుగా కూడా ఉండొచ్చు. ఆ మాటకొస్తే అన్ని విషయాల మీదా అచ్చుమచ్చు ఒకే విధమైన అభిప్రాయాలు గల ఇద్దఱు వ్యక్తులు ప్రపంచంలో మనకెక్కడా తారసపడరు. ఒకవేళ అటువంటివారెవఱైనా ఉంటే వారిలో ఒకఱు అనవసరం. శత్రువుల సంగతలా ఉంచి, మన మిత్రులతో, ఆఖరికి జీవిత భాగస్వామితో కూడా అన్ని విషయాల్లోనూ ఏకీభావం కుదఱదు. మఱి వీరందఱినీ అనునిత్యం భరిస్తూనే ఉన్నాం గదా? అలా భరించడానికీ, ప్రేమించడానికీ గల అసలు కారణం వీరిని మనం ధర్మించకపోవడమే (judge చేయకపోవడమే). అదే ధోరణి అన్ని సందర్భాల్లోనూ పెంపొందాల్సి ఉంది.

మనుషులు పుట్టినప్పుడు ప్రేమస్వరూపులుగానే పుడతారు. శైశవంలో తమ చుట్టూ ఉన్న ప్రతిదాన్నీ ప్రేమిస్తారు. కానీ పెఱిగి పెద్దయ్యే క్రమంలో ఆ ప్రేమ స్థానే కారణం తెలీని ద్వేష మొచ్చి కూర్చుంటుంది. దేన్ని/ఎవర్ని ద్వేషిద్దామా? అని చూస్తూంటారు. ద్వేషించడానికి ఏమీ లేకపోయినా అందుక్కారణాలు వెతుక్కుంటూ ఉంటారు.  మనిషికీ, మనిషికీ మధ్య సహజంగా ఉండే చిన్నపాటి తేడాలు అలాంటి వెతుకులాటకు అక్కఱకొస్తాయి. కానీ మనుషుల మధ్య బైటికి కొట్టొచ్చినట్టు కనిపించే తేడాలన్నీ కేవలం ఉపరితలీనమూ (superficial), బలహీనమూను. చూడగలిగితే, వారందర్లోనూ అంతర్వాహినులుగా ఉన్న పోలికలే అత్యంత బలీయం. అందఱూ బాహ్య భేదాల్నే ఎత్తిచూపుతారు. కానీ కనీసం కొన్ని పోలికల్ని ఉద్ద్యోతించడం (highlighting) నేర్చుకుంటే ఈ ద్వేషలోకం కాస్తయినా ప్రేమలోకంగా మారడానికి అవకాశముంటుంది.

ప్రేమించే స్వభావం కొందఱిలో స్వతహాగానే ఉంటుంది. అది చాలా ప్రశంసనీయం. కానీ అలాంటివారు కూడా చాలా తఱచుగా ఓ పొఱపాటు చేస్తారు. అదేంటంటే- తాము ఇతరుల్ని ఎలా ప్రేమిస్తున్నారో వారు కూడా తమను అలాగే ప్రేమిస్తారని భావించడం. లేదా అలా ప్రేమించాలని ఆశించడం. ఇది నెఱవేఱే ఆశంస కాదని చెప్పడానికి విచారిస్తున్నాను. మనం ఇతరుల్ని ప్రేమించేది- వారి ప్రేమని మళ్ళీ అంత స్థాయిలో పొందడానికి్కాదు. ప్రేమించడమే మన అపర స్వభావం కాబట్టి ప్రేమించాలి, అంతే! తిరిగి ప్రేమని పొందలేకపోయినా అదో పెద్ద విషయం కాదు. ఎందుకంటే, ఆపమిత్యక ప్రేమ (reciprocal love) వాణిజ్య నిర్విశేషమే. నిఃస్వార్థంగా ప్రేమించడం ద్వారానే మనసు పరిశుద్ధమౌతుంది. అది ఎంతగా పరి

శుద్ధమైతే అంతగా ఆనందం కలుగుతుంది. మనకి వాస్తవంగా కావాల్సింది అదే.

**నవ్యమానవతావాదులు బోధించే ప్రేమ** కాస్త భిన్నమైనది. అది నిర్నిబంధమైన మానవప్రేమ (unconditional love of humanity). తోటి మనుషుల నుంచి దృశ్యమానంగా గానీ అదృశ్యమానంగా గానీ ఏమీ డిమాండు చేయకుండా వారికి సహాయమూ, ఉపకారమూ చేసే ప్రేమ. లోకంలో మనుషులు సాటి మనుషుల్ని ప్రేమించడానికి వారి నుంచి కొన్ని కనీస ప్రాజ్ నిర్ణీత యోగ్యతా ప్రమాణాల్ని (fixed minimum qualifying standards) ఆశించడం కద్దు. ఇలాంటిది పెళ్ళి సంబంధాల్లోనూ, ఉద్యోగాల్లోనూ తప్ప మిగతా జీవన తలంలో పూర్తి అనావశ్యకం. ఊహ తెలిసినప్పట్నుంచీ మనకి తెలియకుండానే మన మనసు అవతలివారిని అడుగడుగునా ధర్మిస్తూ అంచనాకడుతూ "మన అభిమానానికి వారెంతవఱకూ పాత్రులా?" అని పరిశీలిస్తూ ఉంటుంది. ఈ తత్త్వం ఉన్నంతకాలం మనం మనుషుల్ని సరిగా ప్రేమించలేం. (అసలు ఎవర్నీ ప్రేమించలేం) నవ్యమానవతావాదుల ప్రేమకి అవతలివారి అర్హతలతో నిమిత్తం లేదు.

## 7. నిర్జీవ వస్తువుల్నీ, విషయాల్నీ, అసమక్ష వ్యక్తుల్నీ కాక సజీవులైన, సమక్షంలో ఉన్న మనుషుల్ని ప్రేమించడం

లోకం పూర్తిగా ప్రేమరహితమని చెప్పడానికి లేదు. అందఱూ ఇప్పటికీ అంతర్గతంగా ప్రేమస్వరూపులే. ఎందుకంటే- పరిశీలించినప్పుడు ప్రతి ఒక్కఱూ ఏదో ఒకదాన్ని ప్రేమిస్తున్నట్లే కనిపిస్తుంది. డబ్బునీ, ఆస్తుల్నీ ప్రేమించేవారు కొందఱు. పేరుప్రఖ్యాతుల్ని ప్రేమించేవారు కొందఱు. పదవిని ప్రేమించేవారు కొందఱు. భోజనాన్ని ప్రేమించేబారు కొందఱు. వ్యసనాల్ని ప్రేమించేవారు కొందఱు. పనిని ప్రేమించేవారు కొందఱు. వృత్తిని ప్రేమించేవారు కొందఱు. వస్తువుల్ని ప్రేమించేవారు కొందఱు. సబ్జెక్టుని ప్రేమించేవారు కొందఱు. కళల్ని ప్రేమించేవారు కొందఱు. ప్రయాణాల్ని ప్రేమించేవారు కొందఱు. మతాన్ని ప్రేమించేవారు కొందఱు. మతగ్రంథాల్ని ప్రేమించేవారు కొందఱు. సిద్ధాంతాల్ని ప్రేమించేవారు కొందఱు. పార్టీని ప్రేమించేవారు కొందఱు.

ఈ విధంగా మనలోంచి మినుకు మినుకుమంటూ వ్యక్తమతున్న ఈ ప్రేమాంశ (element of love) దేనియందైనా నిక్షిప్తం కానివ్వండి– మనలోని పసిబిడ్డ ఇంకా సజీవమే ననడానికీ, మనమింకా పూర్తిగా పుచ్చిపోలేదనడానికీ నిదర్శనం. ఎందుకంటే ప్రేమలో ఆనందం ఉంది. ఆనందంలో ఆటకాయతనం ఉంది. ఆటకాయతనంలో శిశుత్వం ఉంది.



"మఱి జనంలో ఇంత ప్రేమ ఉన్నప్పుడు లోకం ఎందుకింత పాడైపోయింది?" అనడిగితే, "ఆ ప్రేమ మనుష్యేతరమైన అనేక విషయాలకేసి మళ్లడం వల్ల!" అని చెప్పాల్సి వస్తుంది. మనం దేన్నైనా ప్రేమించేందుకు సిద్ధంగా ఉన్నాం, మనుషుల్ని తప్ప! ఈ పై గద్య (paragraph) లో పేర్కొన్న ఆనందాలన్నీ నిర్జీవాశ్రితాలే తప్ప వాటిల్లో సజీవం ఎక్కడుంది? సజీవాలైన కులం, జాతి లాంటివాటిని ప్రేమించేవారు కూడా వాటిని అమూర్త పరిభావనలు (abstract concepts) గా ప్రేమిస్తున్నారే తప్ప వాటిని కలిగున్నవారిని వ్యక్తులుగా ప్రేమిస్తున్నట్లు కనపడదు. ఎందుకంటే తమ కులం, మతం, జాతి, దేశం ఇత్యాదుల్లో తమకి తెలిసినవారెందఱు? ఆ తెలిసినవారు ఆయా అభిమాన గుర్తింపులకి చెందినందుకు ప్రేమిస్తున్నారా? లేక తమకి తెలిసినవారైనందుకు ప్రేమిస్తున్నారా? ఇహపోతే సజీవమైన పశుపక్ష్యాదుల్ని ప్రేమించేవారు మనుషుల్ని కూడా అంతే ఆప్యాయంగా ప్రేమిస్తున్నట్లు కనపడదు.

సౌందర్యాన్ని ప్రేమించేవారు కూడా దాన్ని అమూర్త భావనగానే ప్రేమిస్తున్నారు. దాన్ని కలిగున్న వ్యక్తిని మాత్రం అంతగా ప్రేమించడం లేదనిపిస్తుంది. వారిలో కొందఱు ఆ విధమైన ప్రేమతో ఆగకుండా అత్యాచారాలకి దిగడం వినవస్తోంది. మానవప్రేమలో ప్రేమాస్పదుల్ని అర్థం చేసుకోవడమూ, వారి పట్ల ఆనృశంస్యమూ[1] ముఖ్యమైన అంగాలు. ఆ మనోవాలకం (mood) లో సజీవి అయిన మనిషిని అర్థం చేసుకోవడం జఱుగుతుంది. నిర్జీవ సౌందర్యారాధనలో అనుభవించడం మాత్రమే ఉంటుంది. సౌందర్యప్రేమికులు ఆ సౌందర్యాన్ని తెలిసో తెలియకో పాడుచేసేవారిని అత్యంత తీవ్రంగా ద్వేషించడమూ, దండించడమూ కనిపిస్తుంది. ఉదాహరణకి– తెల్లగా సున్నం వేసిన గోడల మీద వ్రాతలూ, మఱకలూ మొ॥వి. ఎంత గొప్ప సౌందర్యమైనా ప్రాణం లేనిదే. దాన్ని పాడుచేసేవారు మనుషులు. ప్రాణమున్న మనుషులు. మనలాంటి మనుషులు. వారి కంటే ఎక్కువగా ప్రాణం లేని గోడల్ని ప్రేమించడం సరికాదు. అలాంటి ప్రేమ అమానుషమైన ప్రతిచర్యల (reactions) కి దారి

[1] బాధించని, హానిచెయ్యని తత్త్వం.

తీస్తుంది.

కళలూ, సాహిత్యం లాంటివాటిని ప్రేమించేవారిని మిగతావారి మీద గొప్ప సంస్కార వంతులుగా చూడడం మన సమాజానికి మొదట్నుంచీ ఉన్న అలవాటు. మిగతావాటి మీద ఆ రకమైన ప్రేమ కాస్త నయమే కానీ అదీ ప్రాథమికంగా నిర్జీవాల్ని ప్రేమించడం క్రిందికే వస్తుంది. ఎటొచ్చీ కళా-సారస్వత ప్రేమికులు ఆయా రంగాల్లో నిపుణులైన కొందఱు మను షుల్ని కూడా ప్రేమిస్తారు. నిర్జీవ ప్రేమలన్నింటితోనూ సమస్య ఏంటంటే- వీటిల్లో పడ్డవారు మనుషుల్ని ప్రేమించలేరు. డబ్బుని ప్రేమించేవారిలో ఈ బలహీనత చాలా స్పష్టంగా, అదు గడుగునా కొట్టొచ్చినట్లు బైటపడిపోతూండగా మిగతా రకాల నిర్జీవ ప్రేమికుల్లో మాత్రం దీన్ని సూక్ష్మ పరిశీలన ద్వారానే కనిపెట్టగలం.

జ్ఞానానికి గల మానవీయ పార్శ్వం (human angle) పట్ల శీతకన్ను వేసి చేసే కేవల సమాచారాత్మకమైన జ్ఞానసంపాదన సైతం నిర్జీవ ప్రేమల కోవలోనే చేఱుతుంది. అది కూడా త్రాగుడూ, జూదమూ, వ్యభిచారమూ వంటి ఓ తరహా వ్యసనం. కాకపోతే కాస్త తక్కువ ప్రమాదకరం. వ్యసనపరుల్లో ఏ విధంగానైతే మానవత్వం వెనకబట్టుతుందో జ్ఞానపిపాసుల్లో కూడా అది అదే విధంగా అడుగంటుతుంది. ఈ వ్యసనాన్ని మఱిగినవారు జ్ఞానరహితుల్ని ప్రేమించలేరు. వారి చేష్టల్ని భరించలేరు. క్షమించలేరు. వారి ఉనికినే సహించలేరు. జ్ఞానం అనేది ఇతరుల నుంచి తమని విచక్షించే అంశంగా మారడంతో వారు మానవుల్ని ప్రేమించ లేని మనోవైకల్యానికి లోనవుతారు. ఆ రకంగా ఈ జ్ఞానవర్గాల మధ్య జ్ఞాన అసమానత సృష్టించే వైషమ్యం ఆర్థిక అసమానతకి ఎంతమాత్రమూ తీసిపోదు.

దీన్ని కూడా నవ్యమానవతావాదం ఆమోదించదు. ఎందుకంటే జ్ఞానం ప్రేమజన్యం. అది ప్రేమకే రూపాంతరం. మనం ఓ వస్తువుని/విషయాన్ని/వ్యక్తిని ఎంతగా ప్రేమిస్తామో అంత గా దాన్ని/ వారిని గుఱించిన జ్ఞానం మన దగ్గఱ ప్రోగుపడుతుంది. తద్విపర్యాసంగా మనం ఒక వస్తువుని/విషయాన్ని/వ్యక్తిని ఎంతగా నిర్లక్ష్యం చేస్తామో అంతగా మనం దాని/వారి గురించి అజ్ఞానంలో ఉంటాం. చిన్నపిల్లలు ఏదైనా సులభంగా నేర్చుకోగలరు. కారణం- వారు అందఱినీ, అన్నిటినీ ప్రేమించగలరు. పెద్దలకి నేర్పడం కష్టసాధ్యం. ఎందుకంటే వారి లో ప్రేమతత్త్వం మూడొంతులు విలుప్తమై ఉంటుంది. చాలామంది భావిస్తున్నట్లు ఇది పూర్తి గా వయసుకి సంబంధించిన సమస్య కాకపోవచ్చు. కొంతవఱకూ ప్రేమ సమస్య కూడా.



కాబట్టి మనుషులు జ్ఞానం కన్నా ప్రేమ పట్లే ఎక్కువ శ్రద్ధపెట్టాలి. మనకెంత జ్ఞానమున్నా జ్ఞానరహితులతో వ్యవహరించేటప్పుడు వారి స్థాయికి దిగిరావాలి, పెద్దలు పసిబిడ్డలతో ముద్దుమాటల్లో సంభాషించినట్లుగా!

వ్యసనపరులంతా తమలాంటి వ్యసనపరుల సాంగత్యాన్నే ఇష్టపడతారు. 'జ్ఞానవ్యసన' పరు లైనా అంతే! అలాగని తోటి జ్ఞానులతో కూడా వారు పూర్తి సౌమనస్యంగా గడపలేరు. బౌద్ధిక అంశాల మీద అనునిత్యం వివాదపడుతూనే ఉంటారు. జ్ఞానాన్ని సంపాదించినప్పటి నుంచీ దాన్ని ఇతరులక్కూడా అందించాలనే కండూతి మొదలవుతుంది. ప్రతివారికీ జ్ఞానం అవ సరం లేదనీ, అనపేక్షిత జ్ఞానం ప్రమాదకరం కూడా కావచ్చుననీ, మనం తెలుసుకునేవారి మే తప్ప ఇతరులకి తెలపగలవారిమి కాదనీ, మనకి సమయం వచ్చినట్లే ప్రతివారికీ వారి సమయం రావాలనీ, వస్తుందనీ ఈ 'జ్ఞానవ్యసన' పరులు గుర్తించరు. ఆ రోజు కోసం ఎదురుచూసే పాటి ఓపిక వారికుండదు. ప్రపంచంలో మతమార్పులకి ఈ కండూతి కూడా ఓ కారణం. జనం ధ్యాసని దాటిపోతున్న అవలక్షణాలు జ్ఞానానికి చాలా ఉన్నాయి. ఉదాహ రణకి, జ్ఞానం ప్రేమరూపాంతరమే ఐనా ఓ దశలో అది ప్రేమవిరుద్ధమైన హృదయకాఠిన్యా న్ని సైతం పెంపొందిస్తుంది.

మన దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థ అమల్లోకొచ్చాక డబ్బునే కాదు, కీర్తినీ, అధికారాన్నీ ప్రేమించేవారిలో సైతం మానవత్వమూ, మానవప్రేమా ఉండవనే విషయం అందఱికీ క్రొత్త గా అర్థమైంది. ఇలా ఒక్కో దృగ్విషయాన్నీ వేఱువేఱుగా అర్థం చేసుకోవడం కన్నా "నిర్జీవా ల్ని ప్రేమించేవారు సజీవుల్ని ప్రేమించలేరు" అనే సత్యాన్ని ఏకమొత్తంగా అర్థం చేసుకో వడం మంచిది.

సమక్షంలో ఉన్నవారిని తీఱిక చేసి పరోక్షంలో ఉన్నవారికి విలువివ్వడం కూడా నిర్జీవ ప్రేమకున్న మఱో లక్షణం. మనుషులు కాలపరంగా సమకాలీన తరానికి ఎంతెంతగా ఎడ మవుతారో అంతంతగా వారి సంపాధితల (achievements) కి మాననీయత హెచ్చు తుంది. అంటే, ఇక్కడ దేనికైనా/ఎవఱికైనా ప్రామాణికత సిద్ధించాలంటే అది/వారు కనీసం ఓ మూడు తరాల క్రితం నాటికి చెంది ఉండాలి. మన కళ్ళెదుటే ఉత్పన్నమైనదాని గొప్పతనాన్ని మనం ఒప్పుకోలేం.

బ్రతికున్న మనుషుల విలువ మనకి తెలీదు, వారు బ్రతికున్నంతకాలం వారిలో తప్పులే వెతుకుతాం. చనిపోయారని తెలిసినప్పటినుంచీ వారిలో ఒప్పుల్ని వెతకడానికి ప్రయత్నిస్తూంటాం. బ్రతికుండగా మన వల్ల బాధపడ్డవారు చనిపోయాక మన పరితాపాన్ని చూడలేరు. నిర్జీవాల్ని మాత్రమే ప్రేమించడం అభ్యాసమైన సమాజంలో మనుషుల విషయంలో కూడా నిర్జీవుల్నే గౌరవించడం దృశ్యమానమవుతుంది. ఇక్కడ మనుషులు గౌరవానికి నోచుకోవాలంటే వారు అర్జెంటుగా చనిపోవాలి. బ్రతికున్నవారికి ఎవఱూ సహాయం చేయరు. ఎవఱూ వారి గుఱించి ఓ మంచి మాట మాట్లాడరు. “వారిని సంతోషంగా ఉంచడం తమ బాధ్యత” అనుకోరు. సజీవులైన మానవుల్ని ప్రేమించలేని ఈ సమాజం ఆఖరికి ఓ శవపూజారుల స్థావరంగా మారింది.

## 8. మానవ వ్యక్తుల పట్ల అహింస

ఆధిపత్య ధోరణులు నశిస్తే మనుషుల్లో అహింసాప్రకృతి దానంతట అదే వెల్లివిఱుస్తుంది. ప్రపంచంలో అన్ని గొడవలకీ కారణం ఆధిపత్య ధోరణితో గొంతు పెంచడం. ప్రేమకి బదులు ఆధిపత్యం కావాలనే తలపు అంకురించగానే దాని కోసం ప్రత్యేక ప్రయత్నాలు చేయాలనీ, ఇతరుల్ని లొంగదీసుకుందామనీ, లొంగకపోతే వాళ్ళపై కక్ష సాధిద్దామనీ రకరకాల సంకల్పాలు తలెత్తుతాయి. హింసకి మూలం ద్వేషం. ద్వేషానికి మూలం అజ్ఞానం. ఇతరుల్ని సక్రమంగా అర్థం చేసుకోలేని అశక్తత. లోకాన్ని గుఱించీ, మనుషుల గుఱించీ మన అవగాహన ఎంతెంతగా విశాలతరమౌతుందో అంతంతగా మనం ద్వేషభావాల నుంచి విముక్తమవుతాం. మన వ్యక్తిగత శత్రువుల విషయంలో కూడా వారి నెంతెంతగా అర్థం చేసుకుంటామో అంతంతగా వారు మనకి శత్రువులుగా అగుపించడం మానేస్తారు. అర్థం చేసుకోవడమంటే ఇతరుల్లో మనల్నీ, మనలో ఇతరుల్నీ చూసుకోవడమే.

లోకంలో అన్ని తప్పుల మాదిరే హింస కూడా– ఏం చేయాలో, అవతలివారిని ఎలా ఒప్పించాలో అర్థం కాని నిస్సహాయతా, కింకర్తవ్య విమూఢతా, అయోమయాల్లోంచి పుడుతుంది. ఇది ప్రాథమికంగా భావప్రకటన సామర్థ్యలోపానికి సంబంధించినది కూడా. హింస ద్వారా వ్యక్తమయ్యేది బలం కాదు, బలహీనతే. ఆ బలహీనత పేరు అజ్ఞానం. ఆ బలహీనత పేరు



వేచి చూడలేని అసహనం. పూర్వం పిచ్చికుదిర్చే పేరుతో పిచ్చివాళ్ళకి సంకెళ్ళు వేసి నేఱస్థుల్ని కొట్టినట్లు కొట్టేవారు. మానసిక వైద్యాన్ని ఎఱగని అజ్ఞానం వల్ల జఱిగిన హింస అది. నిజానికి అన్ని హింసలూ అలాంటివే. కనుక అన్ని సమస్యలకూ చర్చలే పరిష్కారం. చర్చలొద్దనుకుని పోరాటానికి దిగే వారు అది ముగిశాకైనా చర్చలకు రాకతప్పదు. అంటే అందాకా చేసిన పోరాటమంతా వృథాయేనని అర్థం. ఆ తెలివేదో ఉభయ పక్షాలకీ ముందే ఉంటే చాలా నష్టం తప్పుతుంది గదా!

ఎట్టి పరిస్థితుల్లోనూ వ్యక్తుల్ని, వారు ఎలాంటివారైనా సరే, హింసించకపోవడం సమాజం తనకు తాను చేసుకుంటున్న సేవే. ఎందుకంటే హింసించబడ్డ ప్రతివారూ ఆ హింసని మౌనంగా భరించి మర్చిపోరు. వారలా మర్చిపోవాలనీ, తాను చెప్పినట్లు గుణపాఠాల్ని మాత్రమే గ్రహించి ఊరుకోవాలనీ వ్యవస్థ ఆశించడం తఱచు. కానీ దురదృష్టవశాత్తూ అలా జఱగదు. ఎక్కువమంది రాటు దేల్తారు. వారి హృదయం బండబాఱుతుంది. వారంతకు ముందటికంటే పెద్దతప్పులు చేయగల చొఱవనీ, ధైర్యాన్నీ సంపాదించుకుంటారు. చేతులారా వారినలా తయారుచేసి ఆ తరువాత వారిని దూషించడం, ముద్రలు వేయడం సమంజసం కాదేమో. మనిషి మనసు కూడా కలనయంత్రం (computer) లాంటిదే. అందులో ఏ మృదుసామాను (software) చొప్పిస్తే దాన్నే అది ప్రదర్శిస్తుంది. **మనం మనుషుల గుఱించి ఏదనుకుంటే వారదే అవుతారు. వారిని ఎలా చూస్తే వారు అలాగే తయారవుతారు.**

కనుక సమాజం/వ్యవస్థ చేతుల్లో బాధలుపడ్డవారిలో ఓ క్రొత్త అహంకారం ఉద్బుద్ధమౌతుంది. ఓ నవ్య ప్రతీకారతత్త్వం జాగృతమవుతుంది. తాజా తెలివితేటలు పెంపొందుతాయి. “దొఱక్కుండా తప్పు చేద్దాం. ఏం చేస్తారో చూద్దాం” అనే మొండిపట్టుదల ప్రవేశిస్తుంది. ఇదంతా ఇలా జఱక్కుండా చూసుకోవడం నాగరిక సమాజాల బాధ్యత. కానీ సమకాలీన వ్యవస్థ ఇలాంటివారిని వేలాది సంఖ్యలో తయారుచేసే పనిలో పరోక్షంగా వ్యాపృతమై ఉంది. ఓ పిల్లవాణ్ణి చావగొట్టి పండితుడుగా ఎలాగైతే చేయలేమో ఎదిగిన వయోజనుల విషయంలోనైనా అంతే! ఎందుకంటే– ప్రతివారూ కోరుకునేది– తమని తామెలా అర్థం చేసుకుంటున్నారో, ఇతరులు కూడా అలాగే అర్థం చేసుకోవాలనీ, తమని ప్రేమగా, గౌరవంగా, అభిమానంగా చూసుకోవాలనిన్నీ! ఇతరులు తమని అపార్థం చేసుకోవడాన్ని ఎవఱూ

భరించలేరు, ఆ అపార్థోత్పత్తిలో తమ పాత్రా కొంత ఉన్నప్పటికీ! ఏ గొడవా లేనప్పుడు అందఱూ దేవతలే, మహర్షులే. సంక్షోభ సమయాలొచ్చినప్పుడే మనలో సౌహార్ద కారుణ్యాలు వెల్లివిఱియాలి. అలా చేయకుండా ఓ వ్యక్తిలో ఆ సెంటిమెంటుకి విఘాతం కలిగించాక ఇహ అతన్నుంచి తొల్లటి సౌజన్యాన్నే ఆశించడం కష్టసాధ్యం.

(ఇ) వ్యక్తుల్లో హింసాధోరణుల్ని పై విధంగా పనిగట్టుకుని రెచ్చగొట్టకపోతే కుటుంబాలు హింస నుంచి విముక్తమౌతాయి. కుటుంబాల్లో హింస తగ్గిపోతే వ్యవస్థలో కూడా హింసా ధోరణులు అదుపులోకొస్తాయి. మన కుటుంబాల్లో మగపిల్లల్ని కొట్టడం సర్వసాధారణం. అలా చేయడం వారికి హింస నేర్పడమే అవుతుంది. అదే విధంగా ప్రతివిషయంలోనూ ఎవఱినో సంతృప్తిపఱచడం కోసం అడుగడుగునా మనసు చంపుకోవడానికి ఈ దేశపు జనం బాగా అలవాటుపడిపోయారు. దీనివల్ల మనం స్వీకరించే ఏ బాధ్యత విషయంలోనూ నిజాయితీ చూపలేని సామూహిక మనస్తత్త్వం సంప్రాప్తమైంది. ఇక్కడ ఏ పనినీ ఇష్టపడి చేసేవారు మనకు కనిపించరు.

(ఈ) దురదృష్టవశాత్తూ ఇతరుల్ని హింసించగలగడాన్ని ఒక గొప్ప ఆరాధనీయ పురుష లక్షణంగా చూసే ధోరణి మన సమాజంలో తరతరాలుగా వ్యాపించిపోయింది. ఆ ధోరణి స్త్రీలలోనూ, పురుషుల్లోనూ సమానంగా గూడుకట్టుకుని ఉంది. అనవసరంగా దానికో గొప్ప ధర్మరక్షణ తత్త్వాన్ని ఆపాదిస్తున్నారు. హీరోయిజమ్ పేరుతో ఈ మూర్ఖత్వం ప్రతి చలన చిత్రం ద్వారా ప్రమోట్ చేయబడుతోంది కూడా. అదో కర్తవ్యం, విధ్యుక్తధర్మం అన్నట్లుగా కూడా చూపుతున్నారు. మగతనంలో తర్కంతో కూడుకున్న బహిర్ముఖ యోచనే (extrovert logical thought) ప్రధానాంగం. హింస్రత గౌణమే.

కానీ ఈ ఆలోచనాధోరణి మూలాన, ఈ దేశంలో భార్యని కొట్టని, భయపెట్టని, ఆమె మీద అడుగడుగునా అధికారం చెలాయించని భర్తలంతా పెట్టమారి మొగుళ్ళు(hen-pecked husbands) గా, చవటలుగా అపార్థం చేసుకోబడుతున్నారు. మానవతావాదంలో ఓనమాలు తెలీని ఈ సమాజానికి ప్రేమ అనేది ఓ అర్థం కాని బ్రహ్మపదార్థం.

(ఉ) పిల్లలతో పాటు గర్భస్థ శిశువులు కూడా మానవులే. వారు పూర్తిగా పెద్దల మీదే ఆధారపడ్డ నిస్సహాయ మానవజీవులు. వారిని హింసించడాన్ని కూడా మానవతావాదం ప్రాథమికంగా ఆమోదించదు.



(ఊ) యుద్ధాలన్నీ ప్రాథమికంగా మానవుల్ని మహాజన స్థాయిలో హింసించడం (mass torture) ద్వారా తమ స్వంత ఇష్టానిష్టాల్ని వారి నెత్తిమీద బలవంతంగా రుద్దడానికి ఉద్దేశించినవే గనుక ప్రతిఘటనార్థం కానటువంటి ఏ యుద్ధాన్నీ మానవతావాదులు సమర్థించరు.

(ఋ) ఆత్మహత్యల గుఱించి ఇతరత్రా వ్రాసే ఉన్నాను. కనుక సవిస్తరంగా ఆ జోలికి పోను. కానీ ఆత్మహత్యలు కూడా ఆత్మహింస అనబడే ఒక విధమైన హింస కిందకే వస్తాయి. మానవతావాదం ఆత్మహత్యల్ని ప్రాథమికంగా ప్రోత్సహించదు, సమర్థించదు. ఐతే ప్రాణాంతకంగా జబ్బుపడ్డ (terminally ill) వారూ, శారీరికంగా నరకయాతన అనుభవిస్తున్నవారూ, ఆయుర్దాయాన్ని పొడిగించడం వల్ల ఇంకా నరకయాతనే తప్ప యత్కించిద్ ఉపశాంతినీ పొందలేని వారూ లోకంలో కొందఱున్నారు. అటువంటివారు స్వచ్ఛందంగా చనిపోయినా, లేదా వారియందలి కనికరంతో, వారి అనుమతి గైకొని వారి జీవితానికి ఇతరులు కృత్రిమంగా ముగింపు పలికినా తప్పులేదని చెప్పే మానవతావాదుల శ్రేణి సైతం ప్రపంచంలో లేకపోలేదు. ఈ ప్రక్రియని కారుణ్య సమాపనం (Euthanasia/mercy-killing/assisted death) అని పిలుస్తున్నారు. దీన్ని ఓ ఖచ్చితమైన సర్వసామాన్యసూత్రం (common rule) తో నిబంధించడం కష్టసాధ్యం. ఆయా సందర్భాల్ని బట్టి వివేకవంతంగా ఆలోచించి నిర్ణయం తీసుకోవడం వాంఛనీయం. ఎటొచ్చీ ఇలాంటివాటికి చట్టం ఇచ్చే వెసులుబాట్లు ఆ పేరిట లోపాయికారీ హత్యలకీ, అనావశ్యకమైన ఆత్మహత్యలకీ దారితీయవనే హామీ లేదు.

## ౯. ప్రతిహింసా వ్యతిరేకత

హింసని వ్యతిరేకించడమంటే ప్రతిహింసని కూడా వ్యతిరేకించడమే. ఎందుకంటే ప్రతిహింస భవిష్యత్తులో మఱింత హింస ద్వారా జవాబివ్వబడుతుంది. అదో గొలుసుకట్టు పరంపర. కాబట్టి కక్ష తీర్చుకోవడాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ నవ్యమానవతావాదం సమర్థించదు. అదే విధంగా హింసాపూరితంగా చర్యలు తీసుకోవడాన్ని (కఠిన శిక్షలు వేయడాన్ని) కూడా సమర్థించదు. అంటే వెలివేత, యావజ్జీవ కారావాసాలూ, ప్రాణం తీయడం, అవయవచ్ఛేదం, దెబ్బలాంటివాటితో

అది ఏకీభవించదు. విచారణలోనో, అంతిమ నిర్ణయంలోనో పొఱపాటు జఱిగి పైన పేర్కొన్న అమానుషాలకి ఒకఱు బలయ్యారనుకోండి. ఆ తరువాతెప్పుడో 'అతను నిర్దోషి' అని తేలినా కూడా అతనికీ, అతని కుటుంబానికీ జఱిగిపోయిన నష్టాన్ని ఏ వ్యవస్థా పూడ్చ జాలదు. మీదుమిక్కిలి ఇందులో శక్తి–అసమతూకం (power imbalance) కూడా ఉంది. ఎందుకంటే గుంపులతోనూ, వ్యవస్థలతో పోలిస్తే విడివ్యక్తి దుర్బలుడని ఒప్పుకుంటే, మనం వాస్తవంగా నిలబడాల్సింది ఎవఱి పక్షాన ?

కఠిన శిక్షలు – ఓ నేఱం గుఱించి తక్కిన సమాజం పొందుతున్న భయభ్రాంతుల స్థాయినీ, వారి కడుపుమంటనీ సూచిస్తాయే తప్ప ఆ నేఱానికి పాల్పడ్డవారు నిజంగా ఆ శిక్షకి అర్హు లయ్యేటంత దుర్మార్గులేనా? కాదా? ఆ నేఱం నిజంగా అంతటి నేఱం అవునా? కాదా? అనే అంశాల్ని నిరూపించవు. కఠిన శిక్షల మూలాన జఱిగిన సంఘటన క్రమ్మఱించబడదు. జఱిగిపోయిన నష్టాలు పూడవు. పైపెచ్చు అన్ని వ్యవస్థలూ పెడదారి పట్టిన సమాజంలో కఠిన శిక్షల వెసులుబాటు సైతం దుర్వినియోగమయ్యే ఆస్కారమే ఎక్కువ.

కేవల ఆరోపణల్నే తిరుగులేని సాక్ష్యంగా పరిగణిస్తూ కొన్ని వర్గాలకి 100% అనుకూలంగా పక్షపాతపూరిత చట్టాల్ని రచించినవారి ఏజన్సీల క్రింద ఆరోపితులకి న్యాయం జఱిగడం అసాధ్యం. బహువిధమైన సైద్ధాంతిక/రాజకీయ/ఆర్థిక స్వార్థాలతో పుచ్చిపోయిన మీడియా తానే ఫిర్యాదీగా, తానే దర్యాప్తు అధికారిగా, తానే సాక్షిగా, తానే పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా, తానే రిపోర్టర్ గా, తానే జడ్జిగా ఏకపాత్రాభినయమూ, బహుపాత్రాభినయమూ చేస్తున్న వాతావరణంలో ఏ పలుకుబడీ లేని ఆరోపితుల ఆత్మఘోష ప్రజల చెవిన పడడమూ, న్యాయం ఎటుందో వారు నిర్ణయించుకో గలగడమూ అసంభవం.

ఓ ప్రక్క పూచీకత్తు (bail) ఇవ్వకుండా గదిలో బంధిస్తారు. మఱో ప్రక్క "నీ నిర్దోషిత్వాన్ని నువ్వే నిరూపించుకోవా"లంటారు (Burden of proof on self). ఎలా సాధ్యం? ఈ విధంగా అంతర్జాతీయ మానవహక్కుల చార్టర్ కి పూర్తివిరుద్ధంగా, సహజన్యాయానికీ హేతువాదానికీ నిలబడని అసంబద్ధమైన అధికరణాల (clauses) తో నింపివేయబడ్డ క్రిమినల్ చట్టాల క్రింద మనిషి అగ్నిపునీతుడై బైటికి రావడం దుర్ఘటం. ఈ విధంగా విష యాల సత్యాసత్యాలూ, లోతూ తెలుసుకోవడానికి ఏ మాత్రమూ అవకాశం లేని పరిస్థితుల్లో



వీరందఱి చేతా ప్రభావితులమై ఆరోపితులకి కఠినశిక్షలు విధించడమూ, వాటిని సమర్థించ డమూ ఎంతటి పాపకార్యమో, అనాలోచితమో యోచించాల్సి ఉంది.

మరణశిక్షలూ, అవయవచ్ఛేదాలూ అమల్లోకి తెచ్చి లోకాన్ని అమాంతం బాగుచేసిపారెయ్యా లని ఉబలాటపడేవారు గుర్తించని విషయం ఏంటంటే– ఒకసారి అలాంటివాటిని ఆమోద యోగ్యం చేశాక ప్రతి ఒక్కఱూ వాటిల్లో తమ స్వకీయ సృజనాత్మకతని ప్రవేశపెట్టి, మనుషు ల్ని హింసించడంలోనూ, చంపేయడంలోనూ విపరీతమైన వైవిధ్యాన్ని ప్రదర్శిస్తూ స్వీయకళా చాతుర్యాన్ని వెలార్చసాగుతారనేది. గతంలో జఱిగింది అదే. నిజాం రాజ్యంలో అవినీతి పరుల్ని ఫిరంగులతో ప్రేల్చి చంపేవారు. మధ్యయుగాలనాటి యూరప్ లో పరుగెత్తుతున్న గుఱ్ఱానికి మనిషిని కట్టి ఈడ్పించి చంపేవారు. బ్రతికుండగానే తల మీద ఉన్న చర్మమంతా కోసేసి తీసి పై–కపాలాన్ని మిగిల్చేవారు. నీళ్ళల్లో ముంచి చంపేవారు. మఱుగుతున్న నూనె లోకి త్రోసేవారు. కాళ్ళూ చేతులూ నఱికి ఆరుబయట అలా వదిలేసేవారు. ఓ చిన్నగదిలో 20 మందిని బంధించి తిండి పెట్టకుండా మాడ్చి చంపేవారు. ఈ రోజుల్లో చాలా చిన్నతప్పు లని భావించబడేవాటిక్కూడా ఆ రోజుల్లో ఇలాంటివి అమలుజఱిపారని తెలుసుకుంటే మనసు బాధతో మూలుగుతుంది.

అంతమాత్రాన ఆ కాలపు జనం క్రూరులూ అనాగరికులూ అనడం సరికాదు. ఇక్కడ అసలు ప్రశ్న దయాగుణం గుఱించో, క్రూరత్వం గుఱించో, నాగరికత గుఱించో కాదని గమనిం చాలి. నాలుగు భావనల్లో వారీ పనులు చేశారు.

**ఒకటి –** తాము పవిత్రులమనుకోవడం.
**రెండు –** తప్పొప్పులు నిర్ణయించే తెలివితేటలు తమకి ఉన్నాయనుకోవడం.
**మూడు –** దేనికెంత శిక్షో నిర్ణయించే ప్రతిభ కూడా తమకి ఉందనుకోవడం.
**నాలుగు –** తోటి మనిషిని శిక్షించే అధికారం తమకు ఉందనుకోవడం.

ఆత్మపరిశీలన చేసుకుంటే ఈ భావనలు ఈ రోజు మనలో కూడా ఉన్నాయని అర్థమవు తుంది. కనుక అవకాశమివ్వాలే గానీ మనమూ తప్పకుండా ఈ పనులు చేస్తాం. మరణశిక్ష లూ, అవయవచ్ఛేదాలూ సమాజంలో విస్తృతామోదాన్ని పొందితే ఆ అవకాశమొస్తుంది.

**సమకాలీన పరిస్థితులు కఠిన శిక్షల విధింపుకి అనుకూలమేనా?** మేధాజీవులు కాని సామాన్యప్రజల న్యాయబుద్ధి (laymen's sense of justice) సార్వత్రికంగా అత్యంత హీనమైనది. అనుమానించిన ప్రతి చిన్నతప్పుకీ అవతలివారిని కుటుంబ పరివార సమేతంగా చంపేయాలనేదే ఎక్కువమంది పెట్టే ఘోష. ఈ ఘోషని నిజంగా నిజం చేస్తే మానవ జాతిలో కనీసం నూటికి 20–30 మందిని హతమార్చాల్సి వస్తుందేమో తెలీదు. చారిత్రికంగా ఈ తత్త్వం మూలాన ప్రపంచంలో అన్యాయంగా ప్రాణాలు కోల్పోయినవారి జాబితా చాలా పెద్దది. అందులో ఏసుక్రీస్తు దగ్గఱినుంచీ ఫ్రెంచి శాస్త్రవేత్త లెవోయిజే (Antoine-Laurent de Lavoisier) దాకా చాలామంది ఉన్నారు. వీరంతా ఆనాటి అధికారిక సంస్థల (official agencies) చేతుల్లోనే– కేవలం ప్రజావత్తిడి మూలాన– ప్రాణాలు కోల్పోయారని కూడా జ్ఞాపకం చేసుకోవాల్సి ఉంది. కనుక ప్రజాభీష్టాన్ని కూడా గ్రుడ్డిగా అనుసరించకుండా వివేకంతో అనువర్తించాలని తెలియవస్తోంది.

అదీ గాక ఈ కాలంలో న్యాయస్థానాల మీద పనిచేస్తున్న మానసిక ఒత్తిళ్ళలో మీడియా, ఇంకా ప్రజాసంస్థలమని చెప్పుకునే, రాజకీయాలకి అనుబద్ధమైన అరాచక శక్తులు కూడా చేఱిపోయాయి. ఇటీవల అవి వార్తలూ–వ్యాసాల పేరుతో, ఫేస్ బుక్ పేజీల పేరుతో, ఆందోళనల పేరుతో, ప్రజాభిప్రాయ సేకరణ పేరుతో– అత్యంత ప్రొఫెషనల్ గా, నిర్మమం (detached) గా, ప్రశాంతంగా నడవాల్సిన న్యాయప్రక్రియలో అక్రమంగా వ్రేలుపెడుతున్నాయి (unauthorized interference in the legal process). అవి సాక్షాత్తూ న్యాయమూర్తుల్నే భావోద్వేగ బెదిఱింపుల (emotional blackmail) కి గుఱిచేయాలనీ, వారి మీదే మేధాక్రీడ (Mind–game) ఆడాలనీ ప్రయత్నిస్తున్నాయి. అందుకోసం అవి ఆ కాసేపూ పార్టీజెండాలు తీసేసి పౌరసమాజమైనట్లు రోడ్ల మీద భంగిమలివ్వడం నేర్చుకున్నాయి. వారు గుంపులుగా వెళ్ళిపోయి ప్రత్యక్షంగా క్యామరాల ఎదుటే ఆరోపితులపై భౌతిక దాడులకి పాల్పడుతున్నా ఎవఱూ అడ్డుకోలేనంత అరాచకమూ, అభద్రతా సంప్రాప్తమయ్యాయి. అందువల్ల న్యాయవాదులు ఆరోపితుల తరఫున వృత్తిధర్మంగా కేసులు తీసుకోలేని పరిస్థితీ, అలాగే న్యాయమూర్తులు తాము చదువుకున్న శాసనగ్రంథాల ప్రకారం స్వేచ్ఛగా తీర్పులివ్వలేని పరిస్థితి కూడా నెలకొన్నది. ఇటువంటి పరిస్థితుల్లో కఠినశిక్షల్ని ఆమోదిస్తే జఱగబోయే అనర్థాల్ని ఎవఱూ ఊహిస్తున్నట్లు కనిపించదు. వాటిని ఎవఱు ఎలా ఉపయోగించుకో బోతున్నారో గ్రహిస్తున్నట్లూ కనిపించదు.



**ఎంత నేఱం చేస్తే అంత స్థాయిలో నేఱస్థుల్ని హింసించే సావకాశం మనుషులకుందా?** ఇది ఆలోచనీయం. ఎంత శిక్ష విధిస్తే పాపం పరిహారమవుతుందో ఖచ్చితంగా ఎవరైనా చెప్పగలిగితే బావుంటుంది. ఉదాహరణకి, ఒకఱిని చంపితే మరణశిక్ష వేయాలన్నప్పుడు పదిమందిని చంపిన వాడికి పది మరణశిక్షల్ని అమలుజఱపడం సాధ్యమేనా? ఎందుకంటే ఒకసారి ఉరితీస్తేనే అతను చనిపోతాడు. మిగతా తొమ్మిది హత్యలకీ వేయాల్సిన శిక్షల సంగతేంటి ? కనుక "దేనికి ఏది శిక్ష ? లేదా దేనికెంత శిక్ష?" అనేది మనుషుల చేతుల్లో లేదనీ, వారికి తెలీదని స్పష్టమవుతోంది. కనుక ఎంత పెద్దతప్పుకైనా 15 సంవత్సరాల కఠిన కారావాసం కంటే ఎక్కువ శిక్ష అవసరం లేదు. మనుషులు మారి సత్ప్రవర్తన అలవఱచుకుంటే ఇంకా ముందే విడుదల చేయడం బావుంటుంది.

**కఠిన శిక్షల మానసిక ప్రభావం ప్రజాతలం** (public plane) **లోకి చొచ్చుకొచ్చే వైనమూ, దాని విపరీత పర్యవసానాలూ:** ప్రైవేటు వ్యక్తులు హింసకి పాల్పడకుండా నిరోధించడం ప్రతి ప్రభుత్వానికీ విధ్యుక్త ధర్మం. లేకపోతే ప్రభుత్వం అనే పదానికే అర్థం ఉండదు. కానీ కఠిన శిక్షలు ఈ ప్రాథమిక కర్తవ్యానికే గండికొడతాయి. హింసాయుత శిక్షలు శాసన గ్రంథాల్లో ఉన్నంతమాత్రాన సమాజంలో తప్పులు జఱక్కుండా పోవు. తప్పుచేయనివారు కఠిన చట్టాలు లేకపోయినా చేయరు. చేసేవారు అవి ఎన్నున్నా లెక్కచేయరు. కానీ కఠిన శిక్షల వాతావరణంలో ఏం జఱుగుతుందంటే– "న్యాయస్థానాల దృష్టికి తీసుకెళితే అక్కడ చేసేదీ హింసించడమే కదా! అదేదో మనమే చేద్దాం/చేయిద్దాం" అనేవారు బయల్దేఱతారు. కేవలం తప్పు జఱిగిందనే అనుమానం మీద, అది నిరూపణ కాక ముందే ఈ రకమైన ప్రైవేటు హింసాకాండ మొదలవ్వొచ్చు. ఎందుకంటే ప్రభుత్వం అధికారికంగానూ, బహిరంగంగానూ చేసే తప్పుల్ని ప్రైవేటు వ్యక్తులు అంతకు రెట్టింపు స్థాయిలో చేస్తారు. ఉదాహరణకి – ప్రభుత్వం ఓ ఉపాధ్యాయుడికి ఆఱువేలు జీతమిస్తే దాన్ని కారణంగా పేర్కొంటూ ప్రైవేట్ లో మూడువేలే ఇస్తారు.

కఠిన శిక్షలంటే ఆచరణాత్మకమైన అర్థం– తమ చేతులకి మన్నంటకుండా న్యాయస్థానాల ద్వారా హింసాకాండ (judicial violence) ని అమలు జఱపడం మినహా ఇంకేమీ కాదు. అందుచేత ప్రభుత్వం తరఫున కఠిన శిక్షల్ని ఆమోదించడమంటే ప్రైవేటు హింస క్కూడా లోపాయికారీగా నిశ్శబ్ద ఆమోదముద్ర చేయడమే అవుతుంది. అది – ప్రజలు చట్టా

న్ని తమ చేతుల్లోకి తీసుకునేలా ప్రోత్సహించడమూ, సంబంధిత కుటుంబాల మధ్య గొలుసు కట్టు ప్రతీకార చర్యలకి నాంది పలకడమూ అవుతుంది. “కొండనాలిక్కి మందు వేస్తే ఉన్న నాలిక ఊడిం”దన్న సామెతగా ప్రతీకారన్యాయం (retributive justice) మూలంగా హింస్ర నేఱాలు తగ్గుముఖం పట్టడానికి బదులు మనం త్వరలోనే మఱింత హింసాపూరితమైన సమాజం తయారు కావడాన్ని  చూస్తాం. హింసకి చట్టపరమైన, సామాజికమైన అనుమతి పత్రం (license) గల సమాజాన్ని చూస్తాం. ప్రైవేటు హింసని హీరోయిజమ్ గా, ధర్మరక్షకత్వంగా భావించే సమాజాన్ని చూస్తాం.

**కఠిన శిక్షలతో సమాజం మెఱుగుపడుతుందా?** కఠిన శిక్షల ద్వారానే మనుషులు మంచిగా మారతారని వాదించే మంచివారు తాము స్వయంగా అలా మారినవారేనా? మఱి తామెన్నడూ మ్రింగని మందుని ఇతరులకెందుకు సూచిస్తున్నట్లు? ఒకఱికి శిక్ష వేసి తద్వారా అతన్ని కాక, ఇతరుల్ని మార్చాలనుకునే (భయపెట్టాలనుకునే) ధోరణి మేధావిత్వం కాదు. ఇది నిజానికి మామూళ్ళు వసూల్ చేసే వీధి రౌడీల ఫిలాసఫీ. ఒకర్ని చూసి ఇంకొకఱు బాగుపడతారనీ, లేదా చెడిపోతారనే అభిప్రాయాలు కేవలం అభిప్రాయాలే. లోకంలో ఎవఱూ ఎవఱిని చూసీ ఏమీ నేర్చుకోరు, డబ్బు సంపాదించడం తప్ప!  మిగతా విషయాల్లో ఎవఱి సొంత బుఱ్ఱలు వారికున్నాయి. తాము చేసేది నేఱమనీ, దానికి శిక్ష ఉందనీ తెలియక కాదు నేఱస్థులు నేఱాలు చేసేది. “ఎవఱు దొఱికినా తాము మాత్రం దొఱక”మనుకుని ఆ భరోసాలో చేస్తారు. అందుచేత అంతకు ముందు అదే నేఱానికి ఎంతమంది ఏ విధంగా శిక్షించబడ్డారనే గణాంకాలు (statistics) ముందుపెట్టుకుని విశ్లేషిస్తూ వారు కూర్చోరు.

మన దగ్గఱ డబ్బు పుచ్చుకున్నవారు మన పట్ల కృతజ్ఞులై ఉండడమూ, కఠిన శిక్షలతో ప్రపంచం భూతలస్వర్గం కావడమూ– రెండూ బహుశా ఒకేసారి జఱుగుతాయి. కఠిన శిక్షలతో ప్రపంచం అమాంతం బాగుపడిపోయే మాటైతే వాటిని శతాబ్దాల తరబడి ఎందుకు అమలుజఱిపాల్సి వచ్చిందో, అలా చేసినప్పటికీ నేఱాలు యథాపూర్వంగా ఎందుకు కొనసాగాయో దానికి సమాధా నాన్ని అన్వేషించాల్సి ఉంది. హేయమైన నేఱాలకి మనుషులు పాల్పడడానికి గల కారణాల్లో ఒకటి కఠిన హృదయం. వ్యక్తుల హృదయాలు అలా బండబాఱిపోవడానికి గల కారణాల్లో ఒకటి– వారు పుట్టకముందే కుటుంబాల్లోనూ, సమాజంలో నెలకొన్న క్రూర వాతావరణం. న్యాయస్థానాలు కఠిన శిక్షల్ని విధించడమూ, జనం వాటిని



కనులారా తిలకించడమూ అలాంటి క్రూర వాతావరణాన్ని మఱింతగా సమాజం మీద విధిస్తాయే తప్ప దాన్ని క్షీణింపజేయలేవు. ఎందుకంటే మనం రోజూ ఏదైతే చూస్తామో అంతిమంగా అదే అవుతాం.

**కఠిన శిక్షలకి ప్రత్యామ్నాయాలు లేవా?:** ముందు మనకేం కావాలనేది నిర్వచించుకోవాల్సి ఉంది. మనక్కావాల్సింది నేఱాల్ని అఱికట్టడమా? లేక నేఱస్థుల మీద కక్ష తీర్చుకోవడమా? మన క్కావాల్సింది మొదటిదే అయితే, ముందు చేయాల్సింది, కఠినశిక్షల పేరిట మఱింత క్రూరత్వాన్నీ, ప్రతీకార ధోరణుల్నీ ప్రమోట్ చేయడం కాదు. మనుషుల్లో అవగాహననీ, సున్నితత్వాల (sensibilities) నీ పెంపొందించడం. శిక్ష సౌమ్యమైనా కఠినమైనా తదనంతరం సైతం మనిషికో భవిష్యత్తుంటుంది జీవితముంటుంది. కుటుంబముంటుంది. ఉండాలి కూడా! ఈ వాస్తవాల్ని ఎవఱూ విస్మరించకూడదు.

మనక్కావాల్సింది రెండోదే అయితే కఠినశిక్షలతో నిరభ్యంతరంగా ముందుకు పోవచ్చు. కానీ చూపఱ మనసులకి శునకానందాన్ని మాత్రమే కలిగించే ఈ మార్గంలో నేఱాలు యథాపూర్వం కొనసాగుతాయి. శిక్ష అనే మాటకి అసలైన అర్థం నేర్చుకోవడం. కానీ కఠిన శిక్షలతో ఎవఱికి ఏం నేర్పబోతున్నారు? నేఱస్థుల అవయవాలో, ప్రాణమో తీసేశాక, లేదా వారిని జీవితాంతం ఓ చీకటికొట్లో పెట్టి బంధించాక ఇహ వారు నేర్చుకునేది ఏముంటుంది? అలా వారికి నేర్పినదాన్తో ఏం చేసుకోవాలి వారు గానీ, సమాజం గానీ? ఇక్కడ చాలామంది లేవదీసే వాదన ఎలా ఉంటుందంటే– వారికా శిక్ష పడడం చూసి మిగతావారు నేర్చుకుంటారట.

ఇది వారి ఊహా, ఆశింపే మినహా వాస్తవ జీవితంలో ఇలా ఎక్కడా ఎప్పుడూ జఱిగిన దాఖలాలే లేవు. ఉదాహరణకి– ఆంధ్ర అవినీతి నిరోధక శాఖ (Anti-corruption Bureau) గత కొన్ని సంవత్సరాలుగా దాదాపు ప్రతిరోజూ అవినీతిపరుల్ని పట్టుకుని కేసులు పెడుతోంది. కానీ అవినీతి మాత్రం అలాగే ఉంది. సౌదీ అరేబియాలో ఏడాదికి సుమారు 100 మందిని నానా ఆరోపణల మీద తల తీస్తున్నారు. కానీ సదరు దండితుల దృష్టాంతం మరుసటేడాది ఆ దండనకి పాత్రులు కాని విధంగా మిగతా నేఱస్థులకి ప్రేరణ ఇవ్వలేకపోతోంది. మఱుసటి సంవత్సరపు శిరశ్ఛేదాల్ని నివారంచలేకపోతోంది. పైగా అక్కడి నేఱాల

శాతం దినదిన ప్రవర్ధమానం అవుతోందే తప్ప తగ్గుముఖం పట్టడం లేదు. దీని క్కారణం– మానవజాతిలో ఎవటి అనుభవం వారిదే. ఎవటికి వారు స్వయంగా అనుభవించి తప్పొ ప్పుల మతలబు తెలుసుకోవాల్సిందే. ఒకటి అనుభవం ఇంకొకటికి దారిచూపేలా జీవుల్ని ప్రకృతి సృష్టించి ఉండలేదు.

**కఠిన శిక్షలు విస్తృత ప్రజామద్దతుకి నోచుకోవడానికి కారణమేంటి?** సమస్యల పరిష్కా రానికి అడ్డదారుల్నీ, గోసాయి చిట్కాల్నీ వెతికే విదితపూర్వ బలహీనతతో పాటు ఇంకా ముఖ్యంగా 5 తప్పుడు అవగాహనల మూలాన జనం కఠిన శిక్షల్ని సమర్థించడం దృశ్య మానమవుతుంది :

**ఒకటి**- ఓ నేఆఘటన జఆగ్గా చూసి. లేదా విని తమకెంతటి ఆగ్రహావేశాలు కలిగాయో దాన్ని (level of offended-ness) బట్టి ఆ నేఅతీవ్రతనీ, దానికి పడాల్సిన శిక్షాపరి మాణాన్నీ (gravity of crime and quantum of punishment) నిర్ణయించడం. ఇది భావోద్వేగ మార్గం (emotional approach).

**రెండోది**- ఎక్కడ ఏ మందు వేయాలో తెలియకపోవడం. ఉదాహరణకి- దొంగతనం చేసినవాడి చేతులు నరికేయాలనే ప్రతిపాదనని పరిశీలించండి. అతను దొంగతనం చేయడా ని క్కారణం అతనికి చేతులు ఉండడం కాదని సదరు ప్రతిపాదకులక్కూడా తెలుసు. ఎందు కంటే చేతులున్న ప్రతివారూ దొంగతనానికి పాల్పడడం లేదు. మఱి ఎందుకలా ప్రతిపాదిస్తు న్నారు? అతను చేతుల్ని దుర్వినియోగం చేస్తున్నాడనీ, కాబట్టి వాటిని నరికేస్తే అతనింక వాటిని దుర్వినియోగం చేయలేడనీ, తదుపరి అతని వల్ల ఇతరులకి నష్టం ఉండదనీ, అతన్ని చూసి ఎవఱైనా భవిష్యత్తులో దొంగతనం చేయాలంటే వెఱుస్తారనీ వారు సమాధానమి స్తారు. అవి తమ చేతులు కానంత కాలమూ జనం ఇలాగే వాదించగలరు.

అంటే మనకి సమాజంలో మూడు రకాల వ్యక్తులు కనిపిస్తున్నారు. ఒకఱేమో — చేతులు ఉండీ వాటిని దుర్వినియోగం చేయనివారు. రెండో వారు- వాటిని దుర్వినియోగం చేసే వారు. మూడో వర్గం- వాటిని దుర్వినియోగం చేద్దామనుకున్నా చెయ్యలేనివారు (చేతులు లేనివారు).



ఇక్కడ నరకాలనేవారి ప్రతిపాదన– "రెండో వర్గం వారిని మూడో వర్గంలో చేఱుద్దా"మనేది. ఈ సందర్భంగా మానవతావాదుల ప్రశ్న ఏంటంటే– "దాని బదులు మీరు వారిని మొదటి వర్గంలోనే ఎందుకు చేర్చలేరు?" అనేది. ఎందుకంటే, చేతులు ఉండీ కూడా దొంగతనం చేయకుండా బ్రతకొచ్చునని మొదటి వర్గంవారు విస్తారంగా నిరూపిస్తున్నారు కదా? ఇలా జఱగాలంటే మొదటి రెండు వర్గాలవారి మీదా విస్తృతంగా పరిశోధన జఱగాలి. ఆ పరి శోధనా ఫలితాల్ని రెండో వర్గం వారిని మార్చడానికి ఓర్పుగా అనువర్తించాలి. నిజానికి దుర్వినియోగమవుతున్నది నేఅస్థుల శరీరాలు కావు, మనసులు. వాటి ఆజ్ఞలనే వారి శరీ రాలు పాటిస్తున్నాయి. ఆ మనసుల సంగతే ముందు చూడాల్సి ఉంది.

అదేదీ ప్రయత్నించకుండా, "కాళ్ళు నరకాలి, చేతులు నరకాలి" అంటూ పెడబొబ్బలు పెట్టడం నాగరికమైన knowledge society లక్షణం కాదు. ఓ ప్రక్క మిగతా అన్ని అంశాల్లోనూ 21 శతాబ్ద పద్ధతులు అవలంబిస్తూ మఱో ప్రక్క శిక్షల విషయంలో మాత్రం చరిత్రపూర్వయుగాలకి మళ్ళుతామంటే అది మానవతావాదులు సమ్మతించే విషయం కాదు. అదే విధంగా ఒకే న్యాయవ్యవస్థ కొన్ని నేఱాలకి నాగరిక చట్టాల్నీ, మఱికొన్నిటికి ఆటవిక చట్టాల్నీ అనువర్తిస్తామంటే కూడా అది హాస్యాస్పదమవుతుంది. అమానుషత్వ ప్రదర్శనలో సమాజమూ, వ్యవస్థలూ నేఅస్థులతో పోటీపడే పక్షంలో అవి వారి కంటే (better be-ings) ఉత్తమ జీవులేమీ కాజాలవు. ప్రతి తప్పుకీ అవయవాల్ని ఖండించడమే పనిగా పెట్టు కుంటే సమాజం నిండా అది స్వయానా కోరి కృత్రిమంగా తయారు చేసుకున్న వికలాంగ జనాభాయే తప్ప ఆరోగ్యవంతులెవఱూ కనిపించని పాడుకాలం దాపురిస్తుంది. అలాంటి వాతావరణంలో ఒకే వ్యక్తి తన ఆయుష్కాలం లోగా రెండు-మూడు అవయవాల్ని పోగొట్టు కోవడం కూడా అపురూపం కాదు. పూర్వనేఅస్థులైన ఆ వికలాంగుల్ని సమాజం భరించా లంటే— వారిని జీవితాంతం చెఅసాలలో పెట్టేదాని కన్నా కూడా చాలా ఎక్కువ ఖర్చవు తుంది.

తప్పులు చేసేవారంతా "చాలా మంచి పని చేస్తున్నాం. తెలివైన పని చేస్తున్నాం" అనుకుం టూనే చేస్తారు. అది మంచి కాదనీ, చెడు అనీ, అది తెలివి కాదనీ, శుద్ధ తెలివితక్కువతన మనీ వారికి బోధపఱచడంలో మనం సఫలీకృతులమైన మఱుక్షణం వారు నిలువెల్లా మారిపోతారు. ఎందుకంటే ఈ ప్రపంచంలో ఎవఱైనా రెండు విషయాలకి లొంగిపోకుండా

ఉండడం అసాధ్యం. ఒకటి ప్రేమ. రెండోది, వాస్తవికతతో ఒప్పించగల తర్కం. మన దగ్గఱ ఈ రెండూ లేనప్పుడు మనకి కఠిన శిక్షలతో పని పడుతుంది. మనలోని హేతువాదాంశని అవతలివారే (నేఱస్థులే) అందుకోవాలనీ, వారే మన కోణంలోంచి ఆలోచించాలనీ మూర్ఖ ప్పట్టు పట్టి కూర్చున్నంతకాలం మనం నేఱాల్ని అఱికట్టలేం. ఎందుకంటే, నిజం చెప్పా లంటే, మనకి చేతకానిది వారు చేయాలని మనం డిమాండు చేస్తున్నాం. మన డిమాండు సంగతెలా ఉన్నా దురదృష్టవశాత్తూ వారికంత శక్తి లేకపోవచ్చు. తెలివైనవారమూ, పరి శుద్ధులమూ అనుకుంటున్న మనమే అవతలివారి (నేఱస్థుల) లోని హేతువాదాంశని అందు కునే శ్రమ తీసుకోవాల్సి ఉంది.

ఉదాహరణకి– మానభంగానికి పాల్పడేవారిలో ఎక్కువమంది రతిశాస్త్రం (sexology) లో గానీ స్త్రీ మనోవిజ్ఞానంలో గానీ కనీస పరిజ్ఞానం లేనివారై ఉంటారు. దాన్ని సమగ్రంగా కలిగించడం ద్వారా సదరు నేఱప్రేరణల్ని చాలావఱకూ తగ్గించవచ్చు. అంతే గానీ వ్యక్తులు వ్యక్తిగత స్థాయిలో పాల్పడే నేఱాలకి ప్రతిగా వారి మీద వ్యవస్థ తరఫున సామూహిక హింస కి పాల్పడడం పరిష్కారం కాదు.

**మూడో పొఱపాటు–** ప్రతి నేఱాన్నీ అవకాశిక నేఱం (opportunistic crime) గా భావించడం. అంటే అవకాశముంటే ప్రతివారూ నేఱం చేస్తారనే సిద్ధాంతం. అందుచేత అలా చెయ్యకుండా కఠిన శిక్షలతో బెదిఱించి ముందే మనుషుల మనసుల్లో భయాన్ని నాటా లనే ప్రతిపాదన. ఇదే నిజమైతే ఱేపు మనిషికో పోలీసు చొప్పున నిఘా పెట్టాల్సి వస్తుంది. మళ్లీ ఆ పోలీసుల మీద కూడా తలకో గూఢచారి చొప్పున పెట్టాల్సి వస్తుంది. ఎందుకంటే ఈ సిద్ధాంతం ప్రకారం ప్రతి మనిషీ కాబోయే నేఱస్థుడే కదా! "ఇలాంటి మానసిక ప్రతి బంధకాన్నే సృష్టించాలనుకుంటే అది ఈ పద్ధతిలో కాకుండా పైన పేర్కొన్న నాగరిక పద్ధతి లో చెయ్యడానికి అవకాశమే లేదా?" అని అడుగుతున్నారు మానవతావాదులు.

**నాలుగో తప్పుడు అవగాహన–** "బాధితుల మానవహక్కుల్ని నేఱస్థుడు గౌరవించనప్పుడు అతని మానవహక్కుల్ని 'మనం' ఎందుకు గౌరవించాలి?" అని చాలామంది ప్రశ్నిస్తూం టారు. "అతను వాటి ప్రాధాన్యం తెలియక ఉల్లంఘించాడు. తెలుసునని చెప్పుకుంటున్న వారిమి 'మనం' ఎందుకు ఉల్లంఘించాలి?" అని మానవతావాదుల ప్రశ్న. మఱో విషయ



మేంటంటే– ఈ వ్యవస్థలో ప్రస్తుతం జఱుగుతున్నది, తప్పు చేశారని నిస్సందేహంగా నిర్ధా రణ అయ్యాక దోషుల మానవహక్కుల్ని హరించడం కూడా కాదు. తప్పు చేశారనే ఆరోపణ (వట్టి ఆరోపణ లేదా ప్రచారం మాత్రమే) వచ్చీరాగానే హరించేస్తున్నారు — అందుకోసమే కాచుక్కూర్చున్నట్లుగా!

ఇక్కడ చాలామంది మర్చిపోతున్న మఱో కీలకం ఏంటంటే, కఠిన శిక్షల అమలుసంస్థల్లా దోషి– మానవ హక్కుల పట్ల నిబద్ధత చూపాల్సి ఉన్న ఏ అధికారిక వ్యవస్థకీ ప్రతినిధి కాదు. ఎక్కువ సందర్భాల్లో అతని/ఆమె యొక్క అమానుషత్వం తన స్వంతమైన ఓ అధికారిక వ్యవస్థ తరఫున, ఆ రకమైన హోదాలో చూపేది కాదు. అతనొక్కడి వ్యక్తిగత హోదాలో అరు దుగా దొరకబుచ్చుకున్న అనుకూల పరిస్థితుల మధ్య ఎవఱో ఒక్కఱి పట్ల చూపేది. కానీ కఠిన శిక్షల పేరుతో వ్యవస్థాగతంగా నేఱస్థుల పట్ల చూపే క్రౌర్యం ఓ పెద్ద అధికారిక వ్యవస్థ తరఫున సామూహికంగా పాల్పడేది. ఈ అధికారిక అమానుషత్వం నేఱస్థుడి విషయంలో మాదిరి యాదృచ్ఛికం కాదు. లిఖిత చట్టాల రూపంలో ప్రణాళికాబద్ధమూ, వ్యవస్థీకృతమూ. ఆ రకంగా ఇది నేఱం చేసిన ఒకఱికి పరిమితం కాదు. అనేకమంది ఇతరుల్ని సైతం అక్ర మంగా ఇఱికించడానికి ఉపయోగపడేది. ఇది ఒళ్ళో ఉన్నవాణ్ణి (కస్టడీలో ఉన్న నేఱస్థుణ్ణి) చంపడం లాంటిది. తద్వారా ఇది చెదుఱు మదుఱు ప్రైవేట్ నేఱాల కంటే ఘోరమైనది.

**ఐదో ప్రచారం–** *"ఫలానా నేఱం ఱేపు మన మీదా జఱగొచ్చు"* ఈ వాదన కూడా మీడియా ప్రచారం చేసినటువంటిదే. ఈ వాదం "మనుషులంతా సహజంగా పాపులూ, నేఱస్థులూ" అనే అభిప్రాయానికే రూపాంతరం, లేదా విస్తరణ. ఇది సంభావ్యతా సిద్ధాంతాన్ని (Theory of Probability) కాలదన్నే అశాస్త్రీయ ప్రచారం. "అసలిది ఓ వాదం కూడా కాదు. ఓ తరహా మానసికవ్యాధి" అనడానికి సైతం నేను సంకోచించను. ఇదే గనక నిజమైతే, ఎవఱో ఒకాయన అప్పులు తీర్చలేక ఆత్మహత్య చేసుకున్నాడు గనక బ్యాంకులింక భవిష్య త్తులో ఎవ్వఱికీ అప్పులివ్వకుండా నిషేధించాలి. ఎవఱో ఒకమ్మాయి కన్నతండ్రి చేతుల్లోనే మానభంగానికి గుఱైందని చెప్పి కుటుంబాలకి తండ్రులే లేకుండా చేయాలి. ఏమైనా అర్థ ముందా ఇందులో? (కఠిన శిక్షలు కావాలని డిమాండు చేసేవారి అతివాదం ఈ పై ప్రతిపా దనలకి తీసిపోదని గమనిక)

మనుషుల్లో ప్రతీప స్పందనల్ని (negative reflexes) రెచ్చగొట్టడం ద్వారా వారిని మార్చడమూ, లోకాన్ని సుజీవాస్పదం (better place to live) గా చేయడమూ సాధ్యం కావు. భయమూ, ఆశపోతుతనమూ ఇలాంటి ప్రతీప స్పందనలే. అందుచేత భయపెట్టడం ద్వారానో, ఫలానా లబ్ధి చేకూఱుస్తామని ప్రలోభపెట్టడం ద్వారానో వారిచేత ఒక చెడ్డపని శాశ్వతంగా మానిపించడం గానీ, లేకపోతే మంచి పనులకి మప్పడం గానీ అసంభవం. అలా చేస్తే భయపెట్టేవారు కనుమఱుగయ్యీ కాగానే మళ్ళీ ప్రాత పనులకే దిగుతారు. లేదా మంచి పనుల వల్ల లబ్ధి ఏమీ కలగదనిపిస్తే అవి చేయడం మానుకుంటారు. రోగం ఒక చోట ఉంటే మందు ఇంకో చోట పూయడం వల్ల ప్రయోజనం లేదు. అందుచేత కఠిన శిక్షల వల్ల సమాజం బాగుపడేది కల్ల.

**కఠిన శిక్షల మూలాన సుదూర భవిష్యత్తులో ప్రజాస్వామ్యానికి వాటిల్లే హాని:** మీడియా ఏ అంశం మీద గగ్గోలు లేవనెత్తినా వెంటనే దాని గుఱించి అప్రమత్తమై అతిచర్యల (over -actions) కి దిగడమూ, తద్ద్వారా ప్రజల్లో తమకి చెడ్డపేరు రాకుండా తమ పీఠాలు కదల కుండా జాగ్రత్త పడడమూ సమకాలీనంగా కనిపిస్తున్న దృగ్విషయం (phenomenon).

పాలకుల విషయానికొస్తే వారీ అతిస్పందనా పరంపరలో భాగంగా చిత్రవిచిత్రమైన చట్టాలు తెస్తున్నారు. ఇవి ఎక్కువభాగం దూరదృష్టి మాలినవీ, వోట్-బ్యాంకుల్ని లక్షించినవీ, పూర్తి అశాస్త్రీయమైనవీ, మీడియాకీ ఇంకా అలాంటి అవగాహనారహితులైన అర్ధవిద్యావంత వర్గా లకీ మాత్రమే చక్కిలిగిలి పెట్టేవీ. కఠిన శిక్షాచట్టాలు కూడా ఈ అతిచర్యల్లో భాగం. "అసలు ఇప్పటికి ఉన్నవే అమానుషమైన చట్టాలూ, అమానవీయ విధివిధానాలూ" అని వాపోతూం డగా మళ్ళీ అంతకన్నా అధ్వాన్నమైనవి తెచ్చి ప్రజల మెడకి ఇంకా బిగుతుగా బిగించమని వ్రాతలు వ్రాస్తూ ప్రభుత్వాన్నీ ప్రజల్నీ ఓ పద్ధతి ప్రకారం ఎగసన ద్రోస్తోంది మీడియా. ఇందు లో ఇంకా విచిత్రమైన విరోధాలంకారం ఏంటంటే వాటి మూలంగా వాస్తవంగా నష్టపోయే ప్రజలనే వాటివల్ల లాభపడబోతున్నవారుగా నమ్మించడంలో అది సఫలీకృతం కావడం.

తానిలా అత్యుత్సాహంతో సృష్టిస్తున్న ఈ అమానుషత్వపు విషవలయంలో మీడియా ఏదో ఒక రోజున తానే కంఠదఘ్నంగా ఇఱుక్కోవడం ఖాయం. అయితే అంతకు ముందే ఏం జఱగబోతున్నదో ఊహించడం మానవతావాదులకి కష్టం కాదు. కేవలం ఆరోపణనే ప్రత్యక్ష



సాక్ష్యంగా భావిస్తూ Benefit of doubt కి తావివ్వని ఈ కఠిన శిక్షలు మొదట్లో– మీడియా లేవనెత్తి గగ్గోలు పెట్టిన ఒకటి-రెండు నేఱాల్ని అదుపు చేయడం కోసమే మొద లవుతాయి. తరవాత అవి క్రమక్రమంగా అన్నిరకాల నేఱాలకీ విశృంఖలంగా విస్తరించబడే ఆస్కారం లేకపోలేదు. అటుపిమ్మట తమ వ్యాపార/రాజకీయ ప్రత్యర్థుల్ని తప్పుడు కేసుల్లో ఇఱికించి వారిని శాశ్వతంగా తుదముట్టించడం కోసం అవి ఉపయోగపడే అవకాశం ఉంది. ఈ క్రీడలో విజేతలైనవారే సమాజాన్ని శాసించగలుగుతారేమో తెలీదు. కఠిన శిక్షల ద్వారా అలా ప్రజాస్వామ్యం దశల వారీగా హతమార్చబడుతుంది.

**ఆరోపితుల పట్ల వ్యవస్థలూ, సంస్థలూ చూపే క్రౌర్యం :** మనుషులు తప్పుచేసినట్లు సందే హాల కతీతంగా రుజువుకాకముందే, ఎవఱో ఏదో అన్నారనీ, లేదా తప్పు జఱిగినట్లు అను మానం ఉందనే ఆషామాషీ కారణాల్ని పురస్కరించుకొని వారిని వైయక్తిక స్థాయిలో గానీ, సంఘస్థాయిలో గానీ వ్యవస్థాగతంగా గానీ బాధించడం/అవమానించడం అనే అశాస్త్రీయ కార్యకలాపానికి నవ్యమానవతావాదుల మద్దతు ఎప్పటికీ ఉండదు. కానీ సమకాలీనంగా ఆరోపితుల్నీ (the accused) వారి కుటుంబాల్నీ సంపన్న కుబేర మీడియా ద్వారా రోజు వారీ ప్రాతిపదికన భారీ ఎత్తున బద్నామ్ చేస్తున్న ధోరణి వాడుకలో ఉంది. ఇది ఓ 50 మంది లారీలో వెళ్ళి ఒకణ్ణి పొడిచేసి రావడం లాంటిది. దీని లోతు గమనిస్తే ఇది చాలా అమానుషంగా మానవతావిరుద్ధంగా గోచరిస్తుంది. ఇది నాగరిక సమాజంలో అభ్యంతరాల నెదుర్కోకుండా ఎలా అప్రతిహతంగా చెల్లుబాటవుతోందో మనకింకా అర్థం కావాల్సి ఉంది.

ఈ అమానుషత్వానికి అమలుసంస్థల (enforcement agencies) మద్దతు చూస్తే ఇంకా ఆశ్చర్యంగా ఉంటుంది. "చదువుకున్నవారు, ఓ ప్రజావ్యవస్థలో భాగమైనవారు ఇంత అనా లోచితంగా ఇంత అమానుషంగా, ఇంత దూరదృష్టి లేకుండా ప్రవర్తిస్తారా?" అని దిగ్భ్రాంతి కలుగుతుంది. ఎందుకంటే అరెస్టయిన ఆరోపితుల్ని మీడియా ముందు ప్రవేశపెట్టి ఛాయా చిత్రాలూ, దృశ్యకాలూ (photos and videos) దిగడం లాంటివి చేస్తున్నారు. ఆ ఆరోపి తులు నిజంగా తప్పు చేశారో లేదో వాటి వీక్షకులెవఱికీ తెలీదు. కానీ ఆ బహిరంగ చిత్రాల తో వారి మీద శాశ్వతంగా బుఱద జల్లుతారు. ఒకవేళ కాలగతిలో ఆ ఆరోపితులు నిర్దోషు లుగా బైటపడినా దోషులుగా శిక్ష ననుభవించినా ఆ చిత్రాలు మాత్రం ప్రభుత్వం దగ్గఱా మీడియా దగ్గఱా శాశ్వతంగా భద్రపఱచబడి ఉంటాయి. ఆ ఆరోపితులు భవిష్యత్తులో

సంఘజీవితంలో మళ్ళీ అడుగుపెడదామనుకుంటే వాటి సహాయంతో ప్రాత జ్ఞాపకాల్ని కెలికి వారి యొక్కా వారి వారసుల యొక్కా భవిష్యత్తుని నాశనం చేయడం అత్యంత సుకరం.

ఆ విధంగా ఒకసారి ఒకటి పరువు తీసేశాక, ఆ పరువునష్టాన్నుంచి ఆరోపితులూ, వారి కుటుంబసభ్యులూ జీవితాంతం కోలుకోలేరు. ఒకవేళ ఆ ఆరోపితులు కాస్త సున్నిత మనస్కులై, ఈ వ్యవస్థల/సంస్థల దుశ్చేష్టలకి తట్టుకోలేక కోలుకోలేని విధంగా జబ్బుపడితే, లేదా ఏదైనా అఘాయిత్యానికి పాల్పడితే ఆ బాధ్యత ఎవటిది ? లేదా వారు వ్యవస్థ మీద కక్ష గట్టి సంఘం నుంచి నిష్క్రమిస్తే ఆ బాధ్యత ఎవటిది? గతంలో మన సమాజంలో ఇలా చాలాసార్లు జఱిగినా బుద్ధి తెచ్చుకోనివారు "కఠిన శిక్షలతో అందఱికీ బుద్ధొచ్చేస్తుం" దంటూ ప్రచారానికి దిగడం ఆశ్చర్యా న్ని కలిగిస్తుంది.

గుంపులకీ, అవి బుఱదజల్లే వ్యక్తులకీ మధ్య బ్రహ్మాండమైన శక్తి-అసమతూకం (power imbalance) ఉందని కూడా గమనించాలి. ఏదో ఒక ఆరోపణను పురస్కరించుకొని వారు తమమీద చేస్తున్న దుష్ప్రచార దాడిని ఎదుర్కొనే శక్తి మన సమాజంలో ఏ వ్యక్తికీ లేదు. ఎంత ఆరోపితులైనప్పటికీ వారు సాపేక్షంగా బలహీనులు కనుక ఈ రకమైన విచక్షణారహితమైన వాచాదాడుల నుంచీ, వార్తారూప హింసాకాండ నుంచీ, లిఖితరూప దౌర్జన్యకాండ నుంచి మానవతాదృష్టితో వారికి రక్షణ కల్పించాల్సి ఉంది.

అదే సమయంలో సంఘమూ, వ్యవస్థా కూడా ఆరోపకుల (ఫిర్యాదీల) పట్లా, ఆరోపితుల పట్లా సమదృష్టిని అవలంబించాల్సి ఉంది. ఏ ఒక్కటి పక్షమూ వహించే పని లేదు. ఎవటినీ పూర్తిగా నమ్మాల్సిన అగత్యం లేదు. "అది ప్రాథమికంగా మన గొడవ కాదు, వారి మధ్య గొడవ" అని గమనించాలి. అయితే ఉభయపక్షాలూ మన వారే అవుతారు. కాకపోతే వారూ మనకేమీ కారు. వీరూ మనకేమీ కారు. వారు మనకేదైనా అయితే వీరూ మనకేదో అవుతారు.

ఈ సూచన - సింహాన్ని శాకాహారిగా మారమని ప్రార్థించడం అవుతుందేమో నాకు తెలీదు.



## 10. క్షమాగుణం

ప్రపంచం సర్వానవద్యం (all perfect) గా సృష్టించబడలేదు. మనం ప్రకృతిలోని పదార్థాల్ని సంస్కరించుకొని, మార్పుచేసుకుని వాడుకుంటున్నాం. వాటి మీద నిందారోపణలు చేసి దూషించడం లేదు. మనుషులనైనా అంతే చేయాలి. మానవులూ పూర్తిసౌష్ఠవంగా సృష్టించబడలేదు. దీనికి ఎవఱూ మినహాయింపు కాదు. ఈ సత్యాన్ని మనసా-వాచా-కర్మణా అంగీకరించి, సకల సౌష్ఠవాశంసల (all expectations of perfection) నీ పక్కన బెట్టి మనుషుల్ని ఉన్నవారిని ఉన్నట్లుగా, వారి యొక్క యావత్తు సల్లక్షణాలతోనూ, విలక్షణాలతోనూ, అవలక్షణాలతోనూ సమగ్రంగా అంగీకరించి ప్రేమించడం, మనసారా క్షమించడం నేర్చుకోవడమే మానవతావాదం.

"నాకేం అవసరం?" అనడం అతార్కికం. తోటిమానవుల ప్రేమసానుభూతులు ప్రతిమనిషికీ అవసరమే. ఎంతటి బలవంతుడికైనా అవసరమే. మనమిప్పుడు ఇతరుల్ని క్షమిస్తే భవిష్యత్తులో క్షమాపణ కోరేందుకు మనకీ, మనవారికీ అర్హత సిద్ధిస్తుంది. మనుషులు పరిస్థితుల్ని బట్టి మాత్రమే మంచిగానో, చెడుగానో ముద్రపడతారు తప్ప వాస్తవానికి వారు అదీ కాదు, ఇదీ కాదు. తమ పరిస్థితులు అనుకూలిస్తే వారూ మంచిగానే ముద్రపడతారు. ఉదాహరణకి - మన దేశంలో ఒకప్పుడు ప్రేమలో పడ్డ స్త్రీ బరితెగించినదానికిందే జమ. "ప్రేమే నేఱమౌనా?"అని విషాదగీతాలు పాడుకోవాల్సిన పరిస్థితి. ఇప్పుడు కాదు.

ప్రపంచం- తప్పుచేసేవారూ, చేయనివారూ అని ఖరాఖండిగా సమవిభక్తమై లేదు. ఇతరులకి తెలిసేలా తప్పుచేసేవారూ, రహస్యంగా చేసేవారూ అని మాత్రమే విభక్తమై ఉంది. ఆ అపరాధాల తీవ్రత ఎంత? అనేది తరువాతి విషయం. మనుషులు జయప్రదంగా తప్పు చేయాలంటే అందుకు 4 మునువలయికలు (prerequisites) ఉంటాయి. అవి- అవసరమూ, అవకాశమూ, శక్తీ. నాలుగోది- ఈ మూడూ యుగపత్తు (simultaneous) గా ఒనగూడడమూ. ఇవి అందఱి విషయంలోనూ ఒనగూడవు. కనుక అందఱినీ కాబోయే నేఱస్థులు (criminals in waiting) గా చూడడం అసమంజసం.

**ఎట్లాంటి తప్పులైనా అవసరం, అజ్ఞానం, ఆవేశం అనే మూడు కారణాల్లో ఏదో ఒకటి**

**పురస్కరించుకునే జఱుగుతాయి. క్షమార్హ్వం కానిది వీటిల్లో ఒక్కటీ లేదు.** కఱుడుగట్టిన నేఱస్థులతో సహా తప్పులు చేసేవారంతా ఏదో ఒకటి, లేదా రెండు విషయాల్లో మాత్రమే చేస్తారు. ప్రతి ఒక్క విషయంలోనూ తప్పుడు దారిలోనే నడుచుకునేవారెవఱూ లేరు. అలాగే మనం మంచివారనుకుంటున్నవారు కూడా బట్టబయలుగా తెలిసిన కొన్ని విషయాల్లోనే మంచివారై ఉంటారు. సాధారణంగా– బల్లెల్ని తినేవాణ్ణి చూసే దాకా మనం గొల్లెల్ని తినే వాడే పరమ దుర్మార్గుడని భావిస్తూంటాం. ఏతావతా– తప్పుడు మనుషులని ముద్ర వేయ బడ్డవారిలోని మంచి లక్షణాల్ని సైతం గుర్తించమని నవ్యమానవతావాదం చెబుతోంది.

కొందఱు కొన్ని విషయాల్లో తప్పు చేయడానికి ఎంచుకుంటే మఱి కొందఱు మఱికొన్ని విషయాల్లో ఎంచుకుంటారు. ఒకఱు చేసే తప్పే ఇంకొకఱు కూడా చేయాలని ఏమీ లేదు. కొన్ని తప్పులకి శిక్షలు వ్రాసి పెట్టారు. కొన్నిటికి వ్రాయలేదు. అంతే తేడా. ఓ ఖైదీకి మఱో ఖైదీని ధర్మించే అధికారం లేదు. కనుక సంపూర్ణ పరిశుద్ధుల కోసం గాలించాల్సి ఉన్న ఈ మర్త్యలోకంలో మానవులు ఒకఱి నొకఱు క్షమించుకోవడమే సమంజసం. ఎందుకంటే తప్పులకీ, అనైతికతకీ సంబంధమేమీ లేదు. రెండూ ఒకటి కాదు. తప్పొప్పులనేవి సంఘ దృష్టి. అనైతికత వ్యక్తిగత మూలం గలది. ఎందుకంటే దానికి విరుద్ధమైన నీతి సైతం వ్యక్తిగతం (మనస్సాక్షికి సంబంధించినది). కనుక తప్పులు చేసిన ప్రతివారినీ అనైతికులుగా చూడడం సరికాదు. పొఱపాటున చేసేవాటికీ, ఉద్దేశపూర్వకంగా చేసేవాటికీ తప్పులనే సామాన్యనామాన్ని (common nomenclature) తగిలించి ఒకేలా చూడడం తెలివితే టలు కాదు.

మనం ఇతరుల్ని క్షమించలేకపోవడానికి అసలైన కారణం– మనమేదో మహాపవిత్రులమనీ, అవతలివారు మాత్రమే కళంకితులనీ మనలో మనకి తెలియకుండానే నాటుకుపోయిన ప్రగాఢమైన మూఢవిశ్వాసం. వాస్తవమేంటంటే, మన వార్తాపత్రికల్ని జాగ్రత్తగా చదివిన ప్పుడు నీతీ, న్యాయం అనేవి సమకాలీన సమాజంలో ఎవఱికీ అవసరమున్నట్లు కనిపిం చదు, వాటి గుఱించి మూరెడు, బారెడు ఉపన్యాసాలిచ్చేవారితో సహా! అందఱికీ నూటికి నూఱుశాతం కావాల్సినదీ, ఎక్కువమంది అహర్నిశం తాపత్రయ పడిపోతున్నదీ బ్రతకడం కోసం. ఎలాగైనా సరే, బ్రతకడం కోసం. ఏం చేసైనా సరే, సమాజంలో ఓ సభ్యుడుగా, దాని కనుగుణంగా ఒదిగిపోయి (conform అయి), అందఱిలోనూ తానో విచిత్రవ్యక్తి అని



పించుకోకుండా మనగల్గడం (survival) కోసం. ఈ క్రమంలో నీతీ, న్యాయం అనేవాటిని గోడచాటుకి తీసుకెళ్ళి లోపాయికారీగా క్షమాపణలు చెబుతూ, "ఏమీ అనుకోవద్దయ్యా ధర్మ దేవా! మా శక్తి ఇంతే" అని వీడుకోలు పలకడానికి ఎవఱికీ అభ్యంతరం లేదు. అంతా ఇంతే ఐనప్పుడు, ఇలాంటి వాతావరణంలో ఎవఱిని క్షమించడానికైనా మనకెందుకు అభ్యం తరం ఉండాలి ? మిగతావారందఱినీ బేషరతుగా భరించడం లేదూ?

"ఓ పని చెడ్డది కావచ్చు. కానీ దాన్ని చేసిన మనిషి దాన్ని చేసినంతవఱకే చెడ్డవాడు. అది చేయడం మానేసినా, లేదా అతను అందుకు క్షమాపణ చెప్పినా, లేదా తన పనికి అతను తగువిధంగా పరిహారం చెల్లించుకున్నా అతనూ మంచివాడే అవుతాడని నవ్యమానవతా వాదం చెబుతుంది. "అతను ఆ ఒక్క విషయంలో సరిగా ప్రవర్తించలేదు. అతను ఆ సమ యంలో కాస్త నిగ్రహం పాటించి ఉంటే బావుండేది" అనడం వఱకే నవ్యమానవతావాదులు పరిమితమవుతారు.

నేఱస్థులు కూడా మానవులేననీ, వారు కూడా కాలక్రమంలో మారడానికి అవకాశ ముందనీ మర్చిపోయేలా చేస్తూ, "కీచకుడు, రావణుడు" అంటూ పురాణ ప్రతినాయకుల నామాలతో వారికి లేని వ్యక్తిత్వాల్ని అపాదించడం. వారిని కృత్రిమంగా బూచాళ్ళుగా మార్చడం. ఆ విధ మైన ఊకదంపుడుతో జనసామాన్యానికి దుర్నిగ్రహమైన భావోద్వేగాల్ని కలిగించడం. సంపన్న కుబేర మీడియా పాల్పడే ఈ రకమైన అమానవీయ కార్యకలాపాల్ని నవ్యమాన వతావాదులు ఎట్టి పరిస్థితుల్లోనూ హర్షించరు.

ఎంత వయసొచ్చినా, ఎంత పెద్దహోదాలో ఉన్నా. నేఱస్థులతో సహా అందఱివీ ప్రక్రియ (process) లో ఉన్న వ్యక్తిత్వాలే. పూర్ణపురుషులంటూ ఇక్కడ ఎవఱూ లేరు. 120 ఏళ్ల ఆయుర్దాయమున్నవాడి క్కూడా జీవితం మొత్తం ఓ అభ్యసనప్రక్రియే. అందఱమూ జీవితాం తం నేర్చుకునేవారిమే. కాబట్టి ఓ వ్యక్తి ఏదో ఒక బలహీన భావోద్వేగక్షణంలో పట్టుతప్పి ఏదో చేస్తే, "అతను అదే" అని శాశ్వతంగా ముద్రవేసేయడం సరికాదు. కాబట్టి సమాజం లో తొలితప్పిదాల్ని క్షమించే వెసులుబాటు ఉండాలి. అదే విధంగా మనుషులు అంతకు ముందు సమాజానికి చేసిన సేవను దృష్టిలో ఉంచుకొని క్షమించే వెసులుబాటు కూడా ఉండాలి. ఎందుకంటే క్రిమినల్ చట్టాలన్నీ సాధారణంగా మహాబలశాలుల్నీ, పరమ కిరాత కుల్నీ దృష్టిలో ఉంచుకుని వ్రాయబడతాయి. కానీ దరిమిలా, అవి అంతకంటే చాలా తక్కువ

తీవ్రత గల తప్పులకీ, ముందస్తు నేఱచరిత్రేదీ లేని అత్యంత సాధారణ, బలహీన పౌరులకీ, అక్రమంగా వ్యాజ్యాల్లో ఇఱికించబడ్డ మధ్యతరగతి మనుషులకీ, పేదలకీ అనువర్తించబడతాయి.

ఏదైనా పొఱపాటు చేసినవారు క్షమాపణ చెప్పే సంస్కృతీ, అది చెప్పినప్పుడు అలా చెప్పిన వారిని క్షమించే సంస్కారమూ పెంపొందాలి. సహృదయులైన రెండు పక్షాలవారి మధ్య చోటుచేసుకున్న నిజాయితీతో కూడిన క్షమాపణలు వారి యొక్క దెబ్బదిన్న మానవ సంబంధాల్నీ, సంఘంలో శాంతినీ అత్యద్భుతంగా పునరుద్ధరిస్తాయి. కానీ ఈ రోజుల్లో క్షమాపణల్ని అవతలివారిని క్షమించడానికి కాకుండా, వారు తప్పుచేశారనడానికి తిరుగులేని ఆధారంలా వాడుకోవడాన్ని గమనించవచ్చు. అంతేగాక మన దేశంలో క్షమాపణలకు వ్యవస్థాగతమైన విలువ లేకపోవడం మూలాన క్షమాపణ చెప్పడం కూడా ఓ పెద్ద బెడద (risk) గా తయారై, ఆ సహృదయ సంస్కృతే క్రమంగా మఱుగున పడి అంతరించిపోతోంది. సౌదీ అరేబియాలో బాధితులు బాధకుల్ని క్షమిస్తే అభియోగం (case) ఉండదట. మంచి వివేకవంతమైన (sensible) ఏర్పాటు. కందకి లేని దుఱద, కత్తి పీటకెందుకు? కానీ మన దేశం నిండా ఉన్నవి అలాంటి కత్తిపీటలే.

క్షమాపణ చెప్పడం జనం అనుకుంటున్నంత సులభమైన పని కాదు. దానికి చాలా సంస్కారం కావాలి. అలాగే క్షమాపణ స్వీకరించడానిక్కూడా చాలా సహృదయం కావాలి. కక్షతో అహర్నిశం రగిలిపోతున్నవారికీ, కక్ష తీర్చుకునే అవకాశాలు పుష్కలంగా లభ్యమవుతున్నవారికీ, శత్రుత్వాల్ని పెంచుకోవడంలోనూ, బలప్రదర్శన చేయడంలోనూ అమందానందాన్ని అనుభవించేవారికీ, ఆత్మన్యూనతాభావం (inferiority complex) తో ప్రొద్దస్తమానం బాధపడేవారికీ క్షమాపణల్ని స్వీకరించేటంత హృదయగత సంస్కారం ఉండదు. కాబట్టి క్షమాపణ చెప్పినా చెప్పకపోయినా, వారు ఎదిరి మనుషులమీద కక్ష తీర్చుకుని తీఱతారు.

క్షమాపణలతో సంతృప్తి చెందుతామని చెప్పుకునేవారు కూడా అవతలివారు తమ కాళ్ళ మీద పడాలన్నట్లు డిమాండ్లు చేస్తారు. "బేషరతు క్షమాపణలు" ఆ రకమైన ఆశింపులలో ఓ భాగం. *"నువ్వు నీలా ఉండకుండా మేము డిమాండ్ చేస్తున్న విధంగా మారిపోవాలి, మారినట్లు కనిపించాలి"* అనడమే ఈ "బేషరతు"కు అంతరార్థం. ఒకఱు అలాగే బాహ్యంగా



క్షమాపణ చెబుతారు. కానీ ఆంతరికంగా మారరు. అప్పుడేం చెయ్యాలి ? ఎవఱినైనా సరే, కాళ్ళబేరానికి తెచ్చి అవమానించడం ద్వారా, వారి అహాన్ని దెబ్బదీయడం ద్వారా మార్చలేం, వారు మారాలని మనం నిజంగా ఆకాంక్షిస్తే ! తప్పు చేసినవారు తమ తప్పును తాము తెలుసుకుని తాముగా క్షమాపణ చెబితే ఆ విలువే వేఱు.

ఏ తప్పూ చేయకపోయినా క్షమాపణ చెప్పాల్సిరావడం విచారకరమైన పరిస్థితి. ఇది పలు సందర్భాల్లో– ఒకఱి అవగాహనాస్థాయి వేఱొకఱి అవగాహనాస్థాయికంటే ఎన్నో రెట్లు తక్కువగా ఉండడం వల్లా, ఇతరులు తనని అర్థం చేసుకోవడానికి తిరస్కరించడం వల్లా, వర్గీయ రాజకీయాల వల్లా, అనవసరమైన దుష్ప్రచారం వల్లా ఉత్పన్నం కావచ్చు. ఇలాంటి సందర్భాల్లో అవతలివారి కంటే తనకెక్కువ తెలిసిన పాపానికీ, అజ్ఞానుల పశుబలానికీ వ్యక్తి మూల్యం చెల్లించాల్సి వస్తుంది.

మనుషులు ఒక విధమైన స్వభావాన్ని కలిగి ఉండడానికి కొన్ని కారణాలుంటాయి. ఒక నేపథ్యం ఉంటుంది. ఆలోచనలూ, అనుభవాలూ, వాటినుంచి మనిషి తీసుకున్న పిండితార్థాలూ (conclusions), తత్త్వీకరణలూ (philosophizations) ఇత్యాది. అవి మారకుండా ఊరికే కాళ్ళ మీద పడ్డంతమాత్రాన ఆ స్వభావం మారదు. తెలిసిన అనుభవాల కన్నా భిన్నమైన అనుభవాలు వాటంతట అవి కలగాలి. మార్చగల సత్తా ఉన్నది వాటికే. అందుచేత ఒక మనిషి ఎంత జ్ఞాని అయినా, అధికారవంతుడైనా క్షమాపణ చెప్పించడం ద్వారా మఱో మనిషిని మార్చగలగడం నూటికి నూఱుశాతం అసంభవమైన విషయం. దానివల్ల తాత్కాలికంగా పని గడవొచ్చు. అంతకన్నా ఎక్కువ ప్రయోజనాన్ని ఆశించకూడదు. కనుక బలవంతపు క్షమాపణలనేవి, ఆ చెప్పించుకునేవారి ఓటమే తప్ప గెలుపు కాదు. కొట్టి నమస్కారం పెట్టించుకోవడం లాంటిదది. ఇతరుల్ని బాధపెట్టినవారు క్షమించమని అడగనంతకాలం తప్పు వారిది. క్షమించమన్న తరువాత కూడా క్షమించకపోతే ఆ తప్పు క్షమించనివారిదవుతుంది. అదీగాక క్షమాపణ అనేది ఆత్మగౌరవం గల వ్యక్తులనుంచి స్వచ్ఛందంగా, సహజంగా, వారిదైన శైలిలోనే రావాలి.

# 11. మానవ సంబంధాలు అధికారం చెలాయించడం కోసం కాదు

మానవజీవితం అనేక సంబంధాల్ని ప్రాపుగా చేసుకొని నడుస్తుంది. వాటిల్లో తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ, అక్కాచెల్లెళ్ళూ, భార్యలూ, భర్త, పిల్లలూ, బంధువులూ, మిత్రులూ, గురువులూ, శిష్యులూ, యజమానులూ, సేవకులూ ఇలా చాలా తరహాల వారుంటారు. చెప్పిన వెంటనే నమ్మశక్యంగా ఉండదు. కానీ ఈ మానవ సంబంధాల్లో ప్రాథమ్యక్రమం (order of priority) అంటూ ఏమీ లేదు. మనిషికి అన్ని సంబంధాలూ సమానంగా ముఖ్యమే. ఏ ఒక్కటి సరిగా లేకపోయినా మనిషి జీవితం దుఃఖభాజనమౌతుంది. ఎవఱు లేకపోయినా మనకు గడవదు. వాటిని పోగొట్టుకుంటే తప్ప అవి ఎంత పవిత్రమైనవో మనకర్థం కాదు. ఈ ప్రాధాన్యక్రమాలు ఏర్పడే పద్ధతిలో పెద్దగా బౌద్ధిక సంక్లిష్టతేమీ లేదు. అవి వాస్తవంగా ఏర్పడుతున్నది భౌతిక సామీప్యం వల్ల. ఎందుకంటే ఓ మానవసంబంధం నుంచి భౌతికంగా/భౌగోళికంగా దూరం జఱిగినవారు అనంతర దశలో వారిని తమ జాబితాలో కట్టకడపటి స్థానానికి దించేయడం కానవస్తుంది.

ఈ విషయంలో మతోపదేశాల నుంచి నవ్యమానవతావాదం విభేదిస్తుందని చెప్పుకోవచ్చు. మన దేశంలో పౌరాణిక మతం సమాజంలో అన్నిరకాల ఎగుడుదిగుళ్ళనీ పనిగట్టుకు ప్రోత్సహించినట్లే మానవ సంబంధాల్ని కూడా రకరకాల లెక్కలతో, అంచనాలతో, పోలికలతో అది ఎక్కువ-తక్కువ చేస్తూ వచ్చింది. మళ్ళీ అందులో చాలా ప్రక్షిప్తాలు చోటు చేసుకున్నాయి. ఓ చోటనేమో తల్లిని మించిన దైవం లేదని వ్రాసి ఉంటుంది. మఱో చోటనేమో గురువుని మించిన దైవం లేదని వ్రాసి ఉంటుంది. అంటే ఆయా స్థానాలకి స్వతహాగా పూజ్యత లేదని మనం అనట్లేదు. కానీ చూడబోతే, ఆయా శ్లోకాల రచయితల వ్యక్తిగత జీవితాల్లో ఏ మానవ సంబంధమైతే ప్రముఖపాత్ర పోషించి ఉంటుందో దాన్నే ఆకాశానికెత్తుతూ, "మిగతా సంబంధాలన్నీ దాని ముందు దిగదుడుపు" అన్నట్లు శ్లోకాలు వ్రాసినట్లు గోచరిస్తుంది. మళ్ళీ ఇందులో నరకాలూ, శిక్షలూ గట్రా!

ఏతావతా, వారివారి వ్యక్తిగత అనుభవాలతో నిమిత్తం లేకుండా అందఱూ తమలాగే



భావించి తీఱాలనే ఓ రకం బౌద్ధిక నిరంకుశత్వం సదరు సుభాషితాల్లో దర్శనమిస్తుంది. ఈ సందర్భంగా ఓ ప్రాథమిక జీవితవాస్తవాన్ని వాటి రచయితలు విస్మరించినట్లు తోస్తుంది. అదేంటంటే- ఒకఱు మఱొకఱిని ప్రేమించేదీ, గౌరవించేదీ, కేవలం సంబంధీకులు కావడం మూలాన కాదు. వారి మధ్య ఉన్న పరస్పర మన్నింపుల తీరు మూలానే. శుష్కమైన వావి-వరుసలూ, వట్టిపిలుపులూ ఏమీ చెయ్యలేవు. వాటిని సార్థకం చేసేదీ, జవసత్త్వాలు సమకూర్చిపెట్టేదీ మనసున్న మనుషులు. ఎందుకంటే అందఱిలోనూ నైసర్గికంగా స్వార్థమూ, అహంకారమూ ఉంటాయి. అవి తృప్తిపడేలా ఎవఱు తమను మన్నిస్తారో వారే వారికి ప్రియతములూ, పూజనీయులూ అవుతారు. తద్భిన్నంగా తమను బాధించినవారు తల్లైనా, తండ్రయినా, గురువైనా, భర్తైనా వారిని మనుషులు గౌరవించరు. అంటే, ఎన్ని శ్లోకాలు వల్లించినా ఆచరణలో తమ అనుభూతే తమ వేదం, తమ సుభాషితం. మందులకున్నట్లే మానవ సంబంధాల క్కూడా తుది గడువులు (expiry dates) ఉంటాయి. అవి దగ్గఱపడితే, ఏ బంధమైనా తెగాల్సిందే.

కొన్ని మానవ సంబంధాల్ని మాత్రమే అతిశయోక్తులతో ఉద్ద్యోతించడం (highlighting) వల్ల జనం దృష్టిలో మిగతావాటి ప్రాధాన్యం బాగా తగ్గిపోయింది. ఉదాహరణకి తల్లిని గొప్పదానిగా చేయడం కోసం తండ్రిని తగ్గించి చూపారు. భార్యని కూడా తగ్గించారు. తల్లిదండ్రుల్ని గొప్పవారుగా చేయడం కోసం గురువుల్ని తగ్గించి చూపారు. వీరందఱినీ గొప్పవారుగా చేయడం కోసం దేవుణ్ణి తగ్గించి చూపారు. ఈ దృక్పథమంతా తప్పుల తడక అని వేఱే చెప్పనక్కఱలేదు.

లౌకిక జీవనతలంలో, కేవలం "సన్నిహిత మానవ సంబంధం" అన్న కారణాన, ఏ ప్రత్యేకతా లేని మామూలు మనుషుల్ని దేవుళ్ళగా భావించడంలో చాలా ఇబ్బందులు ఉన్నాయి. ప్రమాదాలు కూడా ఉన్నాయి. ముఖ్యంగా "కొన్ని మానవ సంబంధాలు దైవసమానం" అని అనడం చేత ఆ స్థానాల్ని అధిష్ఠించినవారిని చాలా అధికారమూ, తజ్జనితమైన మదమూ ఆవహిస్తాయి. ప్రేమా, వాత్సల్యమూ తొణికిసలాడాల్సిన చోట అధికార సంబంధాలు (power relations) ఊపిరి పోసుకుంటాయి. వ్యక్తుల మధ్య ఆ అధికారం తాలూకు రాజకీయాలూ, అలాంటి ప్రవర్తనా మొదలవుతాయి. పరస్పర పిలుపులు కూడా మారిపోతాయి.

తమ లోటుపాట్లు బయట పడని విధంగా వ్యవహరిస్తే తప్ప తమనెవఱూ గౌరవించరనీ, అవతలివారి గౌరవాన్ని పొందితే తప్ప తాము వారిమీద పట్టు బిగించలేమనీ భావించడం మొదలుపెట్టాక మనుషులు మనసువిప్పి మాట్లాడ్డం కూడా మానేసి ప్రతీదీ గుంభనగా రహస్యంగా ఉంచడం నేర్చుకుంటారు. వారు నాలుగ్గోడల మధ్య ఒకలా, బయట ఇంకోలా, బొత్తిగా సంబంధం లేని ద్విపాత్రాభినయాలూ, త్రిపాత్రాభినయాలూ చేయడం ప్రారంభిస్తారు. తాము ఓ ఉన్నతస్థాయి సంబంధీకులమనే భావన వల్ల తమకి ఎదురుండకూడదనే ఉద్దేశంతో మనుషులు తమ సన్నిహితుల పట్లనే చాలా అపచారాలకి ఒడిగడతారు. ఆ రకంగా మానవ సంబంధాల వాతావరణం యావత్తూ కలుషితమైపోతుంది.

ముందు కుటుంబాల్లో మొదలయ్యే ఈ కాలుష్యం అటుపిమ్మట సమాజాన్నంతా చుట్టబెడుతుంది. త్వరలోనే ప్రతి మానవసంబంధమూ ఓ అధికార సంబంధం (power relation) గా అవతారం తాలుస్తుంది. ఆ క్రమంలో భార్యాభర్తలూ, గురుశిష్యులూ మొదలైన అన్ని సామాజిక ద్వంద్వాల్లోనూ స్నేహధోరణి ఆవిరైపోయి, కేవలం శాసించేవారితోనూ, ఆ శాసనాలకి చచ్చినట్లు తలొగ్గి తీఱాల్సిన వారితోనూ నిండి మానవ సంబంధాలు మరామత్తుల కతీతంగా పాడైపోతాయి. పుట్టినప్పట్నుంచీ ఇలాంటి అధికార సంబంధాలే తప్ప మానవ సంబంధాలంటే ఏంటో ఎప్పుడూ రుచిచూసి ఎఱగని జనం, వారిలో ప్రతి ఒక్కఱూ ఏదో ఒక రకమైన చిన్నమెత్తు అధికారం కోసం ఓ విచిత్రమైన ఆకలితో ఆవురావురుమంటూ, తమ పరిధిలో తాము ఇతరుల మీద ధాష్టీకం చెలాయిస్తూ వికృతమైన మానసికతృప్తినీ, వికటమైన ఆనందాన్నీ అనుభవించసాగుతారు.

ఆ ప్రక్రియలో, మనకు అత్తలుండరు. ఆడబాసులే ఉంటారు. బాసులుండరు. యముళ్లే ఉంటారు. ఇంటి యజమానులుండరు. శాడిస్టులే ఉంటారు. మనకు వాహన చోదకులుండరు. రోడ్డుకింగులే ఉంటారు. మనకు కార్యదక్షులైన ఉద్యోగులు కాదు, చెయ్యాల్సిన పని వదిలేసి పదోన్నతుల (promotions) కోసం తపించేవాళ్లే ఉంటారు. చాలా సహజం. ఎందుకంటే ఒకప్పుడు ఎవఱో మనల్ని ప్రేష్యులు (subordonates) గా మన్నిస్తేనే మనలో కూడా ఎవఱికైనా ప్రభుతులం (superiors) అయితే బావుంటుందనే కోరిక పొటమరిస్తుంది.



ఇలా అందఱూ కలిసి తమ తమ ఆత్మన్యూనతాభావాల (inferiority complex) కొద్దీ సృష్టించిన ఈ అమానవీయ వాతావరణం— మానవ సంబంధాలంటే అధికార సంబంధాలే మినహా మఱేమీ కాదన్న మనోభ్రాంతిని సృష్టిస్తుంది. ఈ భ్రాంతి దృఢపడే కొద్దీ మన అధికార పిపాస మఱింతగా దుష్పూర[1]మౌతుంది. మనుషుల మధ్య పరస్పరప్రేమా, గౌరవమూ నశించిపోయాక పనిచేసే ప్రేరణ సైతం అంతరిస్తుంది. దరిమిలా, వారిచేత పని చేయించడం కోసం పశువులకి మల్లే ఓ ములుగఱ్ఱతో ప్రతివారినీ, ప్రతిరోజూ పొడుస్తూనే ఉండాల్సి వస్తుంది. ఆ పొడవడం కూడా ఓ ప్రత్యేక ఫిలాసఫీగా, శాస్త్రంగా అవతరిస్తుంది. మళ్ళీ దానికి విశ్వవిద్యాలయాల్లో కోర్సులూ, ప్రొఫెసర్లూ, డిగ్రీలూ. దురదృష్టవశాత్తూ, మన సమాజంలో ఈ ప్రక్రియ (process) మొత్తం ఇప్పటికే పూర్తయింది.

ప్రతివారికీ అప్రయత్న మనోరుగ్ణతలా పట్టుకున్న ఈ అధికారదాహాన్నీ, ఈ వెకిలితనాన్నీ వదిలించి హుందాతనంతో కూడిన మానవ సంబంధాల మాధుర్యాన్ని పునరుద్ధరించాలంటే, మనం ముందు చేయాల్సింది– కొన్ని మానవ సంబంధాలు మాత్రమే దైవసమానమనీ, పవిత్రమనీ. మిగతావి కాదనీ అలవాటు చేయబడ్డ తరతరాల తప్పుడు భావజాలాన్ని వదిలించుకోవడం. వీటి మధ్య ఉన్న అంతరాలు కేవలం సందర్భానుసారమేననీ, పక్షాంతరంలో ఇవన్నీ సమానంగా ముఖ్యమేననే ఎఱుకని పెంపొందించుకోవడం. మనంతట మనం గౌరవాన్ని వాచ్యం (explicit) గా డిమాండు చేయకుండా, మనల్ని గౌరవించాలనే ప్రేరణ అవతలివారిలో స్వయంభువుగా కలిగే వఱకూ వేచి చూడడానికి సిద్ధపడడం.

మనుషులు అధికారాన్ని వదులుకోను ఇష్టపడకపోవడానికి కారణం– అది తప్పితే ప్రేమించబడడానికీ, గౌరవించబడడానికీ తమలో మఱి ఏ విశిష్టలక్షణమూ లేకపోవడమే. ప్రేమ స్వయంగా తానొక విశిష్ట లక్షణం గనుక దానికి అలాంటి భయాలుండవు. అధికారానికి ప్రేమ కూడా తోడైతే ఆ ఔదార్యానికి జనం కళ్ళు చెమ్మగిల్లుతాయి. తద్విపర్యాసంగా ప్రేమ మాలిన కేవల అధికారప్రదర్శన కటువుగా శాపనార్థాలు పెట్టబడుతుంది. ప్రేమకి అధికారం లేకపోయినా తానే అధికార నిర్విశేషమై కూటస్థం (passive) గా శాసిస్తుంది. అందుచేత మనం నేర్చుకోవాల్సింది అధికారం చెలాయించడాన్ని కాదు, ప్రేమ చూపించడాన్నే.

[1] నింపడానికి (తృప్తిపఱచడానికి) శక్యం కానిది (insatiable).

ప్రతి మానవసంబంధమూ అంతిమంగా పర్యవసించేదీ, పర్యవసించాల్సినదీ స్నేహశీలంలోనే. కొన్నిసార్లు కూఱిమి కన్నా చెలిమే గొప్పదీ, ఆత్మిక దివ్యత్వానికి నేదీయాంసమూ (nearer). లౌకికతలంలో 'నిర్మల ప్రేమ' అని పేర్కొనేటప్పుడు జన మనఃఫలకంపై వాస్తవంగా స్ఫురించే వక్తవ్యార్థం స్నేహమే. మనుషులు "తాము అధికుల"మనే భేషజాల్ని కట్టిపెట్టి, తొలుత తేలికపాటి హృదయంతో కూడిన నిరాడంబర స్నేహాన్నభ్యసిస్తే వారు మొదట మంచి మనుషులు కాగల్గుతారు. ఆ తరువాత మంచి తండ్రులూ అవుతారు. మంచి తల్లులూ అవుతారు. మంచిగురువులూ అవుతారు. మంచి పాలకులు కూడా అవుతారు. మానవ సంబంధాల్లో లేని అధికార అనాసక్తిని ఆర్థిక వ్యవస్థలోనూ, రాజకీయవ్యవస్థలోనూ ఆశించడం కేవలం నిష్ప్రయోజనం.

## 12. వ్యక్తుల మీద ఎవఱికీ హక్కులు లేవు

మనుషులు 'ప్రేమ' అనే భావనని "దేని మీదో, ఎవఱి మీదో హక్కుల్ని అనుభూతిల్లడానికీ అనుభవించడానికీ మానసిక అర్హత" అనే అర్థంలో తీసుకోవడం తఱచూ దృగ్గోచరమవుతుంది అంటే *"మేము ప్రేమిస్తున్నాం కాబట్టి లేదా ప్రేమగా చూసుకున్నాం కాబట్టి ఆ వస్తువు మాదే. ఆమె మాదే. ఆ వ్యక్తి మా వాడే."* అన్న భావన. ఏ రకంగా చూసినా ఈ భావనకి సమర్థన (justification) లేదు. ఓ వస్తువు మనకి మొదట్నుంచీ చెందనప్పుడు దాని మీది హక్కుల్ని దాని అసలైన యజమానులు వారంతట వారు ఓ పద్ధతి ప్రకారం మనకిస్తేనే మినహా మనకి దాని మీద హక్కులు సంక్రమించవు. అంటే ఓ వస్తువుని ఇష్టపడ్డంతమాత్రాన అది మనదేనని వాదిస్తే మనం చెఱసాలకి వెళ్ళేది ఖాయం.

ఐతే మనుషుల విషయంలో మాత్రం అలాంటి భయమేమీ లేకుండా యథేచ్ఛగా *"ఆ వ్యక్తి మాది/మావాడు. పూర్తిగా మాకే చెందుతుంది/చెందుతాడు. సర్వహక్కులూ ఉన్నది మాకే. (ఆ వ్యక్తి మా ఆస్తి)"* అని వాదించడం కనిపిస్తుంది. సంప్రదాయం నేర్పిన ఆలోచనలు కావచ్చు, చట్టాల ప్రభావం కావచ్చు, మొత్తమ్మీద మన సమాజంలో నూటికి నూఱుశాతం ఇలా వాదించేవారే ఉన్నారు. ఇది ప్రధానంగా కుటుంబ సంబంధాల విషయంలో జఱుగుతోంది. ఈ ఆలోచనా ధోరణి ప్రకారం– పిల్లలు తల్లిదండ్రుల ఆస్తి. వారి మీద వీరికి సర్వహక్కులూ ఉన్నాయి. వారిని వీరు ఏమని అయినా శాసించవచ్చు. వారిని వీరు ఏమైనా చేయొచ్చు. వారికి సంబంధించిన ప్రతి విషయమూ వీరిదే. ఎంత వయసొచ్చినా వారి విషయాల్లో వీరు వ్రేలుపెట్టొచ్చు. కాదనే హక్కు వారికి లేదు. వారు ఏ విషయంలోనైనా స్వతంత్రించి నిర్ణయాలు తీసుకుంటే వీరికి ద్రోహం చేసినట్లే.

ఇందులోనే మఱో ఆలోచనాపాయ ప్రకారం– అల్లుడు అత్తమామల ఆస్తి. ముఖ్యంగా ఆ అత్తమామలకి కొడుకులు లేనప్పుడు ! ఇంకో ఆలోచనాపాయ ప్రకారం– భార్య భర్త యొక్క ఆస్తి. ఆమెకి సంబంధించిన ప్రతీదాంట్లో అతను వ్రేలుపెట్టొచ్చు. ఆమె అనుమతి లేకుండా ఆమె వనరుల్ని యథేచ్ఛగా వాడుకోవచ్చు. ఆమె తరఫున ఆమె అధికారాల్నీ, హక్కుల్నీ తానే చెలాయించవచ్చు. ఒకవేళ ఆమె 'ఇదేం'టని అడిగితే మఱుక్షణమే పరిత్యాగ పత్రికకి పాత్రమవుతుంది. ఈ ఆలోచనాపాయకి చట్టపర మద్దతేదీ లేకపోయినా ఇది కొనసాగుతోంది.

అలాగే వేఱొక ఆలోచనాపాయ ప్రకారం భర్త భార్య యొక్క ఆస్తి. అతని ఆదాయం మీదా, ఆస్తుల మీదా హక్కు ఆమెది. వారిద్దఱూ విడిపోయినా ఈ హక్కుల్లో మార్పేమీ ఉండదు. ఈ ఆలోచనాపాయకి చట్టపర మద్దతు సంపూర్ణంగా ఉంది.

మనుషులు తమ కౌటుంబిక అనుబంధాల్లో ఇలాంటి సత్తా–స్వామ్యాల తరహా ఆలోచనలకి అలవాటుపడ్డాక కుటుంబ బాహ్యమైన మానవ సంబంధాల్లో కూడా వాటిని ప్రదర్శించడం మొదలుపెడతారు. ఈ ఆలోచనాధోరణిలో– ఉద్యోగులపై సర్వహక్కులూ సార్థవాహాల (companies) వి. వారెప్పుడు రమ్మంటే అప్పుడు రావాలి. ఎప్పుడు పొమ్మంటే అప్పుడు పోవాలి. వారిస్తేనే సెలవులు వాడుకోవాలి. ఉద్యోగులకి వ్యక్తిగత జీవితమనేదే ఉండకూడదు. వారు బ్రతకడం కోసం ఉద్యోగం చేయడం కాదు, ఉద్యోగం చేయడం కోసమే బ్రతకాలి.

నవ్యమానవతావాదం మానవ సంబంధాల్లో ఈ సత్తా–స్వామ్యాల ధోరణుల్ని ఆమోదించదు. వారివారి మధ్య పరస్పర ఆధారపాటు (mutual dependence) ఎంత స్థాయిలో ఉన్నప్పటికీ ఎవఱూ ఎవఱి ఆస్తీ కాదు. భౌతికంగా ఒక్కో వ్యక్తీ ఒక్కో స్వతంత్ర జీవవ్యవస్థ (independent biological system). ఆంతరికంగా ప్రతి మనిషీ తనకంటూ ఓ ప్రత్యేకమైన మనస్సూ, అహంకారమూ గల చైతన్యమూర్తి. ఎవఱి జీవవ్యవస్థనీ ఎవఱూ శాసించ

లేరు (అసలు తమ జీవవ్యవస్థని తామే శాసించలేరు). అలాగే ఎవటి ఆంతరిక చైతన్యాన్నీ ఎవఱూ పని చేయించలేరు. అదే విధంగా ఎవటి భూత–భవిష్యద్–వర్తమానాలూ ఎవటి చేతుల్లోనూ లేవు. అలాంటప్పుడు అవతలివారిని తమ ఆస్తిగా తలపోయడం సంబద్ధం కాదు. ఒకటిని తమ ఆస్తిగా తలచేవారు చనిపోయిన తరవాత కూడా అలా తలచబడేవారు హాయిగా బ్రతుకుతూనే ఉన్నారు గదా! వారితో పాటు వీరూ పోవడం లేదు గదా! మఱి తాము లేకపోయినా ఉండగలవారిని తమ ఆస్తిగా భావించడంలో అర్థమేమైనా ఉందా?

సామాజిక విషయాల్లో వ్యక్తుల మీద సమాజం చెలాయించే సత్తాస్వామ్యాలు మఱో రకంగా ఉంటాయి. ఓ మేధావి తమ కులస్థుడనీ, లేదా తమ రాష్ట్రీయుడనీ, తమ దేశస్థుడనీ అధివచించడం (claim చేయడం) తఱచుగా వినబడుతుంది. వివిధ గుంపులు ఇలాంటి అధివచనాల ప్రాతిపదికన జాతిమదాన్ని (jingoism) ప్రదర్శించడం కద్దు. వ్యక్తుల్ని మేధావులుగా చేయడానికి ఆయా గుంపులు సస్పృహం (conscious) గా, ప్రత్యేకంగా చేసిన ప్రయత్నమేంటి? చూస్తే వాస్తవంగా ఏమీ ఉండదు. ఆ గుంపుల మధ్య పుట్టి పెఱగడం వల్ల వారు మేధావులైన మాట నిజమే అయితే వారిలో అందఱూ ఎందుకలా కావడం లేదు? బహుకొద్ది మందే అయ్యారెందుకు? మహా అయితే ఆ సమాజాలు బౌద్ధిక వ్యాసంగాల (intellectual pursuits) కి కొంత అనుకూల వాతావరణాన్ని కల్పించి ఉండొచ్చు. కానీ అలాంటిదేదీ లేని రోజుల్లో కూడా చక్రాన్నీ, నిప్పునీ, వ్యవసాయాన్నీ కనుక్కున్న ఆదిమ న్యూటన్లూ, దిగంబర ఐన్‌స్టీన్ లూ, నిరక్షరాస్య స్వామినాథన్ లూ ఉన్నారు. వారు ఏ దేశస్థులో, ఏ జాతీయులో తెలీదు కాబట్టి బ్రతికిపోయాం వారూ, మనమూ కూడా!

ఏతావతా, సాధారణ పరిస్థితుల్లో వ్యక్తుల ప్రాధాన్యాన్ని అంగీకరించక పోవడం, కొందఱు వ్యక్తులు తాము పుట్టి పెఱిగిన సమాజం కంటే గొప్పవారని తేలిపోయిన తరవాత కూడా ఆ ముక్కకి సమ్మతించకుండా వారి గొప్పతనాన్ని తన ఖాతాలోనే వేసేసుకోవడం (అంటే పడిపోయాక కూడా తానే గెలిచానని వాదించడం) ఇదీ మొదట్నుంచీ సమాజం అవలంబిస్తున్న పద్ధతి.

దీనికో ప్రతీప పార్శ్వం సైతం లేకపోలేదు. కొన్ని సమాజాలు తమవారి గొప్పతనాన్ని తప్ప ఇంకెవటి గొప్పతనాన్నీ అంగీకరించవు. అందుచేత అన్యసామాజికులైన మేధావుల చరిత్రలకి గానీ, వారి రచనలకి గానీ అవి తమ దేశంలో/రాష్ట్రంలో అధికారికంగా స్థానమివ్వడానికి ఇష్టపడవు. వారు ఎంత ముఖ్యమైన మహాపురుషులైనా అవి లెక్కచేయవు. ఈ వక్రాలోచన (perversion) ని వారు ఆత్మగౌరవంగా సంభావిస్తారు.



మనం ఓ సమాజంలో పుట్టడం మన జీవితాల్లో మన ప్రమేయమేమీ లేకుండా జఱిగిన ఓ యాక్సిడెంట్. దానికి మనం గానీ, మన తల్లిదండ్రులు గానీ, ఆ సమాజం గానీ కారణం కాదు. యాక్సిడెంట్లని ప్రేమిస్తూ సహమానవుల్ని ద్వేషించటం ఏమాత్రం వివేకవంతం? ఎటొచ్చీ ఇటువంటి సంకుచితత్వాలకి ప్రభుత్వాల ఆమోదముద్ర పడడంలో ఉన్న ఇబ్బంది ఏంటంటే "ఫలానా దేశంలో/రాష్ట్రంలో అలా చేస్తున్నారు కదా. మనమూ అలాగే చేద్దాం" అనుకునేవారు చాలా మంది బయల్దేఱతారు. ఇలాంటివారు వాస్తవంగా ఉన్నది కొద్దిమందే ఐనా వీరి కారణంగా ఇతరుల్ని గౌరవించను తిరస్కరించే చౌకబారు మనస్తత్వం ప్రపంచ వ్యాప్తమవుతుంది. అయింది కూడా!

## 13. సర్వతోముఖమైన స్వేచ్ఛ

మానవులు నిర్నిబంధస్వేచ్ఛ (unconditional freedom) ననుభవించడం ద్వారానే పరిపూర్ణ మానసిక వికాసాన్ని పొందగలరని నవ్యమానవతావాదం చెబుతుంది. ఎందుకంటే ప్రతిమనిషిలోనూ అనంతమైన శక్తులూ, ప్రతిభలూ నిక్షిప్తమై ఉన్నాయి. అవి వ్యక్తమయ్యేందుకూ, తన్ను తాను సంపూర్ణంగా ఆవిష్కరించుకునేందుకూ ప్రతివ్యక్తికీ తోడ్పాటు నివ్వాలి. అనుకూల పరిస్థితులు కల్పించాలి. ఆ తోడ్పాట్లలో అత్యంత ముఖ్యమైనదే స్వేచ్ఛ. అది లేకపోతే జంతువులు సైతం వేటకళను మర్చిపోతాయి. కానీ స్వేచ్ఛ గల మానవులు తమకీ, ఇతరులకీ కూడా ఉపయోగపడతారు. ఆ విధంగా ఎక్కువమంది యొక్క స్వేచ్ఛాపూరిత ఆలోచనల ద్వారా మానవాళి ఏదో

ఒక రోజున సమష్టిగా లాభం పొందుతుంది. ఇప్పుడు నాగరికతారూపంలో మనం అనుభవి స్తున్నవన్నీ– ఒకప్పుడు కొందఱు మనుషులు స్వేచ్ఛగా ప్రయత్న–పొఱపాట్లూ (trial and error), ప్రయోగాలూ చేయగా, వాటి గుఱించి ఎన్నో వాదోపవాదాలకి దిగి మనశ్శాంతిని పోగొట్టుకోగా మనకు అందుబాటులోకొచ్చినవే.

అస్తిగోపన (conservative) సమాజాల్లో వ్యక్తిస్వేచ్ఛని లిఖితపూర్వకంగా గుర్తించినా దాన్ని వారు ఎట్టి పరిస్థితుల్లోనూ అమలుకానివ్వరు. దాన్ని అమలుజఱిపే బాధ్యత ఉన్న అధికారులు కూడా ఆ సంగతి విస్మరించి తాము జీవిస్తున్న సమాజంలో నెలకొన్న అస్తి గోపనభావాలకు లోనై స్వేచ్ఛాపరుల్ని శిక్షించడానికే పూనుకుంటారు. కారణం– నిజానికి ఏ సమాజంలో నైనా ఉదారవాద స్వభావులే అధికంగా ఉంటారు. కానీ సమాజం కొద్దిమంది అస్తిగోపనుల ఆధిపత్యం కింద ఉండడానా, ఉదారవాదుల కంటే వారి స్వరమే తారం (loud) కావడానా వారి అభిప్రాయాలే యావత్తు సమాజపు టభిప్రాయాలుగా చెలామణి అవుతూండడం కద్దు. “స్వేచ్ఛ సమానత్వం, భావప్రకటనా స్వేచ్ఛ” అని ఆర్భటించే వర్గాలు కూడా ఆచరణలో ఇతరులకి తమ వాదాన్ని వినిపించే అవకాశం ఇవ్వకపోవడం, వారు మాట్లాడితే ప్రచురించకపోవడం అస్తిగోపన సమాజాల్లో చాలా తఱచుగా కనిపిస్తుంది. కనుక, “స్వేచ్ఛ ఉంది” అని ఊరికే కాయితం మీద వ్రాయడం కాదు, ముందు మనుషుల ధోరణిలో మార్పు రావాలని అవగతమౌతోంది.

స్వేచ్ఛారహిత సమాజాల్లో కొద్దిమంది కూర్చుని తక్కినవారంతా ఏం ఆలోచించాలో, ఏం మాట్లాడాలో, ఏం చెయ్యాలో శాసిస్తూంటారు. ఇతరులు క్రొత్తశైలిలో ఏ క్రొత్త విషయాలూ మాట్లాడడానికి వీల్లేదంటూ వారు విద్దూరపు చట్టాల్ని విరచిస్తారు. అందుచేత ఆ సమాజాలు కొత్త ఆలోచనలు చేయడానికీ, ప్రయోగాలకి దిగడానికీ సైతం భయపడిపోతాయి. అందు చేత ఆ సమాజాల్లో ఓ విధమైన, ఏదో తెలియని భీతావహ వాతావరణం రాజ్యమేలుతూం టుంది. కనుక అవి పైవారు నేర్పే చిలక పలుకులే పలుకుతూ స్వకీయత (originality) లోపించి కాలక్రమేణ వెనకబడిపోతాయి. దరిమిలా అవి వినూత్న స్ఫురణల నిమిత్తం విదేశాలకేసి దృష్టి సారించాల్సిన అగత్యానికి లోనౌతాయి. ఈ విధమైన మనోదాస్యం కాల క్రమంలో భౌతిక బానిసత్వానికి సైతం దారితీయొచ్చు.



మనుషులు ముందు తప్పుచేస్తేనే ఆ తరువాత ఒప్పేదో తెలుసుకోగలుగుతారు. ఐతే ఒకఱికి తప్పని ముందే తెలిసినది మఱొకఱికి ఇప్పటిదాకా తెలియకపోవచ్చు. ఎందుకంటే మానవు లందఱి మానసిక పురోగతిస్థాయీ ఒకేలా లేదు. అదే విధంగా ఒకఱి అనుభవం మఱొక ఱికి చెందదు. కనుక ఆ సంగతి తెలుసుకోవడానికి వారు క్రొత్తగా తప్పుచేయాల్సి రావచ్చు. ఆ ప్రక్రియకి, లేదా ప్రయత్నానికి వారిని ద్వేషించడం, దండించడం అసమంజసం. కాబట్టి తప్పొప్పుల పేరుతో వివిధ ప్రామాణిక సంస్థలు వ్యక్తులపై విధించిన నిషేధాల్లో హెచ్చు శాతం పరిహరణీయాలే (avoidable) ననేది నవ్యమానవతావాద దృక్కోణం. ఎందు కంటే ఓ ఆచరణ సహజమైతే దాని మీద నిషేధం కృత్రిమమౌతుంది. అప్పుడా నిషేధం విఫలమవుతుంది. ఒకవేళ ఆ ఆచరణ కృత్రిమమైతే దానంతట అదే వాడుకలోంచి తొలగి పోతుంది. నిషేధంతో అవసరమే లేదు.

స్వేచ్ఛ అంటూ అసలుంటే దాన్ని ఎలా వాడుకోవాలో జనం ప్రయత్న–పొఱపాట్ల (trial and error) ద్వారా కాలక్రమేణ తెలుసుకుంటారు. తమ స్వేచ్ఛపై పరిసరస్థుల అభిప్రా యాల్నీ, ప్రతిస్పందనల్నీ గ్రహించి తదుపరి దాన్ని పరోపతాపనం కాని విధంగా తీర్చిదిద్దు కుంటారు. అసలు స్వేచ్ఛే లేకపోతే ఎలా తెలుసుకుంటారు? స్వేచ్ఛని అదుపుచేయాలని చెప్పేవారు కూడా, “దానికున్న పరిమితులివి” అని తామెలా తెలుసుకున్నారు? మఱి ఆ తెలుసుకునే అవకాశం తమకే కాక అందఱికీ ఉండాలి కదా! తమ వ్యక్తిగత అవగాహనని ఇతరులకి విధినిషేధాల (Do's and Don'ts) రూపంలో బదలాయించడం సాధ్యమేనా?

గుంపుల గూండాయిజానికీ, మానవస్వేచ్ఛకీ పొత్తు కుదరదు. వర్గీయ గుంపులన్నీ తాము ఉద్యమించిన తొలినాళ్ళలో సమాజంలో నెలకొని ఉన్న శంకారహిత, ఉదారవాద, స్వేచ్ఛా వాతావరణాన్ని (un-suspecting, liberalist and free atmosphere) ఉపయో గించుకుని తమ భావజాలాన్ని ప్రచారం చేసుకుంటూ ఎదుగుతాయి. కానీ తాము సమాజం లో బలమైన శక్తులుగా రూపొందాక అదే స్వేచ్ఛావాతావరణాన్ని ఇతరులకి నిర్దాక్షిణ్యంగా నిరాకరిస్తాయి.

### *వాక్స్వాతంత్ర్యం (మాట ముత్యం — మౌనం మట్టి)*

మానవీయస్వేచ్ఛలో వాక్స్వాతంత్ర్యమూ అంతర్భవిస్తుంది. ఇక్కడ అన్నిరకాల అభివ్యక్తుల్నీ 'వాక్కు' అనే వ్యవహరిస్తున్నాం. Knowledge society ని నిర్మించడం గురించి ఈమధ్య చాలామంది ప్రసంగించడం వినిపిస్తుంది. Knowledge అంటే విదేశాల నుంచి అరువు దెచ్చుకునేది మాత్రమే కాదు. ఓ దేశం knowledge ని అరువు దెచ్చుకోగలదేమో గానీ దాన్తో పాటు knowledge society ని మాత్రం దిగుమతి చేసుకోలేదు. Knowledge ని మాత్రమే అరువు దెచ్చుకోవడం, దాన్ని భట్టీయం పట్టడం వల్ల ఆ knowledge పుస్తకాలకీ, విద్యాలయాలకీ, కార్యాలయాలకీ పరిమితమవుతుంది. అదో విశ్వవిద్యాలయ పట్టా సంపాదించడానికీ, మహా ఐతే ఎక్కడైనా నాలుగు జీతంరాళ్ళు వెనకేసుకోవడానికీ తప్ప మనుషుల్ని నాగరికులుగా తీర్చిదిద్దడానికి మాత్రం పనికిరాదు. బైట మన సామాజిక బర్బరత యథాపూర్వంగా కొనసాగుతుంది. ప్రస్తుతం జరుగుతున్నది సరిగ్గా అదే. కాబట్టి నిజంగా నిజాయితీగా knowledge society ని నిర్మించాలంటే తొలుత చేయాల్సింది ఆ knowledge కి మూలమై, దాన్ని స్వకీయం (original) గా సృజించే సత్తానీ, ప్రతిభనీ ప్రసాదించగల సామాజిక లక్షణాల్ని అలవరచుకోవడం. అలాంటి వాతావరణానికి హార్దిక స్వాగతం పలకడం. భావస్వేచ్ఛా, వాక్స్వాతంత్ర్యమూ అలాంటి అభ్యుదయకర సామాజిక లక్షణాలు.

మనకి knowledge ని అరువివ్వగలుగుతున్న దేశాలు తమ తమ సమాజాల్లో వాక్స్వాతంత్ర్యంతో పాటు అనేక రకాల స్వేచ్ఛల్ని సెంటిమెంట్ల పేరుతో ఎవరికీ ఎలాంటి మినహాయింపులూ లేకుండా, ఏ విధమైన మెలికలూ, మడతపేచీలూ పెట్టకుండా బేషరతుగా అంగీకరించాయి గనుకనే మనకవి ప్రతిరంగంలోనూ బోధించగల స్థాయికొచ్చాయి. మన ఆరాధనాభావానికి పాత్రం కాగలిగాయి. ఏది మాట్లాడినా పెద్దపెద్ద గొడవలు జరిగిపోతాయనీ, అరెస్టులు చేస్తారనీ, శిక్షిస్తారనీ, ఖైదు చేస్తారనీ, పరువు తీస్తారనే భయం లేని దేశాల్లో స్వేచ్ఛగా పరిశోధనలూ, పరిశీలనలూ జరుగుతున్నాయి. అనేక ప్రస్తావనల (topics) మీద జనం స్వేచ్ఛగా తమ మెదళ్ళకి పదునుపెట్టి ఊహాపోహలకి దిగ గలుగుతున్నారు. (అవి నిజం కావచ్చు, కాకపోవచ్చు. అది వేరే విషయం) అక్కడ నానా సబ్జెక్టుల మీద నిర్మొహమాటమైన చర్చలు నడుస్తున్నాయి. వాటన్నిటి ఫలితంగా అక్కడ knowledge పుడుతోంది. అవి తిరుగులేని knowledge societies గా అవతరించాయి.



అంటే శిష్టవర్గానికి (Elite class) చెందిన మేధావులూ, పరిశోధకులూ knowledge ని సృష్టించాలన్నా ముందు రోజువారీ సమాజంలో అందరికీ స్వేచ్ఛ ఉండాలి. అప్పుడు అందరికీ ఉన్న స్వేచ్ఛనే శిష్టమేధావులు కూడా వాడుకుని సమాజాన్ని ఉద్ధరించగలుగుతారు. సామాన్యజనానికి లేని స్వేచ్ఛ శిష్టుల క్కూడా ఇవ్వబడదని గమనించాలి. అంటే ఓ సమాజం knowledge society గా అవతరించాలంటే ముందది సకల శృంఖలా విముక్తమైన తెరుపుదు సమాజం (open society) గా మారాల్సి ఉంటుంది. ఆ తెరుపుదుతనాన్ని కొన్ని వర్గాలకే కాక అందరికీ సమానంగా అనుమతించాల్సి ఉంటుంది. అంతే కాక, knowledge society ఏర్పడాలంటే, ముందు చర్చాత్మకమైన బౌద్ధిక వాతావరణం ఏర్పడాల్సి ఉంది. కానీ భావోద్వేగాలకీ, సెంటిమెంట్లకీ బౌద్ధిక వాతావరణాన్ని ఏర్పరిచే సత్తా ఉండదు. అవి అన్నిరకాల చర్చల్లోంచీ హుందాతనాన్ని బహిష్కరించి తన్నులాటల దాకా తీసుకెళతాయి.

పైపెచ్చు మనుషులు ఇతరుల వాక్స్వేచ్ఛని హరించే నిమిత్తం భావోద్వేగాల్నీ, సెంటిమెంట్లనీ తరచుగా వాడుకోవడాన్ని ప్రజాజీవితంలో గమనించవచ్చు. గత కొంతకాలంగా వివిక్త సార్థవాహుల వారు (private companies) కూడా తమ ఉత్పత్తుల్ని అమ్ముకోవడం కోసం ఇదే విధమైన రాజకీయ మంత్రాన్ని పఠించడం మొదలుపెట్టారు. ఉదాహరణకి — ఆహార ఉత్పత్తుల కోసం అమ్మ సెంటిమెంటు. ఎందుకంటే ఇది వట్టి సెంటిమెంట్ల సమాజమే తప్ప ఆలోచనాపరులు నివసించే, చర్చకీ తర్కానికీ ప్రాధాన్యమున్న knowledge society కాదు కాబట్టి వారిక్కూడా పాపం, అంతకన్నా మార్గాంతరం తోచడం లేదు.

విమానాన్ని తప్పసరిగా తయారుచేస్తామని ఆత్మవిశ్వాసాన్ని వెలిబుచ్చినందుకు రైట్ సోదరులు యూరోపులోనూ, అమెరికాలోనూ ఒకప్పుడు పెద్ద మోసగాళ్ళుగా పరిగణించబడ్డారు. ఎందుకంటే సరైన విమానాన్ని కనుగొనడంలో వారు మొదట్లో అనూహ్యంగా మళ్ళీ మళ్ళీ విఫలమయ్యారు. అయితే అందుకు వారిపై నేరాభియోగాలు మోపి చెఱసాలలో వేసిన వారెవరూ లేరు. అలా చేస్తే మనకీ రోజు విమానాలు ఉండేవి కావు. మనుషులు నిర్భయంగా ప్రయత్న- పొరపాట్లు (trial & error) చేయవచ్చుననీ, చేసి దిద్దుకోవచ్చుననీ అంగీకరించే సమాజాలు ఆ విధంగా ముందుకు దూసుకెళతాయి.

కానీ మన దేశంలోనో? ఓ రకం చెట్టు నుంచి తీసిన నూనె వాహనాలకి ఇంధనంగా పని కొస్తుందని చెప్పిన రామర్ పిళ్ళై అనే పేద పరిశోధకుణ్ణి 2003 లో అరెస్టు చేసి మూసేశారు. అతని మీద వంచనాభియోగాలు బనాయించారు. అతను ఏమయ్యాడో ఈ రోజుకీ తెలీదు. అలాగే భారతదేశపు తొట్టతొలి టెస్ట్ ట్యూబ్ బేబీ సృష్టికర్త మీద వ్యాజ్యాలు బనాయించి అరెస్ట్ చేశారు. ఆ డాక్టరుగారు ఆ తరవాత ఆత్మహత్య చేసుకున్నారు.

పరిశోధన దశలో/చర్చావస్థలో/ప్రతిపాదనస్థితిలో ఉన్న ప్రస్తావనలు (topics) మాతృ గర్భస్థ పిండం లాంటివి. వాటిల్లో మనకి నచ్చని, లేదా ఉపయోగపడని అంశాలు దొర్లినందుకు మనుషుల్ని శిక్షిస్తూ పోతే ఆ జ్ఞానశిశువు పూర్తిగా రూపుదిద్దుకోకుండానే గర్భస్రావమై మరణిస్తుంది. పురుషవీర్యంలో లక్షలాది వీర్యకణాలుంటే వాటిల్లో ఒకటి మాత్రమే అండంతో కలిసి ఫలదీకరణ చెంది శిశువుగా పరిణమిస్తుంది. అలాగే మనుషులు కూర్చుని వెయ్యి మాటలు మాట్లాడితే వాటిల్లో అయిదో పదో పనికొచ్చే మాటలు వెలువడతాయి. అత్యంత ఉపయోగకరమైన ఆ 5–10 మాటలు పుట్టాలంటే తతిమ్మా 990–995 మాటలు కూడా మాట్లాడుకోవడం తప్పనిసరి. 990 నిరుపయోగమైన మాటలున్నాయనే కారణం చేత అసలు మాట్లాడుకోవడాన్నే శిక్షార్హం చేసేస్తే ఇహ సమాజంలో జ్ఞానశిశువు పుట్టేదెలా? అసలు మాట్లాడుకోని సమాజం, అది మానవ సమాజమెలా అవుతుంది? ఎన్ని చెప్పినా ఎంత చెప్పినా అర్థం కాని, అర్థం చేసుకోలేని మూర్ఖ లోకమిది. ఇటువంటి చోట ఒక్కసారి కూడా నోరు విప్పనివ్వని వ్యవస్థల్ని నిర్మిస్తే....?

చూడబోతే, మనది ఓ Shut up సంస్కృతి, Shut up సమాజం. ఇంట్లో Shut up. బయట Shut up. కళాశాలలో Shut up. కార్యాలయంలో Shut up. న్యాయస్థానంలో Shut up. పోలీస్ స్టేషన్ లో Shut up. సమావేశాల్లో Shut up. శాసనసభలో Shut up. మీడియాలో Shut up. అంతర్జాలంలో Shut up. ఆ రకంగా ఎవఱూ ఎవఱినీ మాట్లాడకుండా చేసే వాతావరణమిది. ఇక్కడ ప్రతి ఒక్కఱూ తమ తమ పరిధిలో ఈ Shut up సంస్కృతిని ఎనలేని అంకిత భావంతో అమలుజఱుపుతూంటారు. ఇహ ఇది ఎప్పటికి knowledge society అవ్వాలి? దేన్నీ వ్యక్తీకరించే ధైర్యం చేయలేక ప్రతి ఒక్కఱూ ఇలాగే నోళ్ళు మూసుకునీ, మూసుకునీ ఆఖరికి మన భాషలో కొత్తపదాలు పుట్టే ప్రక్రియ కూడా నిలిచిపోయింది.



వ్యక్తిని మాట్లాడనివ్వని వాతావరణంలో ప్రజలకి న్యాయం మాత్రం ఎలా జఱుగుతుంది ? మన న్యాయస్థానాల్లో కక్షిదారు (litigant) ని మాట్లాడనివ్వరు. అతను ఏం చెప్పాలన్నా తన వకీలు ద్వారానే చెప్పాలి. వకీలు చెప్పబోతే, “ఏ సెక్షన్ కింద చెబుతున్నావ్?” అని గదమాయిస్తారు. సెక్షన్లతో సంబంధం లేని కష్టసుఖాలుంటాయి మనుషులకి. అవి ఆ కక్షిదారు స్వయంగా చెప్పుకుంటేనే తెలుస్తాయి. మనుషులు ఎక్కువ సందర్భాల్లో అబద్ధాలాడేది – అసలువిషయం చెబితే తమను అవతలివారు సరిగా అర్థం చేసుకోరేమోననే అపనమ్మకం మూలానా! ఆ అపనమ్మకాన్నీ, భయాన్నీ వ్యవస్థలు తమ దయాదాక్షిణ్య రహిత వైఖరితో ఓ ప్రక్క మఱింతగా పెంచుతూ మఱో ప్రక్క వ్యక్తులు స్వాభావికంగా మోసగాళ్ళనీ, అబద్ధాలకోర్లనీ ఆరోపిస్తూంటాయి. ఏం న్యాయం ?

కాబట్టి ప్రతీదీ మనసువిప్పి మాట్లాడడాన్ని స్నేహ సానుభూతులతో ప్రోత్సహించాలి. నిజాయితీతో కూడిన భావవ్యక్తీకరణని ఓ సిగ్గుపడాల్సిన అంశంగా, అతివాగుడుగా, ధిక్కారంగా, ప్రమాదకరంగా భావించే ప్రాతకాలపు అస్తిగోపన వాతావరణం (conservative atmosphere) పోవాలి. అలా పోవాలంటే దానిమీదున్న అన్ని నిషేధాల్నీ ఎత్తివేయాలి. ముఖ్యంగా వ్యవస్థాగతమైన వర్గీయ కట్టళ్ళకీ, పక్షపాతాలకీ స్వస్తి పలకాలి.

**సామాజిక అంశాలక్కూడా ఇదే వర్తిస్తుంది :** బాలవితంతువులకి పునర్వివాహావకాశం లేకపోబట్టి యువత పెడదారి పడుతోందని పేర్కొంటూ బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు సంస్కరణోద్యమాన్ని ప్రారంభించారు. కన్యాశుల్కంలో కూడా అటువంటి ఓ పాత్రని గురజాడ చొప్పించారు. ఆ రోజుల్లో సుమారుగా ప్రతి ఇంట్లోనూ ఓ బాలవితంతువు ఉండేది. “ఛాఁ ! దుర్మార్గుడా ! స్త్రీద్వేషీ ! అంత మాటంటావా మా అమ్మాయిల్ని? నీకు తల్లీ చెల్లీ లేరా?” అని ఎవఱూ ఆ రోజుల్లో గుమ్మడికాయల దొంగల్లా భుజాలు తడుముకుని ఆయన్ని దూషించలేదు. అరెస్టు చేయించలేదు. కాబట్టే మన సంఘం సంస్కరించబడింది. ఒకవేళ అటువంటి మర్యాద ఏదైనా ఆయనకి జఱిగితే ఆయన సంస్కర్త కాకుండా ఇంకేదో అయ్యుండేవాడు.

ఎందుకంటే సామాజిక విషయాల గుఱించీ, సమస్యల గుఱించీ మాట్లాడితే దాన్ని వ్యక్తిగతంగా తీసుకోవడం *(“ఖచ్చితంగా నువ్వు నన్నే అన్నావ్”)* కూడా ఎదగని సమాజపు

ధోరణే. కొందఱు ప్రభుత్వోద్యోగులు అవినీతికి పాల్పడుతున్నారని ఎవరైనా అంటే– “నీకు నాన్న లేడా? అన్నయ్య లేడా? వాళ్లు ఉద్యోగాలు చేయలేదా? వాళ్ళూ అవినీతిపరులేనా?” అంటూ ఒక సామాజిక సమస్యలోకి చర్చాకారుల కుటుంబాల్ని అసందర్భంగా లాగడం విద్యాత్మక చర్చకీ, వస్త్వాశ్రయ విశ్లేషణ (objective analysis) కీ అవరోధం.

కాబట్టి వాక్స్వాతంత్ర్యం అంటూ ఉంటే అది సంపూర్ణం (absolute) గా ఉండాలి. ఒకసారి వాక్స్వాతంత్ర్యమనే పరిభావన (concept) ని అంగీకరించాక మళ్ళీ అందులో “పాండవులంటే మంచం కోళ్ళలా ముగ్గుఱు” అని రెండువేళ్లే చూపించిన విధంగా *“మనోభావాలు, సెంటిమెంట్లూ అశ్లీలాలు, ఉచితానుచితాలు, కించపఱచడాలు, సమాజం మీద ప్రభావం, పిల్లల మీద ప్రభావం, శాంతిభద్రతలు”* అంటూ వంద మినహాయింపుల్ని చొప్పించకూడదు. అది, ఓ చేత్తో ఇస్తూ మఱో చేత్తో వెనక్కి తీసేసుకోవడమే అవుతుంది.

ఈ మినహాయింపులకి ఓ నిర్వచనమంటూ ఏమీ లేదు. ఓ సారి అలాంటివాటికి చోటిస్తే ప్రతి ఒక్కఱూ తమ తమ ఆత్మాశ్రిత దృక్కోణాల (subjective viewpoints) తో వాటికి భాష్యం చెబుతారు. ఒకవేళ వాక్స్వాతంత్ర్యం ద్వారా అబద్ధాలు ప్రచారమవుతాయనీ, తద్వారా సమాజం నష్టపోతుందనే భయం గనక ఉంటే, అలాంటి భావాల్ని మళ్ళీ వాక్స్వాతంత్ర్యం ద్వారానే, ఎదురు ప్రచారం ద్వారానే అడ్డుకోవడానికి తప్పకుండా అవకాశ ముంటుంది. ఆ అవకాశం లభ్యమౌతున్నప్పుడు ఏ అభివ్యక్తినైనా సరే, నిషేధించాల్సిన అవసరం గానీ, శిక్షించాల్సిన అవసరం గానీ ఎందుకొస్తుంది?

ఒకఱు ఓ తరహా అభివ్యక్తి (expression) మీద నిషేధాన్ని కోరితే ప్రతిఒక్కఱూ తలో రకం అభివ్యక్తి మీదా నిషేధాలు విధించాలంటూ డిమాండ్లు తీసుకొస్తారు. అంటే ఒకటి వాక్స్వాతంత్ర్యానికి అడ్డుకట్ట వేయవలసిందంటూ మఱొకఱు రచ్చకెక్కుతారు. అలా అందఱూ కలిసి అందఱి వాక్స్వాతంత్ర్యాన్నీ ఏకమొత్తంగా రద్దుచేయించేస్తారు. ప్రస్తుతం మన దగ్గఱ జఱుగుతున్నది అదే. పైవాళ్ళకి ఇంతకన్నా ఆనందదాయకమైన విషయమేదీ బహుశా లేదు. ఆ రకంగా వాక్స్వాతంత్ర్యం లేని, లేదా అది పరిమితంగా ఉన్న, లేదా అది కొన్ని వర్గాలకే సీమితమైన దేశంలో మానవ హక్కుల గుఱించి పూర్తిగా మర్చిపోవడం మంచిది. అదే విధంగా ఒకటికి ప్రసాదించాల్సిన సహజన్యాయాన్నీ, వారి సహజ మానవహక్కుల్నీ మఱొకఱు తమ హక్కుల ఉల్లంఘనగా భ్రాంతి చెందుతూ అలా చిత్రించే వాతావరణంలో కూడాను.



ప్రతి పౌరుడూ రాజకీయనాయకుడు కాదు. ప్రతివారూ ఎన్నికల్లో పోటీ చేయబోవడమూ లేదు. కనుక ప్రతివారూ రాజకీయంగా సాధువులైన ఉద్ఘాటనలు (politically correct statements) మాత్రమే చేయాలనీ, రాజకీయ పక్షాల కార్యావళి (vote-bank agenda) కీ, వారు తమ స్వార్థప్రయోజనాల కోసం కృత్రిమంగా సృష్టించి ప్రచారంలోకి తెచ్చిన రాజకీయ సాధుత్వాల (political correctness) కీ విరుద్ధంగా ఎవఱూ ఏమీ మాట్లాడకూడదనీ నిర్బంధించడం ప్రజాస్వామ్యంలో సరికాదు. నిజమైన వాక్స్వాతంత్ర్యంలో సకలజన సమ్మతమైన మాటలకే కాక ఎక్కువమందికి అసమ్మతమైన మాటలక్కూడా సహజంగా స్థానం ఉంటుంది. ఉండాలి కూడా!

ఈనాడు రాజకీయంగా సాధువైన మాటలే సరిగ్గా వందేళ్ల క్రితం ఎవఱికీ ఆమోదయోగ్యం కాక అసాధువులుగా ఉండేవని గమనించాలి. “ఫలానా మాట నాకు నచ్చలేదు కనుక అదన్నవాణ్ణి ఏదో చెయ్యాలి” అని వాదిస్తే ఎవఱికి ఏ మాట నచ్చుతుందో ముందే ఎలా తెలుస్తుంది? ఒకఱు ఓ భావాన్ని వ్యక్తీకరించాక కదా అది బాలేదని తెలిసేది? అలా తెలియాలంటే ముందు వారిని స్వేచ్ఛగా వ్యక్తీకరించనివ్వాలి కదా?

ఒకడు నచ్చనివారున్నట్లే అతను నచ్చేవారు కూడా ఉంటారు. మఱి ఈ ఇద్దఱిలో ఎవఱి మాట మీద ఆధారపడి ఆ వ్యక్తితో వ్యవహరించాలి? నచ్చడం, నచ్చకపోవడంలాంటి పేలవ ప్రాతిపదికల మీద వ్యక్తుల్ని ధర్మిస్తూ (జడ్జ్ చేస్తూ) పోతే అందఱూ దుర్మార్గులే అవుతారు. కనుక నచ్చినా, నచ్చకపోయినా మాటలకు మాటలతోనూ, చర్చలకు చర్చలతోనూ, తర్కానికి తర్కంతోనూ సమాధానమివ్వడమే నాగరికత. అదే మానవీయత. ఏ అభివ్యక్తి (expression) బావుందో, ఏది బాలేదో ప్రజలే నిర్ణయించుకుంటారు. ఒకఱు చెప్పాల్సిన పనిలేదు. విద్యావంతులైనంత మాత్రాన సమాజంలో ప్రతి ఒక్కఱూ స్వాభిప్రాయ ప్రకటన కళలో చేయి తిరిగిన మహా రచయితలూ, అనర్గళ వక్తలూ కారు. ఏదో చెప్పబోతే అది ఇంకేదో విధంగా ధ్వనించడం తఱచు.

చర్చ అన్నాక చాలా విషయాలు ప్రస్తావనకొస్తాయి. ఎవఱినీ ఏమీ అనకుండా, ఒక్కఱిని కూడా బాధ పెట్టకుండా సామాజికశాస్త్రాల (humanities) కీ, సమాజానికీ సంబంధించి చర్చించడం సాధ్యం కాదు. శుద్ధవిజ్ఞానాల (pure sciences) లో రెండో అభిప్రాయానికి తావుండదు. సామాజిక శాస్త్రాలు అలా కాదు. నాగరికత పెద్దగా ఎఱగని మనలాంటి దేశా

ల్లో – ఒకవేళ అవతలివారి వాదానికి ఇవతలివారి మేధస్ తూణీరంలో సమాధాన బాణం ఒక్కటి కూడా లేకుండా నిశ్శేషంగా కొల్లబోయిందనుకోండి. ఇహ భౌతిక చర్యలకీ, పాశవిక బలప్రయోగానికీ (brute force) దిగాలనే ప్రేరణ కలుగుతుంది.

ఇదో రకం బౌద్ధిక దివాలా (intellectual bankruptcy). తమ దగ్గఱ సబ్జెక్టు లేదని బహిరంగంగా, నేరుగా ఒప్పేసుకోవడమన్నమాట. ఆఖరికి, ఇక్కడ చర్చించడం అంటే 'అనవసరంగా గొడవలు పడడం' అనే అర్థం సిద్ధమైంది. అయితే ఈ తరహా పాశవిక బలాన్ని ప్రదర్శించగలవారంటేనే మన జనంలో ఆరాధనాభావం మెండు. పాశవికులు మొదట్లో గెల్చినట్లు కనిపిస్తారు. కానీ "వినాశకాలే విపరీత బుద్ధిః"అన్నట్లు మేధాశక్తికి బదులు ఇలా పాశవిక బలాన్ని (brute force) ప్రదర్శించాలనే సంకల్పం కలగడం వారి భవిష్యానికే ఓ దుశ్శకునం.

ఆలోచించేవారూ, అలా చెయ్యమని చెప్పేవారూ మన సమాజానికి ప్రధానమైన శత్రువులు. ఆలోచించకుండా బ్రతికెయ్యడానికి ఎన్ని తప్పుకోళ్ళు (escapes) ఉన్నాయో అన్నీ వెతుక్కుని మఱీ ఆ బాధ్యత నుంచి విముక్తులవుతూంటారు. ఎల్లప్పుడూ సంగీతాన్ని ఆస్వాదించడం, త్రాగుడు, హాస్యప్రధానమైన చలనచిత్రాల్ని వీక్షించడం — ఇవన్నీ అలాంటి తప్పుకోళ్ళలో ఓ భాగం.

మనవారెక్కువమంది లౌక్యంలోనూ, ముఖ్యంగా రాజకీయాల్లోనూ తప్ప ఇహ దేనిలోనూ పండితులు కారు. ఫలితార్థంగా మన దేశంలో ఏ సబ్జెక్టు గుఱించైనా చర్చించేందుకు మనుషులే దొఱకరు. అథవా దొఱికినా, కొద్దిపాటి అభిప్రాయభేదమేదో ఉన్నట్లు వెల్లడైతే సబ్జెక్టుకి సంబంధం లేని వ్యాఖ్యలు మొదలవుతాయి. తరువాత అసహ్యంగా తిట్టడం. (ఆ విధంగా రెచ్చగొట్టడానికి ప్రయత్నించడం) అదీ సాధ్యం కాకపోతే మీదపడి కొట్టడం. లేదా మనుషుల్ని పంపి కొట్టించడం. లేదా తమలాంటి కుసంస్కారులు కొంతమందిని ప్రోగుచేసి అభూత కల్పనలతో అభాండాలతో దుష్ప్రచారానికి పూనుకోవడం. లేదా తప్పుడు వ్యాజ్యాలు వేసి అరెస్టు చేయించడం. ఇదీ మన దేశంలో అన్ని చర్చలకీ పట్టే అంతిమ దుర్గతి. ఇహ ఇక్కడ knowledge society ఎలా పుడుతుందనేది అగమ్యగోచరమైన విషయం.

వ్యక్తులతో వ్యవహరించడంలో కలిగిన పూర్వానుభవాలూ, వంచనగా ముదిరిపోయిన లౌక్యమూ కారణంగా భాషలోని పదజాలం తన ఉద్దిష్ట అర్థాల్ని కోల్పోయి కేవలం వ్యంగ్యార్థాలే గమ్యమానమవుతున్న మతిభ్రంశయుగంలో మనం జీవిస్తున్నాం. ఇలాంటి వాతావరణంలో ఎవఱు ఏది మాట్లాడినా అది ఉలిక్కిపాటుకి గుఱిచేస్తుంది. ప్రతి నూత్నాభివ్యక్తీ నిషేధాలనే ఆహ్వానిస్తుంది.



## 14. స్వతంత్రంగా స్వేచ్ఛగా ఆలోచించడం

ఇది చాలావఱకూ వ్యక్తివాదానికి సంబంధించిన సూత్రమే. అందుచేత ఇక్కడ స్వతంత్రత అంటే వ్యక్తికి స్వతంత్రత. స్వేచ్ఛ అంటే వ్యక్తికి స్వేచ్ఛ. ఈ గ్రంథ భాగాన్ని చదివేవారిలో "ఇప్పుడు వ్యక్తులు స్వతంత్రంగా స్వేచ్ఛగా ఆలోచించడం లేదా?" అనే ప్రశ్న రేకెత్తవచ్చు. "లే"దనే ఈ గ్రంథకర్త సమాధానం.

అయితే ఆలోచనాపరంగా సంపూర్ణస్వేచ్ఛ మనిషికి సాధ్యం కాదు. కారణం– ఆలోచన అంటే తనలో తాను మాట్లాడుకోవడం తప్ప ఇంకేమీ కాదు. అలా మాట్లాడుకోవాలంటే భాష కావాలి. దాన్ని సమాజం నుంచే స్వీకరించాలి. ఎవఱూ తన స్వంత భాషని తాను సృష్టించుకోలేరు. మనిషి పుట్టిపెఱిగే క్రమంలో– భాషతో పాటు దాని వాడుకల వెనక నున్న ఆలోచనల (ideas) ని కూడా సమాజం నుంచే సంగ్రహిస్తాడు. ఆలోచనలకి కావాల్సిన ప్రాథమిక తర్కపునాదుల్ని సైతం సమాజం నుంచే గ్రహిస్తాడు. ఆ రకంగా ఓ దశకి చేఱుకునేసరికల్లా అతనిలో తనదంటూ స్వకీయం (original) గా ఏమీ మిగలదు. అతను సమాజానికి అచ్చమైన ప్రతిబింబంలా, దాని అనాధికారిక ప్రతినిధి (unofficial representative) గా పరిణమించి ఉంటాడు.

ఓ ప్రక్క ఇది కొంతవఱకూ సామాజిక ఇముడ్చుకోలు (social assimilation) కి దోహదిస్తూండగా, మఱో ప్రక్క వ్యక్తిని అనేక సామాజిక దురభిప్రాయాలకి దాసుడిగా, వాటి ప్రేరణతో నానా నేఱాలకీ, ఘోరాలకీ ఒడిగట్టేవాడిగా మారుస్తోంది. ఉదాహరణకి, వాస్తవానికి ఎవఱి పెళ్ళి వారే చేసుకోవాల్సి ఉండగా, "అలా కాదు. తల్లిదండ్రులే చేయా"లనే సామాజిక దురభిప్రాయానికి లోనైన తండ్రి అందుకోసం అక్రమ మార్గంలో డబ్బు సంపాదించడానికి పూనుకుంటాడు. ఇది సామాజికంగా స్వతంత్రతని కోల్పోయిన ఆలోచనాధోరణి.

కానీ విడివ్యక్తి అన్ని ఇతర రంగాల్లోనూ ఇదే విధంగా స్వతంత్రతని కోల్పోయిన వైనం దృగ్గో చరమవుతుంది. మన కాలపు విద్య వ్యక్తిని వ్యవస్థకి అనుగుణంగా తీర్చిదిద్దే క్రమంలో అతని ఆలోచనాస్వేచ్ఛని హరిస్తోంది. ఉదాహరణకి, మన జూనియర్ కళాశాలల్లో ఉన్న M.P.C., B.P.C. లాంటి గ్రూప్సుని చూడండి. వాటిల్లో చేఱి చదవడం మొదలుపెట్టిన ప్రతి విద్యార్థీ తనని తానో ఫక్తు సైన్సుమనిషిగా భావించుకో సాగుతాడు. ఆ సబ్జెక్టులు వృత్తిపర విశేషజ్ఞ తలు (professional specializations) మాత్రమేననీ, తన జీవితం సజావుగా సాగా లంటే వాటితో పాటు తనకి పెక్కు ఇతర విషయాల పరిజ్ఞానం కూడా అపేక్షితమేననే వివేకా న్ని ఈ గ్రూప్సు పోగొడతాయి.

తమకి తామే ఒక విధంగా ముద్రాంకణ (branding) చేసుకున్నవారు స్వతంత్రాలోచన లు చేయడానికి జంకడం తఱచుగా దర్శనమిస్తుంది. ఉదాహరణకి, ఏదైనా ఒక సిద్ధాంతా నికి అనుయాయులమని చెప్పుకునేవారు తమ సంస్థల/పార్టీల విధానాలకి విరుద్ధంగా ఏమీ మాట్లాడలేరు, తమకంటూ కొన్ని స్వతంత్ర అభిప్రాయాలూ, తర్కాలూ మనసులో ఉన్నప్ప టికీ! ఇది మన జీవజాతి (species) ప్రవేశించిన ఓ విచిత్ర దశావస్థని సూచిస్తోంది. నిజ మైన వ్యక్తులేమో వ్యక్తిత్వాల్ని కోల్పోయి నిర్జీవ సంస్థల ప్రతిఫలనాలుగా మారడం. నిర్జీవ సంస్థలేమో నిజమైన వ్యక్తుల్లా శాసించగలగడం.

ఏ విషయాన్నైనా మనిషి స్వయంగా వ్యక్తిగతంగా తన ఇంద్రియాలనే ఉపయోగించి తెలుసు కోక తప్పదు. ఎంత గొప్ప తర్కాన్నైనా స్వబుద్ధితోనే విమృశించి అర్థం చేసుకోక తీఱదు. కొందఱు వ్యక్తులు ఎంత మేధావులైనా కావచ్చు. కొన్ని సంస్థలు ఎంత ప్రామాణికమైనా కావచ్చు. కొన్ని పుస్తకాలు ఎంత ప్రసిద్ధమైనా కావచ్చు. కానీ వాటి సారాంశాన్ని ఆకళించు కోవాలంటే ప్రాథమికంగా ఎవరి మనస్సే వారికి కరదీపిక. కాబట్టి వ్యక్తిగత అనుభవానికి విరుద్ధమైన విషయాల్ని ఎవఱు చెప్పినా ఎంతమంది చెప్పినా నమ్మాల్సిన అవసరం లేదు.



## 15. మూకుమ్మడి నీతిసూత్రావళి స్థానే వైయక్తిక నీతిసూత్రావళి

కొన్ని నీతిసూత్రాలు అందఱికీ సమానంగా వర్తిస్తాయనడంలో సందేహం లేదు. అవి దేశకాలాతీతం అనడంలో కూడా సందేహం లేదు. ఉదాహరణకి– దొంగతనం చేయకపోవడం, నిజం చెప్పడం, కృతజ్ఞత చూపడం, పరుల్ని బాధించకుండా ఉండడం మొ॥ వి. కానీ 'నీతి' అనే పదాన్ని మన సమాజం ప్రతిసందర్భం లోనూ ఇలాంటి ప్రాథమికార్థంలోనే అర్థం తీసుకోవడం లేదు. నీతి యొక్క మూలభావాలతో సంబంధం లేని చాలా విషయాలొచ్చేసి కూర్చున్నాయి 'నీతి' పేర చెలామణి అవుతూ! ఉదా హరణకి– కొన్ని రకాల సెంటిమెంట్లనీ, విశ్వాసాల్నీ సహేతుకంగా త్రోసిపుచ్చేవారిని నీతి లేనివారుగా భాష్యం చెప్పడం జఱుగుతోంది. మనిషి తన మనస్సాక్షి పట్ల తాను నిజాయితీ (truthful to his own conscience) గా ఉండడం ద్వారా మాత్రమే సమాజానిక్కూడా ఉపయోగపడగలడు. అతను తన మనసు చంపుకుని సమాజానికి అనుకూలంగా ఉండడం (ఉన్నట్లు నటించడం) వల్ల సమాజానికి ఒరిగేదేమీ లేదని గ్రహించే రోజు రావాలి. అంటే ఇతరుల వ్యక్తిగతజీవితాల్ని శాసించే/వారి వ్యక్తిగత ఇష్టానిష్టాల్లో జోక్యం చేసుకునే దుర్బుద్ధి నుంచి మనుషులు విముక్తులు కావాలి.

## 16. వైవిధ్యాన్ని గౌరవించడం

నవ్యమానవతావాదం ఓ ఇముడ్చుకోలు తాత్త్వికత (inclusive philosophy). వెలిపెట్టుడు తాత్త్వికత (exclusive philosophy) కాదు. మానవుల మధ్య విజ నుష్మ, జాతి, కులం, రంగు, మతం, శాఖ, భాష, లిపి, మాండలికం, విద్య, వృత్తి, ఆర్థికవర్గం, ప్రాంతం, వయసు, ఆరోగ్యం, అలవాట్లూ, అభిరుచులూ, రాజకీయ–సాంఘి కాది అభిప్రాయాలూ ఇత్యాది ప్రత్యేకతల్ని ఆశ్రయించుకొని వేలాది వ్యత్యాసాలున్నాయి. కనుక మానవులంతా సమానమని గానీ, సదృశం (similar– ఒకేలాంటివారు) అని గానీ నవ్యమానవతావాదం చెప్పదు. లేదా వారు అలా తయారవ్వాలనీ, అందుకోసం ఉద్యమాలు నడపాలని కూడా బోధించదు. ఎందుకంటే నవ్యమానవతావాదులు వైవిధ్యాన్ని వైరుద్ధ్యంగా

పొఅపడరు.

పైన పేర్కొన్న వ్యత్యాసాలేర్పడకుండా నివారించే మార్గం లేదు. కనుక అలాంటివి ఎన్నున్నా వాటిని సహించి ప్రేమతో అర్థం చేసుకుని వాటి ప్రాతిపదికన అవతలివారికి బాధ కలగని విధంగా వ్యవహరించాలని మాత్రమే నవ్యమానవతావాదం సందేశిస్తుంది. మానవజాతి లోని ఈ అనంత వైవిధ్యానికి అది సవినయంగా శిరసు వంచుతుంది. దాన్ని యథాతథంగా అంగీకరిస్తుంది. గౌరవిస్తుంది. ఆ భేదాల్ని పాటిస్తున్నందుకూ కొనసాగిస్తున్నందుకూ వాటిని పైకి వ్యక్తీకరిస్తున్నందుకూ అది ఎవ్వటినీ తప్పుపట్టదు. ఐతే వాటిని పట్టించుకోకుండా మానవులందఱి ఎడలా ఒకేలాంటి సౌహార్దాన్ని చూపించాలని నవ్యమానవతావాదం చెబుతుంది. ఒకఱు మఱొకఱిని ఏ ప్రాతిపదికనైనా చెడ్డగా మన్నించడం, అణచి వేయడం, వారి కన్యాయం చేయడంలాంటివాటికి మానవతావాదుల మద్దతుండదు. అదే సమయంలో– అలా చేసేవారి పట్ల కూడా సాధ్యమైనంత మానవీయంగా, మర్యాదగానే వ్యవహరించాలని వారు కోరతారు. వారి దుష్ప్రవర్తన గుఱించి మన సత్ప్రవృత్తిని విడనాడడం సరికాదనేది ఇందులో ఇమిడున్న సూత్రం.

**"మనుషులు ఒకఱిలా మఱొకఱు ఉండనక్కఱ్లేదు" అన్నప్పుడు, మఱి అందఱికీ వర్తించే మానవత్వానికి అర్థమేంటి? అది ఎక్కడుంది ?** మనుషులు ఒకే భాషకున్న వేఱువేఱు మాండలికాల వంటివారు. ఓ మాండలికంలోని మొత్తం పదాలూ ఇంకో మాండలికంలో ఉండవు. అయితే ప్రతిమాండలికానికీ ప్రతి ఒక్క ఇతర మాండలికంతోనూ కొన్ని పోలికలు ఉండనే ఉంటాయి. అందువల్లనే అవన్నీ పరస్పర సంబంధం కలిగినవనీ, ఒకే భాష అనీ గుర్తించగలుగుతున్నాం. అర్థం చేసుకోగలుగుతున్నాం. అలాగే మనుషులు ఒకఱినుంచి ఒకఱు ఎంత భేదించినా వారందఱికీ కలిపి కొన్ని ఉమ్మడి అవసరాలూ ఆశలూ ఉంటాయి. వాటి నాశ్రయించుకుని కొన్ని ఉమ్మడి బలాలూ బలహీనతలూ కూడా ఉంటాయి. మానవత్వమంటే ఈ అన్ని లక్షణాల సమాహారమే. వాటిని అర్థం చేసుకుని ఆ విధమైన అవగాహన ప్రకారంగా మానవులతో వ్యవహరించడమే నవ్యమానవతావాదం.



## 17. నిరీక్షణ తత్త్వం

దీనికీ పోరాటదూరత్వానికీ సంబంధం ఉంది. నవ్యమానవతావాదులు వ్యక్తులలో గానీ సంఘంలో గానీ తాము కోరుకుంటున్న ఏ మార్పుకోసమూ తొందఱపడరు. ఆ మార్పుని బలవంతంగా రప్పించే పరిస్థితుల్ని కల్పించను యత్నించరు. మనం చేఱుకున్న మైలుఱాతినే ప్రతిమానవుడూ ఏదో ఒక రోజు చేఱుకుంటాడు. దాని కోసం మనం ఆతురత చెందాల్సిందేమీ లేదు. కానీ సోదర మానవులు కోరితే వారికి మన వంతు బాసట ఇవ్వొచ్చు.

## 18. పోరాట దూరత్వం

ఏ మార్పు గుఱించైనా సరే, వ్యక్తిగతంగా గానీ, గుంపులుగా గానీ, శాంతియుతంగా గానీ, సాయుధంగా గానీ పోరాడడాన్ని నవ్యమానవతావాదులు ఆమోదించరు. వారు ఏ అంశంలోనైనా చర్చ, అవగాహన, సలహా అనే మూడు కార్యక్రమాలకే పరిమితమవుతారు. ఇతరుల్లోని హేతువాదాంశని అందుకోగలిగితే, అందుకోసం కాస్త సమయాన్నీ, మేధాశక్తినీ వెచ్చించడానికి సిద్ధపడితే ఘర్షణలకి అవకాశం తగ్గుతుంది.

ఈ సందర్భంగా మన ప్రజలు ఓ కఠోర సత్యాన్ని గ్రహించే శుభదినం రావాలి. అదేంటంటే – ఈ రోజుల్లో రోడ్డెక్కేవారెవ్వఱూ అమాయకులూ కారు. నిస్సహాయులూ కారు. మంచి వారు అంతకంటే కారు. మిగతా జనంమీద వారిది చాలా పైచేయి కాబట్టే, లేదా వారి వెనక ఎవఱో శక్తిమంతులు ఉన్నారు కాబట్టే రోడ్డెక్కగలుగుతున్నారు. ఈ తరహా పోరాటాల క్రమంలో తప్పిదాలు అనూహ్యంగా ఎటునుంచైనా జఱగొచ్చు. ప్రతిపోరాటమూ అంతిమంగా అహంకార ప్రదర్శనకీ, తన్మూలకమైన క్రూరత్వానికీ, పరస్పర అపకారాలకీ, తన్నిమిత్తమైన కపటవ్యూహాలకూ దారి తీస్తుంది.

ఏం చేసైనా మొత్తమ్మీద ఇతరుల మీద తమ సిద్ధాంతాల్ని బలవంతంగా అత్యంత శీఘ్ర మార్గంలో రుద్దడమూ, రాజకీయంగా, చట్టపరంగా అందఱిమీదా పైచేయి సాధించడమూ, పట్టుబిగించడమూ, ఎవఱూ నోరెత్తకుండా చేయడమూ– ఇవే అన్ని పోరాటాలకీ అంతిమ లక్ష్యాలు. పోరాటయోధులకి ఈ రకమైన ఆధిపత్యభాష తప్ప మానవతావాద భాష అర్థం

కాదు. ఈ విధమైన లక్ష్యాల్లో నిర్జీవమైన సిద్ధాంత విధేయతలే మినహా ఏ విధమైన సజీవ మానవప్రేమకీ తావులేదు. ఈ పోరాట ధోరణిలో అవతలివారంతా చెడ్డవారూ, వధ్యులూను. తమవారంతా దేవుళ్ళు. లోకమంతా నలుపూ, తెలుపూ మాత్రమే. వేఱే రంగుకి తావు లేదు.

“శాంతియుతం, అహింసాయుతం, రక్తపాత రహితం, ధర్మయుద్ధం” అని చెప్పబడే పోరాటాలు కూడా ఇతరుల మీద దుష్ప్రచారానికీ, కుతర్కాలకీ, వక్రభాష్యాలకీ దిగే దాకా, తప్పో ఒప్పో అభియోగాలు బనాయించి ప్రతివాదకుల్ని వ్యాజ్యాల్లో ఇఱికించే దాకా వెళతాయి. “శాంతియుత పోరాటాలు చేస్తున్నాం” అని చెప్పుకునే పలువుఱు హింసాత్మక పోరాటాలు జఱిపేవారి భాషనే వాడుతూండడం గమనార్హం. *(మా తడాఖా చూపిస్తాం, మడమ త్రిప్పం, అంతు తేలుస్తాం, ఇది నా సవాల్* ఇత్యాది) మనసులో ఇంత ఉగ్రతా, ఇంత హింసా పెట్టుకున్నవారి పోరాటాలు శాంతియుతం ఎలా అవుతాయి? మొదట్లో శాంతియుతంగానే కనిపించిన పోరాటాలు, దరిమిలా హింస్రంగా పరిణమించిన చారిత్రిక దృష్టాంతాలనేకం ఉన్నాయి. నేడు శాంతియుత పోరాటాలని చెప్పబడేవాటిలో హెచ్చుభాగం ప్రసారమాధ్యమాల ద్వారా ప్రచారయుద్ధ విధానాన్నో, కోర్టుకేసులనో ఆశ్రయించుకున్నటువంటివి. నిజానికి ఉగ్రవాదం కూడా మీడియావారి సావధానాన్నీ, సంచలనాల్నీ లక్షించి చేస్తున్నదే.

వివరాలిక్కడ అవసరం లేదు గానీ దీనికింకా నీచమైన పార్శ్వమొకటి తయారైంది. ఈనాడు శాంతియుత పోరాటాల పేరిట వాస్తవంగా జఱుగుతున్నది ఓ విధమైన Show-down business, ఓ రకమైన బ్లాక్ మెయిలింగ్ వ్యాపారం. ఈ కాలంలో పలువుఱికి ఇవి జీవనోపాధిగా మారాయి.

ప్రచార కార్యక్రమాలన్నీ మతమార్పుల (religious conversions) లా ఓ తరహా రాజకీయాలే. అవన్నీ మానవతాసూత్రాలకి విరుద్ధమైన అనృజువర్తన క్రిందికే వస్తాయి. ఎందుకంటే, మామూలు యుద్ధాల్లో మనుషుల్ని భౌతికంగా నిర్మూలిస్తే ప్రచారయుద్ధాల్లో పాల్గొనేవారు ప్రతివాదుల్ని శీలహననం (character assassination) కావిస్తారు. ఆ క్రమంలో వారు అన్ని చర్చానియమాల్నీ, నైతికసూత్రాల్నీ గాలికొదిలేస్తారు. ప్రచారాలకీ, వాస్తవాలకీ మధ్య మహాసముద్రాలూ కొండలూ గుట్టలూ అడవులూ అఖాతాలూ ఎన్నో ఉంటాయి. విషయాల సూక్ష్మాన్నీ మనుషుల లోతునీ అవి గ్రహించనివ్వవు. వృత్తినిపుణులైన ప్రచారకర్తలు (professional campaigners) వ్యూహాత్మకంగా మంచిశైలినీ, భాషనీ గుప్పించి



తమ అధీనంలోని బృహత్తర మాధ్యమ సంపర్క జాలాల (Media networks) ద్వారా చేసే విస్తృత ప్రచారాల ఫలితంగా మనం ముక్కూమొహం తెలీనివారినీ, మనకి ఏ ఉపకారమూ చేయనివారినీ అమాయకంగా ప్రేమించేస్తాం. అలాగే ముక్కూమొహం తెలీనివారినీ, మనకి ఏ అపకారమూ చేయనివారినీ నిష్కారణంగా ద్వేషిస్తాం కూడా.

ఈ ప్రచార పోరాటాలన్నింటికీ పెద్దపెద్ద గుంపులు కావాలి. వాటితో పాటు అక్రమంగానో సక్రమంగానో సమీకరించిన భారీ డబ్బుమొత్తాలు కావాలి. కానీ నవ్యమానవతావాదమో, విడివ్యక్తినే కేంద్రబిందువుగా చేసుకున్నటువంటిది. గుంపుల్ని పోగేయడమంటే, ఆ గుంపులకి చెందని విడివ్యక్తుల్ని వాటి ముందు అశక్తుల్ని చేయడం. వారి నిస్సహాయతని వారికి గుర్తుచేసి బెదిఱించడం. వ్యక్తికీ గుంపుకీ మధ్య శక్తి–అసమతూకాన్ని (power imbalance) సృష్టించడం. అటువంటి బలప్రదర్శన ద్వారా విడివ్యక్తుల హక్కుల్ని హరించడం. ఈ గుంపులన్నీ మీడియా యొక్క అండదండలు చూసుకుని విజృంభిస్తున్నాయి. ఇవి రెండూ కలిసి ఒక రకమైన పరస్పర స్తోత్ర సమాజంగా, ఒకటి తప్పుల్ని ఒకఱు వెనకేసుకొచ్చేవారుగా అవతరించారు.

పోరాడ్డం నేర్చుకున్నవారంతా తెఱుపుడు మనసు (open mind) నీ, సరళ స్వభావాన్నీ, చిన్ననాటి సున్నితత్వాల్నీ, అనుభూతుల్నీ శాశ్వతంగా పోగొట్టుకుంటారు. ప్రేమభావనలకి దూరమైన వీరు, కామసుఖం కఱువైన జాగిలాల వలె నిరంతర ఉగ్రవైఖరిని ప్రదర్శిస్తూంటారు. వీరంతా కలిసి సమాజంలో ఓ అనాగరిక, మొఱటు వాతావరణానికి నాంది పలుకుతారు. ఇదో విషవలయం. ఈ మార్గంలో సాధించే విజయాలు ఆయా సిద్ధాంతవాదులకి తాత్కాలికంగా చవకబారు తృప్తినీ, పైశాచిక ఆనందాన్నీ, స్వోత్కర్షనీ కలిగిస్తాయే తప్ప అవి వాస్తవంగా డొల్ల. ప్రతీకార భావనల కాలకూట మిశ్రమంతో కలుషితం కానటువంటి నిఖార్సైన ధర్మపోరాటాలు ప్రపంచంలో ఎక్కడా లేవు. కాబట్టి మానవుల మీద పోరాడ్డమంటే వారిని ద్వేషించడమే. మతం కోసమో, సిద్ధాంతం కోసమో పోరాడుతున్నామని చెప్పుకునే వారు కూడా ఆచరణలో మతాల్నీ కాదు, సిద్ధాంతాల్నీ కాదు. మనుషుల్నే ద్వేషిస్తారు. వారి మీదే దాడులు చేస్తారు. వారు వాటిని అంతిమంగా ఏమీ చేయలేరు. కానీ వాటి పేరుతో వ్యక్తుల్నీ, కుటుంబాల్నీ నాశనం చేసిపోతారు.

## 19. తన ధనాన్నీ, జ్ఞానాన్నీ ప్రతిఫలాపేక్ష లేకుండా ఇతరులతో పంచుకోవడం



టే సాధ్యమైనంతవఱకూ ఇతరులకి సహాయం చేయడం. మానవ జాతికి చరిత్రలో ఇప్పటి దాకా ఏదైనా మేలు జఱిగిందంటే దాని క్కారణం— కొందఱు వ్యక్తులు ప్రతిఫలాపేక్ష లేకుండా తమ సంపదనీ, జ్ఞానాన్నీ ఇతరులకి ఉచితంగా పంచిపెట్టడం వల్లనే. వట్టి ఉపయోగవాదాన్ని (utilitarianism) ఆశ్రయించినవారి వల్లా, ప్రతీదీ అమ్మజూపేవారి వల్లా మానవాళికి ఎన్నడూ ఏ మేలూ జఱగలేదు. ఇహ ముందూ జఱగబోవడం లేదు. నిజానికి ఈ తరువాతి రెండు తరహాల వ్యక్తులూ మొదటి తరహా వ్యక్తుల మూలాన బాగుపడ్డవారే. మొదటితరహా వ్యక్తులు తమ జీవితాన్ని కూడా లెక్కచేయకుండా ప్రాణాలకి తెగించి మఱీ సాధించిన విషయాల్ని వీరు తరువాతి కాలంలో సొమ్ము చేసుకుంటారంతే.

*“చేపలు వండిపెట్టడం కన్నా చేపలు పట్టడం ఎలాగో నేర్పడం ఎక్కువ మేలుచేస్తుంది”* అనే సూక్తి తఱచుగా వినపడుతుంది. వినడానికి ఈ వాదన చాలా బావుంటుంది. కానీ చేపలు పట్టడం నేర్పాలంటే ముందసలు అక్కడ చేపలంటూ ఉండాలి కదా. “పోనీలే” అని దయ చూపి చంపకుండా కొంతకాలం పాటు వాటిని వాటి మానాన బ్రతకనిచ్చేవాళ్ళుండాలి కదా. కానీ జనం చేపపిల్లలతో సహా అన్నీ అమ్మేసుకుంటారు.

సారాంశమేంటంటే— మానవజాతి చరిత్రలో ఏ వ్యాపారమూ వ్యాపారదృష్టితో మొదలుకాలేదు. ప్రతీదీ ముందు సన్నిహితులకి చేసిపెట్టిన ఉచితసేవగా మొదలై తరువాతి దశల్లో వ్యాపార రూపాన్ని సంతరించుకుంది. ప్రతి వ్యాపారానికీ ముడిసరుకు ప్రకృతిసంపదే. మఱి ఆవిడకి వ్యాపారులు ఏం చెల్లిస్తున్నారు? ఏమీ లేదుగా? ప్రకృతే కాదు, జయప్రదమైన ప్రతి వాణిజ్య పూనిక (commercial enterprise) వెనకా ఎవఱిదో దయార్ద్రహృదయం తప్పక దాగుంటుంది.

మనం జీవిస్తున్న ఆధునిక నాగరికత అత్యంత సమ్మోహకమైనది (fascinating). అది మనుషులకి జీవితం మీదా, భవిష్యత్తు మీదా మిక్కిలి ఉత్తేజకరమైన ఆశని ప్రోదిచేస్తుంది.



ఈ నాగరికతలో శ్రేష్ఠమైన వస్తువుల్ని రోజూ చూస్తూ “అవి మనకొద్దులే” అనుకోవడం సామాన్యులకి అసాధ్యమైన విషయం. అందువల్ల ఈ కాలంలో గణనీయశాతం జనం ఓ రకమైన బందిపోటు మనస్తత్త్వంతో జీవిస్తున్నట్లు కనిపిస్తుంది. చూసిందల్లా కావాలనుకోవడం, అది లేకపోతే ఉండలేమనుకోవడం, దాని కోసం ఏమైనా చెయ్యడానికి సిద్ధపడడం, “అసలు మనం ఈ కాలంలో ఈ సమాజంలో పుట్టిందే అన్నీ అనుభవించడానికి” అనుకోవడం— ఇవీ ఈ బందిపోటు మనస్తత్త్వ లక్షణాలు. ఇది ఉన్నంత కాలం మనిషి మానవతావాది కావడం అసాధ్యం.

సంఘజీవితం అలవాటు చేసిన ఈ బందిపోటు మనస్తత్త్వాన్ని– ప్రతిఫలమాశించకుండా ఇతరులకి సహాయం చేయడం ద్వారా పోగొట్టుకోవచ్చు. వాచ్యంగా సహాయాన్ని అర్థించేవారికే కాదు, అలా నోరు విప్పి అర్థించనివారిక్కూడా చేతనైతే దాన్ని అందించాలి. నూతిలో పడ్డ వాడు “రక్షించండి, రక్షించండి” అని కేకలు పెడతాడు తప్ప దార్న పోయేవారి పేరడిగి కనుక్కుని మఱీ కేకలు పెట్టడు గదా! “నన్ను పేరుపెట్టి పిలవలేదు. నాకెందుకు?” అని దులుపుకు పోవడం న్యాయమా?

ఇహపోతే జ్ఞానాన్ని ప్రతిఫలాపేక్ష లేకుండా పంచడం విషయానికొస్తే అందులో అనేక ఇతర విషయాలు కూడా ఇమిడుంటాయి. సాధారణంగా ఇలా చేయగలవారిలో ప్రతిఫలాపేక్ష లేకుండా విషయాల గుఱించి పరిశోధించే/చర్చించే/పంచుకునే తత్త్వం కూడా ఉంటుంది. జనం మొదటిదాన్ని మెచ్చుకోగలరు. కానీ మిగతా తత్త్వాల్ని మెచ్చుకోలేరు. “నీకెందుకా విషయం?” అని అడిగేవారెక్కువ. కానీ ప్రతిఫలాపేక్ష లేని జ్ఞాన వినిమయం కూడా ప్రతిఫలాపేక్ష లేకుండా చేసే పరిశోధనా, చర్చల లోంచే పుడుతుంది.

## 20. . చట్టాల్నీ, వ్యవస్థల్నీ మానవతావాద స్ఫూర్తితో రూపొందించుకోవడం

చట్టాల్లో ఓ గణనీయశాతం, శస్త్రచికిత్స చేసి కడుపులో కత్తెర మర్చిపోవడం వంటివి. కనుక వాటితో మనుషులు మంచిగా మారతారని నవ్యమానవతావాదులు విశ్వసించరు. కానీ జనాన్ని చెడగొట్టడానికైతే ఇతోఽధిక అవకాశముంది.

ఉదాహరణకి, తప్పుడు ఫిర్యాదులిచ్చేవారిని శిక్షించాలనే నియమం లేకపోవడంతో కేవలం పరపీడన–స్వలాభాల నిమిత్తం ఫిర్యాదులిచ్చేవారి సంఖ్య పెఱిగిపోతోంది. అదే నిష్పత్తిలో అమాయకులు బలైపోవడం కూడా హెచ్చుతోంది. అలా బలి చేసినందుకు ఆ అమాయకులకి నష్టపరిహారం చెల్లించే ఏర్పాటు కూడా ఎక్కడా కనిపించడం లేదు.

సమాజాన్ని బాగుచేయకపోయినా ఫర్వాలేదు కానీ ప్రశాంతమైన యథాస్థితి (status quo) ని పాడుచేసేలా మానవతాసూత్రాలకి విరుద్ధమైన చట్టాలు చేసుకుంటూ వెళ్ళొద్దని నవ్యమానవతావాదులు సలహా ఇస్తారు. చట్టాలనేవి– సంకుచితులూ, సిద్ధాంతోన్మాదులూ ఐన కొన్ని ప్రయోజనగుంపుల (interest groups) యొక్క ఇష్టానిష్టాలకో, లేదా క్షణానికో చిత్తంగా మారిపోయే పరిపాలకుల తలతిక్కలకో అనుగుణంగా కాక అంతర్జాతీయ ఆమోదం పొందిన మానవహక్కుల చార్టర్ కి అనుగుణంగా రూపొందించాలని వారు కోరతారు.

ఐతే ప్రస్తుతం అమల్లో ఉన్న మానవహక్కుల చార్టర్ అసమగ్రమని గమనించాలి. ఉదాహరణకి, అందులో మాతృభాషాహక్కులకి ఏ విధమైన రక్షణా ఇవ్వబడలేదు. అదే కాక అనేక ఇతరాంశాల్ని సైతం జోడించి మానవహక్కుల్ని పునఃక్రోడీకరించాల్సి ఉంది. ఈ విషయానికి అంతర్జాతీయ స్థాయిలో ఆమోదాన్ని సంపాదించడం వెన్వెంటనే సాధ్యపడకపోవచ్చు గనుక ప్రస్తుతానికి ప్రాంతీయస్థాయిలో మనమే దాన్ని తిరగవ్రాసుకోవడం గుఱించి ఆలోచన చేయాలి.

సామాజిక అవసరాల్నీ, అనివార్యతల్నీ చట్టాలుగా రూపుదిద్దడం కొంతవఱకూ ఆమోదయోగ్యం. కానీ ఆదర్శాలూ, ఆశింపులూ అనివార్యం కాదు. అవి అవసరాల శ్రేణిలోకి రావు. ఓ వర్గానికి అనుకూలంగా ఓ చట్టాన్ని తేక తప్పని పరిస్థితి ఉంటే, అదే సమయంలో, ఇతర వర్గాలక్కూడా అనుకూలంగా అలాంటిదే మఱో సమాంతర చట్టాన్ని గానీ అధికరణాన్ని (clause) గానీ తేవాలి. ఆ విధంగా ఎవఱి మానవహక్కులకీ భంగం కలక్కుండా సమతూకాన్ని పాటించాలి.

ఈ సందర్భంగా ఓ విషయం. నవ్యమానవతావాదులు సమానత్వం లాంటి సిద్ధాంతాల మీద ఊనిక (emphasis) పెట్టరు. దానర్థం, వారు అసమానత్వాన్ని సమర్థిస్తారని కాదు. ఉన్న



అసమానత్వాల్ని యథాతథంగా అంగీకరించినప్పుడు మాత్రమే మనం అసమానుల్ని సైతం సహించగలం, ప్రేమించగలం. అలా కాక, వాటిని తిరస్కరించినప్పుడు మనం మన కంటే అధికుల్ని గానీ అల్పుల్ని గానీ భరించలేం. వారిని ద్వేషించనన్నా ద్వేషిస్తాం. లేదంటే ఎగతాళన్నా చేస్తాం. ఒక చిన్నబిడ్డ పెద్దలతో ఏ విధంగానూ సమానం కాదు. అయినా వాణ్ణి వారు ప్రేమిస్తారు. అలాగే మనతో సమానం కాని పెద్దల్ని కూడా ప్రేమించాలనడమే నవ్యమానవతావాద సారాంశం. అంటే ఈ మార్గంలో– సమానత్వం గానీ, అసమానత్వం గానీ రాగద్వేషాలకి ప్రాతిపదికలు కావు.

చరిత్రగతిలోనూ, ప్రకృతిమూలకంగానూ వచ్చిపడ్డ అసమానత్వాల సన్నిధానంలో మనం నిస్సహాయులం. మనం వాటిని సరిదిద్దలేం. అలాగే, వ్యక్తుల జీవితాల్లో వారివారి ప్రతిభావ్యుత్పత్తులూ, కృషి, అదృష్టం ఇత్యాదుల మూలాన ఏర్పడ్డ అసమానత్వాల్నీ మనం సరిదిద్దలేం. కానీ సమానప్రతిభ గల వ్యక్తులకి సమానావకాశాల్ని కల్పించడం వఱకూ చేయగలం.

అదే విధంగా, మన సమష్టిచర్యల్లోని తెలివితక్కువతనం కారణంగా సరిక్రొత్త అసమానత్వాలు సృజించబడని విధంగా జాగరూకత వహించగలం. ఉదాహరణకి సమాజంలో కొన్ని వర్గాలకి మూకుమ్మడిగా చట్టపరంగా ఎక్కువ వెసులుబాట్లూ, ఎక్కువ ఆమోదయోగ్యతా (acceptability), ఎక్కువ రక్షణా ఇవ్వడం వల్ల ఆ మేఱకి వాటిల్లో మిగతా వర్గాలకి కోత పెట్టినట్లే అవుతుంది. అందుచేత ఇలాంటి అసమతూకం సమాజంలో తీవ్ర అసంతృప్తికీ, అశాంతికీ దారితీస్తుంది. పర్యవసానంగా శాసన పరిరక్షిత వర్గాలకీ, అలాంటి రక్షణేదీ లేని వారికీ మధ్య శత్రుత్వమూ, పరస్పరపీడనా హెచ్చుతాయి. ఇది కేవలం ఓ ఉదాహరణ మాత్రమే. ఇలాంటి సంభావ్యతల్ని నివారించాలన్నా, చట్టాల రూపకల్పనలో నవ్యమానవతా సూత్రాల స్ఫూర్తికి స్థానం కల్పించడం తప్పనిసరి.

## ఆరోపకుల న్యాయం చేస్తున్న విలయతాండవం

**న్యాయాన్ని అమలుజఱిపే పద్ధతి కూడా న్యాయంగానే ఉండాలి:** వ్యవస్థ మీద– నష్టపో యిన వారికి న్యాయం చేసే బాధ్యత ఎంతైతే ఉందో, ఏ తప్పూ చేయని వారినీ, వారి పరువు ప్రతిష్ఠల్నీ కడుపులో పెట్టుకుని కాచే బాధ్యత కూడా అంతే ఉంది. కానీ వర్తమాన సమాజం ఈ రెండో బాధ్యతని గాలికొదిలేసిన వైనం గోచరిస్తోంది. దురదృష్టవశాత్తూ ప్రస్తుతం– మానవతావాదమంటే ఏంటో బొత్తిగా తెలీని మనలాంటి దేశాలతో పాటు అది కాస్తో కూస్తో తెలిసిన పురోగత దేశాలతో సహా ప్రపంచవ్యాప్తంగా ఆరోపకుల న్యాయమే (Accusors' justice) అమల్లో ఉంది. అంటే–

- ఆరోపించినవారి మాటల్నే పాటిగా తీసుకుని ఆరోపితుల (accused) ని అవ మానించడం.
- ఆరోపితుల్ని పేర్లూ, ఇంటిపేర్లతో సహా పేర్కొంటూ ఛాయాచిత్రాలతోనూ, దృశ్య కాలతోనూ, ప్రసారాల పునరావృత్తి (photos, videos and repeated broadcasts) తోనూ మీడియాలో బద్నాం చేయడం.
- ఆరోపణ వచ్చీ రాగానే ఆరోపితుల సాధారణ హక్కుల్ని కూడా హరించడం.
- ఏ అనుమానమొస్తే ఆ అనుమానం ప్రకారంగా క్రొత్తక్రొత్త సెక్షన్లు బనాయించి ఆరోపితుల్ని ఇఱికించడం.
- ఆరోపించినందుకు ఆ అరోపణల్ని నిరూపించే నైతిక బాధ్యత ఆరోపకుల మీద ఉండగా తద్విరుద్ధంగా- తప్పు చేయలేదని రుజువు చేసుకునే బాధ్యత (burden of proof) ని ఆరోపితుడి మీదే పెట్టడం.
- ఆరోపణల వెనక పకడ్బందీ కుట్రలుండొచ్చుననే గతానుభవ గుణపాఠాల్ని పరి గణనలోకి తీసుకోకుండా, ఆరోపకులు చెప్పినదల్లా నమ్మేసి, ఆ ప్రాతిపదికన ఉత్తుత్తి విచారణ (kangaroo court) నడపడం.
- ఆరోపితుల పూర్వచరిత్రని బట్టి కాకుండా వట్టి బీభత్స ఆరోపణలూ (wild allegations), అనుమానాలూ, భయాలూ, ఊహాలోకాల ఆధారంగా ఆరోపితు లకి పూచీఖత్తు (bail) నిరాకరించడం.



- ఆరోపకులకి సంపూర్ణ విశ్వసనీయత (కేవల ఆరోపణనే తిరుగులేని సాక్ష్యంగా భావించడం), వారికి రాజపూజ్యం.
- ఇద్దఱు వ్యక్తులు ఒకే నేఱంలో సమానంగా భాగస్వాములైనప్పుడు వారిలో తమ కిష్టమైన వ్యక్తిని ఏదో ఒక మిషపై/ రూల్ పేరుతో కేసులోంచి తప్పించి రెండో వారిని మాత్రమే శిక్షకి పాత్రం చేయడం.

ఇవన్నీ ఈ Accusor's justice లో భాగం. దీన్ని పూర్వశతాబ్దాల పాలకులు కనిపెట్టగా, దాన్ని సరిదిద్దడం మానేసి, సమకాలీనులు సైతం, తమ తమ కుటిలవ్యూహాల కొద్దీ యథా తథంగా కొనసాగిస్తున్నారు. ఫలితార్థంగా Accusor's justice కి సంబంధించిన పలు అన్యాయపు టధికరణాలతో మన చట్టాలు పొంగిపొర్లుతున్నాయి. "ప్రతి ఫిర్యాదీ బాధితుడే అయి ఉంటా"దన్న సిద్ధాంతం అధారంగా ఏర్పడినది ఈ Accusors' justice. ఈ అభి ప్రాయం అవాస్తవమని ఇప్పటి దాకా కోట్లాది కేసుల్లో నిరూపితమయ్యాక కూడా ఇది యథా పూర్వంగా కొనసాగుతూండడం శోచనీయం. పూర్తి ఏకపక్ష ధోరణితో కూడిన ఈ ఆరో పకుల న్యాయం విక్రేతల విపణి (sellers' market) కంటే ఎక్కువ ధర్మబద్ధమైనది కా దని అందఱూ గ్రహించే రోజు రావాలి.

ఇదే క్రమంలో– తమ అదుపులో ఉన్నవారి పట్ల క్రూరంగా ప్రవర్తించడాన్ని కూడా నవ్య మానవతావాదం అంగీకరించదు. అదుపులో లేకపోయినా అనుమానితుల్ని హింసించడం, లేదా మనసులో ఇంకేదో పెట్టుకుని కేవలం అలా హింసించడం కోసమే మనుషుల్ని ఏదో ఒక వంకతో అదుపులోకి తీసుకోవడం– ఇవి కూడా నవ్యమానవతావాదానికి విరుద్ధమే. హింసకి తాళలేక ఒకడు ఓ పనిని తన మీద వేసుకుంటే అది హింసకుల విజయం కాదు. అలా హింసించి ఒప్పించడమే ఒప్పంటే మనకో వ్యవస్థ అవసరమే లేదు. ఏ దారిన పోయే దానయ్యని అందుకు అనుమతించినా అతను కూడా చెయ్యగలడు. ఈ హింసకి "తమదైన శైలి" అని సునామకరణం (euphemism). విచారకరమైన విషయమేంటంటే తమదాకా రానంతవఱకూ అందఱూ ఈ అలవాటుని సమర్థిస్తారు. పవిత్రులం అనుకునేవారు అపవిత్ర పద్ధతుల్ని సమర్థించకూడదు.

నేఱస్థులు కూడా మనుషులేనని నవ్యమానవతావాదం పేర్కొంటుంది. నేఱాన్ని ఆరోపించక ముందటి క్షణం దాకా వారు మనతో పాటు పుట్టి, మనతో పెఱిగి మన మధ్య తిరిగినవారే.

అలాంటివారిని హఠాత్తుగా అస్పృశ్యుల్నీ, హక్కురహితుల్నీ చేయడం తగదు. నేఱాలకి వాటిని చేసిన వ్యక్తుల్నే పూర్తి బాధ్యులుగా చిత్రించడం కూడా సరికాదు. నిజానికి అందుకు కారణం సమాజమే. నవ్యమానవతావాద సూత్రాల ప్రకారం ఎవఱి భావోద్వేగాలకి బాధ్యత ప్రాథమికంగా వారిదే అయినప్పటికీ **సమాజం వ్యాప్తి చేసే తప్పుడు భావజాలమూ, అది సృష్టించే పరిస్థితులూ కూడా అన్యథా-పరిశుద్ధులైన వ్యక్తుల్ని సైతం నేఱస్థులుగా మారుస్తున్నాయి** అని నిర్మొహమాటంగా చెప్పక తప్పదు. ఇవి గాక చట్టాల ద్వారా కృత్రిమంగా సృష్టించబడే పిచ్చిపిచ్చి నేఱాలు కొన్ని. (ఉదాహరణకి– కొన్నిమొత్తాల్ని చెక్ రూపంలోనే చెల్లించాలనే నిబంధన) కాబట్టి నేఱారోపణలు లేని వ్యక్తులకుండే పౌర-మానవ హక్కుల్లో చాలా మటుకూ ఆరోపితులకీ, నేఱ నిర్ధారితులకీ (convicted), శిక్షాకాలీనులకీ సైతం ఉండాలి.

న్యాయమనేది ఈ కాలంలో కలవారికీ, లేనివారికీ సమానంగా అందని ద్రాక్ష. ఎందుకంటే ఏ దేశంలో నైనా న్యాయవ్యవస్థ పైకి చెప్పబడుతున్నంత స్వయంప్రతిపత్తికం (autonomous) కాదు. అదీ గాక అక్కడ కూడా మనుషులే పనిచేస్తారు. ఏది ఏమైనా మనం న్యాయ వ్యవస్థని గౌరవించాలి. ఎందుకంటే అది విస్తృతమైన ఉద్యోగావకాశాల్ని కల్పిస్తోంది. మన చట్టాల్లో కొన్ని సినిమా స్క్రిప్టుల్లాంటివి. వాటిల్లో ఓ హీరో, ఓ హీరోయినూ, ఓ విలనూ, ఓ కమెడియనూ అందఱూ ముందే నిర్ణయమైపోయి ఉంటారు. కనుక ఎవఱు ఎవఱిమీద వ్యాజ్యం వేస్తే ఎవఱు గెలుస్తారో పసిపిల్లవాడు కూడా చెప్పేయగలడు. అందుకోసం మనకో వకీలు అవసరం లేదు.

రాజకీయ ప్రభువులు మన న్యాయవ్యవస్థ యొక్క కాస్మోపాలిటన్ తత్త్వాన్నీ, అపాక్షికతనీ ప్రత్యేక న్యాయస్థానాల ఏర్పాటు ద్వారా హరిస్తున్నారు. అక్కడ పోలీసులూ, పబ్లిక్ ప్రాసిక్యూటర్లూ, వకీళ్ళూ, న్యాయమూర్తులూ, ఫిర్యాదీలూ అందఱూ ఒకే వర్గానికి చెంది ఉంటారు. పాపం, ఆరోపితుడొక్కడే వేఱే వర్గానికి చెంది ఉంటాడు. అందుచేత ఒక వర్గానికి చెందిన కక్షిదార్లకే అనుకూలంగా వ్యవహరించాలనే అదృశ్య మానసిక ఒత్తిడి అక్కడ పనిచేస్తూం టుంది. మఱి అలాంటిచోట న్యాయమెలా జఱుగుతుందో అగమ్యగోచరం.

ఈ వోట్-బ్యాంకు చట్టాల స్థానంలో మానవతాదృక్పథంతోనూ, సర్వజన సమదృష్టితోనూ



కూడిన చట్టాలొస్తే దేశానికి సుదీర్ఘ భవిష్యత్తులో మేలు జఱుగుతుంది. *"కక్షిదారుల్లో మేము సూచిస్తున్న ఒకఱి పక్షాన నిలబడి తీఱాల్సిందే"* నంటూ పోలీసుల్నీ, న్యాయమూర్తుల్నీ ఒత్తిడి చేయని చట్టాలు కావాలి. మనస్సాక్షి కనుగుణంగా నిర్వర్తించాల్సి ఉన్న వారి స్వచ్ఛంద వృత్తి ధర్మంలో జోక్యం చేసుకోని చట్టాలు రావాలి. తటస్థ-నిష్పక్షపాత-ఉదారవాద చట్టాలు రావాలి.

నేఱస్థుల స్వర్గాల్ని (criminals' Paradise) సృష్టించమనడం నవ్యమానవతావాదపు టుద్దేశ్యం కాదు. కఱుడుగట్టిన నేఱస్థులకిచ్చే మన్నింపు (treatment) కఠినంగా ఉండాలన్నప్పుడు అంత తీవ్రత లేని నేఱస్థులతో/ఆరోపితులతో సైతం అలాగే వ్యవహరించడం అర్థం లేని విషయం కదా? ఈ పోకడనే నవ్యమానవతావాదం ఖండిస్తున్నది. మనకి ఈ మానవ నిర్మిత ప్రత్యక్ష నరకాల స్థానే పరివర్తనాలయాలు (Reformatories) కావాలి. శిక్షాగృహాల స్థానే శిక్షణాలయాలు కావాలి. మీడియా, ప్రయోజన గుంపులూ, కలిసి సంయుక్తంగా రోడ్ల మీద నిర్వహిస్తున్న సమకాలీన Street justice/Rowdy justice స్థానే Professional justice కావాలి. నానారకాల రాగద్వేషాల వల్లా, ప్రలోభాల వల్లా, పక్షపాతాల వల్లా ప్రచోదితులైనవారిచ్చే తప్పుడు సాక్ష్యాల/ప్రాడ్వివాకత్వాల స్థానే వాస్తవికమైన భౌతిక రుజువుల మీద ఆధారపడ్డ Scientific justice కావాలి.

## 21. విదేశీయుల పట్ల కూడా దయనీ, ఆదరాన్నీ ప్రదర్శించడం

నేడు విదేశీయులంటే ప్రపంచవ్యాప్తంగా నిరసనభావమూ, ద్వేషమూ ఉన్నాయి. కొన్నిసార్లు తమ ప్రాంతానికి చెందినవారు కాకపోతే స్వదేశస్థుల్ని కూడా ద్వేషిస్తున్నారు. అట్టి ద్వేషించడంతో ఆగకుండా కొండొకచో దోపిడీకి, చట్టబద్ధ/చట్టవిరుద్ధ హింసలకీ, కించపఱుపులకీ పాల్పడుతున్నారు కూడాను. దీనికి మూడు కారణాలు:

**ఒకటి–** తాము తమ దేశానికి/ ప్రాంతానికి వేలాది సంవత్సరాలుగా ప్రాతకాపులమనే విశ్వాసం. అందువల్ల తమ ప్రాంతం తమ తరతరాల పిత్రార్జితమూ, గుత్తసొత్తూ (monopoly) అనే అభిప్రాయం.

**రెండోది—** ఇదివఱకు సాయుధంగా వలసొచ్చిన కొందఱు విదేశీయులతో తమకి కలిగిన రాజకీయానుభవాల చేదు.

**మూడోది—** విదేశీయులు/ పరప్రాంతీయులు తమకంటే తెలివైనవారో, బలవంతులో కావచ్చు గనుక, వారు తమ వనరుల్నీ, అవకాశాల్నీ దొఱకబుచ్చేసుకుని తమకి లేకుండా చేస్తారేమోనన్న భయం.

సుదూర చరిత్రని గమనంలో ఉంచుకున్నప్పుడు ఏ దేశమూ ఏ మానవ సమూహపు గుత్తసొత్తూ కాదని అర్థమౌతుంది. మానవ సమూహాలు ఇప్పుడున్న దేశాల్లోనే ఐదువేలేళ్ళ క్రితం లేరు. ఇంకో ఐదువేలేళ్ళ తరువాత వీరెక్కడికి వెళ్ళబోతారో తెలీదు. ప్రతి మానవ సమూహమూ ప్రస్తుతం తనదిగా భావిస్తున్న దేశానికి/ప్రాంతానికి బైటినుంచి వచ్చినదే. దేశాలు జాతుల గుత్తసొత్తులనే అభిప్రాయం ప్రబలిపోవడానికి కారణం, క్రీ.శ. 14–15 శతాబ్దుల నుంచి వ్యాప్తిలోకొచ్చిన జాతీయవాదం. తత్కాలీనులకి అది ప్రగతివాదం, అభ్యుదయవాదం. ఆ యుగీన జీవితాలకి అదే ఓ పెద్ద మానవతావాదం కూడా.

ఆ మనోవైఖరికి భౌతిక కారణాలున్నాయి. ఆ రోజుల్లో గుఱ్ఱాలు తప్ప వేఱే రవాణాసౌకర్యాలెఱుగరు. రాజ్యాల భౌగోళిక అధికార పరిధి ఆ విధమైన రవాణా పరిమితుల చేత సీమితమై ఉండేది. వారి నెత్తిమీద సువిశాల సామ్రాజ్యాలు కూడా లేకపోలేదు. కానీ ఆ సమ్రాట్టులెవఱూ నేరుగా కాక జిల్లాస్థాయి రాజుల ద్వారానే పరిపాలించేవారు.ఈ చిన్నచిన్న రాజ్యాల మధ్య అడపా–దడపా చాలా ఘర్షణలు చెలరేగుతూండేవి. అభివర్ధిత సమాజానికి ఓ దశలో ఈ చిన్నరాజ్యాల ఆర్థిక వ్యవస్థ కాలవిరోధం (anachronism) గా కూడా పరిణమించింది.

అందుకని అప్పట్లో వారు ఆలోచించారు: "ఒకే భాష, ఒకే మతమూ, సంప్రదాయాలూ గల మనమంతా ఈ విభేదాలు మర్చిపోయి, మన జిల్లాలన్నింటినీ విలీనం చేసి ఒకే ఒక పెద్ద రాజ్యంగా ఏర్పడితే బావుంటుందేమో కదా?" అని! ఫలితంగా యూరప్ ఖండంలో ఒకే భాషా, సంస్కృతీ గల పెద్దపెద్ద జాతీయరాజ్యాలు చాలా ఏర్పడ్డాయి. వాటి ఆవిర్భావంతో యూరప్ ఓ పెద్ద ముందంజ వేసినట్లయింది. ఎందుకంటే తరువాతి కాలంలో యూరోపియన్లు ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యాలు స్థాపించడానికి మూలం, తొలుత తమ స్వఖండంలో జాతీయ రాజ్యాల్ని స్థాపించుకోవడమే.



జాతీయరాజ్యాల నేర్పఱచుకున్న రోజులకీ, నేటికీ మధ్య ప్రపంచం చాలా మారిపోయింది. ఈనాడు ఒక్కరోజులో మనిషి ప్రయాణించగల దూరం 16,000 కిలోమీటర్లు. (ఈ వేగం భవిష్యత్తులో ఇంకా ఎన్నో రెట్లు పెఱగబోతోందని వినికిడి) అటువంటప్పుడు 100 కిలోమీటర్ల వేగానికి ప్రతిస్పందనగా ఉప్పతిల్లిన 14 వ శతాబ్దపు జాతీయవాదం దగ్గఱే మనం మానసికంగా, బౌద్ధికంగా స్తంభించిపోవడంలోని ఔచిత్యం పునరాలోచనీయం. జాతీయవాదం కూడా అన్ని ఇతరవాదాల్లోనూ సర్వసామాన్యంగా ఉండే తభావతుల కతీతం కాదు. కనుక ఇప్పుడు మన మానవప్రేమ జాతీయవాద స్థాయి నధిగమించాల్సిన అవసరముంది. నిజానికి కొంత మేఱకి అధిగమించాం కూడా. కారణమేదైనా కానివ్వండి. మనవారు లక్షలాదిగా వలసపోతూండడమే ఇందుకు నిదర్శనం. దరిమిలా నేడు జాతీయవాదం ప్రభుత్వాలకీ, రాజకీయ పక్షాలకీ పరిమితం.

మనం ఇతర దేశాలకి వలసపోవడమే కాదు, మన దేశానికి వలసొచ్చే విదేశీయుల పట్లా, పర ప్రాంతీయుల పట్లా కూడా సహనంతోనూ, ఆదరంతోనూ వ్యవహరించాల్సి ఉంది. వారిని శత్రువుల్లా చూసే ధోరణి పోవాలి. సర్వస్వామ్యాలూ ప్రసాదించాలని ఎవఱూ అనరు. కనీసం వారి మానవహక్కుల నైనా హరించకుండా జాగ్రత్త వహించాలి.

నానాకారణాల్ని పురస్కరించుకుని స్వదేశంలో వేధింపులకి గుఱయ్యేవారు విదేశాలకి శరణార్థులుగా వెళ్ళడం తఱచు. కానీ అలాంటివారికి ఆశ్రయమిచ్చే విషయంలో అన్నిదేశాలూ తటపటాయిస్తూంటాయి. "ఓ దేశపు రాజు ఇంకో దేశంలో కూలీ" అన్న సామెతుంది. అలాగే ఒకడు ఓ దేశంలో పాపి అయినంత మాత్రాన మఱో దేశంలో పుణ్యాత్ముడెందుకు కాకూడదు?

## 22. కృతజ్ఞత చూపడం

నిజానికి ఇది మానవుల్లో తఱచూ కానవచ్చే లక్షణం కాదు. ప్రయత్నపూర్వకంగా అభ్యసించవలసినదే. అయినా ఇది మానవ సంబంధాల్ని మెఱుగుపఱుస్తుంది. కాబట్టి మానవతాసూత్రాల్లో భాగమైతే బావుంటుందనే ఉద్దేశంతో ఇక్కడ చేర్చడం జఱిగింది

తాము ఇతరులకి చేసిన మేలు గుర్తున్నంతగా వారు తమకి చేసిన మేలు మానవులకి గుర్తుండదు. అదే విధంగా, ఇతరులు తమకి చేసిన కీడు గుర్తున్నంతగా వారు చేసిన మేలు గుర్తుండదు. మానవులు ఈ దౌర్బల్యాల నుంచి విముక్తులై ఇతరులు చేసిన మేలుని గుర్తుంచుకోవడమూ, వారు చేసిన కీడుని మర్చిపోవడమూ నేర్చుకోవాలి.

మానవ సంబంధాలన్నీ ఇచ్చిపుచ్చుకునేవేనని ఉపయోగవాదులు (utilitarians) అంటారు. అంటే అవన్నీ వ్యాపారమేనని అన్యాపదేశంగా చెప్పడమన్నమాట. వ్యాపారమంటే ఇచ్చిపుచ్చుకోవడమైతే ఆ ఇచ్చిపుచ్చుకోవడంలో అవసరమే కాదు, కృతజ్ఞతాభావమూ, అవతలివాళ్ళని దోచుకోకూడదనే ఆత్మసాక్షీ కూడా ఇమిడున్నాయి. కనుక వ్యాపారానిక్కూడా మానవతావాదమే మూలం. ఉద్యోగులకి వేతనాలు చెల్లించడమూ, పెద్దల పట్ల గౌరవం చూపడమూ, వారికి సేవ చేయడంలాంటి ఆదర్శాలు కూడా మౌలికంగా కృతజ్ఞతాభావాన్నే ఆశ్రయించుకుని ఉన్నాయని మఱువరాదు.

## 23. వర్తమానంలో జీవించడం

దీనికీ క్షమాగుణానికీ కాస్త సంబంధం ఉంది. గమనిస్తే, మానవ సంబంధాలు విషమించడానికో ప్రధానకారణం– మనుషులు గతానుభవాల్ని మఱవలేకపోవడం. గతం నుంచి పాఠాలు నేర్వాలి. నిజమే. మనిషి అనుభవాన్ని గడించాలి. అదీ నిజమే. కానీ గతాన్ని వర్తమానంలో ఓ అవిభాజ్య భాగంగా చేసుకోవడమూ, దాన్ని కృత్రిమంగా బ్రతికించడమూ, వర్తమానాన్ని ప్రభావితం చేసేందుకు దాన్ని అనుమతించడమూ, ఏనాడో జఱిగిపోయినది ఇప్పుడు కూడా కళ్ళెదుటే జఱుగుతున్నంత సంరంభంతో ఉద్విగ్నం కావడమూ– ఇదంతా శోభస్కరం కాదు.

కానీ దురదృష్టవశాత్తూ మన దేశంలో ఈ ధోరణి చాలా ఎక్కువ. ఏనాడో శతాబ్దాల క్రితం జఱిగిన హత్యలకీ, మానభంగాలకీ, ఆస్తుల విధ్వంసానికీ ఇప్పుడు ప్రతీకారం తీర్చుకోవాలనేవారున్నారు. ఏనాటి వెనకబాటుకో ఇప్పుడు ఇతరవర్గాల్ని ద్వేషించేవారున్నారు. చిన్నప్పుడు జఱిగిందంటూ ఇప్పుడు మానభంగాల కేసులూ, వేధింపుల కేసులూ పెట్టేవారున్నారు. 70 ఏళ్ళ క్రితం మాయమైన మనిషి గుఱించి ఇప్పుడు మేల్కొని గలభా లేవదీసేవారు కూడా ఉన్నారు.



ఇలాంటి త్రిక్కలన్నింటికీ మన వ్యవస్థ, సంస్కృతీ ఆనందంగా మద్దతు పలుకుతాయి. పౌరులంతా ఖచ్చితంగా గతంలోనే జీవించాలనేది ఇక్కడ ఓ చట్టంలా అమలవుతోంది. గతాన్ని మఱవలేనివారు గొప్ప సెంటిమెంటల్ మనుషులన్నట్లూ, ఆ సెంటిమెంట్లు ఉన్నవారే నిఖార్సైన మానవతావాదులన్నట్లూ ప్రచారమవుతోంది. “దీనికో చీకటిపార్శ్వం కూడా ఉందనీ, ఇది చాలా అమానుషాలకు ఆస్పదం కాగల ధోరణి” అనీ చెప్పడానికి విచారిస్తున్నాను. ఉదాహరణకి– ఒకప్పుడు ఐరోపాలో జఱిగిన యూదుల ఊచకోతకు అసలుకారణం పూర్తిగా హిట్లర్ కాదు. నిజానికి అటువంటి హిట్లర్ ని ఉత్పత్తి చేసినది గతంలో జీవించే ధోరణే. గతాన్ని మర్చిపోయి చూస్తే ఐరోపా యూదులు మిగతా అందఱు ఐరోపేయుల్లాంటివారే. ఏ వ్యత్యాసమూ లేదు.

కానీ ఎంత వద్దన్నా జనం గతంలోనే బ్రతుకుతూంటారు. ప్రతివారూ తమ అసలు వయసు కన్నా పదేళ్ళో, పదిహేనేళ్ళో చిన్నగా ఆలోచిస్తూంటారు. ఉదాహరణకి 60 ఏళ్ళవాడు 45–50 ఏళ్ళ వాడి మనోవాలకం (mood) లో ఉంటాడు. 2014 లో ఉన్న మనుషులు 2000 నాటివో, 1990 నాటివో ఆలోచనలు చేస్తూంటారు. దేశాలేమో 70–80 ఏళ్ళనాటి మనోవాలకంలో ఉంటాయి. కులాలు వందలాది ఏళ్లనాటి మనోవాలకంలో ఉంటాయి. మతాలేమో వేలాది ఏళ్ళ నాటి మనోవాలకంలో ఉంటాయి. ఇది గాక  మనుషులు ఇతరుల్ని కూడా రకరకాలుగా గతంలో ఉంచేస్తారు. పాఠ్యపుస్తకాల ద్వారా గతంలో ఉంచేస్తారు. చరిత్ర ద్వారా ఉంచేస్తారు. సంస్కృతి ద్వారా ఉంచేస్తారు. చట్టాల ద్వారా ఉంచేస్తారు. సైద్ధాంతిక భావజాలాల ద్వారా ఉంచేస్తారు. ఆచారాల ద్వారా ఉంచేస్తారు. సాహిత్యం ద్వారా ఉంచేస్తారు. ఏతావతా జనం తగినంత తాజాభవించకుండా (update కాకుండా) చూడడమే అన్ని వ్యవస్థల పరమార్థంలా కనిపిస్తుంది.

మన దేశంలో నాలుగైదు తరాలనాటి సంఘసంస్కరణనే సంస్కారంగా అదే తుదిపలుకుగా భావించేవారున్నారు. ఆ సంస్కర్తల పేర్లే తల్చుకుంటూ, ఆ ప్రస్తావనకి సంబంధించి నాటి పుస్తకాలే చదువుకుంటూ అద్భుత రసానందాన్ని పొందేవారున్నారు. ఇహ ఆ తరువాత ఏ సంస్కరణా అవసరం లేదనీ, చెయ్యాల్సినదంతా ఆ సంస్కర్తలే చేసేశారనీ వారి అప్రకటిత అంతర్భావన. కానీ ఈ పుస్తకం చదివేవారందఱికీ తెలుస్తుంది “అది నిజం కాదు” అని! ఆ సంస్కర్తలు తమ సమకాలీన సమస్యలకి స్పందించారు. అందువల్ల వారు గొప్పవారయ్యారు.

మనం మన కాలపు సమస్యలకి స్పందించడం లేదు. స్పందించలేకపోతున్నాం. ఆ కాలపు సంఘసమస్యల దృష్టితోనే ఈ కాలాన్ని కూడా చూడడం వల్ల ఈ కాలానికే విలక్షణమైన సమస్యల్ని గుర్తుపట్టలేకపోతున్నాం, రోజూ అనుభవిస్తూ కూడా!

ఒకవేళ స్పందించినా ప్రయోజనం లేని పరిస్థితి. ఎందుకంటే అన్నిరంగాలూ రాజకీయవాదుల హస్తగతమయ్యాయి. అన్ని ప్రస్తావనలూ (topics) మధ్యతరగతి మేధావుల పట్టుదప్పిపోయాయి. అన్ని వర్గాలూ రాజకీయపక్షాల 'సెల్స్'గా, 'మోర్చాలు'గా మారాయి. ప్రజాస్వామ్యం పేరుతో పార్టీల నిరంకుశత్వం అమల్లోకొచ్చింది. దేని గురించి మాట్లాడితే ఎవఱికి కోపం వస్తుందోనని నోరు మూసుకుని ఓ మూల కూర్చోవడం అలవాటు చేసుకున్నాం. అందుకే ఇప్పటికీ ఎన్నిసార్లు మాట్లాడినా, ఎంతమంది మాట్లాడినా ఆ కన్యాశుల్కమే, ఆ పూర్ణమ్మే, ఆ బుచ్చమ్మే, ఆ గిరీశమే, ఆ రామప్పపంతులే, ఆ లుబ్ధావధానులే, ఆ అగ్నిహోత్రావధానులే. ఆ బాల్యవివాహాలే, ఆ వితంతు పునర్వివాహాలే, ఆ సతీ సహగమనమే. మన దగ్గఱ మాట్లాడుకోవడానికి ఇంకేమీ లేని దయనీయ దుఃస్థితి. "ఇది వారి గొప్పతనమా? మన భావదారిద్ర్యమా?" అని ప్రశ్నించుకునే పరిస్థితిలో కూడా లేరు మనవారు.

గతం నుంచి పాఠాలు నేర్వడమన్నా, అనుభవాన్ని గడించడమన్నా అందులోని మంచిని స్వీకరించడమే తప్ప మఱేమీ కాదు. గతమూ, అనుభవాలూ ఎల్లవేళలా మనకి సత్యాన్నే ఆవిష్కరించి పెడతాయనే మూఢవిశ్వాసం నుంచి ప్రజలు ఇహనైనా బయటపడాల్సి ఉంది. అవి కొన్నిసార్లు తప్పుడు సందేశాల్ని కూడా మోసుకు రావచ్చునని మఱువరాదు. గతం నుంచి నేర్చుకుంటున్నామనే పేరుతో మనుషులు వాస్తవంగా చేసేది, ఎప్పుడో చచ్చిన పాముల్ని ఇంకా ఇంకా చంపుతూనే ఉండడం. ఇందుకసలైన కారణం, మనం నేర్చుకోవడానికి కాక ప్రతిస్పందించడానికే (react అవ్వడానికే) ఎక్కువ ప్రాధాన్యమివ్వడం.

మనుషులు ఒక వయసొచ్చాక ఎదగడం మానేస్తారు. ఇది ఎదగలేక కాదు, ఎదగడం ఇష్టం లేక! కానీ ఎంత ఇష్టం లేకపోయినా, తమకి తెలియకుండానే ఎంతో కొంత ఎదుగుతూనే ఉంటారు, చనిపోయే దాకా! తమకి తెలిసినదే చాలనుకోవడం, అదనపు పరిజ్ఞానం తమకి అవసరం లేదనుకోవడం, జీవితంలో కేవలం ఒకటి–రెండు లక్ష్యాలే పెట్టుకుని వాటికే తమ తనువుల్నీ, మనసుల్నీ అంకితం చేసుకోవడం ఎదగలేకపోవడానికి గల కారణాలు. ఇది నిరంతరాయంగా గతంలో జీవించడానికి దారితీస్తుంది.



## 24. మార్పుని అంగీకరించడం

దీనికీ వర్తమానంలో జీవించడానికీ కాస్త సంబంధం ఉంది. మార్పుని ఉన్నది ఉన్నట్లుగా అంగీకరించలేకపోవడం మానసికంగా గతంలో జీవించడం వల్లనే. మానవుల గతాన్ని పురస్కరించుకొని వారు ప్రస్తుతం ఉండాల్సిన పద్ధతిని నిర్దేశించడం అశాస్త్రీయం. మానవుల స్వభావమూ, స్థితులూ, పరిస్థితులూ, జ్ఞానమూ, దృక్కోణమూ, శక్తిసామర్థ్యాలూ అన్నీ మారిపోయాక వారు గతంలో మాదిరే వ్యవహరించడం సరికాదు. సాధ్యం కూడా కాదు. వారిలాగే, వారితో ఇతరులు కూడా. కనుక మానవ సంబంధాల్లో వచ్చే ఈ గుణాత్మకమైన వ్యవహరణ పరిణామానికి తలవంచి బ్రతకాలి.

## 25. జనామోదితమైన క్రమానుగత మార్పులు

మార్పుని ఆహ్వానించడం ఎంత ముఖ్యమో, ఆ మార్పు క్రమానుగతం (gradual) అయి ఉండడం కూడా అంతే ముఖ్యం. జనం మీద హఠాన్ మార్పుల్ని రుద్దడం అసహజమే కాక, అమానవీయం కూడా! ఈ విషయంలో ప్రకృతి బాటే మనుషులకి అనుసరణీయం. హఠాన్ మార్పులు మనుషుల జీవితాల్లో సామూహిక దుఃఖాన్ని ప్రోదిచేస్తాయి. అందుచేత మార్పులనేవి జనామోదాన్ని పడసినవి కూడా అయ్యుండాలి. ప్రజలు కోరుకోని, వారు ఇష్టపడని మార్పులు విఫలమవుతాయి. మార్పుల్ని బలప్రయోగపూర్వకంగా పైనుంచి జనం మీద రుద్దడమే మానవాళి చరిత్రలో ఇప్పటిదాకా జఱిగింది. ఈ పోకడ అంతరించాలి. సమాజానికి మార్పుల అవసరం నిజంగా ఉంటే వాటంతట అవే వస్తాయి. ఎవఱూ రుద్దాల్సిన పనిలేదు. సమాజమే వాటి కోసం ఆకలిగొని ఉంటుంది. ఇతరుల్ని మార్చదల్చుకున్నవారికి ఉండాల్సిన లక్షణాల్లో ప్రధానమైనది భూదేవంత ఓర్పు.

## 26. దేనికీ అంకితం కాకపోవడం

ప్రరోగత బృహత్ సమాజాలకి ఉన్మాదులూ, వీరాంకితులూ (fanatics), మానవ రూప యంత్రాలూ, క్రూసేడర్లే తప్ప మామూలు మనుషులు అవసరం లేదు. వాటికి గౌతమబుద్ధుల కంటే హిట్లర్లతోనే ఎక్కువ అవసరం. అంకితం కావడం (అంకితభావం), విశేషిత నైపుణ్యాల (specialization/specialized skills ) పేరుతో సంస్థలూ, వ్యవస్థలూ అన్నీ, తమకి పనికొచ్చే ఏదో ఒక్క విషయం తప్ప జీవితంలో ఇహ దేని గుఱించీ ఆలోచించలేని ఏకోన్మాదుల (monomaniacs) కోసం ఆబగా స్వప్నిస్తాయి.

సార్థవాహాల (companies) కేమో పని-ఉన్మాదులు (workaholics) కావాలి. విద్యాలయాలకి బోధనోన్మాదులూ, పఠనోన్మాదులూ కావాలి. ప్రభుత్వానికి దేశభక్తి-ఉన్మాదులు కావాలి. కుటుంబాలకి సంపాదనోన్మాదులు కావాలి. వారిలోనే మఱి కొందఱికి శృంగారోన్మాదులు కావాలి. రాజకీయ పక్షాలకేమో సకల సబ్బండు రకాల ఉన్మాదులూ కావాలి. ఇహపోతే కొన్ని సంస్థలకి లింగోన్మాదులూ, మఱికొన్నిటికి సిద్ధాంతోన్మాదులూ కావాలి. ఈ వాతావరణంలో వైవిధ్య అభిరుచులున్నవాడూ, ఏదో ఒక ఉన్మాదాన్ని ప్రదర్శించలేనివాడూ తప్పుబుట్టినట్లే జమ. ఒకవేళ మనుషుల్లో ఉన్మాదస్థాయి తాము ఆశించినంత లేకపోతే దాన్ని పెంచడానికి అవసరమైన వాతావరణాన్ని కృత్రిమంగా సృష్టిస్తారు కూడా!

ఈ కాలపు మనుషుల్లో మానవత్వం నశించిపోతూండడానికి specialization, అంకితభావం, ఉద్యమస్ఫూర్తి అంటూ నానాపేర్లతో చెలామణి అవుతున్న ఉన్మాదాలు ఓ ప్రధాన కారణం. తమ ఉన్మాదానికి ఉపకరించని అంశాల్ని అధికరించి ఏం చెప్పినా, విన్నా, *"నాకు సంబంధం లేదు. నేను చేయగలిగిందేమీ లేదు. అది నా సబ్జెక్టు కాదు. నా డిపార్టుమెంటు కాదు"* ఇదీ ధోరణి. ఇంతటితో ఆగిపోతే బావుణ్ణు. కానీ అలా జఱగదు. తమని తాము అంకితం చేసుకున్నవారు అది చాలా గొప్పదనీ, ప్రజలకి తప్పనిసరిగా మేలుచేస్తుందనీ గ్రుడ్డిగా నమ్ముతారు గనుక, దాన్తో ఏకీభవించనివారంతా వీరి దృష్టిలో రాక్షసులే, సర్వనాశనం చేయదగ్గవాళ్ళే. ఆ విధమైన మానసిక ధోరణిలో అవతలివారి పట్ల వీరు ఒడిగట్టని అపచారాలుండవు.



మనుషులు భావజాలాలకీ, అనుభవాలకీ వాటి నుంచి తాము గ్రహించిన పిండితార్థాల (conclusions) కీ కూడా అంకితమైపోవడం దర్శనమిస్తుంది. వీటన్నింటి పర్యవసానం- వారు మూర్ఖులుగా ఏం చెప్పినా ఎక్కనివారుగా మొండిబండ తత్త్వాలుగా మారడం. తాము అలా మారినది చాలక, పైపెచ్చు ఇతరులు ఉదార వైఖరిని కలిగుంటే "వారికి ఆత్మవిశ్వాసం లే"దని ఆరోపించడం మొదలుపెడతారు.

**ఇలా అంకితం కావడం గుఱించి ప్రకృతిమాత అభిప్రాయమేంటి ? ఆవిడ దీన్ని ఆమోదిస్తోందా ?**

ప్రకృతి ఏ వస్తువునీ ఒకే ఒక్క ప్రయోజనంతో, కేవలం దానికే అంకితం చేసి నిర్మించినట్లు కనిపించదు. ప్రపంచంలో ప్రతిదానికీ రెండు-మూడు ప్రయోజనా లూ/కర్తవ్యాలూ ఉన్నట్లు కనిపిస్తుంది. అన్నీ బహుళార్థక చేపట్టులే (muti-purpose projects). ఒకే నీరు బ్రతికిస్తుంది. పంటలు పండిస్తుంది. చల్లబఱుస్తుంది కూడా. ఒకే పురుషుడు ఓ స్త్రీని రక్షిస్తాడు, పోషిస్తాడు, సాహచర్యమిస్తాడు, సుఖపెడతాడు, సంతానాన్ని కలిగిస్తాడు. ఆ సంతానాన్ని మళ్లీ తానే పైకి తీసుకొస్తాడు. ఆ పని కొకఱూ, ఈ పనికొకఱూ అనే ఏర్పాటు లేదు. అదే విధంగా ఒకే స్త్రీ ఓ సమయంలో తల్లిలా, మఱో సమయంలో భార్యలా, వేఱే సందర్భంలో స్నేహితురాలిలా ఉంటుంది. మన శరీరాలనే తీసుకుంటే ప్రతి ఇంద్రియానికీ ఓ ఉద్యోగాన్నీ, ఓ వినోదాన్నీ కూడా ప్రకృతి ఏర్పఱచింది. వట్టి ఉద్యోగమో, వినోదమో కలిగిన ఇంద్రియం ఒక్కటీ లేదు. ఓ ఇంద్రియం చేసే ఉద్యోగం కూడా ఒకటి కాదు, రెండు-మూడున్నాయి. ముక్కుతో గాలిపీల్చుకుంటాం. వాసన కూడా చూస్తాం. నోటితో తింటాం, మాట్లాడతాం కూడా! అలాగే ఒకే ఆహారపదార్థంలో డజనో అఱడజనో పోషకాలుంటాయి.

మన జీవితాల్లో ప్రతీదాని పట్లా అంకితభావం ఎంత లోతుగా పాతుకు పోయిందంటే- మన ఆహారపు టలవాట్లే తీసుకోండి.రోజూ తినేది తప్పిస్తే మఱోటి మనకి నచ్చదు ఆ "మఱోటి " ఎంత ఆరోగ్యకరమైనా సరే! నిజానికి రోజూ ఒకే రకం ఆధరువులు తినడం వల్లనే అన్ని జబ్బులూ వస్తాయి. వాటినీ, వాటిని వండే పద్ధతినీ తఱచుగా మార్చాలి. ఉదాహరణకి, ఒక రోజు వరి తింటే మర్నాడు గోధుమ, ఆ మర్నాడు జొన్న. అలాగే ఒకరోజు పెరుగైతే మర్నాడు మజ్జిగా, ఆ మర్నాడు పచ్చిపులుసూ. అదే విధంగా ఓ పూట ఉప్పు వేసిన వంటకం

తింటే మర్నాడు ఉప్పు లేకుండా తినాలి. కానీ మన పరిస్థితి ఏంటంటే, మనకో పదార్థం నచ్చిందంటే దాని మూలాన మనకేదో ప్రాణాంతకమైన జబ్బొచ్చి శస్త్రచికిత్స కోసం ఆస్పత్రి లో చేరే దాకా సంవత్సరాల తరబడి అదే తింటూంటాం/తాగుతూంటాం.

అంకితం కావడమనేది మన మనస్తత్త్వాల మీద కూడా సూక్ష్మంగా చూపే ప్రతీప ప్రభావం (negative impact) ఘోరమైనది. దైనందిన జీవితంలో అది పైకి కనిపించకపోవచ్చు. కానీ దాని పర్యవసానాలు మాత్రం బాధాకరంగా తేల్తాయి. ముఖ్యంగా, దేనికెంత ప్రాధాన్యం ఇవ్వాలనే విషయంలో అది మన తెలివితేటల్ని మబ్బుతో కప్పేస్తుంది. మనలో ఒంటిదిక్కు చుట్టుచూపు (one-sided outlook) ని పెంపొందిస్తుంది. ఉదాహరణకి, మన దేశంలో అందఱూ కుటుంబానికి సర్వాత్మనా అంకితులు. పలువుఱికి కుటుంబం కంటే వేఱే జీవితం గానీ, ఆసక్తులు గానీ లేవు. ఫలితార్థంగా కుటుంబానికీ, దాని సభ్యులకీ సంబంధించిన ప్రతి విషయమూ ఇక్కడ హబుల్ టెలిస్కోపంత భూతద్దంలో చూడబడుతుంది. దాని గుఱించి ఇక్కడ హోరాహోరీ ప్రపంచయుద్ధాలైపోతూంటాయి. అవినీతి కూడా, గృహస్థులు తమ కుటుంబాల భవిష్యత్తు గుఱించి విపరీతంగా ఆందోళన చెందడం వల్ల జఱుగుతోంది. అందువల్ల కొన్ని విషయాల్ని "ఎలా జఱిగితే అలా జఱగనీ" అనుకునేటంత పరిపక్వత ఈ దేశస్థులకి ఎన్నాళ్ళు గడిచినా రావడం లేదు. మన అంకిత భావాల్ని ఇతరులు ఉపయోగించుకుంటారే తప్ప దాని వల్ల మనకి కలగబోయే అదృశ్యనష్టాలకి ఎవఱూ పరిహారం చెల్లించరని జనం గ్రహించే రోజు రావాలి.

## 27. వ్యవస్థల కతీతంగా మానవత్వాన్నే అవలంబించడం

మానవతావాదులు ప్రజాస్వామ్యవాదులు కూడా అయ్యుండాలని జనం ఆశించడం తఱచూ కనిపిస్తుంది. మానవతావాదుల్లో ప్రజాస్వామ్యవాదులున్నారు. కానీ అంతమాత్రాన వారంతా అదే అనుకోవడం సరికాదు. అదే విధంగా ప్రజాస్వామ్యవాదులంతా మానవతావాదులూ కారు. ప్రజాస్వామ్యం మన ముందున్న అనేక రాజకీయ-పరిపాలనా ఎంపికల్లో ఒకటి మాత్రమే. నవ్యమానవతావాదుల అంకితభావం మానవత్వం పట్లే తప్ప ఏ ప్రత్యేక రాజకీయవ్యవస్థ పట్లా కాదు. అంటే నవ్యమానవతావాదం యొక్క ఆద్య మఱియు అంతిమ శ్రద్ధాస్థానం విడివ్యక్తి మాత్ర



మే. వ్యవస్థలు దానికి సాందర్భికం కాదు.

ఎందుకంటే ప్రజాస్వామ్యంతో సహా అన్ని రాజకీయ వ్యవస్థలూ అశాశ్వతమే. మానవతావాదమే శాశ్వతమూ, సార్వజనీనమూను. ఓ దేశంలో ఈ రోజు రాజఱికం (monarchy) అమల్లో ఉండొచ్చు. ఱేపు సామ్యవాదం (socialism) రావచ్చు. ఎల్లుండి ప్రజాస్వామ్యం నెలకొనవచ్చు. ఏ కాలపు వ్యవస్థ ఆ కాలపు వారికి సర్వోత్తమంగా, మహోన్నతంగా భాసిస్తుంది. ప్రజాస్వామ్యం ఉండడమో, లేకపోవడమో ఓ సమాజపు మానవతావాద లక్షణాల్ని పట్టివ్వదు. ఎటొచ్చీ మానవతావాద సూత్రాల్ని వ్యాప్తి చేయడం మిగతా వ్యవస్థల కన్నా ప్రజాస్వామ్యంలో పిసరంత ఎక్కువ సుకరం, అది నిజమైన ప్రజాస్వామ్యమే ఐతే!

ప్రాచీన రోమకరాజ్యం (Rome) ప్రజాస్వామికమే, శ్రేయోరాజ్యమే (welfare state). అయినా, బానిసల్ని బహిరంగంగా సింహాల కాహారంగా వేస్తే కేవుచీటీలు (tickets) కొనుక్కుని మఱీ ఆ సన్నివేశాన్ని కళ్ళారా వీక్షించి వినోదించడం పట్ల అప్పటి ప్రజల మనస్సాక్షి ఇసుమంతైనా సంచలించలేదు. బానిసలు తమ కంటే వేఱైన వర్గమనే వర్గదృష్టివల్ల వారి మానవతా దుకాణం అలా మూతపడింది. మన కాలంలోనూ వర్గాలున్నాయి. మనకీ వర్గదృష్టి ఎక్కువే. వారిలా సరిపడని వర్గాల వాళ్ళని మనం సింహాలకి ఆహారంగా వేయం (బహుశా మన కాలానికి అవి మఱీ ఎక్కువ లేవు గనక). కానీ దాన్తో సమానమైన ఇతరేతర అపకారాలకి ఒడిగడుతూనే ఉన్నాం. కాబట్టి వ్యవస్థ ఎలా ఉన్నా, దాన్ని నడిపే వ్యక్తుల్లో గనక మానవత్వం ఉంటే, దాని దుష్ప్రభావం ప్రజల జీవితాల మీద తక్కువగా పడుతుందని నవ్యమానవతావాదులు నమ్ముతారు. ప్రజాస్వామ్యమైనా మానవతాసూత్రాల్ని సాకల్యంగా అస్థిగతం చేసుకుంటేనే ప్రజాస్వామ్యంగా మనగల్గుతుంది. లేకపోతే ఓ పేద్ద నాటక మండలి (drama troupe) గా మిగిలిపోతుంది.

కనుక ఇతర వ్యవస్థల్లాగానే ప్రజాస్వామ్యం కూడా మానవతావాదంలోని కొన్ని అంశాల్ని అరువు తీసుకుంది. అయితే అంత మాత్రాన అది మానవతావాదానికి పర్యాయపదం గానీ, ప్రత్యామ్నాయం గానీ కాజాలదు. వాస్తవానికి ప్రస్తుతం అమల్లో ఉన్న ప్రజాస్వామ్యాలన్నీ మానవతావాద సూత్రాలకి విరుద్ధంగా నడుస్తున్నవే. ఎందుకంటే ఓ వ్యవస్థలో ప్రజారోగ్యానికీ, వారి ఆర్థికతకీ సంబంధం లేకుండా ఎంత పెద్దసంఖ్యలో నిషేధ చట్టాలు పోగుపడ

తాయో అంతగా అది ప్రజాస్వామ్యం కాకుండా పోతుంది. అంతగా అది అమానవీయమవుతుంది.

ప్రజాస్వామ్యాలన్నీ మెజారిటీ ఆధిపత్యాన్ని ఆశ్రయించుకొని ఉన్నటువంటివి. కానీ నవ్యమానవతావాదంలో మెజారిటీ, మైనారిటీ అంటూ ఏమీ లేవు. ఆ పరిభావనల (concepts) కి ఇందులో విలువ లేదు. దీని దృష్టిలో అంతా మనుషులే. ఏ ఒక్కఱినీ అనాథగా వదిలేయొద్దని ఇది చెబుతుంది. *సర్వే జనా స్సుఖినో భవన్తు* అనేది నవ్యమానవతా నినాదం కాగా, *బహుజన హితాయ బహుజన సుఖాయ* అనేది ప్రజాస్వామ్య నినాదం. ఇది గౌతమబుద్ధుడి కాలం నాటి  సిద్ధాంతం. ఆ ముక్క ఆ రోజుల్లో చెప్పిన సందర్భం వేఱు. దాన్ని నేటి సామాజిక– శ్రేయోరాజ్య అంశాల కన్వయించడం ఓ పెద్ద తప్పిదం. అదీ గాక ఈ లోపల మానవజాతి పరిభావనలు చాలా పురోగమించాయి.

ఈ బహుళజనులు (అధిక సంఖ్యాకులు) ఎవఱో ఎవఱైనా వివరిస్తే బావుణ్ణు. ఓ జిల్లాలో ఒకానొక శ్రేణిజనం బహుళజనులైతే, వారే రాష్ట్రం మొత్తమ్మీదా లెక్కవేసినప్పుడు ఊనజనులు (అల్పసంఖ్యాకులు) అవుతారు. అదే విధంగా ఒకే ప్రదేశంలో మనుషులు తమతమ అభిప్రాయాల్ని బట్టి కొన్నిసార్లు బహుళజనులూ, మఱికొన్నిసార్లు ఊనజనులూ అవుతారు. ఓ మానవ సమూహం బహుళ జనులు (majority) అనిపించుకోవడానికి అది మొత్తం జనాభాలో 51 శాతంగా ఉండాలా? 60 శాతంగా ఉండాలా? 70 శాతంగా ఉండాలా? అది ఎవఱూ ఖచ్చితంగా చెప్పలేరు. మిగతా జనంలో ఒక్కో వర్గమూ 5 –10 శాతం కంటే ఎక్కువ లేరనే కారణం చేత కేవలం 30–40 శాతమే ఉన్న వర్గాలు కూడా కొన్నిసార్లు బహుజనులుగా లెక్కవేయబడుతున్నారు. ఓ చిన్న కుగ్రామంలోనో, సభలోనో 99 శాతం మంది ఓ వైపూ, మిగతా ఒక్కశాతం మందీ ఇంకో వైపూ ఉంటే ఆ 99 శాతం మంది యొక్క పైచేయి మనకి పెద్ద అభ్యంతరకరంగా గానీ, హానికరంగా గానీ అగుపించదు. కానీ ఆ సూత్రాన్నే ఇంకా బృహత్తర స్వరూపాల (still larger entities) కి అనువర్తిస్తే శక్తి–అసమతూకం మూలాన ఘోరాలూ, అన్యాయాలూ, అణచివేతలూ జఱిగిపోతాయి. ఉదాహరణకి, ఓ దేశంలోనో, రాష్ట్రంలోనో 1% అంటే ఆ జనాభా లక్షల్లోనూ, మిలియన్లలోనూ ఉంటారు. ప్రపంచవ్యాప్తంగా చూసుకుంటే ఆ ఒక్కశాతమే కోట్లల్లో ఉంటారు.



“మైనారిటీలు ఏ శంకరగిరి మాన్యాలు పట్టిపోయినా ఫర్వాలేదు. మెజారిటీ బావుంటే చాలు” ననే వారు, తమ వాహనాల ఇంధనంలో 10% కల్తీ చేసినా ఫర్వాలేదనీ, తాము తినే అన్నంలో 1% విషం కలిసినా ఫర్వాలేదనీ అనరు కదా! అనాథగా వదిలివేయబడ్డ ఒకఱి విషాదం కాలక్రమంలో పదిమందికి అంటుకుంటుంది. ‘మైనారిటీ’ అంటే ఇప్పుడు అపార్థం చేసుకోబడుతున్నట్లు మహ్మదీయులో క్రైస్తవులో కాదు. మన ఆదరణకి నోచుకోవడానికి ఓ వ్యక్తి మెజారిటీకో,  మైనారిటీకో చెందనక్ఖర్లేదు. అతనూ మనలాగే ఓ మనిషీ, మనం అనుకున్న పనికి పనికొచ్చేవాడూ అయితే చాలు. మెజారిటీలే తప్ప మైనారిటీలు మనుషులు కారన్నట్లూ, వారికి హక్కులే లేవన్నట్లూ ధ్వనించే ఈ రకమైన అశాస్త్రీయ మెజారిటీవాదంతో మైనారిటీజనాన్ని నిర్లక్ష్యం చేసినా, అణగద్రొక్కినా వారు జాతిగొలుసులో అత్యంత బలహీన లంకెలు (weakest links in the chain) గా మారతారు. భావిప్రమాదం ఖచ్చితంగా అక్కణ్ణుంచే పొంచి ఉంటుంది.

కాబట్టి ప్రతిఒక్కఱి ఇష్టానిష్టాలకీ– అవి మిగతా సమాజపు అభిరుచుల నుంచీ, అభిప్రాయాల నుంచీ ఎంతగా భేదించనివ్వండి– విలువివ్వాల్సిందే. సమాజంలో స్థానం కల్పించాల్సిందే. అలాగే వారివారికి వ్యక్తిగతమైన జీవన విధాన అభీష్టాల్నీ (life-style choices) ఆమోదించాల్సిందే. మనుషుల్ని నిర్జీవ గణాంకాలు (statistics) గా, శాతాలుగా చూసే ధోరణి పోయి సజీవులైన ఆత్మలుగా, వారి జీవితాల్ని జీవితాలుగా చూసే గభీర (serious) దృష్టికోణం మనలో పెంపొందాల్సి ఉంది. తేలిగ్గా నిర్ణయాలు తీసుకునే ఉపాయంగా మొదట్లో అమల్లోకి వచ్చిన ఈ అంకెల గారడి– ఈ మెజారిటీవాదం నేడు విశ్వరూపాన్ని ధరించివేస్తున్న వెఱ్ఱితలల విషయం అంతా ఆకళింపు చేసుకునే శుభదినం రావాలి. ఎందుకంటే ప్రతి ఒక్కఱూ ఏదో ఒక విధమైన మైనారిటీవర్గం కిందికే వస్తారు.

అదీ గాక కుటుంబమూ, విద్యా, మతమూ, విజ్ఞానశాస్త్రాలూ, నైపుణ్యాలూ, ఇష్టానిష్టాలూ మొదలైన అంశాల్లో నలుగుఱి అభిప్రాయమూ అడిగి కనుక్కుని అంతర్గతంగా చేసేదేమీ ఉండదు. కాబట్టి ప్రజాస్వామ్యాన్ని అన్ని రంగాలకీ అంతర్గతంగా వర్తించే సిద్ధాంతంగా చూడడం చాలా తప్పు. అది మూర్ఖత్వం కూడా అవుతుంది. అందుచేత అది ఎక్కడికి చెందుతుందో అక్కడికే (ఏకమొత్తపు రాజకీయ పరిపాలన రంగానికే) దాన్ని పరిమితం చేయడం అందఱికీ శ్రేయస్కరం.

## 28. శ్రమకి తగ్గ ప్రతిఫలం

మనుషులు స్వయంగా చేసుకోలేని పనుల్ని ఇతరుల చేత చేయిస్తూంటారు. అప్పుడు వారు యజమానులవుతారు. ఆ ఇతరులు వారికి సేవకులో, ఉద్యోగులో అవుతారు. పరస్పర సహాయం చేసుకోవడం వల్లనే మనుషులు మనుషులయ్యారు. కనుక సేవ పేరిట గానీ, ఉద్యోగాల పేరిట గానీ ఇతరులు మనకు చేస్తున్నది వాస్తవంగా సహాయమేననీ, దానికి మనం తగువిధంగా కృతజ్ఞత చూపాలనీ అందఱూ గ్రహించే రోజు రావాలి. స్వచ్ఛంద సహాయానికీ, ఉద్యోగానికీ మధ్య భేదం మిక్కిలి సూక్ష్మమైనది. నిజానికి ఆచరణలో రెండూ ఒకటే. ఎందుకంటే ఒకఱికి ఇష్టం లేకుండా వారిచేత మనం ఏ పనీ చేయించలేం. అందుచేత ఉద్యోగధర్మంగా చేసే సేవకి ఏ విధంగా నైతే పారితోషికం ముట్టజెప్పుతున్నామో అలాగే స్వచ్ఛంద సహాయానిక్కూడా ఏదో ఒక రూపేణ పారితోషికం ముట్టజెప్పాలి.

అయితే ప్రస్తుతం ఈ యజమానుడనే మాట చాలా అపార్థంలో వాడబడుతోంది, ఇటు యజమానుల్లోనూ, అటు వారి ఉద్యోగుల్లోనూ! యజమానుడంటే ఉద్యోగి యొక్కా, అతని కుటుంబం యొక్కా యావద్ జీవిత పరిధికీ బాధ్యత వహించాల్సినవాడన్నట్లు మాట్లాడడం కనిపిస్తోంది. అటువంటి ఆలోచనాధోరణిలో చేసిన చట్టాలు కూడా ఉన్నాయి. ఇది సరైన ఆలోచనా విధానం కాదు. యజమానుడు కూడా ఉద్యోగుల్లాంటి మనిషే. అతనేమీ సర్వ శక్తిమంతుడైన భగవంతుడు కాదు. తనకు పనిచేసి పెడుతున్నంత కాలం, ఆ చేసిన పని వఱకూ మాత్రమే అతను తన ఉద్యోగికి తగు పారితోషికమివ్వాలని ఆశించడం న్యాయం. అంతకు మించి అతనిమీద భారాలు మోపడం అంటే దూర భవిష్యత్తులో వ్యాపారాల్నీ, ఉద్యోగావకాశాల్నీ దెబ్బదీయడం అన్నమాట.

శ్రమకీ, సంపదకీ అభేదం. ఎందుకంటే శ్రమలోంచే సంపద పుడుతోంది. సంపద అంటే రొక్కమూ, ఆస్తులూ, సొమ్మూ మాత్రమే కాదు. ఏ వస్తువైనా, పదార్థమైనా సంపదే. దాన్ని ఉచితంగా తీసుకోవడమంటే ఎవఱికో పరోక్షంగా అన్యాయం తలపెడుతున్నట్లే లెక్క. అదీ ఓ రకం దొంగతనం కిందికే వస్తుంది. మన దేశంలో ఉచితాల మోజు మెండు. అందులోనూ ప్రభుత్వ సొమ్మయితే ఇంకా విజృంభిస్తారు. ప్రభుత్వమేమీ మన పూర్వపుణ్యాల నిధి



కాదు, హక్కులా అనుభవించడానికి. అదీ ఓ వాణిజ్య బ్యాంకులాంటిదే. దానికీ కొన్ని లెక్కలున్నాయి. దానికి మాత్రం సంపద ఎక్కణ్ణుంచి వస్తుంది? ప్రజల నుంచి సేకరిస్తేనే కదా? అంటే అదీ ఒకఱి శ్రమఫలితమే. వారు ఎవఱనేది మీకూ, నాకూ తెలియకపోవచ్చు. కానీ అసలంటూ వారున్న మాటైతే నిజం. కాబట్టి ప్రభుత్వసొమ్ముని తేరగా అనుభవించడమంటే కంటికి కనిపించని కొందఱు పన్నుచెల్లింపరుల (taxpayers) ని దోచుకోవడమే. తక్కువ చెల్లించడమే తప్పంటూంటే ఏమీ చెల్లించకపోవడం ఇంకెంత తప్పో ఎవఱికి వారు యోచించుకోవాలి.

ముందిది అర్థం చేసుకోవాలి అందఱూను. మనమేమీ ప్రకృతిలో జీవించడం లేదు. చాలా కృత్రిమమైన వాతావరణంలో జీవిస్తున్నాం. ఉచితాలనేవి ప్రకృతిబద్ధ జీవనంలోనే, అదీ, చాలా తక్కువ జనాభా గల సమాజాలకే సాధ్యం. మనలాంటివారికి కాదు. ప్రకృతిలోంచి దేన్నయినా ఉచితంగా కోరుకోవడానికి మనం ప్రకృతికి చేస్తున్నది ఏముంది? ఉదాహరణకి, నీటిని ప్రభుత్వం ఉచితంగా సరఫరా చెయ్యాలని డిమాండు చేసే ముందు, అసలు మనం నీటిని పట్టి నిలవ చేయడంలో ప్రభుత్వానికిస్తున్న బాసట ఏంటి? మనం అన్నీ వాడుకుని అవతల పారేసేవారిమే తప్ప దేన్ని ఉత్పత్తి చేస్తున్నామని, ప్రతీదీ ఉచితంగా కావాలని డిమాండు చేయడానికి? మహా అయితే మన ఉద్యోగాలు మనం చేసుకుంటున్నామంతే!

## 29. మంచిచెడుల సాపేక్షత్వం (Relativity)

మంచి-చెడులు ఐకాంతిక/స్వయంసంపూర్ణ విలువలు (absolute or self-contained values) అనే నమ్మకం మన సమాజంలో చాలా బలంగా, లోతుగా నాటుకుపోయి కనిపిస్తుంది. అంటే కొన్ని విషయాలు అన్ని చోట్లా అన్నివేళలా, అందఱికీ మంచేననీ, మఱికొన్ని ఎప్పటికీ చెడేననీ నమ్మడం. నిజానికి ప్రపంచంలో అస్తిగోపన సమాజాలు (conservative societies) పైకి వెయ్యి నమ్మకాల్ని ప్రవచిస్తున్నప్పటికీ వాటన్నింటికీ మూలమైన కేంద్రబిందువు ఈ ఒక్క నమ్మకమే. వాటి ఛాందసాలూ, సంకుచితత్వాలూ, అమానుషత్వాలూ అన్నీ ఈ ఒక్క నమ్మకం లోంచే ప్రభవిస్తాయి. కానీ లోతుగా ఆలోచించినప్పుడు మంచి-చెడులనే వాటికి స్వంత అస్తిత్వమంటూ ఏమీ లేదు. అవి ఆయా దేశ-కాల పరిస్థితులూ, వ్యక్తులూ, వారి స్థితిగతు

లూ, ఇష్టానిష్టాలూ, సమయ-సందర్భాల ఆధారంగా నిర్ణయించాల్సినవి. అంటే వాటి విష యంలో గొప్ప సమయస్ఫూర్తితో కూడిన తర్కం కూడా అవసరమే. అందుకు పూర్వాయత్త సూత్రా (readymade formulas) లంటూ ఏమీ లేవు. ఈ ముక్క బోధపడాలంటే కాస్త వైవిధ్య సమాచారమూ, చరిత్ర పరిజ్ఞానమూ కూడా అపేక్షితమే.

మంచిచెడులనే గణితశాస్త్రంలో అస్తిగోపన సమాజాలన్నీ ఇలాంటి మొద్దబ్బాయిలే. ఎందు కంటే ప్లస్సులూ, మైనస్సులూ అనేవి వేఱువేఱుగా ఉండవనీ ఓ ప్లస్ గుర్తులో వాస్తవానికి రెండు మైనస్ గుర్తులు సమద్విఖండన చేసుకుంటాయనీ వారికి తెలీదు. శౌర్యోదాత్తమైన పులీ, భీరుహృదయి అయిన పిల్లీ- అలాగే విశ్వాసపాత్రమై ప్రేమభావ భాసితమైన జాగిల మూ, క్రూరమైన తోడేలూ ఒకే జీవజాతులకి చెందిన జంతువులని వారికి తెలీదు. ఇంకా, విహాయసంలో విహరించే విహంగాలకీ, పాతాళంలో ప్రాకే పాములకీ పూర్వీకుడు ఒకడే నని కూడా వారెఱుగరు. అదే విధంగా, ఒకే పురుషవ్యామోహం ఒకామెని స్వైరిణిగానూ, మఱొకామెని సాధ్విగానూ చేయొచ్చునని వారు గుర్తించలేకపోయారు.

కొందఱు మేధావులకి ఇలాంటి విషయాలు తెలిసినా పైకి చెప్పకపోవడానికి ప్రాసంగికమైన (circumstancial) కారణాలుండొచ్చు. ముఖ్యంగా నాటి జనసామాన్యం నిరక్షరాస్యు లూ మూర్ఖులూను. లోతు గ్రహించలేనివారికి ఇదంతా చెప్పడం వల్ల ఆ రోజుల్లో చాలా ప్రమాదం ఉంది. కనుక మతగురువులు కొన్ని విధినిషేధాల్ని మాత్రమే బోధించి, "ఇలా ఉండండి. చాలు" అనేశారు. అంటే విలువల గుఱించి నిరంతర తర్కానికి దిగే అవసరం నుంచి వారు జనాన్ని తాత్కాలికంగా విమోచించారు. ఆ విధినిషేధాలు మాత్రం బాగా ఒంట బట్టేశాయి. వాటి స్ఫూర్తేమో ఆ గురువులతోనే అంతరించింది. వాటిని బోధించిన నాటికీ, అనంతర కాలఖండాల (later periods) కీ మధ్య జీవనవిధానం మారకుండా ఉన్నంతకాలమూ అవి బానే పనిచేశాయి. 'అవే నిఖార్సైన మంచీ, నిఖార్సైన చెడూ' అనిపిం చుకున్నాయి. కానీ నాగరికత మారిపోయాక వాటి సాందర్భికత (relevance) గుఱించి ప్రశ్నలు తలెత్తసాగాయి.

"ఆనాటి మేధావులు చెప్పడానికి సాహసించనిది మనమీనాడు చెప్పడం అవసరమా?" అని అడిగితే, ఔను, ఇప్పుడు అవసరమే. ఎందుకంటే సమకాలీనంగా చదువుసంధ్యలు ఎంత వ్యాపించినప్పటికీ మనుషుల మంచిచెడులు మాత్రం ప్రాత విలువల ప్రాతిపదికనే నిర్ధారించ



బడుతున్నాయి. ఆ పేరుతో మన సమాజంలో పెద్దయెత్తున మూర్ఖత్వమూ, దంబాచారమూ (hypocrisy) వ్యాపించిపోయాయి. మన రాజకీయ వ్యవస్థ, మనం జీవిస్తున్న క్రొత్తనాగరి కత, నమ్ముతున్న ప్రాత విలువలూ— ఇవన్నీ ఒకదాని కొకటి పొంతన లేకుండా పోయి, ఒకే రేడియోసెట్టులో యుగపత్తుగా వినవస్తున్న మూడు స్టేషన్లలా అసందర్భమై, అయోమయమై, కర్ణకఠోరమై కూర్చున్నాయి. వాటి ముద్రతో విలువల నిర్ణయాలూ (value judgments), వాటి ఆధారంగా పరహింసా పెచ్చుమీఱాయి.

కనుక ఈ విలువలేవీ స్థిరమూ, శాశ్వతమూ కాదనీ, ఇవన్నీ సాపేక్షమనీ, వీటి ఆధారం గాఎవఱినీ ధర్మించి ద్వేషించాల్సిన అగత్యం లేదనీ స్పష్టీకరించాల్సిన సమయం ఆసన్న మైంది. పూర్వంలా కాకుండా, ఏతత్కాలీనులు విద్యావంతులు కనుక ఈ సాపేక్షతని సమీచీ నంగా అర్థం చేసుకుని మారతారని ఆశించాల్సి ఉంది.

## ౩౦. మంచి ఎవఱు చెప్పినా స్వీకరించడం

తమ సిద్ధాంతాల మీదా సంప్రదాయాల మీదా ఉన్న వెఱ్ఱి అభిమానంతో వాటిని అవ లంబించని వ్యక్తుల్ని ద్వేషించడం, వ్యక్తుల మీది ద్వేషంతో వారిలోని మంచిని స్వీక రించకపోవడం- ఇవి ఈనాడు మానవాళికి సోకిన జమిలి తెగుళ్ళు. చరిత్రలో బాగా వెనక్కి వెళితే, అతిప్రాచీనకాలంలో నాగరికత ఈ మార్గంలో విస్తరించలేదని తెలు స్తుంది. పనికొచ్చే జ్ఞానం ఎక్కడున్నా గానీ అతిప్రాచీనులు నిరభ్యంతరంగా స్వీకరించేవారు. కనుక ప్రతి మంచివిషయానికీ కులరంగో మతరంగో జాతిరంగో పులుముతున్నంత కాలం, అలా పులిమి ఎగతాళి చేస్తున్నంత కాలం మనం నాగరికులం కాలేం. ఎంతో కొంత మంచి అన్నిచోట్లా ఉందని గ్రహించాలి. అందఱిలోనూ ఉంది. కాబట్టి నచ్చిన మంచిని మెచ్చుకుని, స్వీకరించి నచ్చనివాటిని వదిలిపెట్టడమే మనం చెయ్యాల్సినది.

## ౩౧. భావోద్వేగాల స్థానే పర్యాలోచనకి పెద్దపీట

భావోద్వేగాలూ (emotions), పర్యాలోచనా (relaxed thought)— ఈ రెండూ మానవత్వంలో భాగాలే. ఒకటి మఱొకటిగా అవపాతం చెంది

ఘనీభవిస్తుంది. కాబట్టి మనిషికి రెండూ అవసరమే. అయితే, కొన్ని కారణాల వల్ల నవ్య మానవతావాదంలో భావోద్వేగాల కన్నా పర్యాలోచనకే అగ్రాసనం. పర్యాలోచన గడియార మైతే భావోద్వేగం అందులో భాగమైన అలారంలాంటిది. గడియారం నిరంతరాయంగా నడవడం ముఖ్యం. కానీ అలారం విషయంలో మటుకూ అలా కాదు. అది నిరంతరాయం గా మ్రోగడం జబ్బులక్షణం. జీవితం ఓ పుస్తకమనుకుంటే అందులో మనం పొందే భావో ద్వేగాలు– ఆసక్తికర అనుభవాలనే పంక్తుల క్రింద గీచి గుర్తుపెట్టిన ఎఱ్ఱసిరా గీతలు. అవి మనకి గతాన్నీ, భావికర్తవ్యాన్నీ గుర్తుచేస్తాయి. అదే వాటి ఉద్దిష్ట ప్రయోజనం. అది మర్చి పోయి పుస్తకం మొత్తం ఎఱ్ఱసిరా గీతలతో నింపేస్తే అది చాలా ఎబ్బెట్టుగా అగుపిస్తుంది.

భావోద్వేగాల్ని భావోద్వేగాలుగానే, పర్యాలోచనని పర్యాలోచనగానే చూడాలి. అలాగే వాటిని వేఱువేఱుగానే అనుభవించాలి. రెండూ కలిపి కలగాపులగం చేయకూడదు. అలా చేస్తే మనకి తెలియకుండానే మనం మానవతాసూత్రాల ఉల్లంఘనకు ఒడిగడతాం. కానీ ఇందు కు విరుద్ధంగా లోకంలో రెండు విషయాలు తఱచుగా దృశ్యమానమవుతాయి. ఒకటి– తొలుత నిర్భరమైన భావోద్వేగాలకీ, సెంటిమెంట్లకీ లోనై ఆ తరువాత వాటిని సమర్థించు కోవడం కోసం పర్యాలోచనని ఆశ్రయించడం. రెండు– పర్యాలోచన ద్వారా కొన్ని లక్ష్యాల్ని ఏర్పఱచుకుని వాటిని సాధించడం కోసం తమ యొక్కా, ఇతరుల యొక్కా భావోద్వేగాల్నీ, సెంటిమెంట్లనీ వాడుకోవడం. ఈ రెండో పని ఎక్కువగా మగవారు చేస్తారు. కానీ రెండూ తప్పే.

భావోద్వేగాలు సున్నితత్వానికి సంబంధించినవి. దానిగుఱించి స్థలాంతరంలో ఇదివఱకు విపులంగా చెప్పే ఉన్నాను గనుక ఇప్పుడు సవిస్తరంగా ఆ ప్రస్తావన గుఱించి వ్రాయను. మన సమాజంలో ఆలోచనాత్మక, ఆలోచనాప్రేరక అభివ్యక్తి (thoughtful, thought-provoking expression) కన్నా కూడా భావోద్వేగ పూరిత, భావోద్వేగ కారక అభివ్యక్తి (emotional, emotive expression) కి చాలా విలువిస్తారు. తార్కికంగా మాట్లాడే నాయకులకన్నా ఆవేశంగా మాట్లాడే నాయకులు మనకి బాగా నచ్చుతారు. శాంతరసాన్ని పోషించే రచయిత కన్నా ఉద్రేచక శైలితో ఒక ఊపు ఊపేసే రచయితని మనం ఎక్కువ అభి మానిస్తాం. తనకి పని ఎలా చేసిపెడితే బావుంటుందో స్పష్టంగా, శాంతంగా తెలిపే యజ మానుడి కన్నా ఆవేశంతో బూతులు తిట్టి చేయించుకునే యజమానుణ్ణే మన దేశప్పనివారు



బాగా అర్థం చేసుకోగలరు. ఇక్కడ అటువంటి వారికి మాత్రమే పని అవుతుంది.

అదే విధంగా ఏ ప్రస్తావన మీదైనా సరే, చర్చ అనేది మనం బొత్తిగా భరించలేం, మనం ఏదీ వినలేం. వినిపించుకోలేం. సమాధానం బైటికొచ్చే దాకా ఎదురు చూడలేం. దాని బదులు ఎవఱైనా అవతలివారి నోరు బలవంతంగా నొక్కేసి యావత్తు చర్చకీ ఒక్కదెబ్బతో భరత వాక్యం పలికితే మనకి చాలా ఆనందం కలుగుతుంది. చాలా ఉపశమనంగా, హాయిగా అని పిస్తుంది. మనల్ని ఇలా మార్చినది భావోద్వేగాలకి మనమిచ్చే అనవసర ప్రాధాన్యమే. మనది ఆలోచనాప్రధానమైన విద్యావంత బౌద్ధిక సమాజం కాకపోవడం ఇందుకో ప్రధాన కారణం. ఇలా భావోద్వేగాలకి మాత్రమే స్పందించడం అలవాటై మన మెదళ్ళు సాలోచనా భివ్యక్తులకి శ్రుతికావడం మానేశాయి. భావోద్వేగాలు వినోద కార్యక్రమాల్లోనూ, కళల్లో నూ, ఆధ్యాత్మికతలోనూ పనికొస్తాయి. కానీ విద్యావిజ్ఞానాలకీ, పరిశోధనకీ, సత్యాసత్య నిర్ధా రణకీ, తత్త్వీకరణలకీ అవి సుతరామూ పనికిరావు. కానీ మనం భావోద్వేగాలకి వేసే స్వర్ణ సింహాసనం మూలాన వినోద–విజ్ఞానాల మధ్య ఉన్న అగాధాన్ని గమనించలేనివారి మయ్యాం. మనం వినోదాన్నే విజ్ఞానం అనుకుంటున్నాం. అందుకనే తెలుగులో 30–40 దూరదర్శన వాహినులు (TV channels) ఉంటే వాటిల్లో ఒక్కటీ విద్యావిజ్ఞానాలకి సంబంధించినది కాదు. అసలు అలాంటివి మనకవసరమే లేదు.

మనుషులకి మనమిచ్చే ప్రాధాన్యం కూడా అలాగే ఉంటుంది. ఓ నోబెల్ బహూకృతుడైన శాస్త్రవేత్తో, సాహిత్యవేత్తో చనిపోతే "ప్చ్ పోయాడు" అని నాలుగైదు పంక్తుల్లో సరిపెడతాయి మన పత్రికలు. వార్తావాహినులైతే ఓ పూట స్క్రోలింగుతో సరిపెడతాయి. ఆయన అంతిమ యాత్రకైతే ఎవఱూ వెళ్ళరు. అదే ఓ సినీ నటుడో, క్రీడాకారుడో అనుకోండి, అప్పుడు...? ఆలోచనకీ, దాని ద్వారా మన మస్తకాల్ని పెంచిన వారికీ మనమిచ్చే శాశ్వతస్థానం అది – వెనక బెంచి.

సమాజపు విలువల వ్యవస్థ యావత్తూ ఇలా భావోద్వేగాల చుట్టూ పరిభ్రమించడం వల్ల అందఱూ తమని తాము భావోద్వేగులుగా తీర్చిదిద్దుకుంటున్నారు. స్త్రీలేమో అది తమ సున్ని తత్వం, లేదా సాధికారత అనుకుంటున్నారు. మగవారైతే తమ పౌరుషానికి సంకేతం అను కుంటున్నారు. సంస్థలేమో అది తమ స్పందక తత్త్వానికి (responsiveness) నిదర్శనం

అనుకుంటున్నాయి. కానీ దీనివల్ల టోకుగా జరిగే నష్టం గురించి ఎక్కువమందికి అవగాహన లేదు.

**మొదటిది-** మనకి ఎల్లప్పుడూ ఏదో ఒక ఉద్రేచక విషయం (emotive issue) కావాల్సి వస్తోంది. ఏదీ లేకపోతే ఊరికే వసపిట్టల్లా వాగడం. ఆఖరికి నిశ్శబ్దాన్ని భరించలేని, సహించలేని గోల-గగ్గోలు మనుషులుగా మనం అవతరించాం. గుడికి వెళ్ళినప్పుడు కూడా మన చెవులకీ, కళ్ళకీ ఏదో ఒక గోల, గొడవ కావాలి. పొరపాటున ఎక్కడైనా అది లభ్యం కాకపోతే పూనుకుని ఓ వాదకమూ, అధిగ్రీవమూ (player and mic set) దానం చేసి మరీ దాన్ని సృష్టిస్తాం.

**రెండోది-** మన భావోద్వేగాల పిచ్చిలో మన బౌద్ధిక నాణ్యత చిన్నప్పుడే దెబ్బతినడాన పరిశోధన మరియు అభివృద్ధి (R&D) లాంటివాటికి పనికిరాని వ్యక్తులుగా పరిణమించాం. ఎందుకంటే మన సామూహిక మనస్తత్వానికి వాటి పట్ల అభిరుచే ఉదయించదు.

**మూడోది-** మనకి భావోద్వేగాలే తప్ప ఆలోచనాశక్తి లేదని గమనించి మన ఈ మనస్తత్వాన్ని రాజకీయపక్షాలూ, నాయకులూ చక్కగా వాడుకుంటున్నారు. మాటిమాటికీ మన భావోద్వేగాల్ని రెచ్చగొట్టి, మనల్ని అమానుషులుగా మార్చి వారు తమ పబ్బం గడుపుకుంటున్నారు. బహుశా అందులో వారి తప్పేమీ లేదు. వారికా అవకాశాన్ని మనమే కదా ఇస్తున్నది!

భావోద్వేగాల పారవశ్యం విషయాల తాలూకు సూక్ష్మవివరాల మీద శీతకన్ను వేయిస్తుంది. సమస్యల మారుమూల కోణాలకేసి దృష్టి సారించనివ్వదు. భావోద్వేగాల్ని వ్యక్తీకరించనంతవరకే అవి మన అదుపులో ఉండేది. ఓ సారంటూ వ్యక్తీకరించడం జరిగాక మనమే వాటి అదుపులోకి వెళ్ళిపోతాం. తదుపరి పరిణామాలు మన చేతుల్లో లేకుండా పోతాయి.

## 32. ఆత్యంతిక వాదాల నుంచి దూరం పాటించడం

మనుషులు స్వతహాగా సౌందర్యారాధకులూ, సవితర్కజీవులూ గనుక ఉన్న ప్రపంచంతో/ జీవితంతో సంతృప్తి చెందకపోవడం సహజం. ఇది ఇంతకన్నా మెఱుగ్గా ఉంటే బావుంటుందని అనుకోనివారు ఉండరు. తప్పులేదు.



కానీ కొందఱిలో- వారి అపరిణత, ఆవేశపూరిత, భావోద్వేగ ధోరణి మూలాన ఈ ఆశంస క్వాచిత్కంగా వికటరూపాన్ని ధరిస్తుంది. ఆ మెఱుగుదల కోసం ఇతరుల్ని హింసించినా, దోచినా తప్పులేదనీ, వారందుకు తగినవారేననీ, ఎందుకంటే ఇప్పుడు తమ వంతొచ్చిందనీ, తాము కోరుకుంటున్న క్రొత్త ప్రపంచం కోసం ఉన్న ప్రపంచాన్నీ, దాని విలువల్నీ ధ్వంసం చేయక తప్పదనీ, అందునిమిత్తం కొన్ని హఠాన్ మార్పులూ, పెడ నిర్ణయాలూ (out-of-way decisions), అలాగే కొన్ని 'అతి'చర్యలు కూడా తప్పవనీ వారు భావిస్తారు. భావించడమే కాకుండా ఆ భావనల్ని ప్రచారించడం కూడా మొదలుపెడతారు. త్వరలో అదో ఆత్యంతిక సిద్ధాంతం (extremist ideology) అయి కూర్చుంటుంది. దాని చుట్టూ రాజకీయ పక్షాలూ, వాటి కనుబంధంగా స్వయంప్రకటిత (self-styled) ప్రజాసంఘాలూ (తోక సంఘాలు) తయారవుతాయి. తమ భావజాలాని కనుగుణంగా ప్రజాజీవితం మీద పెద్ద ఎత్తున ఆకస్మిక, తొందఱపాటు చర్యలతో 'అతి' ప్రయోగాలు చేయవలసిందని వారంతా కలిసి ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయ నారంభిస్తారు. మన సమాజంలో ఈ ప్రక్రియంతా ఇప్పటికే పూర్తయింది.

ఐతే దురదృష్టవశాత్తూ, ఇటువంటి ఆత్యంతిక వాదాలు మొదట్లో విస్తారమైన ప్రజాదరణకి నోచుకునే మాట వాస్తవం. ఎందుకంటే ఆవేశపరులూ, తిరుగుబాటరులూ, తలక్రిందులుగా నడిచేవారూ, ముక్కుతో తినేవారూ, కుక్కల్ని కఱిచేవారూ ప్రజల దృష్టిని చప్పున ఆకర్షిస్తారు. వారు రుచిచూపుతామనే క్రొత్తదనం మీది ఆసక్తి ప్రజల తార్కికప్రతిభని తాత్కాలికంగా ఆచ్ఛాదించి వేస్తుంది. ప్రస్తుత జీవితంతో విసిగిపోయినవారంతా బేషరతుగా వారివెంట నడవడానికి సిద్ధపడతారు. ప్రతి క్రొత్త సామాజిక భావజాలమూ, చట్టమూ నవజాత శిశువుల్లాంటివి. అవి ప్రజల మనసుల్లో భవిష్యత్తు పట్ల ఉజ్జ్వలమైన చల్లని ఆశావాదపు పిల్లతెమ్మెఱల్ని వీస్తాయి. కనుక "ఆ మార్గం విశ్వసనీయం కా"దనే దీర్ఘదర్శులు అశ్లీలంగా దూషించబడతారు. అయితే మానవత్వం పక్షాన ఉండేవారెవఱూ అలాంటి ఆత్యంతిక వాదాల్ని ఎట్టి పరిస్థితుల్లోనూ సమర్థించరు, అవి ఎంత ప్రభుత్వ/ప్రజా ఆదరణ పొందనీ, ఎన్ని తాత్కాలిక విజయాల్ని సాధించనీ! ఇలాంటి ఆత్యంతికవాదాల్ని పెంచిపోషించే దేశాలు తమ తొల్తటి ప్రజాస్వామిక లక్షణాలన్నింటినీ శీఘ్రమే కోల్పోతాయి. అనంతరం ఈ వాదాలకి శ్రద్ధాస్థానమైన వర్గాలు ప్రభుత్వాలకి మోయలేని భారంగా పరిణమిస్తాయి.

**ఆత్యంతిక వాదాల్ని ప్రచారించే సంస్థలన్నిటికీ కొన్ని సర్వసామాన్య లక్షణాలుంటాయి :**

1. అవన్నీ ప్రాథమికంగా జనాభా మొత్తానికీ కాక, అందులో ఏదో ఒక ప్రత్యేక సమూహపు శ్రేయస్సుకి మాత్రమే సర్వాత్మనా అంకితమై ఉంటాయి. కానీ ఆ సమూహపు శ్రేయస్సే అందఱికీ శ్రేయస్సని ప్రచారం చేస్తుంటాయి. తమ మార్గదర్శకత్వం/నాయకత్వంలో ఓ ఉజ్జ్వల భవిష్యత్తుని అవి ఆ సమూహానికి వాగ్దానం చేస్తుంటాయి.

2. తమలోని ఒకఱిద్దఱిని గానీ, కొందఱిని గానీ, తమ చర్యల్ని గానీ, అభిప్రాయాల్ని గానీ సిద్ధాంతాన్ని గానీ, ఎవఱైనా విమర్శిస్తే తాము వకాల్తా పుచ్చుకున్న సమూహమంతటినీ విమర్శించినట్లేనని అవి తఱచూ ఓ వింత వాదనకి దిగుతూంటాయి. ఆ విమర్శించినవారు బేషరతుగా బహిరంగ క్షమాపణ చెప్పాలనీ, వారిని శిక్షించాలనీ అవి డిమాండ్లు లేవనెత్తుతూంటాయి. ఎందుకంటే తమ మీదా, తమ అభిప్రాయాల మీదా ఏ విధమైన ప్రజాస్వామిక చర్చనీ అవి సహించలేవు. ఇతరుల్ని విమర్శించే హక్కు తమకి మాత్రమే ఉందని అవి అంతర్గతంగా భావిస్తుంటాయి.

3. మఱో పార్శ్వం నుంచి- అవి కొన్ని ఇతర సమూహాల్ని బహిరంగంగా ద్వేషిస్తుంటాయి. అన్ని లోపాలకీ, నష్టాలకీ అవే ఏకైక కారణమనీ, వాటిని ఏం చేసినా పాపం లేదనీ, వాటి కడగండ్లకి ఎవఱూ కఱగాల్సిన అవసరం లేదనీ అవి బోధిస్తాయి, కనీసం జనాంతికంగానైనా ! అంటే- అవి ఏ కారణాలకి వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నామని చెబుతున్నాయో సరిగ్గా వాటినే మఱో రకంగా మఱో రూపంలో కొనసాగించడానికి పూనుకుంటాయి.

4. అవి- సమాజంలో రావాలని తాము కోరుతున్న ఏ మార్పు కోసమూ ఓర్పుగా వేచి చూసేందుకు ఇష్టపడవు. రాజకీయ ఒత్తిళ్ళూ, పైరవీలూ, ప్రలోభాలూ, వెన్నుపోట్లూ, వక్ర మార్గీయులతో చెట్టపట్టాలూ, నిరంకుశ చట్టాలూ, బెదిఱింపులూ, హింస, విధ్వంసం, పెద్దపెద్ద గుంపుల్ని సమీకరించడం, భారీ ఎత్తున నిధుల సేకరణ ద్వారా శక్తి-అసమతూకాన్ని సృష్టించడం మొదలైన శీఘ్రతర అడ్డదారుల్నే అన్వేషిస్తాయి.

5. వాటి ప్రచారవ్యూహం సాధారణంగా- అబద్ధాలూ, వదంతులూ, వక్రభాష్యాలూ, బుఱద జల్లడం, గోరంతల్ని కొండంతలు చేయడం, మహాజనుల క్రించు సహజాతాల్ని (base instincts) రెచ్చగొట్టడం, అప్పటికే సమాజంలో సుప్రతిష్ఠితమై ఉన్న వర్గవైషమ్యాల్నీ తదితర సెంటిమెంట్లనీ ఎడాపెడా వాడుకోవడం, ఎగతాళ్ళూ, ఇతరుల్ని బద్నామ్ చేయడం కోసం కళారూపాల్నీ కవితాత్మక-ఆలంకారిక శైలుల్నీ దుర్వినియోగం చేయడం మొదలైన



హీనస్థాయి పద్ధతుల్ని ఆశ్రయించుకుని ఉంటుంది.

6. అవి భవిష్యద్-వర్తమానాల కన్నా గడిచిపోయిన చరిత్ర గుఱించే హెచ్చుగా ప్రసంగిస్తుంటాయి.

ఒకానొక భావజాలం పైన పేర్కొన్న ఆత్యంతిక లక్షణాల్ని (extremist features) అధికంగా కలిగి ఉన్నట్లు గుర్తుపట్టిన వెంటనే దాన్నుంచి దూరం జఱగడం ప్రతి నవ్యమానవతావాదికీ విధ్యుక్త ధర్మం. “అది ఎవఱి కోసం? ఏ లక్ష్యాన్ని కలిగుంది?” అనే చర్చ పూర్తిగా అనవసరం. “వాటి మార్గం చెడ్డది కావచ్చు గానీ లక్ష్యం మంచిదే”నంటూ వాటిల్లో లేని పవిత్రతని అభిదర్శించే ప్రయత్నం పొఱపాటవుతుంది. ఎందుకంటే ఆత్యంతికవాదులు చేసే తప్పులు, తెలియక చేసేవి కావు. వారు హింసకి దిగకపోయినా సమాజం మీద వారి సిద్ధాంతాల/కార్యక్రమాల దీర్ఘకాలిక దుష్ఫలితాలు ఏ ఇతర టెఱ్ఱరిస్టు విధ్వంసానికీ తీసిపోవు.

## ౩౩. ప్రతిచర్యకి బదులు, చర్య

ఆంగ్లంలోని Reactionary అనే విశేషణాన్ని మనమిక్కడ తెలుగులో ‘ప్రతిచర్యాళువు’ అంటున్నాం. దానికి వ్యతిరేకార్థకంగా ‘చర్యాళు’వంటున్నాం. కానీ ఆంగ్లంలో ‘చర్యాళువు’కు సమార్థకం (equivalent) లేదు. Back formation పద్ధతిలో Actionary అనొచ్చును గానీ ఆ మాటకింకా నిఘంటువుల్లో స్థానం లేదు. చర్యాళుత్వం అంటే- ఇతరుల మీద కోపంతోనో, ద్వేషంతోనో, లేదా తానంటే ఏంటో వారికి నిరూపించి చూపాలనే పట్టుదలతోనో, లేదా తానూ వారిలా అవ్వాలనో కాకుండా, తన స్వకీయమైన ఆసక్తితో, యథార్థమైన ప్రేమతో, సొంత సృజనాత్మకశక్తి-ప్రతిభలతో, తన పద్ధతిలో తానో క్రొత్త పనిని స్వతంత్రంగా సంకల్పించి చేయడం. ఇందుకు విరుద్ధమైనది ప్రతిచర్య.

ఆధునిక కాలంలో మన మనసులు పలు బాహ్యప్రభావ వాహినుల చేత కోలాహలంగా ముట్టడించబడుతున్నాయి. వాటిల్లో సత్ప్రభావాలూ ఉన్నాయి. దుష్ప్రభావాలూ ఉన్నాయి. మనమూ మంచి పనులు చేయాలనే ఉత్తేజాన్ని కలిగించేవి మంచి ప్రభావాలు. ఆవేశాల్ని రగిలించేవి దుష్ప్రభావాలు. వాస్తవానికి ఈ రెండూ ప్రతిచర్యలే. ఈ రోజుల్లో తామనుకున్న

ప్రతిస్పందనల్ని మన నుంచి రాబట్టడానికీ, తామనుకున్న అంశాల మీద తామనుకున్న పద్ధతిలో మనల్ని ప్రతిచర్యకేసి తోలడానికీ రకరకాల ఆధికారిక, అనాధికారిక శక్తులు అహర్నిశం కృషిచేస్తున్నాయని గమనించాలి.

ఈ ప్రభావాల్లో పడి మనకి ఏ భావమైనా దానంతటది కలగడం మానేసింది. ఏదో జఱగాలి. ఎవఱో ఏదో చెయ్యాలి. దాని గుఱించి ఎవఱో ఓ భావోద్వేగపూరిత శైలిలో మనకు నివేదించాలి. రచ్చా, రభసా అవ్వాలి. ఓ పబ్లిక్ పంచాయితీ పెట్టాలి. అప్పుడు గానీ మనకి ఆలోచనలు రావు. ఇదీ ఈనాడు మన పరిస్థితి. కాదు, మన మేధస్సుల పరిస్థితి. ఓ రకంగా మనం భావపరమైన నపుంసకులుగా మారాం. ఎందుకంటే మనలో భావాలూ, ఆలోచనలూ పుట్టాలంటే మనల్ని ఎవఱైనా గిల్లాలని కోరుకుంటున్నాం. అంటే బాహ్యప్రేరణని అపేక్షిస్తున్నాం. ఎల్లప్పుడూ ప్రతిచర్యే తప్ప చర్య నెఱగనివారి పరిస్థితి ఇలా కావడం ఆశ్చర్యకరం కాదు.

జాగ్రత్తగా గమనిస్తే– చదువు దగ్గర్నుంచీ, ఉద్యమాల దాకా మన బ్రతుకంతా ఇలా దేనికో ప్రతిచర్య (reaction) గా తయారైంది. మనంతట మనం ప్రేమించి, లేదా మనంతట మనకి బుఱ్ఱలో ఊహ పుట్టి చేసేదేదీ కనిపించదు. దేన్నో, ఎవఱినో చూసి స్పందిస్తున్నంత కాలమూ మనం ప్రతి చర్యాళువులమే అవుతాం. ఏ అంశం మీదా బొత్తిగా స్పందనలే లేని బండజనంలో వాటిని కలిగించడం గొప్పవిషయమే కానీ స్వతహాగా సృజనశీల స్పందనలు గలవారు ఇలాంటి ప్రతిచర్యల మీద తమ భావోద్వేగాల్ని వృథా చేసుకోవడం మంచిది కాదు. దీని మూలాన వారు తమ సృజన శీలాన్ని కోల్పోవడమే కాక భవిష్యత్తులో మానవతా విరుద్ధమైన ప్రతీప భావజాలాల (negative ideologies) కేసి ఆకృష్టులు కావడానికి సైతం ఆస్కారం ఉంటుంది.



## 34. ఏది చేసినా ముందు దానికో భౌతిక కారణాన్నీ, ప్రయోజనాన్నీ చెప్పి చేయడం.

అం దానికీ ఓ లెక్కుంది" అంటారు గణితశాస్త్రవేత్తలు. అలాగే నీతికీ ఓ లెక్కుంది. ఆ లెక్క పేరు తర్కం. ఆ రెంటి మధ్యా గల విడదీయరాని లంకె గుఱించి ఇక్కడ చెప్పుకుంటూ పోతే గ్రంథ విస్తరమవుతుంది. కాబట్టి జిజ్ఞాసువులు నేను వ్రాసిన "**చింతన సమీరం**" అనే వ్యాస సంకలనాన్ని చూడవలసినది.

అయినా ఇక్కడ క్లుప్తంగా కొంత వ్రాస్తాను. నవ్యమానవతావాదంలో సాంప్రదాయికమైన సంఘనీతి (conventional social morality) కి ప్రాధాన్యం కాస్త తక్కువ. దానికి బదులు మానవతావాదులు తర్కానికే (logic) ప్రాధాన్యమిస్తారు. ఆ తర్కానికీ, కార్య కారణ మీమాంసకీ నిలబడే నీతులనే వారు ఆచరిస్తారు, సమర్థిస్తారు. కాబట్టి ఇతరులకి నవ్యమానవతావాదుల నీతి కొన్నిసార్లు నీతిలా గోచరించకపోవచ్చు. ఎందుకంటే సాంప్రదాయిక నీతి యాంత్రికం (mechanical). దాంట్లో తంతి సందేశాల (telegraphic messages) లాంటి టూకీ నిర్దేశాలే తప్ప వాటిని ఏ పరిస్థితులకి ఎలా అన్వయించుకోవాలో ఆ వివరాలు శూన్యం. ఆ శూన్యాన్ని మానవతావాద తర్కం పూరిస్తుంది.

**ఉదాహరణకి**– ఇతరులు చేసిన ఉపకారానికి కృతజ్ఞత చూపాలనేది సాంప్రదాయిక నీతి. ఈ నిర్దేశంతో ప్రాథమికంగా పేచీ ఏమీ లేదు. ఎంతటి ఉపకారానికి అంతటి ప్రత్యుపకారం చేస్తే సరిపోతుంది. జీవితాంతం ప్రత్యుపకారాలు చేస్తూ పోనక్కర్లేదు. దాని బదులు, ఉపకారులకి అపకారం చెయ్యకుండా ఉండడానికి శాయశక్తులా ప్రయత్నిస్తే నయం. ఎందుకంటే ఇతరుల్లోని కృతజ్ఞతాభావాన్ని వాడుకోవాలనుకునే మనస్తత్త్వాలున్నాయి. కృతజ్ఞత అనే సెంటిమెంటుతో అవతలివారిని శాశ్వతంగా కట్టి పడేయాలనుకునేవారున్నారు. అలా కట్టేసి "చేయకూడని ప్రత్యుపకారాలు" చేసిపెట్టమంటూ మానసిక ఒత్తిడి పెట్టేవారున్నారు. కనుక సందర్భాన్ని బట్టీ, అవతలి మనుషుల తత్త్వాన్ని బట్టీ వివేకవంతంగా నీతుల్ని అనువర్తించుకోవాలి. గ్రుడ్డి నిబద్ధతలు (blind dedication) ప్రమాదకరం.

అలాగే నిజం చెప్పాలనే నీతి ఉంది. దీన్ని ఆచరించాలంటే చాలా అనుకూల పరిస్థితులు కావాలి. ఆ నిజాన్ని నమ్మేవారు కావాలి. నమ్మి తట్టుకునేవారు కావాలి. ఆ నిజం చెప్పడాన్ని సమర్థించేవారు కావాలి. ఆ నిజం వల్ల ఉపయోగమే తప్ప హాని ఉండకూడదు, చెప్పేవారికీ, ఇతరులకీ కూడా! ఇవేవీ ఒనగూడనప్పుడు నిశ్శబ్దంగా ఊరుకోమనే మానవతావాదుల సలహా.

శతాబ్దాల తరబడి జనసామాన్యంలో ప్రచురం (popular) అయిన నీతులు నిజానికి సుఖమయ సమష్టి జీవనం కోసం పూర్వీకులు సూచించిపోయిన బండగుర్తులు. జనసామాన్యం అడుగడుగునా తర్కించలేరు గనకా, దాని ఆధారంగా నిర్ణయాలు తీసుకోలేరు గనకా సూక్ష్మంలో మోక్షంలా వారికి ఈ నీతిమార్గం బోధించబడింది. కానీ నవ నవోన్మేష ఆలోచనాపరులైన నవ్యమానవతావాదులకి ప్రాతకాలపు బండగుర్తులతో పని లేదు. వారు నేరుగా వాటి మూలానికే వెళ్ళగలరు.

జాగ్రత్తగా గమనిస్తే నీతులన్నిటి వెనకా కొంత తర్కమూ, హేతువాదమూ ఉంటాయి. **ఉదాహరణకి–** వావిడికం (incest) మీది నిషేధం. వావిడికం ద్వారా పుట్టే పిల్లలకి అవకరాలూ, అల్పాయుర్దాయమూ ఏర్పడే సంభావ్యత హెచ్చు కావడంతో పూర్వీకులు అలాంటి సంబంధాల్ని నిషేధించాల్సి వచ్చింది. పైపెచ్చు ఆ రకమైన ఆచరణ (practice) కుటుంబంలో పరస్పర అసూయాద్వేషాలకి దారితీయడమూ, వయోరీత్యా చిన్నవారైన కుటుంబ సభ్యులకి పెద్దవారినుంచి భద్రత లేకపోవడం కూడా గమనించి దాన్ని నిషేధించడం జఱిగింది. అయితే ఈ కారణాలేవీ వర్తించని జంటల మీద ఈ నిషేధాన్ని విధించడంలో అర్థం లేదు. అంటే ఉదాహరణకి– ఓ జంట వాస్తవంగా అన్నాచెల్లెళ్ళు కానప్పుడు, వారి మధ్య చెప్పుకోదగ్గ స్థాయిలో సన్నిహిత రక్తసంబంధం లేనప్పుడు, వారా భావననే అనుభూతిల్లనప్పుడు "వరసకి అన్నాచెల్లెళ్ళవుతా"రనే కారణంతో వారిని విడదీయ బూనుకోవడం, లేదా నేఱస్థీకరించడం (criminalization) భావ్యం కాదు.



## 35. విషయాల యొక్క అన్ని కోణాలూ సమగ్రంగా వెల్లడయ్యే దాకా ఓర్పుతో ఎదురు చూడడం

మనం ఎంతగా సవితర్కజీవులమైతే అంతగా నీతిమంతులం కూడా అవుతామని ఇంతకుముందు అనుకుని ఉన్నాం. అయితే తర్కించడం అనేది ఓ లక్షణం, లేదా ప్రతిభే తప్ప కేవలం దాన్తోనే నీతిమంతులం కాలేం. ఆ తర్కానికి కొంత సమాచారమూ, పరిజ్ఞానమూ, అనుభూతీ, అనుభవమూ కూడా తోడవ్వాలి. ఉదాహరణకి– ఆకలివేస్తే తిండి తినడం సహేతుకమే. కానీ అలాగని కన్న బిడ్డల్ని నమిలి మ్రింగడం నీతి కాదు. ఆ సంగతి తెలియాలంటే ఆ జీవులు తన బిడ్డలేననే సమాచారం ఉండాలి. మూడోది – ఆ బిడ్డల ఎడ మమకారమనే అనుభూతి కూడా కలగాలి. ఈ రెండూ లేకనే కదా పులులూ, పాములూ ప్రసవకాలపు వివశత్వంలో కన్నబిడ్డల్ని తినేయడం!

కాబట్టి మనం తప్పులు చేయకుండా ఉండాలంటే, లేదా మన తప్పులు ఇతరుల్ని బలి తీసుకోకుండా నివారించాలంటే– విషయాల గుఱించి మనకి ఇప్పటి దాకా తెలిసినదే సర్వసమగ్ర సత్యమనే భ్రాంతి పెట్టుకోకూడదు. తెలిసినదాన్తో తృప్తిపడకూడదు. అంటే ఎప్పటికప్పుడు మన దగ్గఱున్న సమాచారాన్ని పూర్తిగా నమ్ముకోకుండా పాక్షికంగా శంకిస్తూనే ఉండాలి. కనుక సాధ్యమైతే, సమయం ఉంటే, అదనపు సమాచారం ప్రోగయ్యే దాకా ప్రతీక్షించాలి. విషయాలకీ, వ్యక్తులకీ, పరిస్థితులకీ సంబంధించి అన్ని కోణాలూ వెలువడే దాకా ఓర్పుపట్టాలి. ఎందుకంటే దాన్తో మన దృక్పథం మారే అవకాశం ఉంది. ఆ మార్పు మనం అమానుషులం కాకుండా నిరోధిస్తుంది

## 36. చెడుని కప్పిపుచ్చి మంచిని మాత్రమే పంచడం

దీన్ని రెండు రకాలుగా అర్థం చేసుకోవచ్చు. ఒకటి– తనలోని చెడుని కప్పిపుచ్చి తనలోని మంచిని మాత్రమే ఇతరులకి పంచడం. రెండోది– ఇతరుల్లోని చెడుని కప్పిపుచ్చి వారిలోని మంచిని మాత్రమే నలుగుఱి ఎదుటా ఉద్యోతించడం (highlighting).

ఈ సందర్భంగా, *"మనుషుల్లో మంచి ఉండడం ఎంత సత్యమో, చెడు ఉండడమూ అంతే సత్యమైనప్పుడు ఒకదాన్ని ఉద్యోతించి, మఱోదాన్ని నిగూహించడం అసత్యదోషం క్రిందికి రాదా? అది వ్యక్తుల గుఱించి మనం చేసుకునే ఆత్మవంచన అవ్వదా? మనుషుల్లో చెడు వాస్తవంగానే ఉన్నప్పుడు దాన్ని కప్పిపుచ్చడం మూలాన సంఘం ఉద్ధరించబడుతుందా? సంస్కరించబడుతుందా?"* అనే ప్రశ్నలు తలెత్తుతాయి.

ఇక్కడ ఓ తేడా గమనించాలి. సంఘం బాగుపడాలని ఆకాంక్షించేవారు అందులోని లోపాల గుఱించి బహిరంగంగా మాట్లాడడంలో తప్పు లేదు.[1] కానీ ఈ పై సూత్రం సంఘం కోసం కాదు. వ్యక్తుల కోసమే, వ్యక్తుల గుఱించే! ఆ మాటకొస్తే అసలు నవ్యమానవతావాదమే సువిశాల సంఘం కోసం ఉద్దేశించినది కాదు. విడివ్యక్తుల కోసం ఉద్దేశించినదే. నవ్య మానవతావాదానికి సంఘం ముఖ్యం కాదు. విడివ్యక్తులే ముఖ్యం. అందుచేత సంఘాన్ని ఉద్ధరించడం, సంస్కరించడం లాంటి ప్రసక్తే లేదు. ఇక్కడ మనం విడివ్యక్తులలోని మంచిచెడుల గుఱించే మాట్లాడుకుంటున్నాం.

ప్రతి మనిషీ మంచిచెడుల సమ్మేళనమే. పరిపూర్ణులెవఱూ లేరు. ఐతే ప్రతివారిలోనూ నేర్చుకో దగ్గ విషయాలు ఉంటాయి. మనం ఎదిగే క్రమంలో అతిసౌష్ఠవవాదులు (over-perfectionists) గా పరిణమించి ప్రతిదాంట్లోనూ తప్పులే పట్టడానికి అలవాటుపడడం చేతా, మనలో నేర్చుకునే శక్తి వయోరీత్యా క్షీణించడం చేతా వాటిని గుర్తుపట్టడంలో విఫలమవుతాం. పర్యవసానంగా ఓ వయసొచ్చేసరికి మన పరిచయస్థుల జాబితా వంక చూసుకున్నప్పుడు అందులో ప్రేమాస్పదుల కంటే ద్వేషాస్పదులే ఎక్కువగా కనిపిస్తారు. అలాగే పలువుఱి జాబితాల్లో మన పేర్లు కూడా ద్వేషణీయులనే శీర్షిక (heading) క్రింద ఉండొచ్చు. కారణం– మనలోని అతిసౌష్ఠవవాదానికి వారూ అతీతులు కాకపోవడమే.

[1] చూ. మొదటి అధ్యాయంలో *(ఞా) నవ్యమానవతావాదంలో తప్పొప్పుల నిర్వచనం* అనే ఉపశీర్షిక (sub-heading). మఱియు ఈ అధ్యాయంలో 13 వ సూత్రం క్రింద *"సామాజిక అంశాలక్కూడా ఇదే వర్తిస్తుంది"* అనే ఉపశీర్షిక.



ఇలా ఎందుకు జఱుగుతుందంటే– చెడుని సూక్ష్మ–సూక్ష్మంగా గుర్తుపట్టడమే కాకుండా హృత్కవిలెగా గుర్తుంచుకుని మఱీ దాని గుఱించి మాట్లాడ్డం వల్ల! పదే పదే వ్యక్తుల్లోని చెడుని వెలార్చడం (exposing) మూలాన మనుషులకి మానవత్వం మీదే నమ్మకం పోతుంది. కాబట్టి సాధ్యమైనంత వఱకూ మంచిని మాత్రమే ఉద్యోతించాలి. అలాగే మనలో సైతం చెడు లక్షణాలు ఉన్నప్పుడు, వాటిని సంస్కరించుకోవడానికి మనం ఈ జీవిత కాలంలో అశక్తులమైనప్పుడు వాటిని దాచుకోవడంలో తప్పులేదు. దాచుకు తీఱాలి కూడా. లేకపోతే మన నుంచి నలుగుఱు నేర్చుకుంటారు. అయితే దాచుకోమని చెప్పినంత మాత్రాన వాటిని సమర్థించుకోవచ్చునని తాత్పర్యం కాదు.



# మూడో అధ్యాయం

## మఱికొన్ని విచికిత్సలు

### 1. సాంప్రదాయిక మానవతావాదానికీ నవ్యమానవతావాదానికీ వ్యత్యాసం ఏంటి?

మానవతావాద వాచకమైన Humanism అనే ఆంగ్లశబ్దానికి కొంతమంది ఐరోపేయులు వేఱే విధమైన నిరుక్తి (etymology) చెబుతారు. మానవీయ శాస్త్రాలు (Humanities) అనబడే తత్త్వశాస్త్రం, రాజనీతి మొదలైనవాటి అధ్యయన ఫలితంగా రూపుదిద్దుకున్న ఆలోచనాధోరణి గనక Humanism అయిందంటారు. కానీ ఈ ప్రతీతి సందేహాస్పదం. ఎందుకంటే నాటి ఐరోపాలో Mathematics, physics, chemistry తో సహా అన్ని శాస్త్రాల్నీ philosophy అనే పిలిచేవారు. అదీ గాక చర్చికి వ్యతిరేకంగా పుట్టిన సాంప్రదాయిక మానవతావాదం విజ్ఞానశాస్త్ర సత్యాల వల్ల ప్రభావితమైనట్లుగా మానవీయ శాస్త్రాల వల్ల ప్రభావితమైనట్లు కనిపించదు.

మన నవ్యమానవతావాదానికి స్ఫూర్తి సాంప్రదాయిక మానవతావాదమే. అయినా దానికీ దీనికీ మధ్య ఇంతింతనరాని వ్యత్యాసాలున్నాయి. సాంప్రదాయిక మానవతావాదం వాస్తవంగా ఐరోపాలో పుట్టిపెఱిగినట్టిది. గర్భస్రావమూ, స్త్రీల హక్కులూ, కారుణ్య సమాపనం లాంటి కొన్ని కొంగ్రొత్త చరిత్రపరిణామాలకి సానుకూలంగా అభిప్రాయాల నేర్పఱచుకోవడం మినహా దాని ప్రాచీన దృక్పథం గడిచిన 200 ఏళ్ళుగా పెద్దగా మారినదీ లేదు. పురోగమించినది అంతకంటే లేదు.

సాంప్రదాయిక మానవతావాదం– ఆనాటి ఐరోపాలో చర్చికీ, తదితర సమాజానికీ మధ్య



తలెత్తిన తీవ్ర మనస్పర్ధలూ, ఘర్షణల ఫలితంగా రూపుదిద్దుకున్నట్టిది. అది ఆధునిక విజ్ఞాన శాస్త్ర సత్యాల (scientific truths) వెలుగులో– క్రైస్తవంతో పాటుగా అది బోధించే యావత్తు Theology పట్లా, అన్ని క్రైస్తవ నీతినియమాల పట్లా, ఇంకా అటువంటి అన్ని ఇతర ఆస్తిక ధర్మాల పట్లా తీవ్రమైన నిరసననీ, ద్వేషాన్నీ, ఈసడింపు (contempt) నీ పెంచుకుని ఆవేశంతో తిరగబడినట్టిది. *"కావాల్సింది దేవుడు కాదు, మానవుడు. పరలోక జీవితం కాదు, ఇహలోక జీవితం"* అనే విప్లవాత్మక పరిభావనతో ఆనాటి మానవతావాదం ముందుకొచ్చింది.

ఫలితార్థంగా– సాంప్రదాయిక మానవతావాదంలో మతద్వేషమూ, దైవద్వేషమూ, ఆచార ద్వేషమూ, సంస్కృతి–సంప్రదాయాలన్నింటి ఎడా ద్వేషం. ఎటు చూసినా ద్వేషమే తప్ప మానవప్రేమకి తావులేని పరిస్థితి తలెత్తింది. అదే పరిస్థితి ఇప్పటికీ కొనసాగుతోంది కూడా! మానవతావాదం పేరుతో ఇలాంటి ద్వేషం చెలామణి కావడం నిజంగా మానవాళి దురదృష్టం. దానికి తోడు ఐరోపేయ దేశాలు ఎక్కడెక్కడైతే తమ వలసల్ని స్థాపించాయో అక్కడికల్లా ఈ ద్వేషపూరిత మానవతావాద పాఠాంతరమే ఎగుమతైంది.

ఈనాటికీ ఐరోపా నుంచి వచ్చిన ఏ తాజా మానవతావాద ప్రచురణని తీసుకు చూసినా అందులో నూటికి 70 కన్నా ఎక్కువ పుటలు "దేవుడు లేదు. అది లేదు. ఇది లేదు" అనే నిరాకరణ తర్కానికి (denial dialectic) కేటాయించబడి ఉంటాయి. ఆ పుస్తకాల్లో మానవప్రేమని గుఱించిన ప్రస్తావనలు మిక్కిలి అరుదుగా మాత్రమే దర్శనమిస్తాయి. మానవతావాదం గుఱించి నాకు తెలిసిన దాన్ని మించి క్రొత్తగా నేర్చుకోవాల్సిందేదీ వాటిల్లో నాకు కనిపించలేదు. తెలుగుదేశపు టాస్తికుల కోసం అనువదించదగ్గ కృతి ఏదీ ఆ సాహిత్యంలో నాకు తారసపడలేదు. పోనీ, ఒకటో రెండో అధ్యాయాలు నాస్తికతా ద్యోతకాలై మిగతా రచనంతా మానవప్రేమ గుఱించే అయితే పెద్దగా సమస్య లేదు. నిరభ్యంతరంగా అనువదించవచ్చు. మొత్తం పుస్తకమే దేని పట్లనో నిరసనే అయితే దాన్ని మానవతావాద కృతిగా భావించడం సాధ్యం కాదు కదా?

మానవప్రేమతో పొత్తు కుదరని, దానికి అడ్డుపడే అనేక విషయాల మీద సాంప్రదాయిక (ఐరోపేయ) మానవతావాదులకి ఇంకా మోహం చావలేదు. ఉదాహరణకి,

- మంచి–చెడుల్నీ, తప్పొప్పుల్నీ గుణించిన నిక్కచ్చి అభిప్రాయాలు (స్థానిక మత ప్రధానవాహిని ప్రభావం)
- హక్కుల మీదా, చట్టాల మీదా, వ్యవస్థల మీదా అచంచల విశ్వాసం (విద్యావంత మధ్యతరగతి వాతావరణం మఱియు ప్రజాస్వామ్యాల సంయుక్త ప్రభావం)
- ప్రచారాల్నీ, ప్రచార సాధనాల్నీ, పోరాటాల్నీ గౌరవించడం (మీడియా ప్రభావం)
- ఓ ప్రత్యేక విజనుష్షు (gender) ని మాత్రమే సమర్థించడం (అలా చేయడం మానవతావాదం అవుతుందనే భ్రమ)

మొదలైనవి. ఇంకా వారిలో మిగిలిపోయిన అశాస్త్రీయ విషయాలు మఱికొన్ని కూడా లేక పోలేదు. ఉదాహరణకి– లైంగికత (sexuality) మానసికమని నమ్మడం ఇత్యాది. ఏతావతా, మానవతావాదుల నుంచి మనం తఱచూ ఆశించే తటస్థ, ఇముడ్చుకోలు వైఖరి (neutral & inclusive outlook) ఐరోపేయ మానవతావాదుల్లో లోపించడం నిరాశా జనకం.

ఐరోపేయులు మానవతావాదాన్ని ఓ ప్రతిచర్యాత్మక తిరుగుబాటుదారీ తత్త్వశాస్త్రం (reactionary rebel philosophy) గా మార్చారు. అంటే ఆ మానవతావాదానికి తనకంటూ నిలబడేందుకు నీడ లేదు. కదిలేందుకు కాళ్ళు లేవు. దానికంటూ ఓ స్వతంత్ర మూర్తిమత్త్వమే లేదు. అది ఓ ప్రతీప పరిభావన (Negative concept). అది హిరణ్యకశిపుడిలా ఎప్పుడూ దేవుణ్ణి ఆడిపోసుకుంటూ బ్రతకాల్సిందే. పేఱోలగం (parliament) లో ప్రతిపక్షంలా దాని అస్తిత్వం యావత్తూ దాని ప్రతిచర్య (reaction) లోనే ఉంది. ఇలాంటి కుంటి, కలహశీల మానవతావాదం పుట్టి శతాబ్దాలవుతున్నా అది ప్రపంచాన్ని బాగుచెయ్యడంలోనూ, మనుషుల్ని మార్చడంలోనూ ఘోరంగా విఫలమైందంటే, అది ఎక్కడైతే పుట్టిందో ఆ ఐరోపా ఖండమే రెండు ప్రపంచయుద్ధాల్ని చూడాల్సి వచ్చిందంటే, అది ఓ ప్రక్క ప్రచారంలో ఉండగానే మఱో ప్రక్క తీవ్రవాదులు కూడా పుట్టుకొస్తున్నారంటే — ఈ పరిణామాలన్నింటిలోనూ పెద్దగా ఆశ్చర్యపోయేదేమీ లేదు.

ఐరోపేయ మేధావుల చేతుల్లో మానవతావాదం అనేది నాస్తికత్వానికి సునామకరణం (euphemism) లా తయారైనట్లు కనిపిస్తోంది. వారి దృష్టాంతంతో జనసామాన్యం సైతం 'మానవతావాది' అనగానే ఖచ్చితంగా నాస్తికుడై ఉంటాడని నిశ్చయించుకుంటున్న పరి



స్థితి. మతమూలాలు ఏవైనప్పటికీ అది ఈనాడు మానవుల యొక్క సున్నితమైన భావోద్వేగ తలానికి (emotional plane) చెందిన రంగం. దాని శాఖోపశాఖలూ, ఊడలూ, వేర్లూ బహు విస్తృతమైనవి. అదీ గాక ఎవఱు ఎందుకోసం మొదలుపెట్టి కొనసాగిస్తున్న దుస్సంప్రదాయమో తెలియదు గానీ మానవతావాద ప్రచారం కోసం మతం మీద దాడి చేయడం పూర్తిగా అనవసరం. దాని బదులు మత సహకారాన్ని కోరడం ఎక్కువ వివేకవంతం.

మఱో పార్శ్వన– మానవతావాదానికీ, నాస్తికత్వానికీ వాస్తవంగా ఏ సంబంధమూ లేదు. ఎందుకంటే క్రియాశీలకమైన, మతంతో పనిలేని మానవజీవితమూ, (ప్రవృత్తి), దాన్నుంచి విరమించుకున్న మతజీవితమూ (నివృత్తి)– ఈ రెండూ మానవుడి తాత్త్విక పయనంలో రెండు మజిలీలకి సంబంధించినవే తప్ప పరస్పర విరుద్ధం కావు. అందుచేత మనలాంటి దేశాల వారికి ఆచార్యస్థానీయులైన ఐరోపేయ మేధావులకి సాదరంగా నమస్కరిస్తూనే వారు మానవతావాదానికిచ్చిన అన్ని నాస్తిక నిర్వచనాల్నీ, భాష్యాల్నీ బుట్టదాఖలు చేయక తప్పదు. అదీ గాక నవ్యమానవతావాదంలో బోధించబడుతున్న అనేక అంశాలు సాంప్రదాయిక మానవతావాదంలో లేవు. అవి వారి కసలు తెలీవు కూడా!

ఐరోపేయ మానవతావాదులు చేసేది మతఖండన మాత్రమే కాదు, మానవతావాదం యొక్క మూలసూత్రాలకి నేరుగా ప్రసక్తం కాని ప్రజాస్వామ్యమూ, జంతువుల హక్కులూ, స్త్రీవాదమూ, లైంగిక అల్పసంఖ్యాకుల (sexual minorities) హక్కులూ, లౌకికవాదమూ, ఉపయోగవాదమూ (Utilitarianism) మొదలైన అనేక ప్రస్తావనల్ని మానవతావాద కార్యావళి (humanist agenda) లో ప్రవేశపెట్టడం కూడా! దీని వల్ల అనవసరమైన ఘర్షణలూ, సంక్లిష్టతా పెచ్చుమీరడం మినహా ప్రయోజనమేమీ లేదు. ఎందుకంటే నిజమైన మానవతావాదులు మానవాళిని ఇలా ఖండఖండాలుగా ప్రేమించరు. సైద్ధాంతిక షరతుల ప్రాతిపదికన అసలు ప్రేమించరు. అలాంటి ఖండప్రేమ (వర్గీయప్రేమ) భావనలతో సరిపుచ్చుకోలేకనే కదా అఖండప్రేమ కోసం మానవతావాదాన్ని ఆశ్రయించినది! విషయాల్ని ఇలా డొంకతిరుగుడు సిద్ధాంతాల దృష్టితో చూడ్డం కన్నా మానవతా వాదపు మూలసూత్రాల కోణంలోంచే విశ్లేషించడమూ, పరిష్కరించడమూ ఎక్కువ సుకరం. అదీ గాక ఈ ప్రస్తావనలు మానవతావాదం యొక్క మౌలిక పరిద్యోతాన్ని (original/primary focus) చెదరగొట్టే ప్రమాదమూ లేకపోలేదు.

మన నవ్యమానవతావాదం మాత్రం విజ్ఞానశాస్త్రాల కంటే కూడా మానవీయ శాస్త్రాల ద్వారానే అధికంగా ప్రభావితమైనటువంటిది. ఇది దైవభావనకి విరుద్ధం కాదు: ఇది దాన్ని సవాలు చేయదు. అలాగని దాని కనుకూలంగా సిఫార్సులు కూడా చేయదు. మానవజాతి యొక్క ఉమ్మడి చారిత్రిక అనుభవా న్ననుసరించి చూసినప్పుడు— మతాలు మారణహోమానికే దారి తీశాయని వాదిస్తే, మఱి నాస్తిక సిద్ధాంతాలు కూడా ఆ విషయంలో తీసిపోయినట్లు కానరాదు. కనుక నవ్యమానతావాదం అలాంటి విషయాల్లో తటస్థీభవిస్తుంది. **వాదాలూ, సిద్ధాంతాలూ దీనికి ముఖ్యం కాదు. మానవులందఱినీ బేషరతుగా ప్రేమించడం మినహా దీనికి మఱో పరిద్యోతం** (focus) **లేదు.** మన కాలపు సమాజం చిరకాలంగా అలవాటుపడ్డ మొఱటు అమానవీయ ఆచరణల దృష్ట్యా వాటి పట్ల ఇది లేవనెత్తే అభ్యంతరాలు పైకి తిరుగుబాటులా కనిపిస్తాయి. కానీ ఇది దేనిమీదా తిరుగుబాటు కాదు. ఇది ప్రేమతో కూడిన ఆలోచనాధార. ఇది ఓ ప్రశాంతమైన బ్రతుకోజె.

నవ్యమానవతావాదం మతవిషయంలో తటస్థమైనా దీన్ని సమీచీనంగా ఆచరించినప్పుడు ఇది ఆధ్యాత్మికతకే దారితీస్తుందని నా అనుకోలు (assumption). దీని చేఱికతో సాధనామార్గాలు మఱింత పరిపుష్టమయ్యే అవకాశముంది. శ్రీమద్రామానుజులు, మహాత్మాగాంధీ వివేకానందస్వామివంటి ఆధ్యాత్మిక మహాపురుషులనేకులు మానవతావాదులే, వారు తమని తాము ఆ పేరుతో పిల్చుకోకపోయినా! అదే విధంగా ఐరోపాలో Erasmus, Jacques వంటి తొల్తటి మానవతావాదులంతా మతవిశ్వాసులే. ఏ కారణానో గానీ పునరుజ్జీవన (Renaissance) కాలం నుంచి మానవతావాదం లౌకికవాదుల చేతుల్లో పడి ఆ పిమ్మట నాస్తికుల సొత్తైంది. కనుక మతవాదులు నవ్యమానవతావాదులు కూడా కావడానికి సంకోచించ నక్కర్లేదు.

నాస్తికత్వం రెండు వైపులా పదునున్న కత్తి. దాన్ని మంచికీ, చెడుకీ సమానంగా వాడుకోవచ్చు. నవ్యమానవతావాదం మాత్రం ఏనాటికీ అలా కాదు. దాన్ని సర్వసమగ్రంగా అర్థం చేసుకుని ఆచరించినప్పుడు దానివల్ల అందఱికీ మేలే తప్ప ఇసుమంతైనా కీడు జఱగడానికి అవకాశం లేదు. మానవతావాదం నాస్తిక-అజ్ఞేయవాదులకు మాత్రమే చెందడాన, ఆ ముద్రాంకణ (branding) దాని వ్యాప్తికీ, మెఱుగుదలకీ వాటిల్లజేసిన నష్టం అపారం, అమేయం. ఎందుకంటే మన సమాజంలో నాస్తికులు ఊనసంఖ్యాకులు (minority).



వారికి తక్కుంగల జనాభాలో విశ్వసనీయతా, ప్రామాణ్యమూ కనిష్ఠం. వారు చెప్పే విషయాల్లో సబబులు చాలా ఉన్నప్పటికీ, వారిని కేవలం సంప్రదాయ విరోధులుగా, వారసత్వ విధ్వంసకులుగా, ఫక్తు తిరుగుబాటరులుగా మాత్రమే భారతదేశపు జనసామాన్యం పరికిస్తుంది.

కానీ ఈ విధమైన అభిదర్శన (perception) సమీచీనం కాకపోవచ్చని నా అభిప్రాయం. నాస్తికులు కూడా వారి పద్ధతిలో వారూ కొన్ని సంప్రదాయాల ప్రేమికులే. అవి ఏంటనేది వారికే ఎఱుక. ఉదాహరణకి, హిందూనాస్తికులు ముస్లిమ్ నాస్తికులతో వియ్యం అందుకోరు. క్రైస్తవ నాస్తికులు వీరిద్దఱితోనూ వియ్యం అందుకోరు. కానీ ఒకఱిలో ఓ అంశం నచ్చకపోతే ఇహ వారిలో మెచ్చుకోదగ్గ మంచి విషయాలు వేఱే ఎన్ని ఉన్నా పట్టించుకోకపోవడం మానవుల బలహీనత. ఆ రకంగా, నాస్తికులకు ప్రీతిపాత్రమైన మానవతావాదానికి ఆస్తికుల మధ్య ప్రాచుర్యం (popularity) లేకుండా పోయింది. తద్వారా పూర్వపు అమానవీయ క్రూరత్వాలు విద్యావంత సమాజంలో సైతం యథాపూర్వంగా కొనసాగుతున్నాయి.

ఈ పరిస్థితి మారాలి. మారాలంటే ఆస్తికులు ఇహనైనా మానవతావాదాన్ని తమదిగా కూడా చేసుకోవాలి. ఈ క్రమంలో మతాలు బోధించిన అంశాల్లో మానవతావిరుద్ధాలేవైనా ఉంటే వాటిని త్రోసిపుచ్చక తప్పదు. మతాల్ని ఆధునికమూ మానవతా పరిపూర్ణమూ చేయాలన్నా ఇది తప్పదు. అంతమాత్రాన ఎవఱూ నాస్తికులైపోరు. మతాలు మనమెఱిగినట్లే మొదట్నుంచీ లేవనీ బహు సహస్రాబ్దుల పయనంలో దురభిజ్ఞంగా మారిపోయాయనే చారిత్రిక సత్యాన్ని గమనంలో ఉంచుకుంటే ఈ త్రోసివేత మఱీ అంత కష్టంగా తోచదు.

## 2. నవ్య మానవతావాదపు టంతిమ లక్ష్యం ఏంటి?

నవ్య మానవతావాదం కేవలం మానవతావాదం కోసమే. ఇది ఏ ఇతర ప్రయోజనం కోసమూ కాదు. ప్రపంచంలో పురుషులు స్త్రీలని ప్రేమించడంలోని అంతరార్థం తమ పురుషత్వాన్ని అనుభూతికి తెచ్చుకోవడమే. స్త్రీలు కూడా పురుషుల్ని ప్రేమించడంలోని అంతరార్థం తమ స్త్రీత్వాన్ని అనుభూతికి తెచ్చుకోవడమే. ధనికులు ప్రతిచిన్న వస్తువు మీదా అధికాధికంగా డబ్బు వెదజల్లడం తమ ధనికత్వాన్ని అనుభూతిల్లడం కోసమే.

అదే విధంగా నవ్యమానవతావాదులు కూడా తోటి మానవుల్ని ప్రేమించడం తమలోని మాన వత్వాన్ని అనుభూతికి తెచ్చుకోవడం కోసమే. ఇందులో లాభనష్టాల ప్రసక్తేమీ లేదు.

ఓ వ్యక్తి మానవతావాదిగా ఉండేది– అలా మినహా మఱో రకంగా ఉండలేక! మఱో రకం గా ఉండడం తన తత్త్వానికి సరిపడక! మానవతావాదిగా జీవించడం వల్ల జీవితంలో ఏమైనా నష్టపోవాల్సి వస్తే నిజమైన మానవతావాదులు (మానవతావాద హృదయాన్ని సవ్యంగా అర్థం చేసుకున్నవారు) అందుకు మనసా-వాచా-కర్మణా సిద్ధపడే ఉంటారు. కేన్సరొస్తుందని సిగరెట్లు మానేవారు లేరు. నేజకాలో, కాలేయమో పాడైపోతాయని త్రాగుడు మానేవారూ లేరు. చెడ్డ విషయాల్ని అలవాటు చేసుకున్నవారికే అంత ధీమా అయితే, మఱి మానవతావాదం లాంటి మంచితత్త్వాన్ని అనుసరించేవారికి ఇంకెంత ఉండాలి?

మానవతావాదిగా ఉండి మనం ఎవర్నీ ఉద్ధరించడం లేదు. మనల్ని మనమే ఉద్ధరించుకుంటున్నాం. మన మనసుల్నే ఆరోగ్యంగా ఉంచుకుంటున్నాం. అవశంగా (మన ప్రమేయమేమీ లేకుండా) పెద్దల నుంచి తరతరాల వారసత్వంగా అందుకున్న అనేక మానసిక రోగాల్నీ, తప్పుడు, అసమాన, అసహన, సంకుచిత ఆలోచనాధోరణుల్నీ ప్రయత్నపూర్వకంగా వదిలించుకుని పరిశుద్ధులమవుతున్నాం. ఇందులో గర్వపడాల్సిందీ, ఆధిక్యత అనుభూతిల్లాల్సిందీ ఏమీ లేదు. మానవీయంగా మెలగుతున్నందుకు మనకి ఎవ్వఱి ప్రశంసలూ, కృతజ్ఞతాభివందనాలు అవసరం లేదు. మానవతావాద ప్రయోజనం అవి కాదు.

మానవతావాదం గుఱించి సమగ్రంగా తెలీకపోయినా, పరిసరాల్లోని మానవ జీవితం పట్ల ఆసక్తి పెంచుకున్నవారు దాన్ని మెఱుగుపఱచడానికి కృషి చేశారు, ఇంకా చేస్తూ ఉన్నారు. ఆ ఆసక్తి లేనివారు కూడా ఆ కృషి ద్వారా లాభపడుతున్నారు. అలాగే మానవుడి అవసరాలేంటో కనిపెట్టి అవి తీర్చే ప్రయత్నం (వాణిజ్యపరంగా) చేసినవారు కుబేరులవుతున్నారు. అంటే మానవతావాదాన్ని ఏ కాస్త ఆచరణాత్మకంగా అవలంబించినా బ్రహ్మాండమైన శుభోదర్కాలు కనిపిస్తున్నాయి సంఘజీవితంలోనూ, వ్యక్తిజీవితంలో కూడా!

ఈ విధంగా, వ్యక్తుల్లోని మానవతావాద ధోరణుల వల్ల విశాల సమాజానికి దీర్ఘ భవిష్యత్తులో వివిధ అవాంతర ప్రయోజనాలు (incidental benefits) ఒనగూడవచ్చు. ఐనా వాటితో మానవతావాదులకి సంబంధం లేదు. ఎందుకంటే వారు మానవతావాదాన్ని అవ



లంబించేది సమాజం కోసం కాదు. దాన్ని బాగుచేయడం కోసమూ కాదు. దాని ఆమోదం కోసం అంతకంటే కాదు. తమ మానవీయత తమ తృప్తి కోసం. అంతే! ఎందుకంటే సమాజం మూకుమ్మడిగా బాగుపడేది కల్ల, ఎవఱైనా వ్యక్తిగతంగా బాగుపడాల్సిందే. దాన్నలా అమాంతం బాగుచేసిపారేసే ప్రయత్నం నిజమైన మానవతావాదులు చెయ్యరు. ఇందుకు విరుద్ధంగా– ఒకవేళ వివిధ అంశాలపై మానవతావాదులు ప్రదర్శించే వైఖరి ఇతరులకి ఆమోదయోగ్యం కాకపోతే, లేదా అది వారికి అర్థం కాకపోతే, అంతమాత్రాన వారా వైఖరిని మార్చుకునే ప్రసక్తి కూడా లేదు. మానవతావాదానికి మొట్టమొదటీ మఱియూ కట్టకడపటీ శ్రద్ధాస్థానం విడివ్యక్తులు మాత్రమే. వారిలో వచ్చే మార్పుతోనే మానవతావాదులు తృప్తిపడతారు.

## 3. వివిధ సైద్ధాంతిక భావజాలాలు మానవతావాదమేనా?

మానవజాతిలో ఏకదేశానికి అంకితమై తమదీ మానవతావాదమేనని చెప్పుకునే ప్రయోజన గుంపులూ (interest groups), సైద్ధాంతిక సంపర్క జాలాలూ (ideology networks) సమకాలీనంగా తామరతంపరగా ఉన్నాయి. ఇది తార్కికంగా పొసగదని గమనించాలి. అది స్వీయవర్గవాదమే (sectarianism) తప్ప మానవతావాదం కాదు. వారు మానవతావాద సూత్రాల్ని తమ సిద్ధాంతాల సమర్థన, వ్యాప్తి కోసం అరువు తీసుకుంటున్నారే తప్ప తమ అభిమానవర్గానికి చెందని ఇతరుల పట్ల వారికి ఏ విధమైన సహానుభావమూ ఉన్నట్లు కనిపించదు. నిజానికి ఆయా సిద్ధాంతాల్లో మానవతావాద విరుద్ధమైన అంశాలెన్నో కనిపిస్తాయి. కనుక ఇది మానవతావాద స్ఫూర్తిని హైజాక్ చేయాలనే ప్రయత్నం కూడా కావచ్చు.

ప్రతి సిద్ధాంతంలోనూ ఎంతో కొంత మంచి లేకపోదు. కానీ ఆ కాస్త మాత్రమే చూపించి మిగతాదంతా కుతర్కంతో నింపి కుత్సితమైన ద్వేషాన్ని బోధించే సిద్ధాంతాలు 20 వ శతాబ్దం లగాయితు చాలా తయారయ్యాయి. అవి ఇంకా నిక్షేపంలా కొనసాగుతున్నాయి కూడా. కారణం– వివిధ సైద్ధాంతిక భావజాలాల్లోని మంచి-చెడుల చర్చ ప్రజలకి అవసరం లేదు. వారికది చేతా కాదు. ఆయా భావజాలాలవారు తమకి మిగిల్చిన అనుభూతుల్నీ, అనుభవాల్ని బట్టే ప్రజలు వాటి మంచి-చెడుల్ని ధర్మిస్తారు.

ప్రతి సామాజిక-ఆర్థిక-రాజకీయ సిద్ధాంతంలోనూ ప్రాజ్ నిర్ణీత శత్రువులు (pre-determined enemies) ఉంటారు. వారు తమ జోలికి పెద్దగా రాకపోయినా ఈ సిద్ధాంత వాదులు వారి పేరుతో తమని తామే గిచ్చుకుని నిత్యదుఃఖితులుగా ఉంటారు. సదరు శత్రు నామకుల్ని (so-called enemies) తప్పుపట్టే అవకాశానికై సదా కాచుకుని ఉంటారు. ఆ రకంగా తమ నిష్కారణ మానవద్వేషానికి సంతృప్తికరంగా కనిపించగల కారణాల్ని (నెపాల్ని) కృత్రిమంగా ఉత్పత్తి చేసే పనిలో నిమగ్నమై ఉంటారు. శత్రువుల్ని వ్యతిరేకించే పేరుతో, ఆ ప్రక్రియలో సిద్ధాంతవాదులు తమ శత్రువుల్లాగే తయారవుతారు. లేదా ఇంకా విష మించిపోతారు. తామిదివఱకు ఏ శత్రుపద్ధతులనైతే వ్యతిరేకించారో వాటినే ఆప్యాయంగా కౌగలించుకునే స్థాయికి దిగజాఱిపోతారు.

మానవతాసూత్రాల్ని అవలంబించడానికీ, దాని లక్ష్యాల్ని సాధించడానికీ అనుసరించే మార్గం కూడా మానవీయంగానే ఉండాలి. తమదీ ఓ మానవతావాదపు పాఠాంతరమే (a version of humanism) నని బుకాయించే సైద్ధాంతిక శ్రేణులు ఈ అగ్నిపరీక్షలో తఱచుగా విఫలమవుతాయి. ఎందుకంటే వాటి కార్యకలాపాలన్నీ అసత్యాల్నీ, అర్ధసత్యాల్నీ, అతిశయోక్తుల్నీ ప్రాపుగా చేసుకుని జనంలో ప్రతీప భావోద్వేగాల్ని (negative emotions) ఎగసన ద్రోయడమే ధ్యేయంగా నడుస్తూంటాయి. వాటికి వాస్తవంగా కావాల్సింది శత్రుత్వాల్ని పరిష్కరించుకోవడం గానీ శత్రుభావనల్ని జయించడం గానీ తద్ద్వారా శాంతిని స్థాపించడం గానీ కాదు. శత్రువుల మీద చారిత్రికంగా పగ సాధించడం. వారిని భౌతికంగా నిర్మూలించడం. ఆ తరవాత కూడా ఆ శత్రుత్వాల్ని సూత్రప్రాయంగా నిరవధికంగా కొనసాగిస్తూనే ఉండడం.

**మానవతావాదం ఇతర సైద్ధాంతిక భావజాలాల పాత్రని తీసుకోగలదా? (కేవలం మానవతావాదంతోనే అన్ని సమస్యలూ, అందఱి సమస్యలూ తీఱిపోతాయా?)**

సైద్ధాంతిక భావజాలాలని చెప్పబడుతున్నవన్నీ వాస్తవంగా వాటి అంతరాళం (core) లో వర్గీయభావ జాలాలే. ఇవి ఉత్పన్నం కావడానికి గల కారణం గుఱించి ఇదివఱకే చెప్పడ-



మైనది.[1] అంతా వర్గీయ భావజాలాలనే నమ్మే వాతావరణం మధ్య మానవతావాదం కూడా అన్ని వాదాలతో పాటు ఓ వాదమై కూర్చుంటుంది మినహా అది సమస్యల్ని పరిష్కరించ జాలదు (పరిష్కరించే అవకాశం దానికెవఱూ ఇవ్వరు). సామాజికులంతా వివిధ వర్గాలుగా విడిపోయి పరస్పరం కత్తులు నూఱుకుంటూ కుట్రలు పన్నుతున్నప్పుడు ఎవఱో ఒకఱు, లేదా ఏదో ఒక చిన్న గుంపు మాత్రం మానవతావాదం ప్రకారం పోవడమంటే అది ఆత్మహత్యాసదృశంగా కాన వస్తుంది.

రెండో సమస్య ఏంటంటే- మానవతావాదులు అందఱినీ ప్రేమిస్తారు. కానీ వర్గాలుగా చీలి చిద్రుపలైపోయిన ఛిన్నాభిన్న సమాజానికి ఇలాంటి విశ్వజనీన ప్రేమ (universal love) అవసరం లేదు. దీని మీద అది భరోసా పెట్టుకోజాలదు. పైగా మన సమాజంలో చారిత్రికంగా గాయపడ్డ అహాల (bruised egoes) తో కుమిలిపోతున్న వర్గాలు అధికం. వారిలో ఓ గణనీయ శాతం మంది ఏదో తెలీని సామూహిక ప్రతిచర్యావాంఛతో కుతకుతలాడిపోతున్నట్లు కూడా కనిపిస్తుంది! ఓ వర్గంగా తామంటే ఏంటో అందఱికీ నిరూపించి చూపాలనే తహతహ ఈ తరహా వాంఛ లక్షణం. ఈ తీఱని కోరిక తీఱిన కోరిక అయ్యే దాకా వారు మానవతావాదంలోకి అడుగుపెట్టలేరు. ఇలాంటి కోరికలు తీఱాలంటే "అందఱితో పాటు మేమూ" అనే తత్త్వం ఉపకరించదు. కాబట్టి వారు ఓ వర్గంగా తమనీ, తమ అవసరాల్నీ, ఆకాంక్షల్నీ అర్థం చేసుకునే నాయకత్వం కావాలని అపేక్షిస్తారు. తమ వర్గానికంటూ ప్రత్యేకంగా కార్యాచరణనీ, వ్యూహాన్నీ అభిలషిస్తారు.

ఉన్న పరిస్థితుల్లో ఈ అభిలాషని తప్పుపట్టలేం. నవ్యమానవతావాదం వర్గీయ గుర్తింపులకి వ్యతిరేకం కాదు గనక వర్గాల పరంగా వేయబడే సూక్ష్మ ప్రణాళికల (micro-plans) కి కూడా వ్యతిరేకం కాదు. నవ్యమానవతావాద భావనలు సమాజంలో విస్తృతామోదానికి నోచుకునే దాకా ఆయా వర్గాల సేవలో వర్గీయ సంస్థలు ప్రస్తుతం పోషిస్తున్న అద్వితీయ పాత్రని నవ్యమానవతావాదులు అందిపుచ్చుకోవడం సాధ్యం కాదు. అంత విస్తృత సంపర్క జాలం గానీ, వనరులు గానీ (network or resources) ప్రస్తుతం వారికి లేవు.

[1] చూ. మొదటి అధ్యాయంలో *(ఈ) నవ్యమానవతావాదం మఱో ఇజమా?* అనే ఉపశీర్షిక.

"ఆ సిద్ధాంతం, ఈ సిద్ధాంత"మని కాదు. సామాజికులందఱూ కలిసికట్టుగా ఏ సిద్ధాంతాన్ని నమ్మి ఆచరించినా అది మేలే చేస్తుంది, అది వాస్తవంగా ఎంత కుంటిదైనా కానివ్వండి! అలా కాక, ఒకే చోట కొందఱు ఒకటీ, మఱికొందఱు ఇంకొకటీ నమ్మితేనే సమస్యలు మొదలయ్యేది. లోకంలోని సిద్ధాంతాలన్నిటి విజయరహస్యమూ వాటి సత్యస్థితిలో కాక వాటి అవలంబుల సమైక్యంలో ఉంది. అందుకే వాటిని నమ్మే ఛాందసులు నమ్మనివారందఱినీ నిర్మూలించడం. కాబట్టే "సిద్ధాంతాల్లో ఏమీ లేదు. అంతా వ్యక్తుల్లోనే ఉం"దని మానవతావాదులు ఉద్ఘోషిస్తారు.

## 4. మతాలు మానవతావాదమేనా ?

కొందఱు, మానవతావాదం క్రొత్తవిషయమేమీ కాదనీ, తమ మతం పెక్కు శతాబ్దాల క్రితమే మానవతావాద సూత్రాల్ని బోధించిందనీ చెబుతూ, అందుకు ఉపబలకంగా తమ పవిత్రగ్రంథాల్లోంచి సుభాషితాల్నీ, ఉపాఖ్యానాల్నీ ఉదాహరిస్తారు. మతాల్లో మానవతావాదం లేకపోలేదు. కానీ అది కేవలం బీజప్రాయమైనది (rudimentary). ఆదిమ శైశవావస్థకి చెందినది. అంత ప్రౌఢంగా వికసించనటువంటిది. మతాల్లో దాన్ని గుఱించిన నిర్దేశాలు తంతిసందేశాల (telegraphic messages) లా అత్యంత సంక్షిప్తమైనవి. అవి అన్ని మతనిర్దేశాల మాదిరే యథామామూలుగా పుణ్యప్రలోభాలతోనూ నిర్బంధాలతోనూ భయపెట్టడాలతోనూ పూర్తిగా పెడదారి పట్టినటువంటివి.

ఉదాహరణకి, భర్తని పూజించడం, పెద్దల్ని గౌరవించడం, దానాలూ, అతిథిపూజ. వీటన్నింటిలో మానసికంగా బలవంతం చేసే ధోరణి చాలా కనిపిస్తుంది. తన పరిస్థితుల్ని బట్టి వీటిని చేయడానికీ, మానడానికీ మనిషికి స్వేచ్ఛ ఇవ్వబడలేదు. కానీ మానవతావాద చింతనచక్రం యావత్తూ స్వేచ్ఛ అనే ఇరుసు మీదే తిరుగుతుంది. మనిషి స్వేచ్ఛగా ఉండడమంటే చెడిపోవడంగానే భావించారు పూర్వీకులు. మనిషి నీతిమంతుడిగా ఉండాలంటే బాహ్య నియంత్రణ ఒకటుండాలనీ. భయంతో తప్ప మఱో రకంగా మనిషి మంచిగా ప్రవర్తించలేడని వారనుకున్నారు. కానీ అదే సమయంలో ప్రొద్దస్తమానం నీతులు చెబుతూ ఇతరుల్ని అదుపులో పెట్టే పైవారు మాత్రం ఏ రకంగా నీతిమంతులో, మఱి వారి స్వేచ్ఛా, ధైర్య



మూ వారిని ఎందుకు పాడుచేయవో సోపపత్తికంగా వివరించలేకపోయారు. పైపెచ్చు, కాలక్రమేణా ఓ దశలో పై నిర్దేశాల ఆధారంగా జనంలో తమని తాము సరిదిద్దుకోవడానికి ప్రాధాన్యం తగ్గిపోయి వాటి పేరుతో నచ్చని వారిని తప్పుపట్టడానికీ, నలుగుఱిలో బద్నాం/బ్లాక్ మెయిల్ చేయడానికీ, వెలివేయడానికే అవి ఉపయోగపడడం మొదలైంది.

పైగా దేవుడితో/మోక్షంతో మానవుడి సంబంధం మీదే మతాలన్నిటి ఊనికా (emphasis) తప్ప మనిషికీ, మనిషికీ మధ్య ఉండాల్సిన సత్సంబంధాల సమస్య వాటికంతగా ప్రసక్తం కాదు. మానవ సంబంధాల గుఱించి ప్రస్తావించిన సందర్భాల్లో సైతం అవి తఱచూ పెద్దల అధికారాల్నే తప్ప ఇతరుల విషయం పట్టించుకున్న దాఖలాలు లేవు. పవిత్రగ్రంథాల్లో అన్ని నీతులూ చిన్నవారికే చెప్పడం సర్వసాధారణంగా కనిపిస్తుంది. పెద్దల్ని పిన్నలు శిరసావహిస్తే చాలు, ఇహ సంఘంలో అంతా సర్దుకుంటుందనే భ్రమ వాటిల్లో ప్రచురం.

మతాలు "దేవుడికీ, మోక్షానికీ సంబంధించినవి" అని స్థూలంగా అర్థం చేసుకోబడుతున్నప్పటికీ నిజానికి ఏ మతమూ అందుకు పరిమితమైన దాఖలా లేదు. ప్రతిమతమూ సాధనతోనూ, ఆత్మపరిశుద్ధితోనూ సంబంధం లేని అనేక లౌకిక విషయాల్లో వ్రేలు పెడుతున్నట్లు కనిపిస్తోంది. అవి శోభనం నుంచీ పరిపాలన దాకా కొన్ని వందలుగా, వేలుగా ఉన్నాయి. ఇవి ఆచారాల పేరుతో, మతగుర్తింపుల (religious identities) పేరుతో చెలామణి అవుతున్నాయి. ఈ మార్గంలో అవీ, వాటి ప్రచారకులూ పూర్తిగా అపఖ్యాతిపాలై ఉన్నారు. ఇవన్నీ కూడా– లౌకిక జీవితానికి మిక్కిలి మమత్వంతో అంటిపెట్టుకున్నవారిలో "తామింకా దేవుడికి దగ్గఱగానే ఉన్నా"మనే భ్రాంతిని పెంచి పోషించడానికి తప్ప ఇహ దేనికీ ఉపయోగపడడం లేదు.

అహింసని బోధించేవాటితో సహా ఏ మతానికీ మానవప్రేమని బోధించడం ప్రధానలక్ష్యం కాదు. అందుకే అహింసాధర్మ దేశాలు కూడా హింసకీ, దురాక్రమణలకీ పాల్పడుతున్నాయి. మనిషినొక్కణ్ణీ మినహాయించి అన్ని జీవుల్నీ భక్షిస్తున్నాయి. అహింసక వర్గాలు కూడా మోసపూరిత వ్యాపారాలు చేస్తున్నాయి. మతం అని పేరుపెట్టాక అన్ని ఆదర్శాలకీ పట్టే గతి అది. ఎందుకంటే తమ మతగుర్తింపుని జనం స్వీకరిస్తే చాలు, అంతటితో మతాలు సంతోషపడతాయి. వారు నిజంగా మతబోధల కనుగుణంగా మారారో లేదో వాటికక్కఱ్లేదు. "మా మతస్థులు ఇంతమంది ఉన్నా"రని చెప్పుకోగలిగితే చాలు.

మతాల్లో మానవతావాదం సర్వసమగ్రంగా చెప్పబడిందనే ఊహ మతవాదులలో నెలకొనడానికీ, ప్రత్యేకంగా తమకి మానవతావాదంతో పనిలేదని వారు అభిప్రాయపడడానికీ కారణం– ఆయా మతాల ప్రామాణిక గురువుల జీవితం అనుష్ఠానరీత్యా మానవతావాదాన్ని పోలి ఉండడం. తమ ప్రామాణిక గురువుల మానవతావాదాన్ని ప్రశంసించే మతానుయాయులు తమ జీవితాల్లోనూ, మతప్రచారంలోనూ మాత్రం వారి జీవనశైలిని పూర్తిగా అనుసరించకపోవడం గమనార్హం. ఆ గురువులు పరమపదించిన తదుపరి వీరు యథాపూర్వంగా అస్తిగోపన (conservative) పద్ధతుల్లోకి జాఱిపోతున్నారు.

పూర్వ మతగురువుల జ్ఞాపకాల్ని బట్టి జనసామాన్యం సైతం “నిష్ఠాగరిష్ఠులైన మతానుయాయులు ఖచ్చితంగా మానవతావాదులు కూడా అయ్యుంటా”రనే భావనలో ఉంటారు. అలా కాదని ఏదైనా ఒక సంఘటన ద్వారా తెలియవస్తే వారినో, వారు అనుసరిస్తున్న మతాన్నో డంబాచారం (hypocrisy) అనీ, వారు ఇంతకాలం నటించారనీ దూషించడం వినిపిస్తుంది. అలా దూషించనక్కఱలేదు. వారు నిజమైన, నిజాయితీ గల మతానుష్ఠాతలే కావచ్చు. కానీ మతాల్లో మానవతావాదం సమగ్రంగా చెప్పబడనందువల్ల వారు దాన్ని ఆచరించలేకపోతున్నారంతే! మన మతగ్రంథాలు మానవతావాదాన్ని జనసామాన్యానికి నిత్యనైమిత్తిక అనుష్ఠానంలో ఓ అవిభాజ్య అంగంగా, దానికి పూర్వార్హతగా నిర్దేశించి ఉండలేదని గమనించాలి. అందుచేత ఒకడు గొప్ప భక్తుడూ, యుగపత్తు (simultaneous) గా గొప్ప లంచగొండి కూడా కావచ్చు. అలాగే ఒకడు గొప్ప వేదాంతి, అదే సమయంలో వ్యసనపరుడు కూడా కావచ్చు. మతదృష్ట్యా వైరుధ్యమేమీ లేదు.

కాబట్టి మతానుసరణకీ, మానవతావాది కావడానికీ బాదరాయణ సంబంధమేమీ లేదు. ఓ వ్యక్తి మతావలంబీ, ఆస్తికుడూ కాకపోవచ్చు. కానీ అదే సమయంలో అతను గొప్ప మానవతావాదై ఉండొచ్చు. దీనికి విపర్యస్తంగా నేనింతకు ముందు ఏవైనా వ్రాసి ఉంటే వాటిని ఉపసంహరించుకుంటున్నాను.

ఏతావతా, మతాలు ఏయే విషయాల్లో కలగజేసుకుని ఖచ్చితమైన ఆదేశ, నిర్దేశాలిచ్చాయో ఆ విషయాల్లో మన సమాజం ఇప్పటికీ గట్టిగా ఉక్కుపిడికిలి బిగించే ఉంది. ఉదాహరణకు, కామవాంఛ మనిషికి పరమశత్రువు, ఘోరదుర్లక్షణం, మహా హానికరం, నీచనికృష్టం, అసహ్యమంటూ మతాలు ఊదరగొట్టేశాయి. ఆ బోధ సమాజంలో నరనరాలా ప్రాకిపోయింది.



మఱోప్రక్క అత్యాచారాలకి పాల్పడే కొందఱి మూలాన, ‘ఆ బోధ నిజమే’ నన్న అభిప్రాయం జనంలో దృఢపడింది. కామం కూడా అన్ని ఇతర సాధనాల్లాంటిదేననీ, దాని మంచీచెడూ దాన్ని ఉపయోగించుకోవడాన్ని బట్టి ఉంటాయనీ గమనించలేకపోయారు. కానీ అదే అభినివేశంతో ఏయే విషయాలనైతే మతాలు పట్టించుకోలేదో ఆ విషయాల్లో మాత్రం సమాజపు నడత చాలా హీనస్థాయిలో ఉంది. ఉదాహరణకు, లంచాలు పుచ్చుకోవద్దని మన మతం గట్టిగా శాసించలేదు కనుక దేశమంతటా లంచగొండులే తయారయ్యారు. ఎవఱికి నచ్చినా నచ్చకపోయినా మతానికి సమాజం మీదున్న పట్టు అంత బిగుతు.

గమనిస్తే– ఆయుష్యపూర్వార్ధంలో విషయాసక్త జీవితాన్ని గడిపి తదనంతర దశలో ఆధ్యాత్మిక బాట పట్టిన అనేకులు తోటిమానవుల పట్ల ఒక రకమైన విసుగుదలతో అలా మారడం కనిపిస్తుంది. అంటే మన స్వధర్మాభిముఖ్యంలో దైవప్రేమ కంటే మానవద్వేషపు వాటాయే పెద్దదన్న మాట.

మతావలంబులు తమ మతగ్రంథాల్లోని సుభాషితాల్ని అన్ని అంశాల మీదా, ప్రశ్నలమీదా తుది తీర్పులుగా భావిస్తారు. అవి యావన్మానవ జీవిత కార్యకాలాపాల పరిధినీ చుట్టబెడతాయని వారనుకుంటారు. పవిత్రగ్రంథాలు మారడానికి అవకాశం లేదనీ, ఎందుకంటే అవి సాక్షాత్తూ భగవంతుడే ప్రసాదించినవనీ, మనుషుల్లాగా ఆయన తఱచూ మాట మార్చడనీ వారు చెప్తారు.

ఇది పూర్తివాస్తవం కాదని చెప్పే సాహసం చేస్తున్నందుకు మన్నించాలి. ఎందుకంటే, జాగ్రత్తగా గమనిస్తే, మతాలు ప్రతి కొన్ని శతాబ్దాలకీ మారుతూనే ఉన్నాయి. మతగ్రంథాల మధ్యలో ప్రక్షిప్తాలు విఱివిగా చొఱబడుతూనే ఉన్నాయి. వాటికి వినూత్నభాష్యాలూ, సరిక్రొత్త అనుబంధ పొత్తాలూ/ప్రకరణ గ్రంథాలూ బయల్దేఱుతూనే ఉన్నాయి. వాటికి తోడు అంతకు ముందు లేని క్రొత్త మతగ్రంథాల్ని సృష్టించి అవి కూడా చాలా ప్రాచీనమని ప్రచారించడం కూడా కనిపిస్తోంది. మఱో ప్రక్క ఓ మతంలో నిషేధించిన ఓ ఆచారాన్నో, విశ్వాసాన్నో దాని అవలంబులు కొంతమంది పాటిస్తూండగా కొంతమంది తీఱిక చేయడం కూడా కనిపిస్తోంది.

చారిత్రికంగా చూసినప్పుడు, భగవద్భావనా, తప్పొప్పుల విచక్షణా అత్యంత ప్రాచీనమైన

ప్పటికీ మానవజాతి పుడుతూనే మతమనే కవచకుండలాలతో పుట్టినది కాదని తేల్తుంది. కనుక **మతగ్రంథాలన్నీ ఇటీవలివే.** అవి ఉద్భవించక ముందు అవంటే ఏంటో తెలియకుండా ఈ భూమండలం మీద పుట్టిపెఱిగి నడయాడి గతించిన వేలాది మానవసమూహాల్ని 'దైవద్రోహులు' అనలేం. నాగరికతతో పాటే మతం కూడా క్రమక్రమంగా ఎదగబాఱుతూ (evolve అవుతూ) వచ్చింది.

“మఱెందుకని పూర్వీకులు అవి సాక్షాత్తూ దైవదత్తమేనని చెప్పారు?” అనడిగితే, అలా చెబితే తప్ప తత్కాలీనులకి అర్థమయ్యే పరిస్థితి కాదు. వారు వినిపించుకునేవారు కారు. నూటికి 99 మంది నిరక్షరాస్యులే అయిన సమాజాల్లో పుస్తకాల్లోని మాటలు ఎవఱికి తెలుస్తాయి? వాటికి విలువిచ్చేదెవఱు? అసలేమీ తెలియనివాళ్ళకి ఏమని చెప్పి ఒప్పించాలి? అందుకని అలా చెప్పక తప్పింది కాదు. మతగ్రంథాలనే కాదు, ఆ రోజుల్లో పరిపాలనా, మందులూ, న్యాయస్థాన తీర్పులతో సహా ప్రతీదీ దేవుడి పేరిటే చెలామణి చేసేవారు. ఓ రకంగా సంఘమే దేవుడి పేరుతో చెలామణి అయ్యేది. నిజానికి ఈరోజు కూడా ఎక్కువమంది దేవుడి పేరు బెట్టి ఆరాధించేదీ, విధేయత చూపేదీ సంఘానికే! దాని కనుగుణంగా లేకపోతే మనిషి పాపాత్ముడి క్రిందో నాస్తికుడి క్రిందో జమ. మతగ్రంథాల విలువైనా సంఘాని కనుగుణంగా ఉన్నంతవఱకే. ఉదాహరణకి, మనుధర్మశాస్త్రంలో మేనఱికాన్ని నిరసించారు. పట్టించుకున్న దెవఱు?

ఇహపోతే భగవంతుడు తన నిర్ణయాలు మార్చుకోడనే వాదన. అలా అయినట్లయితే మతావలంబులు అది కావాలనీ, ఇది కావాలనీ ఆయన్ని రోజూ ఎందుకు ప్రార్థిస్తున్నారు? ఆయన ఏం చేస్తే దానికి తలొగ్గి అనుభవించవచ్చు గదా? సర్వశక్తిమంతుడైనవాడు మారకుండా ఉండడం అసాధ్యం. భక్తుల ప్రార్థనల్ని బట్టి తన నిర్ణయాల్ని మార్చుకోవడం ఇష్టం లేకపోతే ఆయన అహంకారీ, క్రూరుడూ అనాల్సి వస్తుంది. ఇష్టమున్నా మారలేకపోతే మన బోటి సామాన్యజీవుల్లా అస్వతంత్రుడేననాల్సి వస్తుంది. కానీ ఆయన ఆ మూడూ కాదంటున్నాయి కదా పవిత్రగ్రంథాలు! మఱి ఆయనే మారుతున్నప్పుడు మానవకల్పిత మతగ్రంథాలూ, వాటి అవలంబులూ మారడాని కభ్యంతరం ఏముంది ?

మతానుష్ఠానం నీతికీ, మానవత్వానికీ హామీ (guarantee) కాదనే వివేకం మన సమా



జంలో ఈనాటికీ లేదు. మనుషులకి మతం గుఱించి నేర్పి “ఇహ వారిని బాగుచేయడం పూర్తయింది” అనుకుంటారిక్కడ. అనుదిన అనుభవంలోకి వచ్చే విషయమేంటంటే, మనుషులు మతావలంబులూ, దైవభక్తులూ అయినంత మాత్రాన వారు పరపీడాకారులు కాకుండా మానడం లేదు. వారిలో స్వార్థాహంకారాలేమీ చావడం లేదు. దైవభక్తీ, ఆస్తిక విశ్వాసమూ మనుషుల్ని మంచిగా మార్చలేకపోతున్నాయి. పైపెచ్చు సాక్షాత్తుగా దేవుణ్ణే తమ స్వార్థ ప్రయోజనాల కోసం వాడుకునే ధోరణి ప్రబలుతోంది. ఉదాహరణకి– ఓ దుష్కార్యాన్ని ఆశీర్వదించమని మ్రొక్కేవారూ, తమకి అడ్డొచ్చినవారు సర్వనాశనమవ్వాలని సంకల్పం చెప్పుకునేవారూ– ఇట్లాంటివారితో పొంగిపొర్లుతున్నాయి మన భక్తసమాజాలు. కాబట్టి మనం నిజంగా బాగుపడాలంటే ప్రాతమతాలూ, వాటి మార్గదర్శనమూ ఎంతమాత్రం చాలవనేది సుస్పష్టం. సరిక్రొత్త మానవతావాదపు శస్త్రచికిత్స తప్పదు.

నిజానికి మతానుష్ఠానం పేరుతో మత–వీరాభిమానమే బోధించబడుతోంది. మతాలు ప్రమాదంలో పడ్డాయనీ, వాటిని కాపాడాలనే ఆదుర్దాని సదరు వీరాభిమానులు వ్యక్తం చేయడం కద్దు. మతాల్లో సత్యమే ఉంటే వాటిని ఒకఱు పనిగట్టుకుని కాపాడాల్సిన అవసరముందా? సత్యస్వరూపాలైనవి, ఆ సత్యం వ్యక్తమయ్యే భాష ఏదైనా, దాన్ని సూచించే ఆచారం ఏదైనా యుగాంతం దాకా అందఱికీ ఒకేలా స్ఫురణకొస్తూనే ఉంటాయి కాదా? అలా కాక, మతం పేరుతో కాపాడదలచుకున్నది కేవలం ఓ సంస్కృతినే అయితే ప్రతి సంస్కృతీ ఓ ప్రత్యేక భూభాగంలో నివాసం మూలాన ఉనికిలోకొచ్చినదే కదా? నివాసస్థలం మారగానే అక్కడి వాతావరణాన్ని బట్టి సంస్కృతి మారిపోతుంది. అంటే ఇక్కడ మనం కాపాడాల్సినది సంస్కృతినా? దానికి మూలమైన వాతావరణాన్నా?

ఇలాంటి దారి తప్పిన ప్రేమతత్త్వాలు మనిషిలోని మానవత్వాన్ని హతమారుస్తాయి. ఇవి అందమైన విషపూవులు. కనిపించని దేవుడితో మనకి ఏ సమస్యలూ లేవనీ, అన్ని సమస్యలూ కట్టెదుట కనిపిస్తున్న మానవులతోనే ననీ, ముందు ఆ మానవులతో సఖ్యాన్ని సాధించడం ద్వారానే అవి పరిష్కారమవుతాయనే ఇంగితం ఇప్పటికీ మనలో కలగలేదు. ప్రార్థనలతో దేవుణ్ణి మార్చే ప్రయత్నం చేసే కన్నా ముందు మనం మారడం ఎక్కువ ప్రయోజనకరమని ఎవఱూ గుర్తించడం లేదు.

సంప్రదాయం, మతావలంబన పేరుతో మనుషులు ఎక్కువగా లైంగిక సంబంధాల బాగో

గుల్ని గుఱించి మినహా ఇంకే విషయమూ ఆలోచిస్తున్నట్లు కనిపించదు. తత్త్వచింతన కన్నా "ఎవఱు ఎవఱితో పోతున్నారు?" అనేదే వారి సావధానాన్ని పూర్తికాలం వ్యాపృతం చేసే చర్చనీయాంశంలా కనిపిస్తోంది. ఈ విధంగా మనుషులు ఓ ప్రక్క మతాల్ని పట్టుకు ప్రేలాడుతూనే మఱో ప్రక్క మతలక్ష్యాలకి విరుద్ధంగా సుదూరంగా జఱిగిపోతున్నట్లు తోస్తుంది.

మన సమాజంలో ఎవఱికీ మానవతావాదపు Education లేక మనలోని అహంకారాలూ, స్వార్థాలూ, సంకుచితత్వాలూ మతవిశ్వాసాలనే ఓ కొంగ్రొత్త ముసుగు వేసుకుని మనచేత పవిత్రమైన పాపాలు చేయిస్తున్నాయి. ఎవఱికో హాని జఱగాలని హోమాలు చేయడం. లక్ష్మీ కటాక్షం కోసమో, వాస్తుదోషాలు పోవాలనో మనుషుల్ని బలివ్వడం. ఇతరుల్ని మొఱటుగా నిర్దాక్షిణ్యంగా త్రోసేస్తూ త్రొక్కేసుకుంటూ వెళ్ళి దైవదర్శనం చేసుకోవడం. తాము దేవుళ్ళమంటూ భర్తలు భార్యల్ని చావగొట్టడం. అదే వంకతో కాంచరులు (parents) పిల్లల్ని చావగొట్టడం. పండగో, పబ్బమో జఱుపుకుంటున్నామనే పేరు బెట్టి భయంకరమైన కాలుష్యాన్ని సృష్టించడం. ఈ రూపేణ మానవత్వం లోపించిన మన మతానుష్ఠానం– భోజనం లేని ఔషధ సేవనంలా బహు ప్రాణాంతకంగా పరిణమించింది.

ప్రతివారికీ మతం అవసరం లేదని గుర్తించే రోజు రావాలి. మన సమస్యలకి పరిష్కారం పరలోకంలో లేదు. ఇహలోకంలోనే ఉంది. అది మనల్ని మనం మార్చుకుంటేనే సాధ్యమవుతుంది. మతం అందఱికీ అర్థమయ్యే, అందఱూ శీఘ్రంగా ప్రగతి సాధించగల సబ్జెక్టు కాదు. కానీ ప్రతి ఒక్కఱికీ మానవతావాదంతో అవసరముంది, అవసరమొస్తుంది, వారు స్వయంగా మానవతావాదులు కాకపోయినా! సరళమైన నవ్యమానవతావాదం అందఱికీ అనుష్ఠాన సులభమైనది. మతంగా ముద్రపడ్డ బోధల్లో ఆధునిక మానవతావాదాన్ని అన్వేషించే ప్రయత్నం పెద్దగా విజయవంతం కాదు. దాని బదులు మనుషులు తమ పురుషకారంతో ఈ జన్మలోనే ఇక్కడే తప్పకుండా సాధ్యమయ్యే మానవీయ లక్షణాల పెంపుపై మొదట శ్రద్ధపెడితే మంచిది. **నిత్య జీవితంలో మానవతావాద సూత్రాల్ని అవలంబించకుండా పూజగదిలో మతానుష్ఠానం చేయడం కేవలం నిష్ప్రయోజనం.**

స్వేచ్ఛా, స్వతంత్రాలోచనా, వ్యక్తిప్రాధాన్యమూ మానవతావాదానికి ప్రాణం లాంటివి. కానీ ఈ మూడూ ప్రాతమతాలకి (మతగ్రంథాలకి) సమ్మతమైనట్లు కనిపించదు. ఎందుకంటే



తొలుదొల్తటి ఋషులు (earliest saints) పుస్తకాలు వ్రాసినప్పుడు "మానవ జీవితాన్ని ఇలా గడుపుకోవాలి. అలా గడుపుకోవాలి" అని వందలాది శ్లోకాలు వ్రాశారు. వాటిల్లో పళ్ళు తోముకోవడం, స్నానం చేయడం, బహిర్భూమికి వెళ్ళడం లాంటి అత్యంత ప్రాథమిక విషయాలు కూడా ఉన్నాయి. శీతాకాలంలో సైతం స్నానం మానరాదని ప్రబోధిస్తూ ప్రత్యేక పురాణాలే వ్రాయబడ్డాయి. కానీ ఆధునిక ఋషులెవరూ అంతెక్కువ మాట్లాడడానికి ఇష్టపడలేదు. కారణం బహుశా, మనిషికున్నట్లే మానవజాతికీ ఓ బాల్యం ఉంది. ఆ బాల్యదశలో ప్రతీ విషయంలోనూ అతని చేయి పట్టుకు నడిపించేవారు అవసరమయ్యారు. అలాంటిది ఈ కాలానికి అక్ఖర్లేదనీ, ఎవఱికి వారు ఆలోచించుకోవాలనీ అధునిక ఋషుల భావం కావచ్చు.

**నవ్యమానవతావాదం విశ్వాసాల్ని ఏల ఖండించదు?** ఈ పుస్తకాన్ని చదివే సాంప్రదాయిక మానవతావాదులు పలువుఱిలో ఈ సందేహం పొటమరించవచ్చు. విశ్వాసాల్ని పూర్తి తర్క–జ్ఞానదృష్టితో అర్థం చేసుకోవడం మూలాన ఏర్పడ్డ కర్కశ దృక్పథం నుంచి పొటమరించే ప్రశ్నలివి. ప్రపంచంలోని అనేక కండూతుల మాదిరే తర్క–జ్ఞానకండూతి సైతం బహు వర్జనీయమని ఇంతకు ముందే ఈ పుస్తకంలో చెప్పుకోవడమైనది[1]. విశ్వాసాలకి అనేక సూక్ష్మపార్శ్వాలున్నాయి. వాటికో మానవీయ కోణం కూడా ఉంది. వాటిని అర్థం చేసుకోవడానికి తిరస్కరించడం, అందుకోసం ప్రయత్నించకపోవడం, ఖండిస్తూ పోవడం, ఆ ప్రక్రియలో సంపూర్ణ నాస్తికదర్శనంగా పేరుమోయడం— ఇలాంటి కారణాల మూలానే సంప్రదాయ మానవతావాదం సర్వజనామోదాన్ని పడయలేకపోయింది.

**మొదటి విషయం**- విశ్వాసాలన్నీ ప్రాథమికంగా వ్యక్తిగతమైనవి. వ్యక్తుల్ని (తోటి మనుషుల్ని) మనం బేషరతుగా ప్రేమించాలన్నప్పుడు వారి విశ్వాసాల మీద మనకి విశ్వాసం లేకపోయినా మన జ్ఞానం ఆధారంగా వారిని బాధించకుండా నడుచుకోవడం మానవతావాదిననుకున్న ప్రతివారికీ విధ్యుక్తధర్మం. ఈ విశ్వాసాల్లో హింసాత్మకాల్ని మాత్రమే మనం ఖండించాలి. తద్భిన్నంగా వాటి చరిత్ర శోధించి వాటికి భవిష్య దూరాన్వయాలు తీసి వక్రభాష్యాలు చెప్పడం సరికాదు.

[1] చూ. 7 వ మానవతాసూత్రం (*నిర్జీవ వస్తువుల్నీ.... ఇత్యాది*) క్రింద.

**రెండో విషయం**- విశ్వాసాలు యావన్ మానవ జీవిత పరిధినీ, మానవ మనస్తత్త్వాన్నీ ఆస్తరించుకున్నటువంటివి. కేవలం మతవిశ్వాసాలనే విశ్వాసాలనుకోవడం సమీచీనం కాదు. అనేక లౌకిక విశ్వాసాలతో సైతం మనుషులు జీవిస్తున్నారు. మతవిశ్వాసాల మాదిరే వీటిల్లో కూడా దేనికీ ఓ తార్కిక ప్రాతిపదిక గానీ పూర్వోదాహరణ (precedent) గానీ లేదు. ఉదాహరణకి– ఫీట్లు చేసేవారు "ఈసారి కూడా తాము పడిపోము" అనే నమ్మకం తోనే అవి చేస్తూంటారు. రైలెక్కే ప్రతివారూ "ఈ బండికి దారిలో ప్రమాదం జఱగదు" అనే నమ్మకంతోనే ఎక్కుతారు. తమ డబ్బు పదిలమనే నమ్మకంతోనే జనం బ్యాంకుల్లో ఇల్లడాలు (deposits) ఉంచుతారు. ఉగ్రవాదులు దాడులు చేయరనే నమ్మకంతోనే జనం రోడ్లమీద తిరుగుతున్నారు. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా ఉంది.

**మూడో విషయం**- ప్రతి జ్ఞానమూ సామూహికం కావాల్సిన అవసరం లేదనేది మానవీయ జ్ఞానశాస్త్ర (Humanist Epistemology) సూత్రం. ఎందుకంటే జ్ఞానాలు రకరకాలుగా ఉంటాయి. సామూహికంగా అనుభవించదగ్గ, లేదా సరిచూడదగ్గ (verifiable) సమాచారాల్ని మాత్రమే జ్ఞానంగా పరిగణించడం ఈ దర్శనానికి ఆమోదయోగ్యం కాదు. ఉదాహరణకి ఒకటికి పులుపు పడదనే విషయం అతనికి మాత్రమే తెలుసు. ఊళ్లో ఉన్న వారందఱికీ అది తెలిసే అవకాశం లేదు. ఆ అవసరమూ లేదు. అందులోని సత్యాసత్యాల్ని వారు చూడలేరు. పరీక్షించలేరు కూడా! ఎందుకంటే అది అతని వ్యక్తిగత అనుభవం. కనుక వ్యక్తిస్థాయిలో ఏదైతే ప్రత్యక్ష జ్ఞానమవుతుందో అదే సామూహికస్థాయిలో విడ్డూరమో, విశ్వాసమో కావచ్చు. అంతమాత్రాన అలాంటివాటిని త్రోసిపుచ్చడం తగదు. అంతే కాక మానవతావాదంలో సమూహాల కన్నా వ్యక్తికే ప్రాధాన్యం కనుక అటువంటి వ్యక్తిగత అనుభవాలకీ, జ్ఞానాలకీ ఈ దర్శనం ప్రయోగాత్మకమైన, పరిశోధనాత్మకమైన విలువ నిస్తుంది.

**నాలుగో విషయం**- మన అవగాహనని బట్టి సృష్టి నడవదు. అంటే దాంట్లోని ప్రక్రియల్ని మనం వ్యాఖ్యానించుకుంటున్న పద్ధతి ఎలా ఉన్నా, వాటి అంతిమ పర్యవసానమే ముఖ్యమవుతుంది. అదే జ్ఞానంగా పనికొస్తుంది. ఉదాహరణకి– ఒక ఓషధి తీసుకుంటే ఒక నలత నయమవుతున్నదనుకోండి. ఆ ఓషధిలోని ఏయే పదార్థాలు శరీరంలోని ఏయే భాగాల మీద ఎలా పనిచేసి రోగం నయమవుతోంది? అనే విషయం మనకి అర్థం కాకపోయినా పెద్దగా



తేడా ఏమీ ఉండదు. ఆ ఓషధిలో అమృతముందని ఒకడు అనొచ్చు. కాదు, దేవతలే దిగొచ్చి నాటారని ఇంకొకడు అనొచ్చు. ఈ విధమైన వేఱువేఱు అవగాహనలతో నిమిత్తం లేకుండా అది తన పని తాను చేసుకు పోతుంది. కాబట్టి కొన్నికొన్ని విశ్వాసాల మూలాన నష్టమేదో జఱుగుతుందని సంప్రదాయ మానవతావాదులు లేవనెత్తే వివాదం అన్నివేళలా అర్థవంతం కాదు.

**ఐదో విషయం**- విశ్వాసాల ద్వారా ఆశించబడే పరిష్కారాన్ని లౌకికశాస్త్రాలు ఇవ్వజూపినప్పుడల్లా జనం విశ్వాసాల్ని విడిచిపెడుతూనే ఉన్నారు. ఉదాహరణకి– మశూచిలాంటివాటికి మందు కనుక్కున్నాక జనం అటువంటి రోగాల్ని అమ్మవారుగా భావించడం మానేశారు. ఏతద్విపర్యాసంగా– వేటికైతే లౌకిక శాస్త్రాలు పరిష్కారాన్ని చూపలేకపోతున్నాయో అలాంటి వాటి విషయంలో జనం ఇప్పటికీ విశ్వాసాలనే ఆశ్రయిస్తున్నారు. వారిక్కావాల్సినది వారికి సమకూర్చలేనప్పుడు వారి విశ్వాసాల్ని ఆక్షేపించే అధికారం ఎవఱికీ లేదు.

## 5. హక్కులు మానవతావాదానికి ప్రత్యామ్నాయమా ?

మానవతావాదానికి ప్రత్యామ్నాయాన్ని ఇప్పటిదాకా ఎవఱూ కనుక్కోలేదు. ఈ రోజుల్లో ప్రతి సిద్ధాంతానికి సంబంధించిన వాదులూ తమ తమ వాదాలకు ప్రభుత్వ గుర్తింపు కావాలనీ, చట్టాల్లో వాటికి స్థానం ఉండాలనీ, కొండొకచో తమ సిద్ధాంతాల్నీ, సూత్రీకరణల్నే చట్టాలుగా రూపొందించాలనీ, తద్వారా అవి ఆధికారికం (official) అవ్వాలనీ, వాటిని అందఱి నెత్తినా బలవంతంగా రుద్దాలనీ కోరుతున్నారు. గతంలో పలు ప్రభుత్వాలు ప్రపంచవ్యాప్తంగా ఇటువంటి పొఱపాట్లు చేయడం మూలాన ఆ పూర్వోదాహరణల్ని బట్టి ఆ సంప్రదాయాన్నే ఇప్పుడూ కొనసాగించాలంటూ ప్రయోజన గుంపులు (interest groups) పెడుతున్న ఒత్తిడిని అవి ఎదుర్కుంటున్నాయి.

ఆయా సిద్ధాంతవాదులు మానవాళిలో ఏయే ప్రత్యేక వర్గాలకి ప్రాతినిధ్యం వహిస్తున్నారో ఆయా వర్గాలకి అనుకూలంగానూ, ఇతరులకి వ్యతిరేకంగానూ అనేక చట్టాలూ, వర్గీయ హక్కులూ అమల్లోకొచ్చాయి. కులం, మతం, విజనుష్ఠ, ప్రాంతం, ఆర్థికవర్గం, బాంధవ్యం

ఇత్యాది వింగడింపులతో ఈ వర్గాలు రకరకాలుగా ఉంటాయి. ఉన్న వర్గాలు సరిపోవను కుంటే ఎవరైనా ఇంకేదో అపూర్వ ప్రాతిపదికన ఓ వినూత్న వర్గాన్ని కూడా సృష్టించవచ్చు. ఆ రకంగా స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ ఇప్పటి దాకా ప్రతి పదేళ్ళకీ ఓ సరిక్రొత్త వర్గావళి చట్టాల్లోకి ఎక్కుతూండడాన్ని మనం గమనించవచ్చు. ఇలా చేసేశాక ఆయా వర్గాలు ఆయా గుర్తింపులతోనే సృష్ట్యాది నుంచీ ఉన్నట్లు ప్రసంగించడం కూడా మొదలవుతోంది.

జనం అనుకుంటున్నంత సానుకూల కోణం (positive angle) హక్కులకి లేదని చెప్పే సాహసం చేస్తున్నందుకు మన్నించాలి. ఈ రోజుల్లో 'హక్కులు' అనే ఈ పదం దుర్వినియోగ మవుతున్న విధంగా ఏ ఇతర పదమూ కావడం లేదు. ఇవి లేనప్పుడు కూడా మానవజాతి ఉంది, లక్షణంగా మనగలిగింది కూడా నని జ్ఞాపకం చేసుకోవాల్సి ఉంది, కనుక ఇవి లేకపోతే మనమేదో అయిపోతామనడం సరికాదు. మనమందఱమూ మనుగడ సాగిస్తున్నది హక్కులుండడం వల్ల కాదు. మనకి కొన్ని హక్కులున్నాయని తెలుసుకుని మనం పుట్టలేదు. పుట్టిపెఱిగాకే అలాంటివి ఉన్నాయని తెలుసుకున్నాం. మనం వాస్తవంగా మనుగడ సాగిస్తున్నది కొన్ని ప్రత్యయాల (convictions) వల్ల ! (మనలోనూ ఇతరుల్లోనూ). ఆ ప్రత్యయాల్లో మానవత్వానికి సంబంధించినవి కూడా భాగం కావడం వల్ల! ఉదాహరణకి – మనం రాదారి నిబంధనల (traffic rules) ని నమ్మి పాటిస్తున్నామనీ, మనలాగే ఇతరులు కూడా నమ్మి పాటిస్తారనే నమ్మకంతో మనం రోడ్లమీద ధైర్యంగా వెళుతున్నాం. కానీ అనూహ్యంగా అలాంటి ప్రత్యయాల్ని ఎవరైనా దెబ్బదీస్తే, లేదా అలా దెబ్బదీస్తారనే ఆందోళనా, అభద్రతాభావమూ మనలో ఉంటే అందుకు విఱుగుడుగా హక్కులు అవసరమవుతున్నాయి. అంటే హక్కులనేవి తమ మూలతత్త్వంలో ప్రతిచర్యాత్మక పరిభావన (reactionary concept) అన్నమాట.

రాజ్యం గుర్తించిన ప్రత్యయాల కన్నా ఎన్నో రెట్లు ఎక్కువ సంఖ్యలో అవి మనలో గూడుకట్టుకుని ఉంటాయి. ప్రతి ప్రత్యయానికీ ఒక ప్రత్యేక హక్కూ, దానికో చట్టమూ, వాటిని అమలు జఱిపే ప్రత్యేక వ్యవస్థానూ. అలాగే ప్రతిరోజూ ఎవఱో ఒకఱికి ఏదో ఒక క్రొత్త అభద్రతా భావం పుట్టుకొస్తుంది. ప్రతి అభద్రతాభావానికీ ఓ క్రొత్త హక్కూ, మళ్ళీ దానికో క్రొత్త చట్టం. ఈ కథకి అంతెక్కడ? అందుకే మానవతావాదం ప్రాథమికంగా హక్కుల గుఱించి కాదని గమనించాలి. వాటికి రాజ్యపు టామోదముద్ర పడడం గుఱించి అసలే కాదు.



అంటే హక్కులు లేవని కాదు. అవి ఉండకూడదనీ కాదు. ఎందుకంటే, హక్కులంటే అవసరాలే. మఱేమీ కాదు. అవసరాలున్నంతకాలం హక్కులు కూడా ఉంటాయి, రాజ్యం గుర్తించినా గుర్తించకపోయినా! హక్కులు లేకుండా అవసరాలు తీఱడం అసంభవం. ఐతే ఆ అవసరాలు అందఱివీ అయ్యుండాలి. లేదా ఇతరులకున్న ప్రత్యేక అవసరాలతో పోలిక గలిగినవైనా అయ్యుండాలి. అవి సహజమై ఉండాలి. అంతే తప్ప త్రాగుడు, ఇతరుల్ని కొట్టడం, పోలీసులచేత కొట్టించడం, కేసులు పెట్టడం, ఇతరుల ఆస్తుల కోసం, కష్టార్జితాల కోసం డిమాండు చేయడం–ఇలాంటివి సహజమైన విషయాలూ కావు. అత్యవసరాలూ కావు. కనుక ఇవి సహజహక్కులు కూడా కావు. కాకూడదు.

హక్కుల వాడకం ఐచ్ఛికం (optional) కూడా అయి ఉండాలి. అంటే వాటిని వాడుకోవడానికీ, వాడుకోకపోవడానికీ కూడా వ్యక్తికి స్వేచ్ఛ ఉండాలి. "హక్కులంటే అవసరాలు" అన్నప్పుడు, ఆ హక్కుతో పాటు ఎవఱి అవసరాల్ని వారే తీర్చుకోవడం వారి బాధ్యత కూడా. అంతే తప్ప "నా అవసరాన్ని నువ్వు తీర్చాలి. నా హక్కుని నువ్వు నిలబెట్టాలి. అది నీ బాధ్యత. నేను మాత్రం తేరగా తిని పడుకుంటా" నని డిమాండు చేస్తే, ఆ విధంగా చట్టాలు వ్రాస్తే అది ఇతరుల హక్కుల్ని హరించడమవుతుంది. అప్పుడు మనకి మొదటి తరగతి పౌరులూ, రెండో తరగతి పౌరులూ అని రెండు రకాల ప్రజలు తయారవుతారు. కనుక అలాంటి పరపీడన హక్కుల్నీ, పరదోపిడీ హక్కుల్ని ఎవఱికీ ఇవ్వకూడదు, కుటుంబసభ్యులకైనా సరే! కానీ మన దేశంలో మొదట్నుంచీ జఱుగుతున్నది ఇదే.

హక్కులకున్న రెండో పార్శ్వాన్ని కూలంకషంగా అవగతం చేసుకున్నవారెవఱూ వాటికోసం పట్టుపట్టరు. రాజ్యగుర్తింపు పొందిన (State-recognised) హక్కులు–

- మనుషులు తోటిమనుషులతో మానవీయంగా మెలగాల్సిన అవసరాన్ని,
- ఔదార్యమూ, క్షమాగుణమూ ప్రదర్శించాల్సిన అవసరాన్ని
- ఓ తర్కానికో, ఇంగితజ్ఞానానికో తలవంచాల్సిన అవసరాన్ని,
- ఓ ఆత్మపరిశీలన చేసుకోవాల్సిన అవసరాన్ని,
- ఓ చర్చలో పాల్గొనే అవసరాన్ని
- సందర్భాన్ని బట్టి వివేకంతో సర్దుకు పోవాల్సిన అవసరాన్ని

ఏకమొత్తంగా రద్దుచేస్తాయి. వారు పరస్పరం ఒద్దికతో ఒకఱి మీద ఒకఱు ఆధారపడి సామ

రస్యంగా బ్రతికే సౌమ్యవాతావరణాన్ని అవి చెఱుస్తాయి. ఉదాహరణకి, ఓ వ్యక్తి యొక్క ఆస్తిలో ఇతరులకి హక్కులు కల్పిస్తే అతనేమో వారి ప్రేమనీ, సేవనీ పొందే హక్కుని పోగొట్టుకుంటాడు. ప్రేమ పంచకపోయినా, సేవ చేయకపోయినా చట్టప్రకారం అతని ఆస్తి తమకు సంక్రమించాల్సిందేనన్న భరోసాలో ఉన్న వారు, మనిషిగా అతనికి ఇవ్వాల్సిన కనీస మర్యాదా-మన్ననలు కూడా ఇవ్వకుండా అతన్ని నిర్లక్ష్యం చేస్తారు. కాబట్టి ఒకటికి ఓ ప్రాతిపదికన ప్రత్యేక హక్కులు కల్పించడమంటే, ఆ ప్రాతిపదికకి చెందనివారి హక్కుల్లో ఆ మేరకి కోత విధించడమే అవుతుంది. అంతే కాక, లోకంలో సుమారుగా హక్కులన్నింటికీ ఉన్న సర్వసామాన్యలక్షణం, వాటి నెఱవేర్పు నిమిత్తం ఇతరుల మీద భారాన్ని మోపడం. ఇదో తరహా న్యాయాభాస.[1]

అప్పుడు, “వర్గీయ హక్కులన్నీ అన్యాయమేనా ?” అనే ప్రశ్న తలెత్తుతుంది. ఏ హక్కులూ స్వతహాగా అన్యాయం కావు. కానీ వాటిల్లో డబ్బువ్యవహారాలూ, చట్టాలూ, నానాగుంపులూ, ఇజాలూ, వృత్తినిపుణులూ (professionals) ప్రవేశించాక పూర్తి అన్యాయమై కూర్చుంటాయి. ఈ ప్రక్రియని ఆపే మార్గం లేదు. మనుషుల్ని వ్యక్తులుగా కాక వర్గాలుగా చూసి జాలిపడడం చేత ఉనికిలోకొచ్చినవి వర్గీయ హక్కులు. వారి ఇబ్బందుల్ని మానవతాసూత్రాల ఉల్లంఘన వల్ల చోటుచేసుకుంటున్న పరిణామంగా కాక, వారు ఫలానా వర్గానికి చెందడం వల్లనే కలుగుతున్నాయనే భ్రాంతిలో ప్రసాదించినవి అవి. అంతే కాదు, వారి ఇబ్బందుల్ని వారి పరిస్థితుల పర్యవసానాలుగా చూడకుండా, వాటిల్లో లేని వర్గీయ సరళి (sectarian pattern) ని అభిదర్శించడం చేతా, వారిని ఏ వర్గస్థులుగా గుర్తిస్తామో ఆ వర్గస్థులందఱికీ ఆ ఇబ్బందుల్ని మూకుమ్మడిగా ఆపాదించడం చేతా అమల్లోకి వచ్చినవి అవి.

ఇది సరికాదు. వ్యక్తుల్ని వ్యక్తులుగానే చూసి జాలిపడాలి. వ్యక్తుల్ని వ్యక్తులుగానే బాగు చెయ్యాలి. వ్యక్తుల్ని వ్యక్తులుగానే సత్కరించాలి. వ్యక్తుల్ని వ్యక్తులుగానే తప్పుపట్టాలి. వ్యక్తుల్ని వర్గాలుగా చూసి జాలిపడడం, వ్యక్తుల్లో వర్గాల్ని అభిదర్శించడం, ఎవఱి వ్యక్తిగత సంకల్పమూ లేకుండా యాదృచ్ఛికంగా ఏర్పడ్డ పరిస్థితుల్ని వ్యక్తుల సృష్టిగానో, వర్గాల సృష్టిగానో

[1] న్యాయంలా కనపడుతూ జఱిగే అన్యాయం.



పొఱపడడం— ఇదంతా పూర్తి అశాస్త్రీయం. కారణం — ఓ వ్యక్తి యుగపత్తుగా అనేక వర్గాలకి చెంది ఉండొచ్చు. ప్రస్తుతం అమల్లో ఉన్న చట్టాల ననుసరించి ఒక వ్యక్తి ఒకానొక వర్గీయ గుర్తింపు ప్రకారం సంభావ్య పీడితుడు (probable oppressed) అవుతాడు. మఱో వర్గీయ గుర్తింపు ప్రకారం మళ్ళీ అతనే సంభావ్య పీడాకారుడు (probable oppressor) కూడా అవుతాడు. ఉదాహరణకి, ఓ వ్యక్తి కొన్ని చట్టాల ప్రకారం దళితుడిగా పీడితవర్గానికి చెందినవాడైతే, మళ్ళీ అదే వ్యక్తి మఱికొన్ని చట్టాల ప్రకారం భర్తగా పీడాకార వర్గానికి చెందినవాడవుతాడు. మఱి ఈ వర్గీయ గుర్తింపులకున్న తర్కబద్ధత ఏమిటి? వీటిని ప్రాతిపదికగా చేసుకొని హక్కులూ, చట్టాలూ ఏర్పఱచడం ఎంతవఱకూ సమంజసం?

హక్కులనేవి ఆదర్శభావాల ఫలితం. ఆదర్శాల్ని ఆదర్శాలుగా, ఆశింపుల్ని (expectations) ఆశింపులుగానే ఉంచాలి. అంతే తప్ప ప్రతి ఆదర్శాన్నీ, ఆశింపునీ చట్టబద్ధం చేయబూనుకోవడం మానవత్వం కాదు. ఉదాహరణకి, వార్షిక పరీక్షల్లో డిస్టింక్షన్ రావడం ఓ ఆదర్శం, లేదా ఆశింపు. ఐతే ప్రతివారికీ డిస్టింక్షన్ వచ్చితీఱాలని నిబంధన విధిస్తే చాలా మంది ఆత్మహత్య చేసుకోవాల్సిన దురవస్థ తలెత్తుతుంది.

**వర్గీయ హక్కులనేవి ఎక్కువ సందర్భాల్లో పిచ్చివారి చేతుల్లో ఱాళ్లు :-** హక్కులకీ, రాజకీయ అధికారానికీ ప్రాథమికంగా తేడా లేదు. ఎందుకంటే బలప్రయోగం ద్వారా అమలు కావడంలో రెండూ సమానమే. కానీ నవ్యమానవతావాదం మానవుల మధ్య పరస్పర అవగాహననే తప్ప ఏ విషయంలోనూ బలప్రయోగాన్ని ఆమోదించదు. ఒక రకంగా హక్కుల కన్నా రాజకీయాధికారమే ప్రశస్తతరమేమో కూడా! Power corrupts and absolute power corrupts absolutely అనే సూక్తి ఉంది. “**అధికారం మనిషిని చెడగొడుతుంది. పరిపూర్ణాధికారం పరిపూర్ణంగా చెడగొడుతుంది**” అని దాని భావం. హక్కులనేవి ఇలాంటి పరిపూర్ణాధికారం క్రిందికొస్తాయి.

- ➢ రాజకీయాధికారం పరిపూర్ణాధికారం కాదు. ఎందుకంటే రాజకీయాధికారం కావాలంటే ఎన్నికల్లో పోటీ చేయాలి. ఆ అధికారాన్ని దుర్వినియోగం చేస్తే తదుపరి ఎన్నికల్లో దించేస్తారు. హక్కులకి అలా అవసరం లేదు. ఎంతమంది ఎన్నిసార్లు ఎన్ని దశాబ్దాల పాటు తమ హక్కుల్ని దుర్వినియోగం చేసినా అవి నిరాఘాటంగా కొనసాగుతాయి.

- ఒకఱు ఓ ప్రాతిపదిక (category) కి చెందినవారన్న కారణం చేత దేని మీదో హక్కు ప్రకటించుకుంటూ ఎవఱికో వ్యతిరేకంగా న్యాయస్థానాన్ని ఆశ్రయించవచ్చు. కానీ రాజకీయాధికారం కోసం ఎవఱూ న్యాయస్థానాన్ని ఆశ్రయించ జాలరు.
- అధికారానికి కాలపరిమితి ఉందేమో గానీ హక్కులకి లేదు.

ఏతావతా రాజ్యం గుర్తించిన వర్గీయ హక్కులు ఆయా వర్గాలకి తరతరాలకి వ్రాసిచ్చిన నిశ్శుల్క అగ్రహారాల్లాంటివి. అధికారం, దాన్ని కష్టపడి సంపాదించగల కొద్దిమందినే చెడగొట్టగా, అందఱికీ తేరగా వచ్చిపడ్డ హక్కులు ప్రతి ఒక్కఱినీ వక్రమార్గం పట్టిస్తాయి.

దేశ రాజ్యాంగాల్లో హక్కుల్ని మాత్రమే పొందుపఱచడం వల్ల నష్టముంది. హక్కుల్ని రద్దు చేసి విధుల్ని మాత్రమే పొందుపఱిచినా ప్రజలకి హాని జఱగదు. పైపెచ్చు హక్కుల విచ్చలవిడి అనుభవనం ద్వారా తలెత్తుతున్న తలనొప్పులన్నీ తీఱిపోతాయి. ఎందుకంటే విధుల్లోనే హక్కులు కూడా అంతర్లీనంగా ఇమిడుంటాయి. కానీ ఇందుకు విపర్యయం (vice versa) గా ఉండదు. ఉదాహరణకి, "పిల్లల్ని పోషించడం తల్లిదండ్రుల బాధ్యత" అని చట్టం చేస్తే అందులోనే పిల్లల హక్కులూ, "స్త్రీలు కూడా ఉద్యోగం చేయొచ్చు"ననే అనుమతీ అన్యాపదేశంగా ఇమిడుంటాయి. అలాగే "పత్రికల్లో దేశానికి అనుకూలంగానే వ్రాయా"లని చట్టం చేస్తే అందులోనే "పత్రికలు పెట్టుకుని నడుపుకోవచ్చు"ననే అనుమతి కూడా నిశ్శబ్దంగా ఇమిడుంటుంది.

## 6. మన దేశంలో మానవతావాద భవిష్యత్తు ఎలా ఉండబోతోంది?

**నేడు మన ప్రతి భౌతిక, మానసిక తలాన్నీ సంకుచిత గుంపులు ఆక్రమించేసుకున్నాయి :-** మేధావులు పూనుకొని తక్షణం ఏదో ఒకటి చేయకపోతే, భావిదృశ్యం అంధకార బంధురంగా అగమ్యగోచరంగా దర్శనమిస్తోంది. చట్టాల కంటే, వ్యవస్థల కంటే, సంస్థల కంటే, కుల–మతాల కంటే, విజనుష్షు కంటే విడివ్యక్తే ముఖ్యమని చెప్పే మానవతావాదాన్ని వ్యవస్థలూ, పార్టీలూ, వాటి తోకసంస్థలూ, ప్రయోజన గుంపులూ నిరసన భావంతో పరికిస్తాయి. నవ్యమానవతావాదంలో ఇంకా అదనంగా చేర్చదగ్గ అంశాలున్నాయేమో గానీ ఉన్నవాటికి మినహాయింపులైతే లేవు. ఎవరైనా స్వీయవర్గాభిమానాలతో వాటికి వక్రభాష్యాలిచ్చి మినహా



యింపులు కోరితే అది నిజమైన మానవతావాదుల లక్షణం కాదు.

మానవతాసూత్రాల్ని వాస్తవ జీవితంలో అమలుజఱపడానికి పూనుకుంటే ఆయా గుంపుల యథార్థవైఖరులు బహిర్గతమవుతాయి. వారిలో ప్రతి ఒక్కఱూ స్వీయ సైద్ధాంతిక కార్యావళి (ideological agenda) ఎడల తమకున్న వల్లమాలిన ఆభిముఖ్యం హేతువుగా, తమదైన మానసిక వైఖరిలోంచి మానవతావాదులకి రకరకాల బిరుదులు తగిలించే ఆస్కారం ఉందని కూడా గమనించాలి. ఎలా తిట్టించుకున్నా మానవతావాదులు చలించకూడదు. ఒకదాని ఉపయోగం తెలియనంతకాలం మనుషులు అలాగే ప్రవర్తిస్తారు. ప్రపంచంలో ఎక్కువమంది బలం వారి మూర్ఖత్వమే. బ్రిటీషువారి కాలంలో వారు దేశమంతా టెలిగ్రాఫ్ తీగల్ని అల్లుతూంటే, వారి మీది ద్వేషభావంతో భారతీయులు, *"అవి మా కుత్తుకలకి ఉరి బిగించే తీగలు"* అని నిందించారు. కానీ ఆ తరువాత అవి వద్దన్నదెవఱు ?

మనుషులకు ఏదో ఒక వెఱ్ఱిమొఱ్ఱి చిల్లఱ సమస్య మీద గొడవ పడడంలో ఉన్న ఆనందం తోటి మనుషుల్ని ప్రేమించడంలో లేకపోవడం దీనంతటికీ ఓ ప్రధాన కారణం. సమస్యల్లో ఇరుక్కున్నప్పుడు అందఱికీ మానవతావాదుల చేయూత కావాలి. ఎందుకంటే ఏ సంకుచితాలూ లేకుండా, సైద్ధాంతిక వైరుద్ధ్యాల్ని సైతం మనసులో పెట్టుకోకుండా సహాయం చేసేది వారొక్కఱే. కానీ మామూలుగా అయితే వారివారి వర్గీయ పక్షపాతాలకి సహకరించరనే కారణాన మానవతావాదులు మిగతావారందఱికీ అప్రకటిత శత్రువులు. అందఱూ వారి మీదే దాడి చేస్తారు.

ఇప్పుడిప్పుడే నాగరికతనీ, ఆలోచననీ కొద్దికొద్దిగా అలవఱచుకుంటున్న మనలాంటి దేశంలో మానవతావాదంలాంటి సువిశాల భావజాలం పుంజుకోవాలంటే అందుకింకా ఎన్నో దశాబ్దాలు పట్టవచ్చు. ఇక్కడ మనుషులంతా తమ తమ కులాలతోనూ, మతాలతోనూ, శాఖలతోనూ పీకల్లోతు ప్రేమలో కూరుకుపోయి ఉన్నారు. కొందఱు తమ ప్రాంతాలతోనూ, ఎక్కువమంది తమ విజనుష్షు (gender) తోనూ ప్రేమలో పడిపోయి ఉన్నారు. తోటి మనుషుల మీద దయచూపడం మానేసి, ఎంతసేపూ తమ మీదే తాము జాలిపడిపోతూ తమ అభిమానవర్గం కోసం ప్రత్యేక చట్టాలూ, ప్రత్యేక వ్యవస్థలూ కావాలని డిమాండ్లు లేవనెత్తుతున్నారు. అత్యధిక సంఖ్యాకులైన మిగతా సామాజికులు డబ్బు సంపాదించుకోవడం గుఱించి తప్ప ఇహ దేని గుఱించి ఒక్క క్షణమైనా కేటాయించలేని పరిస్థితిలో ఉన్నారు. మన నాయ

కత్వం బాహాటంగా ఇదంతా ప్రోత్సహిస్తోంది.

మన దేశంలో ఆంగ్లేయుల నిష్క్రమణానంతరం సృష్టించబడ్డ అసమాన, అశాంతిమయ సమాజం యావత్తూ, మానవతావాదాన్ని విచక్షణారహితంగా త్రోసిపుచ్చడం మూలాన ఉనికి లోకి వచ్చినదే. మన దేశపు వోట్-బ్యాంకు చట్టాలు మానవతాసూత్రాల్ని బహిరం గంగా ఉల్లంఘించే విషయంలో ఇసుమంతైనా సంకోచమూ, బిడియమూ ఎఱగనివి. గడి చిన దశాబ్దాలలో ప్రైవేట్/పబ్లిక్ మీడియా ద్వారా కొన్ని పురోఽభిప్రాయాలు (prejudices) వ్యాప్తిలోకి తేబడ్డాయి. వాటి వెన్నుదన్నుతో మానవతావ్యతిరేకమైన కట్టళ్ళు కొనసాగు తున్నాయి. అందుచేత ప్రస్తుత పరిస్థితులు ఎలా ఉన్నాయంటే— నిజంగా మానవతావాదా నికి నిబద్ధులైనవారు తర్కానికి పూర్తిగా విడాకులిచ్చిన ఈ మూర్ఖత్వానికీ అస్తవ్యస్తతకీ జడిసి పారిపోయేలా!

**నియంత్రణోన్మాదుల దేశం** (A Nation of Control freaks) :- దురదృష్టవశాత్తూ మన దేశం నిండా ఏదో ఒక విధమైన ఆధిపత్యం లేదా అదుపు కోసం అంగలారుస్తున్న నియంత్రణోన్మాదుల (control freaks) జనాభాయే ఉంది. ఇందులో ఆడా-మగా, చిన్నా-పెద్దా, పేదా-గొప్పా, ఆ కులం-ఈ కులం, ఆ వృత్తి-ఈ వృత్తి అనే తేడా కనిపిం చదు. ఇక్కడ ప్రతివారికీ ఇతరుల జీవితాలపై నియంత్రణ (control) కావాలి. మామూలు నియంత్రణ కాదు, సర్వంకషమైన నియంత్రణ కావాలి. ఇతరులు తమ ఆస్తిగా మిగిలిపో వాలి. తాము ఇతరుల్ని సర్వదా సర్వేసర్వత్రా శాసించగలగాలి. తోటి మనుషుల మీదా, పరి మీదా వీరికి ఉడుంపట్టు కావాలి. భల్లూకపట్టు కావాలి. ఫలితార్థంగా ఈ దేశంలో ఎవఱికీ స్నేహమూ, ప్రేమా అవసరమున్నట్లు కనిపించదు. ఎవఱి ఇష్టానికీ, స్వేచ్ఛకీ వారిని వదిలి, "మనకెందుకు పోనీ" అనుకుని మనశ్శాంతిగా బ్రతకడం ఈ దేశస్థులకి కలలో కూడా ఊహించ శక్యం కాని జీవనవిధానం. దీని వల్ల మన దేశం అన్ని రకాల హింసలకీ, ఘర్షణ లకీ, అశాంతికీ చిరునామాగా మారింది. అనంతరం ఈ తరహా వ్యక్తిగత సమస్యలకు వర్గీయ (మూకుమ్మడి) పరిష్కారాలు వెతక నారంభిస్తారు. కాబట్టి మన సమాజపు మాన సిక రోగాలన్నిటికీ మానవతావాదమనే మందు పడాల్సి ఉందనేది సుస్పష్టం.

**ప్రజల అజ్ఞానమూ, జాగృతిలేమీ— ఇవే అమానవీయుల పెట్టుబడి :-** ఎక్కువమంది



సామాజిక శాస్త్రాలకీ, సాహిత్యానికీ పూర్తిగా దూరమై మెడిసిన్, సైన్స్, ఎంజినీరింగ్ మాత్ర మే అభ్యసిస్తున్నారు. దాన్తో పరిసరాల గుఱించి ఆలోచించేవారూ, తత్త్వవేత్తలూ పూర్తిగా కఱువైపోయారు. మఱో ప్రక్క తమ పిల్లలు ఈ విధమైన వ్యాసంగాల (careers) పరంగా విజేతలు కావాలనే దుగ్ధతో తల్లిదండ్రులు వారిని అన్నివిధాలా అస్తిగోపన (conservative) పద్ధతుల్లో పెంచుతున్నారు. ఏదో ఒక రకంగా విజేతలు కావడమే ముఖ్యమైపోయిన మొండి వాతావరణంలో మానవతావాద సూత్రాలు బుట్టదాఖలా కావడం మామూలు. పైగా మన దేశంలో ఎక్కువ శాతం కుటుంబాలు కేవలం ఈ తరంలోనే కళాశాల మొహం చూ స్తున్నవారు (first generation graduates). అందువల్ల క్రొత్తతరానికి తాము బ్రతు కుతున్న సమాజపు తలా తోకా ఏమీ అర్థం కాని పరిస్థితి ఉంది. గతం నుంచి ఇసుమంతైనా పాఠాలు గ్రహించలేని మహాజన బలహీనత (mass weakness) కూడా వెల్లడవుతోంది.

**మానవతావాదం అంటే ఏంటో తెలియని దేశంలో మానవహక్కుల కమిషన్లు :-** అన్ని చోట్లా ఉన్నట్లే మన దగ్గఱా మానవహక్కుల కమిషన్లున్నాయి. వాటికి న్యాయస్థానాల ప్రతి పత్తి కూడా ఉంది. కానీ మానవతావాదపు ఎడ్యుకేషనే లేని దేశంలో వాటి లక్ష్యం ఏంటో, వాటిని ఎలా ఉపయోగించుకోవాలో ప్రజలకి ఎలా తెలుస్తుంది? (నిజం చెప్పాలంటే ప్రభు త్వంలో ఉన్నవారికే ఈ మానవతావాద మతలబులు తెలియవు) అందువల్ల స్పెషల్ కోర్టు లకి వెళ్ళాల్సిన వర్గీయ కేసులే మానవ హక్కుల కమిషన్లక్కూడా వస్తున్నాయి. ఆ తరహా కోర్టులకి వెళ్ళే అర్హత లేని తతిమ్మా కోట్లాది మంది (వీరికి ఇతరుల ఫిర్యాదుల మీద జైలుకి వెళ్ళే అర్హత మాత్రమే ఉంది) ఆ మానవ హక్కుల కమిషన్లకి కూడా వెళ్ళడం లేదు, ఎందు కంటే వీరు అలవాటు పడిపోయారు, ఏ అన్యాయాన్నైనా భరించడానికి! ఏ కమిషనూ, కోర్టూ తమ గోడు వినదనీ, తమ కనుకూలంగా కనీసం ఒక్క చట్టమైనా, చట్టంలో క్లాజైనా లేదనీ తెలుసు గనక!

పాశ్చాత్యదేశాల్లో మానవహక్కుల కమిషన్లు ఉన్నాయంటే అక్కడ మానవతావాదం గుఱించి విశాల సమాజంలో కాస్తో కూస్తో ABCD లు తెలుసు గనక ఉన్నాయి. ఓ ప్రక్క మానవ హక్కులకి విరుద్ధమైన చట్టాలు తెస్తూ మఱోప్రక్క మానవహక్కుల కమిషన్లు పెడితే — ముందు రోడ్డు మీద మేకులు విసిరి, తరవాత వాటి వల్ల పాడైన బండికి మరామత్తు చేసి నట్లుంటుంది. మీడియా స్వైరవిహారమూ, రాజకీయ అనుబంధాలు గల స్వయం ప్రకటిత

ప్రజాసంస్థల (తోకసంస్థల) రౌడీయిజమూ, ఆరోపకుల న్యాయమూ, సంపూర్ణ వర్గపక్ష పాతాలతో కూడిన పాలసీలూ, కఠిన శిక్షల వెసులుబాటూ– ఇవన్నీ వెరసి అంతిమంగా ఈ దేశాన్ని ఓ ఉదారవాద దేశం (liberalist country) గానే మిగులుస్తాయా? అని!

ఇలాంటి వాతావరణం మధ్య మానవతావాదానికేమైనా భవిష్యత్తుంటుందని ఎవఋా అను కోరు. ఎందుకంటే ఎంతో కొంత పరిసర స్పృహ ఉన్నవారికే గానీ మానవతావాద ప్రాధా న్యం అర్థం కాదు. కానీ ఈ దేశంలో సంప్రదాయాలన్నింటినీ దుమ్మెత్తిపోయడమో, కామా నికి గల ఒకటి–రెండు పార్శ్వాలనే ఉద్యోతిస్తూ సాహిత్యాన్ని సృష్టించడమో, లేకపోతే కొంత మందిని ద్వేషించడమో పరిసర స్పృహగా అపార్థం చేసుకోబడుతున్న పరిస్థితి.

**ప్రస్తుతం సమాజమంతా రాజకీయ జీవుల స్వర్గం** (Politicians' Paradise) :– మన సాంస్కృతిక నాయకత్వం (cultural leadership) అంతా– కనీసం దాని ప్రామాణికత (authority) యావత్తూ– నిర్మూలించబడినట్లు కనిపిస్తోంది. ఈ జనం మతగురువులు చెప్పినా వినరు. సాహిత్యవేత్తలు చెప్పినా వినరు. శాస్త్రవేత్తలు చెప్పినా వినరు. సమాజానికి పార్టీల నాయకులు తప్ప వేఱే నాయకత్వం లేని పరిస్థితి తలెత్తింది. ఏం చేసినా వీరే చేయాలి. ఏం మాట్లాడినా వీరే మాట్లాడాలి. ప్రతిచోటికీ వీరే వస్తారు. వీరికి వాస్తవంగా ఏ సబ్జెక్టు లోతూ తెలీకపోయినా అన్నీ తెలుసని మనల్ని మనం ఆత్మవంచన చేసుకుంటూ మన జీవితాల్ని వారి చేతుల్లో పెట్టాలి. "సర్వే గుణాః ఎన్నికాం ఆశ్రయంతి" ప్రజాస్వామ్యమని మనం భావిస్తున్న ప్రస్తుతవ్యవస్థలో ప్రభుత్వాధినేతలే చక్రవర్తులు. పార్టీల అధినేతలే మహా రాజులు. వర్గీయసంఘాలు సామంతరాజులు/రాణీలు. వ్యాపారసంస్థల అధిపతులు స్థానిక జమీందార్లు. మొత్తమ్మీద ఆధునిక కాలం కూడా ఇంచుమించు ప్రాచీన కాలం లాగే భాసి స్తోంది.

ఈ రోజుల్లో భయపెట్టేటంత అధికారమో, కట్టుకు పోయేటంత డబ్బో ఉంటే తప్ప ఎవఋా ఆగి, "ఏం చెబుతున్నాడబ్బా?" అని వినరు. మీడియా కూడా సాదాసీదా తత్త్వవేత్తల్ని పట్టించుకోదు. ఏదైనా ఓ పెద్దపత్రికకి సంపాదకులో, విశ్వవిద్యాలయ ఆచార్యులో, నోబెల్ బహూకృతులో ఐతే కాస్త నయం. ఏతావతా మళ్ళీ పాతకాలపు టగాధాలే పునరుజ్జీవితం. కనుక ఎవఱికీ ఏమీ చెప్పే పరిస్థితిలో లేము. ఎవఱితోనూ ఏదీ చెప్పుకునే పరిస్థితిలో కూడా



లేము. చెప్పొచ్చేదేంటంటే, ఇంతగా క్రమశిక్షణా, వినయమూ, ప్రమాణబుద్ధీ లోపించిన వాతావరణంలో నవ్యమానవతావాదమైనా చెవికెక్కడం అత్యంత కష్టసాధ్యం.

**వెయ్యి అడుగుల ప్రయాణమిది. కనీసం ఒక్క అడుగుతో నైనా మొదలుపెడదాం :-** నవ్య మానవతావాదం గుఱించి తెలిసినంత మాత్రానో, లేదా అది నచ్చినంత మాత్రానో, లేదా అది అర్థమైనంత మాత్రానో మనం పరిపూర్ణ మానవతావాదులం కాలేము. మనం పుట్టి పెఱిగిన దేశకాల పరిస్థితులూ, మన నెత్తిమీద తిష్ఠవేసే నిత్యజీవిత సమస్యలూ, మన చుట్టూ ఉన్న మనుషులూ మనల్ని అలా కానివ్వరు. నవ్యమానవతావాదం చాలావఱకూ అనుష్ఠానా త్మకం. కనుక ఇదో అనంత ప్రయాణం. దారిలో తఱచూ పడిపోతూనే ఉంటాం. అయినా ఓపిక తెచ్చుకుని లేచి మన పయనాన్ని యథావత్తుగా తిరిగి కొనసాగించాలి.

